# నాచన సోమనాథుఁడు

## కావ్యానుశీలనము

1966వ సంవత్సరమున
ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారిచే డాక్టరేట్ పట్టమునకు
ఆమోదింపబడిన సిద్ధాంత గ్రంథము

డాక్టర్ వేదుల కామేశ్వరరావు,
ఆంధ్రశాఖాధ్యక్షులు, మహారాణీ కళాశాల
పెద్దాపురం (తూర్పు గోదావరిజిల్లా) 533 437

అక్షయ - వైశాఖ పూర్ణిమ

మే / 1986

సర్వస్వామ్య సంకలితము

ప్రచురణ :
లక్ష్మీపతి పబ్లికేషన్సు, పెద్దాపురం

ముద్రణ :
శ్రీపతి ప్రెస్సు, కాకినాడ

మూల్యము :
రూపాయలు 70

ప్రతులకు :
**శ్రీమతి ఎ. ఎ. యస్. కాంతం,** బి.యస్‌సి., బి.యల్
19-1-307C, ప్రకాశం కోలనీ,
పెద్దాపురం - 533 437

# విషయానుక్రమణిక

—//—

# పీ ఠి క

నాచన సోమనాథుని యుత్తరహరివంశము, మహాభారతమునకు ఖిలపురాణమయిన హరివంశమున కాంధ్రీకరణము. ఈమహాకవి విజయ నగరాధీశ్వరులగు హరిహర బుక్కరాయల యాస్థాన కవీశ్వరుఁడని యిదివఱకు నిర్ణయించిరి. కాని యిటీవల నది సరికాదను నభిప్రాయము తలయెత్తినది. ఆ శాసనమును సమగ్రముగ పరిశీలించి, సమన్వయించి, మఱికొన్ని నూతన శాసనముల సాహాయ్యమున నాచన సోమనాథుఁడు విజయనగరాధీశ్వరులగు హరిహర బుక్కరాయల యాస్థాన కవీశ్వరుఁడే యని నిరూపించితిని. అనఁగా నాతఁడు పదునాలుగవ శతాబ్దారంభమున జన్మించి, ఆ శతాబ్ది చతుర్థపాదమును జూచియుండునని నిర్ణయింపఁబడినది. గ్రంథరచనా కాలమును, నివాసము, వంశాదులను గూడ సహేతుకముగఁ జర్చించితిని. సమకాలిక కవీశ్వరుఁడగు నెఱ్ఱయ విషయమును, ఆతని హరివంశ రచనాదుల విషయము నవసరమయి నంతవఱకుఁ జూపియున్నాఁడను.

వివాదగ్రస్తమగు పూర్వ హరివంశ రచనము విషయమును విపులముగఁ జర్చించితిని. ఆచర్చ ఫలితముగ నాచన సోమనాథుఁడు పూర్వ హరివంశమును రచింపలేదనియు, నుత్తర హరివంశమును మాత్రమే రచించెననియు నిశ్చితముగఁ జెప్పుట కవకాశ మేర్పడినది. ఉత్తరహరివంశ గ్రంథ ప్రణాళికను వివరించి, యావిషయమును సోపపత్తికముగ నిర్ణయము గావించియున్నాను. సోమనాథుఁడు, తన గ్రంథము ప్రత్యాశ్వాసాంత గద్యయందును దనకుఁగల బిరుదములను జెప్పికొనియున్నాఁడు. వ్యాఖ్యాన సహితముగ నాబిరుదుల గూఢార్థములను స్పష్టపఱచి, సోమనాథున కా బిరుదము లెంతవఱకుఁ దగియున్నవో నిర్ణయించితిని.

ఉత్తరహరివంశము నందలి యాఱాశ్వాసములలోఁగల యైదు కథలను, సంస్కృత హరివంశముతోఁ బోల్చి చదివి, సోమనాథుఁడు మూలము నెంతవఱ కనుసరించినదియు, మూలము నెతఁ డేయే ఘట్టముల నేయే రీతి నతిక్రమించి రచన సాగించినదియు నుదాహరణ పూర్వకముగ జూపితిని. ఎట్టియు విడిచిపెట్టిన హంసడిభకోపాఖ్యానము సంస్కృత హరివంశము భవిష్యపర్వమునందు తుదిని గలదు. అదియే నాచన సోమనాథుని హంసడిభకోపాఖ్యానమునకు మూలము. ఈ మూలమునెట్లు తెనిగించినది వివరముగ, సోదాహరణ నిరూపణము చేసితిని. ఈ సందర్భమున లభ్యమయినంతవఱకు ననఁగా మూఁడు సంస్కృత హరివంశ ప్రతులను, మూఁడు ముద్రణములలో లభ్యమగు రెండు ఉత్తరహరివంశ ప్రతులను సంప్రతించితిని. మఱియు నీ మహాకవి విరచితములయ్యు నేఁడలభ్యములయిన యితర కృతుల విషయమును వివిధ గ్రంథములనుండి సేకరించి చర్చించితిని.

సోమన గ్రంథమునందు సామెతలు, జాతీయములు, నుడికార ములు విశృంఖలముగఁ బ్రయోగింపఁబడినవి. అవి సుమారు శతార్థము వఱకుఁ గలవు. అవి సందర్భోచితముగ భావస్ఫూర్తి కెట్లు తోడ్పడి నదియు, వాని మూలమున నాడు వ్యవహారము నందున్న భాషావిషయ మెట్లు సుబోధకమగునదియు సాభిప్రాయముగ వివరించితిని.

ఈతనికి తిక్కన సోమయాజి యందధికమగు భక్తి ప్రపత్తులు గలవనుట కీతని గ్రంథము నాశ్వాసాంతగద్యలే తార్కాణము. హరి వంశము నాంధ్రీకరించిన యెఱ్ఱయు, సోమునికి సమకాలికుఁడగు కవీశ్వరుఁడు. ఈ కారణములచేత నీ కవిద్వయు కవితారీతులను సరిపోల్చి, యందలి సాదృశ్య భేదములను గూడఁ జూపియున్నాను.

ఈ మహాకవి కవిత్వమునఁ గానవగు చమత్కార భూయిష్ఠము లగు పద్యములను, విశిష్టములును, విచిత్రములు నగు పదముల ప్రయో గములను బ్రత్యేకముగ వివరించియున్నాను.

ఇదంతయుఁ జేయుట యొకయెత్తు, చేయించు టొకయెత్తు. నా పరిశోధనమునకు వలయు నమూల్యములగు నుపదేశములనిచ్చి, సహృదయతతో నెప్పటికప్పుడు తమ విలువైన సూచనల నందించి నా యీ గ్రంథరచనమున కనేక విధముల సాహాయ్య మొనరించిన పరిశోధన పర్యవేక్షకులగు ఆచార్యశ్రీ డాక్టరు కె. వి. ఆర్. నరసింహముగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడను. మఱియు నా పరిశోధనమునకుఁ దగిన వసతినిగూర్చి, పరిశోధనకాలము మూఁడు సంవత్సరములపాటు ద్రవ్యసాహాయ్య మొనర్చిన ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారికిని, వలయు గ్రంథముల నందించి సాయపడిన ఆంధ్రసాహిత్య పరిషత్తు కార్యాలయమును, గౌతమీ గ్రంథాలయమును, సింహాచలాగ్రమ పాఠశాల గ్రంథాలయమును, ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము వారలకు నా కృతజ్ఞతాభివాదములు.

వాల్తేరు
20-5-1965



సీ. అభ్రంకషంబైన యాలపోతు నితండు
త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధు సమ్మతముగా సామజంబు నితండు
గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు

తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజతగిరి మీఁద హరిహరారాధనంబు.

ఉ. హరి. 2ఆ. 180

# కృతజ్ఞతలు

భగవద్విలాసము హేతువుగా నేను ఎం. ఏ. చదువు పూర్తి చేయగనే పరిశోధన చేయవలసినదిగా ప్రోత్సాహపఱచి, పరిశోధన పర్యవేక్షణభారమును స్వీకరించినవారు సాహితీమూర్తులు, అస్మద్గురుదేవులు ఆచార్య శ్రీ డాక్టర్ కె. వి. ఆర్. నరసింహంగారు. నాపరిశోధనకు అవసరమగు అమూల్యోపదేశముల నిచ్చి నాకెంతగానో తోడ్పడిన ఆచార్య శ్రీ డాక్టర్ నరసింహంగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులను సమర్పించుకొనుచున్నాను.

నా అభిలాష నెఱింగి శిష్యవాత్సల్యముతో పరిశోధన గావించుట కవకాశ మొసంగిన పూజ్యగురువర్యులు కళాప్రపూర్ణ ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజిగారికి, అభిమానపూర్వకముగా ప్రోత్సహించిన ఆచార్య శ్రీ డాక్టర్ యస్వీ జోగారావుగారికి, అనేక సందేహములను దీర్చి, తగుసహాయ సహకారముల నందించి యాదరించిన గురుపాదులు శ్రీ డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి (ఆంధ్రశాఖాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు) గారికి నాహార్దికాభివందనములను సమర్పించుకొనుచున్నాను.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో నాసహాధ్యాయులు శ్రీ టి.పి.యస్. రామచంద్రాచార్య (ప్రధానాంధ్రోపన్యాసకులు, మిసెస్. ఎ. వి. యన్. కళాశాల, విశాఖపట్నం) గారికి, శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రి గారికి, డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి, (ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఆంధ్రశాఖాధ్యాపకులు) ఆచార్య తూమాటి దోణప్ప (ఆంధ్రశాఖ, నాగార్జున విశ్వవిద్యాలయము, గుంటూరు) గారికి వందనము లర్పించుచున్నాను.

పరిశోధనకాలమున ఉపకారవేతన మొసంగి, యీ గ్రంథప్రచురణమున కనుమతించిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారికి, యీ సిద్ధాంత వ్యాసమును ప్రచురించుటకు ఆర్థికసాహాయ్య మొనర్చించిన ఆంధ్ర

ప్రదేశ్ ప్రభుత్వమువారికి, దయతో తమ అమూల్యాభిప్రాయములను పంపి నన్నభిమానించిన ప్రొఫెసర్ డాక్టర్ కె. వి. ఆర్. నరసింహం గారికి, ప్రొఫెసర్ డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గారికి, శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారికి, శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారికి, ప్రొఫెసర్ గంధం అప్పారావు గారికి ప్రత్యేకముగ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

పెద్దాపురం మహారాణీ కళాశాల పాలకవర్గాధ్యక్షులు శ్రీ యస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు గారికి, కరెస్పాండెంటు శ్రీ యం. సి. హెచ్. అంకయ్య గారికి, విద్యావేత్తలు, బహుముఖ ప్రజ్ఞావంతులు, కళాశాల ప్రిన్సిపల్ శ్రీ డి. శేషగిరిరావు గారికి నా కృతజ్ఞతల నర్పించుచున్నాను శ్రీ టి భాస్కరరావు (ఆంధ్రశాఖ, ఏ. సి. కాలేజి, గుంటూరు) గారికి, డాక్టర్ చామర్తి కనకయ్య గారికి (ఆంధ్రోపన్యాసకులు, పి. ఆర్. ప్రభుత్వకళాశాల, కాకినాడ), పెద్దాపురం మహారాణీ కళాశాల ఆంధ్రశాఖాధ్యాపకబృందమువారికి, తదితరులకు నా కృతజ్ఞతలు. సర్వదా నాకు బహువిధముల సహాకరించిన నా సోదరద్వయము శ్రీయుతులు సీతారామమూర్తి బాలకృష్ణమూర్తి గారలకును, సోదరీమణులు చిరంజీవులు శ్రీమతి డాక్టర్ తమ్మా సూర్యకాంతం, ఎం.ఏ., పిహెచ్. డి. శ్రీమతి డాక్టర్ నాదెళ్ళ శ్యామల, ఎం.బి., బి. యస్. లకు నా కృతజ్ఞతాభినందనలు.

ఈగ్రంథమును ఆకర్షణీయముగా, సకాలంలో ముద్రించిన శ్రీపత్రి ప్రెస్సు అధిపతులు శ్రీ టి. గణేశ్వరరావు గారికి కృతజ్ఞుడను.

# పండితాభిప్రాయములు

Dr. K. V. R. Narasimham
Emeritus Professor
Andhra University, Waltair

IV Line, Vidyanagar
Visakhapatnam - 3
Date 12-11-79

"నాచన సోమనాథుని ఉత్తరహరివంశం" మీద మూడేళ్ళు పరిశోధనచేసి, డాక్టర్ కామేశ్వరరావుగారు, ఈసిద్ధాంత వ్యాసాన్ని వ్రాసేరు. నా పర్యవేక్షణలోనే ఆ పరిశోధన జరిగింది కాబట్టి, ఇక్కడ ప్రత్యేకంగా నా అభిప్రాయం చెప్పవలసిన పనిలేదు; ఒకవేళ చెప్పినా, ఇతరులు దానిని అత్యుక్తిగా పరిగణించడానికి అవకాశముం టుంది. డాక్టర్ రావుగారు, నా అభిప్రాయాన్ని అడిగినప్పుడు, నేను ఈమాటే చెప్పాను. వారుకూడా నా అభిప్రాయంతో ఏకీభవించారు. కాని, తమకోర్కె మార్చుకోడానికి అంగీకరించలేదు. నాకు, వారి కోర్కె మన్నించక తప్పిందికాదు.

ఉత్తరహరివంశానికి సంబంధించిన సర్వసమస్యలు, ఈసిద్ధాంత వ్యాసంలో చర్చింపబడ్డాయి. వీటిని పరిష్కరించడంలో డాక్టర్ రావు గారు చూపిన నైపుణ్యం శ్లాఘనీయంగా ఉంది. సంస్కృతాంధ్ర హరి వంశాలకి సంబంధించిన తులనాత్మక పరిశీలన ఈ సిద్ధాంత వ్యాసానికే మకుటాయమానంగా ఉంది. అనావశ్యకమైన పదాడంబరంగాని, ఉప పత్తి శూన్యములైన శుష్కవాదాలుగాని, ఇందులో మచ్చుకైనా లేవు. చ్యుత సంస్కారాది దోషాలు లేకుండా, శ్రవణపేయమైన సరళ గ్రాంథికంలో వ్రాయబడ్డ యీగ్రంథం, ఆంధ్ర సాహితీ ప్రియులందరికీ అభిమాన పాత్రమౌతుందని నా దృఢవిశ్వాసం.

కె. వి. ఆర్. నరసింహం

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని ఎం ఏ (ఆనర్సు), పిహెచ్. డి,
పూర్వాంధ్ర శాఖాధ్యక్షులు
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

ప్రియమిత్రులు శ్రీ డాక్టర్ వేమల కామేశ్వరరావుగారు రచించిన "నాచన సోమనాథుఁడు - కావ్యానుశీలనము" అను సిద్ధాంత వ్యాసమును పరికించి యానందించితిని. వారి నాంధ్రవిశ్వవిద్యాలయము వారి పిహెచ్. డి పట్టమున కర్హులఁ గావించిన యీ యుత్తమ విమర్శగ్రంథము ప్రాశస్త్యమును గూర్చి వేఱుగాఁ జెప్పనవసరము లేదు. ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథునకు విశిష్టమైన స్థానము కలదు. అతఁడు కవిత్రయము వారి తరువాతఁ జెప్పఁదగిన మహాకవి. కొందఱొక్క తిక్కనను మాత్రము విడిచి నన్నయ యెఱ్ఱనలకంటెఁ గూడ నాతఁ డధికుఁడని యభిప్రాయపడి యుండిరి. చిన్నయ సూరి "అలికంబున నక్షిని దాచినట్టి సర్వజ్ఞుఁ"డని యాతని ప్రశంసించి యుండెను. అతఁడు రచించిన ఉత్తర హరివంశమొక్కటే యిప్పుడు లభ్యమగుచున్నది. అతఁడు వసంత విలాసము, హర (హరి) విలాసము అను కావ్యములను గూడ రచించెనని లాక్షణికోదాహృతములైన కొన్ని పద్యములవలనఁ దెలియుచున్నది. కాని అవి యిప్పుడు లభ్యములగుట లేదు. అతఁ డష్టభాషాపండితుఁ డనియు, కన్నడమునఁ గూడఁ గొన్ని గ్రంథములు రచించెననియుఁ జెప్పుదురు. అతఁడు విజయనగర సామ్రాజ్యమును స్థాపించిన హరిహరబుక్కరాయల యాస్థాన కవీశ్వరుఁడని శ్రీ కామేశ్వరరావుగారు నిరూపించియుండిరి. బుక్కరాయలతనికిని ఇతర పండితులకును గలిపి పెంచుకలదిన్నె యను గ్రామము నగ్రహారముగా నొసంగెను.

శ్రీ కామేశ్వరరావుగారీ సిద్ధాంతవ్యాసమున సోమనాథుని గూర్చి వివాదగ్రస్తములై యున్న పెక్కు విషయములను బరిష్కరించి

యుండిరి. అందాతఁడు పూర్వహరివంశమును గూడ రచించెనా లేదా యను సమస్య ముఖ్యమైనది. శ్రీ రావుగారు సోమన పూర్వహరివంశ మును రచించి యుండలేదని సోపపత్తికముగా నిర్ణయించియుండిరి. పెంచుకలదిన్నె శాసనకాలము 1344 గా నిర్ణయింపఁ బడుటచే సోమన యెఱ్ఱనకు సమకాలికుఁ డగును. శ్రీ రావుగారు సోమన, ఎఱ్ఱన రచించిన హరివంశము తెలెంగియు నది కేవలానువాద మగుటచే తద్భిన్న పద్ధతి నుత్తర హరివంశము నాంధ్రీకరించి యుండెనని విశదీకరించిరి. ఎఱ్ఱన విడిచిపెట్టిన హంసడిభకోపాఖ్యానము సంస్కృత హరివంశమున భవిష్యపర్వము చివరఁ గలదు. సోమన దాని ననుసరించియే యా యుపాఖ్యానము నెంతో రమణీయముగా సంతరించి యుండెను.

సోమనాథుఁ డుత్తరహరివంశపు టాశ్వాసాంత గద్యలలో తనకుఁ గల బిరుదములను పేర్కొని యుండెను. సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీన గుణసనాథ, సకలభాషాభూషణ, సంపూర్ణకీర్తి — ఇత్యాది బిరుదములన్నియు సోమన రచననుబట్టి యెట్లు సార్థకములగు చున్నవో శ్రీ రావుగారు చక్కగా వివరించి యుండిరి. సోమన ఆంధ్రీ కరణ విధాన మపూర్వమైనది. అత డుత్తర హరివంశము నందలి రస వత్తరములైన యైదు వృత్తాంతములను గ్రహించి వానిని వర్ణనాదులచేఁ బెంచి నవీనగుణసనాథముగను, రసవన్మనోజ్ఞముగను దన కావ్యమును రచించెను. అతని ఆంధ్రీకరణ విధానమును విపులముగను సోదాహరణ ముగను వివరించు నధ్యాయ మీ గ్రంథమునందు మిక్కిలి విలువైనది. ఈ విషయమును విమర్శకు లెవ్వరును ఇంత విపులముగాఁ జర్చించి యుండలేదు. శ్రీ రావుగా రీసందర్భమున లభ్యములగు సంస్కృత మూలముల నన్నిటిని బరికలించి యుండిరి.

ఆంధ్రీకరణ విధానమున, రచనాప్రకారమున, పదలోకోక్తి ప్రయోగమున సోమన నూత్నపద్ధతి నవలంబించి నవీనగుణసనాథుఁ

ఏ మ్యోసు అనేక [illegible] ప్రయోగించిన లోకోక్తులును, జాతీయ సమాసములు [illegible], [illegible] చిత్రములై అని కవిత్వమునకు క్రొత్త [illegible] శ్రీ రావుగారు యథాసందర్భము లందుచితరీతులైన యుద్ధ [illegible] లొసంగుచు సోమన రసపోషణా పాటవమును, [illegible] వైదగ్ధ్యమును, సంవిధాన సంధానసామర్థ్యమును, పాత్రపోషణ [illegible] పదప్రయోగవైచిత్రిని చక్కగా నిరూపించి తమ పాండిత్య [illegible] ప్రాగల్భ్యమును [illegible] ప్రదర్శించి యుండిరి.

సోమనాథుని [illegible] వారిలో తిక్కన సోమయాజియెడ నతనికి భక్తిగౌరవములు కలవు అనువిషయ మతని ఆశ్వాసాంత గద్యము వలననే తెలియుచున్నది. తిక్కన [illegible] వలనచే నతఁడు మిక్కిలి ప్రభావితుఁ డయ్యెనని తెలుపు [illegible] నుత్తర హరివంశమున పెక్కున్నవి. శ్రీ రావుగారు తిక్కన యెఱ్ఱనల కవిత్వమును సోమన కవిత్వమును తులనాత్మక దృష్టితోఁ బరిశీలించిన విధము మెచ్చఁదగి యున్నది. సర్వజ్ఞుఁడు, పండితప్రకాండుఁడు, ప్రౌఢకవితాసంపన్నుఁడు నైన సోమనాథుని రచనా సౌష్ఠవమును గూర్చి వారు స్పృశింపని యంశము లేదు, స్పృశించి సమగ్ర పరిశీలనము కావింపని యంశము లేదు.

శ్రీ రామేశ్వరరావుగారు పితృభక్తి సంపన్నులు. వారి పితృపాదులను నేనెఱుఁగుదును. వారు తాము శ్రమపడి రచించిన యీ యుత్కృష్ట విమర్శగ్రంథమును జననీజనకుల పాదపద్మముల కర్పించుట వారి పితృభక్తి సంపన్నతకుఁ దార్కాణము. శ్రీ రావుగారు పండితులు, విమర్శకులు, బోధనానుభవము కలవారు, వినయసంపన్నులు. వారు కవి మూర్ధన్యుఁడైన సోమనాథుని ప్రశస్త ప్రబంధమును గూర్చి కావించిన పరిశోధనను ప్రశంసించుచు వారింకను పెక్కుత్తమ విమర్శ గ్రంథములను వెలయించి ఆంధ్రసరస్వతి కపూర్వాలంకారములు సమకూర్తురని యాశించుచున్నాను.

హైదరాబాదు
14-11-79

దివాకర్ల వేంకటావధాని

శ్రీ గురుమూర్తయే నమః

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
రామారావుపేట, కాకినాడ - 4.

"నాచన సోమనాథుడు — కావ్యానుశీలనము" అను సిద్ధాంతోదాత్త విమర్శ గ్రంథమును వర్ధమాన చంద్రులగు శ్రీ వేదుల కామేశ్వరరావు ఎమ్. ఏ. గారు రచించి ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిచే డాక్టరు బిరుదముచే సన్మానింపఁబడినారు. ఈ విమర్శనము సాధారణమైనది కాదు. 'సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి' యున్నగు బిరుదములుగల మహాకవి నాచన సోమనాథుని కృతియగు "ఉత్తర హరివంశము" పై వెలువడిన సర్వతోముఖ్యమైన సమీక్ష. ఈవ్యాసకర్త తన నాఁటికి ఉత్తర హరివంశముపై వెలువడిన పండిత విమర్శనములనించుమించుగా నన్నిటిని శ్రద్ధతో చదివి, జీర్ణము చేసుకొని లలితమగు గ్రాంథికాంధ్రమున వెలువరించిన గ్రంథమగుటచే అస్మదాదులు "అట్టు ఇట్టు" అని తాము చిన్నవోవుటకంటె—మెచ్చుకొనుట యుత్తమము. లేదా మానసమందు ఆనందించి మిన్నకుండుట రెండవ పక్షము. వ్యాసకర్త తన వ్యాసరాజమును 18 గా విభజించి ముందు రాఁబోవు నట్టి ఉత్తరహరివంశ సమీక్షకులకు నేమియు మిగులకుండ మథించి సారమంతా తానే ఆపోశనము పట్టుట లోకమునకు కన్నుఱ్ఱ కలిగించు ననుకొందును.

మొదటి రెండు పరిచ్ఛేదము లందు సోమనాథుని కాలము విషయమున శిలాశాసనాద్యాధారము లేని యొక్క మాటయు కానరాదు. మూఁడవ పరిచ్ఛేదమున అతని నివాసస్థానము వంశాదులను గూర్చిన పరిశీలనము. నాల్గవది పూర్వహరివంశము సోమనాథీయము "కలదు—లేదు" అని పూర్వులు చేసిన పరామర్శములపైని విచారణము. ఆ విచారణ సారాంశము నీ వాక్యమునఁ జేర్చివైచినారు. "మీఁది

విపులమగు చర్చనుబట్టి నాచన సోమనాథుడు పూర్వహరివంశము వ్రాసి యుండెనని నిశ్చయముగా చెప్పజాలము" అని 6 వ పుటలో మృదువుగా మందలించినారు. ఉత్తర రామాయణము (తిక్కన కృతము), ఉత్తరరామచరిత్ర-మున్నగు నామములలోని ఉత్తరపదముచే పూర్వపద మాక్షిప్తమై వివిధ మీమాంసల కాలవాలమైనది. అట్టిదే యిదియును. ఈగ్రంథమునకు అవతారిక లేకపోవుటయే యిన్నివాదములకు హేతువు. ఆ గ్రంథమైనను తాళపత్రములది యొక్కటే ప్రతి తంజావూరి సరస్వతీ మహలునందున్నది. ప్రత్యంతరము లేదు. ఎందరనో విస్మృతాంధ్ర కవులను, కావ్యములను వెలుగులోనికి తెచ్చిన పరమపూజ్యులు మానవల్లి రామకృష్ణకవిగారు "పూర్వహరివంశము తాళపత్రప్రతి కలదని చెప్పినారనియు, దానికై యెంత యత్నించినను కవిగారది ప్రకటింపలేదనియు, ఎవరికిని చూపలేదనియు" శ్రీ జయంతి రామయ్యపంతులు గారు చెప్పుచుండువారట. ఇట్టి విచారములు వినోదముగా నుండకపోవు.

"సాహిత్యరసపోషణం" బిరుదమునందలి సాహిత్య శబ్దమునకు వాఙ్మయము, సారస్వతము అనునవి అర్థములని చక్కగా నిరూపించినారు.

ఇట్లే తక్కిన పరిచ్ఛేదములన్నియు తలస్పర్శనమగు మీమాంసతో కూడినవే అగుటచే మరల మరల వ్రాసి చదువరులకు విసువు పుట్టించుట మంచిది కాదని చిరంజీవి కామేశ్వరరావు గారిని మాతృభాషారాధన దీక్షయందే కాలముగడుపునట్లు పరమేశ్వరుడు ఆయురారోగ్య సౌభాగ్యము లొసంగుగాక యని ఆకాంక్షించుచున్నాను.

ఇట్లు
విద్వద్విధేయుడు
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

కాకినాడ
7-9-79

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

అప్పవికోలనువారివీధి
రాజమహేంద్రవరము
తేది 23-11-'79

# అభినందనము

"నాచన సోమనాథుఁడు – కావ్యానుశీలనము" అను నీసిద్ధాంత గ్రంథము పట్టలాభమునకై వెలసి షష్ఠివంతమైన కాలమునకు, అచ్చుపడి వెలుఁగునకు వచ్చినకాలమునకు పది పదునైదేండ్ల యంతరము. బృహద్గ్రంథముల ముద్రణ దృష్టితో, ఈ యంతరము అంత విడ్డూరమైనది కాదు. కాని, ఇది పరిశోధనగ్రంథము. కవి కాలాది బహువిషయ నిర్ణయములో, భావ ప్రకటనములో పాఠకులు పౌర్వాపర్యములను గూర్చి జిజ్ఞాసువు లగుదురు.

నాచన సోమనాథుని 'ఉత్తరహరివంశము' తెనుఁగులో ప్రౌఢ ప్రబంధము. దీనికి వేదము వేంకటరాయశాస్త్రిగారి వంటి విద్వాంసులు వ్యాఖ్యానము వ్రాసి యుండవలసినది వేటూరివారి వ్యాచిఖ్యాస నాఁటి రోజులలో కొంత యాశ కలిగించినది. మనము ఆయదృష్టమునకు నోచుకొనలేదు. వ్యాఖ్యమాట యటుండె.

సోముని కాలవంశాదికమునుగూర్చి, ఉత్తరహరివంశము రచనను గూర్చి యెన్నో సంశయాంశములు నివారించుకొనవలసియున్నది. వేటూరి శివరామశాస్త్రిగారు వ్రాసిన 'సోమఁడు' ఆనాఁడు వెలువడిన విమర్శన కృతి. సోమునకీయవలసిన స్థానమును గూర్చి త్రిరాళ్ళపల్లివారి నడకుదుటివారి చర్చలు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో వెలువడినవి. విశ్వనాథవారి 'ఒకఁడు నాచన సోమన్న' ప్రసద్ధమై యున్నది.

డాక్టర్ వేదుల కామేశ్వరరావుగారు ఈ సిద్ధాంత గ్రంథమును సంధానించు కాలమునాటికి సోముని కాలవంశాదికమునుగూర్చి, ఉత్తర

హరివంశరచనను గూర్చి 'సామగ్రి' వికీర్ణమై యున్నది. జిజ్ఞాసువులకు నిశ్చయ పరిజ్ఞానమునకై ఒక పరిశీలనగ్రంథము రావలసియున్న తరుణములో ఈగ్రంథము వచ్చిన దనవచ్చును. ఆయా సందర్భములలో వారి వారి మతభేదములు చూపుటయే కాక, స్వాభిప్రాయముయొక్క మొగ్గు దల ప్రకటించుటయుఁ గావించిరి. డాక్టర్ కామేశ్వరరావుగారు జాగరూకులై చేసిన ఈ నిర్వహణము సుకుమారముగా, నిష్పాక్షికముగా వెలయుచున్నదని తలంచుచున్నాను.

సోముని కాలము, హరిహరబుక్కరాయల కాలములనుగూర్చి శాసనాధారములు, పూర్వపండిత మతములు ప్రతిపాదింపబడినవి. దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి 'సమకాలబాహువిక్రమముచేత' అన్న వక్రోక్తి కాలసమన్వయము చూపఁబడినది. పలువురు పెద్దల యభిప్రాయములను క్రోడీకరించుచు సోమనాథుఁడు, ఎఱ్ఱాప్రెగడయు సమకాలికులయి సుమారు మూఁడు దశాబ్దముల కాలమాంధ్రకవితా సామ్రాజ్యసీమలలో స్వేచ్ఛావిహార మొనరించి యుందురన్న స్వాశయమును వీరు ఆవిష్కరించి యున్నారు.

బుక్కరాయలు సోమనాథునకు మఱి యైదుగురు విప్రులకును పెంచుకలదిన్నె యను బుక్కరాయపురమును దానము చేసెను. ఈదాన శాసనపుఁ బ్రతిలోని దశోత్తరశతం-దశోదరశతం-షట్త్రింశ-షడ్వంశ-పాఠములను వివేచించిన పెద్దల యభిప్రాయములను సూచించుటయే కాక, వేలూరి, చాగంటివారల యభిప్రాయానుసారము దశోదరశతం (దశన్యూనశతం) పాఠము గ్రాహ్యమని ఈ గ్రంథకర్తగారు గణనీయమైన తమ యభిప్రాయమును వెల్లడించుట సముచితముగా నున్నది.

"పూర్వహరివంశము-వివాదపరిష్కారము" అన్న ప్రకరణము శ్రీ కామేశ్వరరావుగారి నిశితపరిశీలనమునకు మచ్చుతునక. ఉత్తర హరివంశము మాత్రమే సోముని రచన. ఒక ఉదాత్తమైన కావ్యప్రయో

జనము నుద్దేశించి సంస్కృత హరివంశమునుండి ప్రధానకథలు కొన్ని కయికొని ఉత్తరహరివంశమును రచించియుండెనన్న గ్రంథకర్తగారి సోపపత్తిక నిరూపణము హృదయంగమమైనది.

సాహిత్యరసపోషణ, సంవిధానచక్రవర్తిత్వాది బిరుదసార్థకత ఉదాహరణ పురస్సరముగా నిందు పేర్కొనబడినది.

"నాచన సోముని యాంధ్రీకరణ విధానము"— అను ప్రకరణము ఈసిద్ధాంత గ్రంథమునకు కిరీటప్రాయమైనది. వీరి పరిశీలన కౌశలమును కనుగొనుటకు ఇది ముకురభూతమైన ప్రకరణము. మూలశ్లోకముల నేటికి చూపి, సోముని తెనుగు పద్యముల సంవాద విసంవాదములు, ఔచిత్యాదికము సవిశేషముగా పేర్కొనబడిన తీరు ప్రశంసార్హము.

సోముని సామెతలు, జాతీయములు — నుడికారములు, ఎత్తిన సోముని కవితల తారతమ్యములు, సోముని హాస్యరసపోషణము, పద ప్రయోగ వివరణము ఈ విధముగా డాక్టర్ వేదుల కామేశ్వర రావుగారి సిద్ధాంత గ్రంథమిది సోముని చారిత్రక విశేషములకు, ఉత్తర హరివంశ మహాప్రబంధముయొక్క సారస్వతవైభవమునకు నిలిచి పట్టిన కప్రపునివాళి.

డాక్టర్ కామేశ్వరరావుగారి పరిశీలన కౌశలమునకు హార్దమైన అభినందనములు తెలుపుచున్నాను.

రాజమండ్రి
23-11-79

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి.

**Prof. G. APPA RAO, M. A. Ph.D.,**
Dip. in Kannada,
Head, Department of Telugu,
University of Madras.

University Buildings,
Madras-600 005
Date 15-1-80

## INTRODUCTION

In the world of Telugu literature, the great poet Nachana Somanatha is considered next only to the Renowned Trinity (Kavitraya). "Sakalabhasha;-Bhooshana, Sahityarasaposhana, Samvidhana Chakravarti and Naveena guna Sanadha are the titles conferred on him. Chinnaya Suri has described him as the Omniscent Poet who has a hidden third eye in his forehead.

That Somana was a beloved disciple of Kavi Brahma Tikkana which is evident from the lines of prose that mark the ending of the chapters of his "Kavya". His "Uttara Harivamsa" is a literary work of supreme merit. There are, however, different opinions among the literary crittics about the merits of his work. One school of scholars and criitcs consider the poet's language artificial full of long Sanskrit compounds and uncommon and obscure words difficult to comprehend. They have compared his work with that Yerrapraggada and have considered it inferior to his "Harivamsa."

Another school of critics has given Somana the highest place as far as creative imagination and strength of composition are concerned. They have considered his poetry structurally superior to that of Yerrana.

They have even gone to the extent of saying that in some respects Somana's poetry excels that one of the other two of the Kavitraya. Descerning scholars and critics appreciate great literary works differently in accordance with their literary tastes and standards. One thing, however, is certain. Somanatha was a great creative poet. His style flows like the waters of the river Ganges. In the matter of daring imaginative flights and structural completeness, his is the first place. The title "Samvidhana Chakravarti" fits him eminently.

Scholars and poets like Sri Viswanatha and Sri Rallapalli have written critical essays on the literary excellance of Somanatha's "Uttara Harivamsa", but there has not been a complete examination of the work. Dr. Kameswara Rao has fulfilled this worthy task. His "Kavyanuseelanamu" is a comprehensive thesis. The great pains he has taken to gather all the required material must be appreciated.

Somanatha's family, his time, the controversial question of the composition of Poorva Harivamsa, the brevity and clarity of style, his delicate humour and his mature erotic sentiment, the contrast in the styles of Yerrana and Somana, Somana's diction and his apt use of sayings and proverbs - all these questions have been thoroughly discussed by the scholar. I hope that this thesis will find prominent place in the world of Telugu letters.

Madras
15-1-'80 (Sd) G. APPA RAO

సంస్కృత హరివంశమునందలి హరివంశ, విష్ణు, భవిష్యపర్వములలో మొదటిదగు హరివంశపర్వమునందలి గాథలను నాచన సోమనాథుడు సంపూర్ణముగా విడిచినాఁడు.

సంస్కృతహరివంశమునగల సుమారు 16000 శ్లోకములలో విష్ణు, భవిష్యపర్వములందలి 262 అధ్యాయములలో 79 అధ్యాయముల నుండి 3314 శ్లోకములను మాత్రము గ్రహించి, ఉత్తరహరివంశప్రబంధమున 1487 గద్యపద్యములుగా సంతరింపఁబడినవి.

## సంస్కృత హరివంశము

| పర్వము | అధ్యాయము | శ్లోకసంఖ్య |
|---|---|---|
| విష్ణుపర్వము | 62, 63 | 146 |
| ,, | 111 నుండి 115 | 130 |
| భవిష్యపర్వము | 73 నుండి 90 | 629 |
| ,, | 91 నుండి 102 | 347 |
| ,, | 103 నుండి 132 | 851 |
| విష్ణుపర్వము | 116 నుండి 127 | 1211 |
| | | 3314 |

## ఉత్తరహరివంశము

| ఆశ్వాసము | విషయము | గద్యపద్య సంఖ్య |
|---|---|---|
| ప్రథమ | నరకాసురవధ | 188 |
| ద్వితీయ | విప్రబాలకరక్షణము, శ్రీకృష్ణతపశ్చర్య, | |
| | హరిహరారాధనము | 224 |
| తృతీయ | పౌండ్రికవాసుదేవుని కథ | 162 |
| చతుర్థ | హంసడిభకోపాఖ్యానము | 321 |
| పంచమ | ఉషానిరుద్ధుల ప్రణయము | 317 |
| షష్ఠమ | బాణాసుర గాథ | 275 |
| | | 1487 |

# సోమన ప్రశస్తి

మ. మహి మున్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁదత్ప్రాగల్భ్యమూహించెదన్.

— రామరాజ భూషణుఁడు.

కం. ఘను నన్నయభట్టును ది
క్కన, నెఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబున యు
క్తిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచన సోమనాథు స్తుతియొనరింతున్.

— చిన్నయసూరి.

సీ. ఋషివంటి నన్నయ్య రెండవవాల్మీకి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోఁట
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు
పోతన్న తెలుఁగుల పుణ్యపేటి
శ్రీనాథుఁడు రసప్రసిద్ధధారాధుని
కృష్ణరాయఁ డనన్యకృతి ప్రబంధ
పెద్దన్న వడపోతవెట్టి నిక్షురసంబు
రామకృష్ణుఁడు సురారామగజము

ఒకఁడు నాచనసోమన్న, యుక్కివుండు
చెఱిపి పదిమార్లు తిరుగ వ్రాసినను మొక్క
వోని యీయాంధ్రకవిలోక మూర్ధమణుల
మద్గురుస్థానములుగ నమస్కరించి.

— విశ్వనాథ సత్యనారాయణ.



అచ్యుతరామయ్య
[ఉరులాం]
లక్ష్మీపతి (సీతమ్మ)
సూర్యనారాయణ (నీలమ్మ)
రామయ్య
సీతారామయ్య (వెంకటలక్ష్మమ్మ)
అచ్యుతరామయ్య
జగన్నాథం (రత్నమ్మ)
సత్యనారాయణమూర్తి (గోదావరమ్మ)
సూర్యనారాయణమూర్తి (కామేశ్వరమ్మ)
[శ్రీకాకుళం]
లక్ష్మీపతి (సూరమ్మ)
నరసింహస్వామి
జగన్నాథం
సన్యాసిరావు
సీతారామమూర్తి (మదుకేశ్వరమ్మ)
బాలకృష్ణమూర్తి (సుశీల)
[పెద్దాపురం)
కామేశ్వరరావు (అనంతసూర్యకాంతం)
విశ్వేశ్వరరావు
రామగోపాల్
సింహాద్రిరావు
ప్రభాకర
శ్రీనివాసరావు
లక్ష్మి
వాణి

గ్రంథకర్త జననీజనకులు



శ్రీ వేదుల లక్ష్మీపతి సూరమ్మగారలు

వేదులవారివంశవృక్షము వేదుల కృష్ణమూర్తి (లక్ష్మీదేవి) [చేనులవలస అగ్రహారం]



గ్రంథకర్త :
డాక్టర్ వేదుల కామేశ్వరరావు

సహధర్మచారిణి :
శ్రీమతి అనంతసూర్యకాంతం

# నాచన సోమనాథుని కాలము

విజయనగర సామ్రాజ్యమును హరిహరుఁడు బుక్కరాయలు ననువారు స్థాపించిరనుట నిర్వివాదమగు సంశము. వారి యాస్థానమున నాచన సోమనాథ మహాకవి యుండెననుటకు శాసనస్థములగు నాధారములు కలవు. నాచన సోమనాథునకును మఱియైదుగురు బ్రాహ్మణులకును గుత్తిదుర్గమునందుఁగల పెంచుకలదిన్నె యను గ్రామమును క్రీ. శ. 1344వ సంవత్సరమునందు బుక్కరాయలు దానమిచ్చిన సందర్భమునఁ బుట్టిన దీశాసనము. ఈ శాసనమునకు రెండు ప్రతులు లభ్యమైనవి. అందొకటి మైసూరు రాజ్యమునందలి కోలారు మండలములోనున్న ముడియనూరను గ్రామ (సమహెబ్బాళ్లి) మున నివసించు వేంకటరామశాస్త్రి యను నాతనినుండి గ్రహింపఁబడినది. ఆమండలమునందే హొసూరు (హొసూరుహొబ్బళి) గ్రామమున, రామపుర పటేలయిన, జటావల్లభుఁడను నొక విప్రునికడ మఱియొకప్రతి లభ్యమయినది. ఈ రెండింటిని, బి. లూయీరైసు అను నాంగ్లపండితుఁడు మైసూరు ప్రభుత్వపరముగ క్రీ. శ. 1905వ సంవత్సరమున ఎపిగ్రాఫియా కర్నాటికా పదియవ భాగమునఁ బ్రకటించెను. అందొకటి KL. Mg. 158వ సంఖ్యయందును, రెండవది KL. Gd. 46వ సంఖ్యయందును బ్రకటితములయినవి. పెంచుకలదిన్నె గ్రామ మాఱుగురు బ్రాహ్మణులకు దానమీయఁబడినందున, నా దానశాసనమున కాఱుప్రతులు వెలసి యుండెననుటలో సందియములేదు. ప్రకృతము లభ్యమయిన ప్రతులు రెండేయని ముందు చెప్పఁబడెను. మిగిలిన నాలుఁగు ప్రతులను గూర్చిన విషయ మనూహ్యముగానున్నది. దాన ప్రతిగ్రహీతలగు వారి విషయమును, వారి తరువాతి తరముల విషయమును కనుగొనుట కవకాశముండిన మహాజనులకు, మిగిలిన నాలుఁగు శాసనప్రతులను సేకరించు భారమును విడువవలసి యున్నది. ప్రకృతము మనకు లభించిన రెండు శాసనములయందును గానవగు సమానవిషయముల నీక్రింద బొందుపఱచు చున్నాను.

(1) శాసన నియుక్తాధికారి సంతకము "శ్రీవిరూపాక్ష" అని కలదు. (విజయనగర ప్రభువులు తమయిష్టదైవతమగు శ్రీవిరూపాక్షునిపేర శాసనములను వేయించుట సంప్రదాయము.)

(ii) శాసనమునందలి శ్లోకములను రచించినది సర్వశాస్త్ర ప్రవీణుఁడగు మల్లనారాధ్యుఁడు.

(iii) శాసనమును నిర్మించినది ఆచార్యవర్యుఁడగు నాగిదేవ శిల్పాచార్యుఁడు. అత్యంత ప్రధానవిషయము లనఁదగు రెండంశములయందు మాత్రము భేదము కానవచ్చుచున్నది. శాసనము నందుదాహరింపఁబడిన కవికాల విషయమునను, కవులకు పంచి యీయఁబడిన భాగముల విషయమునను, ఈ రెండు శాసన ప్రతులయందుఁ బారభేదములు కనఁబడుచున్నవి. దానమీయఁబడిన గ్రామ నామము విషయమునను, శాసన కర్తృత్వాదుల విషయమునను, దాన ప్రతిగ్రహీతల కులగోత్ర నామాదుల విషయమునను భిన్నత్వము కానరాదు. మఱియు నీరెండు శాసన ప్రతులయందునుగల భాష సంస్కృతమే యయ్యుఁగన్నడలిపి యందున్నవి. కావున పయిని పేర్కొనఁ బడిన వివిధములగు నాధారములనుబట్టి, యీరెండును నొకే దానశాసనమునకుఁ బ్రతికలనుట నిర్వివాదాంశము. అయినను వీనికి మాతృక యనఁదగు శాసనమేదియో మనకు లభించిన ప్రతులనుబట్టి నిర్ణయించుటకుఁ దగిన యాధారములు కానరావు.

## బుక్కరాయ శాసన విషయము

క్రీ. శ. 1897 వ సంవత్సరమున శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు మహాకవి నాచన సోమనాథుని కృతియగు "ఉత్తరహరివంశము" ను బ్రథమముగాఁ బరిష్కరించి ముద్రించియుండిరి. ఆ తరువాత సుమారెనిమిది సంవత్సరములకుఁ బయిని చెప్పఁబడిన రెండు శాసనపుఁ బ్రతులును క్రీ. శ. 1905 వ సంవత్సరమునందు రైసుపండితునిచేఁ బ్రకటింపఁబడినవి. అయినను నీశాసన విషయము లేకారణము ననో యాంధ్రలోకమునందంతగాఁ బ్రాచుర్యము నందలేదు. తొలుదొలుత నీ శాసనమును శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు క్రీ. శ. 1910 వ సంవత్సరమున ఆంధ్రపత్రిక తొలి ఉగాదిసంచిక యందు ప్రకటించి, యిమ్మహాకవికి సంబంధించిన వివిధ విషయముల నాంధ్రలోకమునకుఁ బరిచయ మొనర్చిరి. వీరు ప్రకటించిన శాసనము రైసుపండితునిచే ఎపిగ్రాఫియా కర్నాటికాలో పదియవ భాగమున కోలారు మండలము Mg. 158 వ సంఖ్యముఁ బ్రకటింపఁ బడినట్టిది. మఱికొంతకాలమునకు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రమునందు నాచన సోమనాథుని కాలమును నిర్ణయించుటలో బుక్కరాయ శాసనమును పేర్కొని యిట్లు వ్రాసియున్నారు.

"ఇది మైసూరు రాజ్యములోని కోలారు మండలమునందలి హెబ్బాళ్లి రామవరపు పటేలయిన జటాపల్లయ్యను విప్రునినుండి గైకొనఁబడి, ఎపిగ్రాపియా కర్నాటికాలో కోలారు మండలము నందలి Gd 46 వ సంఖ్యను బ్రకటింపఁబడిన తామ్రశాసనము". అనఁగా వీరుదాహరించిన ప్రతియును, చిలుకూరి వీరభద్రరావుగారు ప్రకటించిన ప్రతియును, నొకే శాసనమునకుఁ బుట్టిన పుత్రికలని యింతకుముందు చెప్పిన కారణముల చేతనే నిర్ణయింపఁ దగును. వీనియందుఁ గన్పట్టు వివిధవిషయముల తారతమ్యములు ముందు విపులముగాఁ జర్చింపఁబడును

శ్రీ కందుకూరివారు గ్రహించిన శాసనము ప్రతినిటఁ బొందుపఱచుచున్నాను.
( కోలారు మండలము : గౌరిబిదనూరు తాలూకా - GD 46 సంఖ్య )

శ్రీ గణాధి పతయే నమః

శ్లో॥ నమస్తుంగ శిరశ్చుంబి చన్ద్రచామరచారవే
త్రైలోక్య నగరారంభ మూలస్తంభాయ శంభవే ౧
అవ్యాదవ్యాహతైశ్వర్య కారణో వారణాననః
వరదస్త్రీవ తిమిరమిహిరో హరనందనః ౨
శ్రీమానాదివరాహో యశ్శ్రియం దిశతు భూయసీం
గాఢమాలింగతాయేన మేదినీ మోదతే సదా ౩
అస్తికౌస్తుభ మాణిక్య కామధేను సహోదరః
రమానుజః కళానాథః క్షీరసాగర సంభవః ౪
ఉదభూదన్వయేతస్య యదుర్నామ మహీపతిః
పాలితా యత్కులీనేన వాసుదేవేన మేదినీ ౫
తత్కులే బుక్కనామాయః కీర్తిశౌర్య విచక్షణః
మంగాంబికా భవద్రాజ్ఞీ లక్ష్మీరివ హరేర్యథా ౬
అభూత్తస్యకులే శ్రీమా నభంగురగుణోదయః
అపాస్త దురితాసంగః సంగమో నామభూపతిః ౭

మాలాంబికా భవద్రాజ్ఞీ తస్యరాజ్ఞః శుచిస్మితా
దమయంతీ నళస్యేవ ఇంద్రస్యేవ యథాశచీ ౮

ఆసన్ హరిహరః కంపో బుక్కరాయ మహీపతిః
మారపోముద్దపశ్చేతి కుమారాస్తస్య భూపతేః ౯

పంచానాం మధ్యగస్తేషాం ప్రఖ్యాతో బుక్కభూపతిః
ప్రచండవిక్రమో మధ్యేపాండవానా మివార్జునః ౧౦

భంగాః కళింగామిత శౌర్యవృత్తే
ర్వంగా విభిన్నాంగ విఘూర్ణనేత్రాః
ఆంధ్రాశ్చరంధ్రాణి విశంతి యస్య
బాహ్వాగ్ర ఖడ్గేన విశీర్యమాణాః ౧౧

తురుష్కాశ్శుష్కవదనాః పాండ్యభూపాః పలాయితాః
స్వభుజార్జిత కీర్త్యేణ తస్మైరాజ్యం ప్రయచ్ఛతి ౧౨

బుక్కరాయోద్భవ [illegible] క్రమః
మేదినీవ ప్రజాయేన [illegible] ౧౩

రాజాధిరాజ స్తేజస్వీ యో రాజపరమేశ్వరః
భాషాలంఘిత భూపాల భుజంగమ విహంగమః ౧౪

రాజరాజ భుజంగోయః పరరాజ భయంకరః
హిందురాయ సురత్రాణ ఇత్యేతైరుపశోభితః ౧౫

విద్యాభిదాన నగరీ విజయోన్నతి శాలినీ
విద్యారణ్య కృతా తస్యాం రత్నసింహాసనే స్థితః ౧౬

యస్మిన్ షోడశదానానాం ధరాయాపరిశోభితే
దానాంబు ధారయాతస్య వర్ధతే ధర్మపాదపః ౧౭

అలంకృతే శకస్యాబ్దే రసభూనయనేందుభిః
తారణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే ౧౮

పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్య సన్నిధౌ
ఆపస్తంభాఖ్య సూత్రాయ భారద్వాజాన్వవాయినే ౧౯
యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే
అష్టాదశ పురాణానా మభిజ్ఞాతార్థవేదినే ౨౦
అష్టభాషాకవిత్వ శ్రీ వాణీ విజితసంపదే
సోమాయ నాచనాంభోధేః సోమయామితతేజసే ౨౧
గుత్తి దుర్గాభిధే రాజ్యే కోడూ రాజ్యమహీతలే
పెన్నమాగాణి విఖ్యాతే సర్వసస్యోపశోభితే ౨౨
కోడూరు నాగమల్లాఖ్య దిన్నాభ్యా మపి పశ్చిమం
గ్రామోత్త మాద్వేళుమంకూరోః ప్రాచ్యాద్దిశి సమన్వితం ౨౩
ఊరచింతల నామ్నశ్చ గ్రామాద్దక్షిణ సంస్థితం
వంగలారొక్కడుతాళాభ్యా ముత్తరాశాముపాశ్రితం ౨౪
పినాకినీ తటే పెంచుకల దిన్నాహ్వయం పురా
బుక్కరాయపురాఖ్యాత ప్రతినామ్నాచ శోభితం ౨౫
నిధినిక్షేప సంయుక్తం జలపాషాణసంయుతం
అక్షిణ్యాగామిసహితం సిద్ధసాధ్య సమన్వితం ౨౬
అష్టభోగమిదం సర్వస్వామ్య మాచంద్రతారకం
సహిరణ్య పయోధారా పూర్వకం దత్తవాన్ముదా ౨౭
శ్రీమన్నాచన సోమాఖ్య మహాకవివరో వ్యధ
రాజానమాశిషం చైవ చిరజీవీ భవత్వితి ౨౮
స్వయమన్వకరోద్వృత్తిం దశోత్తరశతం కవిః
షట్త్రింశ దత్ర భాగాః స్యు ర్యజమానాహ్వయస్తతః ౨౯
భారద్వాజాన్వయేజాతః తల్లపో నామయాజుషః
అష్టవింశతి వృత్తీనామధిపో నాచనాత్మజః ౩౦
కాశ్యపాన్వయ సంభూత అన్నదాతాధ్వరీంద్రజః
యాజుషైకాదశాంశీచ సర్వజ్ఞః సింగయోబుధః ౩౧

దేవణస్యసుతః శ్రీమాన్ సింగపో నామ యాజుషః
కౌండిన్యాన్వయసంభూతో దశవృత్తీశ్వరః స్మృతః ౩౨
నాగయస్యసుతః శ్రీమాన్ వత్సయో నామ యాజుషః
కాశ్యపాన్వయ సంభూతో వృత్తిత్రియ మిహాశ్నుతే ౩౩
శ్రీవత్సాన్వయ సంభూత స్తిమ్మయస్య తనూభవః
యాజుషోభాస్కరశ్చేతి వృత్తిద్వయ మిహాశ్నుతే ౩౪
అస్యాగ్రహార వర్యస్య చతుస్సీమా వినిర్ణయం
సర్వేషాం సుఖబోధాయ లిఖ్యతే దేశభాషయా ౩౫

తూర్పుకు నాగమలదిన్న – ఆ సందుకు చింతకోట. అందుకు దక్షిణము ఒగదిలోని నల్లగట్టు – అందుకు దక్షిణాన కప్పలవాగుమేర – అందుకు పశ్చిమానక .... అందుకు దక్షిణాన వేంపమ్రాకు. అందుకు దక్షిణాన కోడూరి రాట్లపువాల్లి అరతి పెద్దరావిమాకు నాగమల్లదిన్న – ఆ సందుకు ముగ్నుడ్డపొలాన —— అమ్మిమ్రాకుమేర. అందుకు దక్షిణాన కలవి గుట్టం – అందుండి పెన్న యేటిగడ్డను ఉప్పారగోడలు – దక్షిణాన కవంగలూరును కొడతాళాను. ఆసందుక పెన్నమేరగ్గా – పడమటికి గడ్డమేర – అందుకు ఉత్తరాన నాయనిచింత – అందుకు ఉత్తరాన చోటు మిట్టమీది జమ్మిమ్రాకు. అందుకు ఉత్తరాన దండు చెరువు వేంపమ్రాకు. అందుకు ఉత్తరాన కప్పలవాంగు గడ్డను తుమ్మమ్రాకు – అందుకు ఉత్తరాన కాశంవాగు మేరచేసికొని నక్కలతిప్ప – పడమట అంచుమేర చేసికొని కొండమేర – ఉత్తరానకు ఊరచింతల ఆసందుకున్ను కొండ మేర – మానుచింత కాననుకలశన్ను. ౩౬

ఇద మఖిలరాజశేఖర మధుకర ఝుంకారగీత మాహాత్మ్యం
శ్రీమద్బుక్క రాజేంద్రనృపతేః శాసనమచలైక పారిజాతస్య
ఆత్రేయాణాం యాజుషః కోటిదేవారాధ్యాచార్యస్యాంగజో
మాధమూర్తిః
చక్రీసమ్యత్సర్వ శాస్త్రప్రవీణః శోకానేతాన్ మల్లనారాధ్య
వర్యః ౩౭

త్వష్ట్రేతచ్ఛాసనం స్వామిశాసనేన వినిర్మితం
శాసనాచార్యవర్యేణ నాగిదేవేన శిల్పినా ౩౮
దానపాలన యోర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం
దానాత్స్వర్గమాప్నోతి పాలనా దచ్యుతం పదం ౩౯
స్వదత్తాద్ద్విగుణం పుణ్యం పరదత్తాను పాలనం
పరదత్తాప హారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్ ౪౦
సామాన్యోయం ధర్మసేతుర్నృపాణాం
కాలేకాలే పాలనీయో భవద్భిః
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్రః ౪౧
శ్రీవిరూపాక్ష.

## శాసన ప్రతుల విషయము

ఈ సందర్భమున నిదానశాసనపుఁ బ్రతులను గూర్చిన మఱొక విషయమును జెప్పనగును. ఎపిగ్రాఫియా కర్ణాటికాలో లూయీ రైసు పండితునిచేఁ బ్రకటింపఁబడిన రెండు ప్రతులయందలి భాషయు సంస్కృతమేయని ముందె చెప్పఁబడినది. కాని వాని దిగువను, 'In Kannada; In Kannada Character' (కన్నడలిపి యందు గలదు) అని వ్రాయబడియున్నది.[1] శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఉత్తరహరివంశ పీఠికలో నీప్రతుల విషయమున నిట్లు వ్రాసియున్నారు. "ఆ రెండు (శాసనప్రతులు) ను నిదానమునె పేర్కొనుచున్న యేకశాసనమునకే భిన్నప్రతులు; నాగరలిపిలోనున్న తామ్ర శాసనములనుండ నెత్తఁబడినవి."[2] శ్రీ వంగూరి సుబ్బారావుగారు తమకు కన్నడలిపియందున్న శాసనమొకటి దొరికినదను విషయమును, "నాచన సోమనాథుఁడు - చారిత్రక విషయములు" అను వ్యాసమునఁ దెలిపి యున్నారు.[3]

1. Epigraphia Carnatica vol X Kolar Dt. Inscription Nos. Mg. 158 and Gd 46.
2. Vavilla Edition, 1926 and 1961 A.D
3. Grandhalaya Sarvaswamu vol. I — First Issue.

పయి విషయముల మూలమున నీ బుక్కరాయ శాసనమునకు రెండు ప్రతులు నాగరలిపియందును, మఱి రెండుమూఁడు ప్రతులు కన్నడ లిపియందును గలవని తెలియుచున్నది. ఇందు శాసన ప్రకాశకులు "కన్నడలిపి" అని పేర్కొనినను, శాసన కార్యాలయమునందున్న ప్రతులు నాగరలిపిలోనె గలవని, ఆ కార్యాలయమున పని చేసిన శ్రీ హర్షవర్ధన శర్మగారు తెలియఁజేసిరి. అందలి ముఖ్యాంశములఁ బుటయడుగు భాగమునఁ జూపియున్నాను.[1] కావున ప్రస్తుతము లభ్యమగుచున్న ప్రతులన్నియును బుక్కరాయల దానశాసనమునకు ప్రతికలేయని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

## శాసనకాలము — వివిధమతములు

యదువంశ సంభూతుఁడును, సంగమవంశమునకు మూలపురుషుఁడు నగు సంగమునకు మాలాంబిక యందైదుగురు పుత్రులు జనించిరి. వారిలో, పాండుపుత్రుల యందర్జునునివలె, మధ్యముఁడగు బుక్కరాయ భూపతి స్వభుజబల పరాక్రమాతిశయమున రాజ్యము నేలుచుండెను. రాజాధిరాజ, రాజపరమేశ్వర, రాజరాజ

1. " అందొక విచిత్రమైన పొరపాటు జరిగి ఇంతవఱకు దాని (బుక్కరాయఁ శాసన) కాలమును గూర్చిన అనేక శంకలకు తావలమైనది. అసలది ఒకే తామ్ర శాసనము రెండు ఊళ్లలోని ఇద్దరి వ్యక్తులద్వారా చేరి వేర్వేరుగా శాసనపాఠములు చదువబడినవి. అందుచే ఆ శాసన పాఠభేదములు, అందును ముఖ్యముగ కాలమును గూర్చిన భేదము గలదు. 10 వ వాల్యూము రోమన్‌లో వేసిన దానిలో నొకచోట (i) శకస్యాబ్దే రసర్తునయనేందుభిః (శక 1266 = క్రీ. శ. 1344) అని — (ii) అదే గ్రంథమున రెండవచోట రసభూనయనేందుభిః (శక 1216 = క్రీ. శ. 1370) సందేహముగ సాధారణ సంవత్సర — (iii) కన్నడలిపిలో చదివినపాఠమున రసాభ్ర నయనేందుభిః (శక 1206 = క్రీ. శ. 1284) అని మూఁడు విధములుగ శాసనపాఠములు చదువుటచే మన పండితులు నిన్నిచిక్కులు పెట్టినారు. ఇందు మొదటి పాఠము సరియైనది.........రెండు స్థలములలో వేర్వేరుగా ప్రకటించిన దొకేశాసనమనుటకు నా కాధారము ఆయా రేకుల మీద గల పంక్తులు ఏమాత్రము ఒక్క అక్షరమైన భేదము లేకుండ ఒక్కటిగ నుండుట. ప్రతిబింబము వారెచ్చట ప్రకటించలేదుగాని రెండు నాగరలిపిలోగలవు. వరాహముద్ర యున్నదని చెప్పిరి. ఆ రెండు వేర్వేరు శాసనములుగనే మా reports 1906 లో గలవు........."

(శ్రీ హర్షవర్ధన శర్మగారి లేఖ – 12–12–1962)

"**Note : This is given as the Saka year rasabhu nayana indu ( = 1216) the year Tarana. But this does not fall within Bukka's reign during which there was no Tarana. Hence Sadhatana, Saka 1292 expired has been conjecturally taken.**" రైసు పండితుఁడిట్టి సూచనచేసి యుండిన మాట వాస్తవమే. కాని యాతఁడు ప్రకటించిన శాసనమునందు "కరాజ నయనేందుభిః" అను పాఠమును జూపలేదు. ఇంతియుగాక తారణ సంవత్సరము బుక్కరాయల రాజ్యకాలములోనికిఁ దెప్పించుటకు శాసన కాలమును శా. శ. సంవత్సరము **1266** గా మార్చవలెనని యెంచి, "రసాభ్ర" యను దానిని "రసర్తు" గా రైసు పండితుఁడు సవరించెననియు శ్రీ వీరేశలింగంగారు వ్రాసిరి. అట్లు చేసినను తారణ సంవత్సరము బుక్కరాయల రాజ్యకాలములోనికిరాక, హరిహరరాయల రాజ్యకాలము లోనికి వచ్చిన దనిరి. కావున నీ బుక్కరాయ శాసన కాలము క్రి. శ. **1344** వ సంవత్సరము నాటిదనుటకంటె, క్రి. శ. **1370** వ సంవత్సరమునాటి దనుటయే సమంజసమని శ్రీ పంతులుగారు తమ నిశ్చయమును దెలిపి యున్నారు.

అనంతరము నాచన సోమనాథుని యర్వాచీన కవులెవరెవరు స్తుతించిరనియుఁ దెలిపి, తుదకు శ్రీ పంతులుగారీ కవికాలము నీక్రిందివిధముగా నిశ్చయించి యున్నారు. "వీనినన్నిటినిబట్టి విచారింపఁగా సోమకవి యెఱ్ఱాప్రెగడకుఁ దరువాతను శ్రీనాథాదులకుఁ బూర్వమునందును నుండుట స్పష్టము. కాబట్టి యితఁడు హూణశకము **1360 - 70** సంవత్సరముల ప్రాంతముల యందున్నాఁడని యించుమించుగా నిశ్చయింపవచ్చును." సోపపత్తికముగా నింతటి సుదీర్ఘమగు చర్చగావించియు వీరేశలింగము పంతులుగారు దానశాసనకాలము బుక్కరాయల రాజ్యకాలములోనే యుండవలయునని తలంచి, తారణాబ్దమునకు మాఱుగా సాధారణాబ్దముగాఁ జేయఁబడిన మార్పు నంగీకరించిరి. కావున నీదాన శాసనకాలము శా. శ. **1292** వ సంవత్సరము లేక క్రి. శ. **1370** వ సంవత్సరము కావలయునని వారు నిర్ణయించిరి.

## విజయనగర రాజ్యస్థాపన కాలము

ఈ కవికాల నిర్ణయ విభాగమును జర్చించు నవసరమున మఱియొక ముఖ్య విషయమునుగూర్చి చెప్పవలసియున్నది. ఈ కవికి సంబంధించిన దానశాసనము

విజయనగర సమ్రాట్టగు బుక్కరాయలచే నిర్మింపబడినదని మీఁద వివరించితిని. అట్టిచో నా విజయనగర సామ్రాజ్య స్థాపనాది విషయములనుగూడ నిర్ణయింపవలసియుండును. అందులకుపయోగపడు చారిత్రక విషయములను, శాసనస్థములగు నాధారములను బరికింతము. స్వస్తిశ్రీ ధాతృనామ సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమీ తిథిని పుష్యమీ నక్షత్రయుక్త సింహలగ్నమందు, సంగముని కుమారులలో జ్యేష్ఠుడగు హరిహరరాయలు విజయనగరమునఁ బట్టాభిషిక్తుఁడయినాఁడు. ఈ విషయము కాపలూరి శాసనమును బట్టి వ్యక్తమగుచున్నది. ఆశాసనము "నెల్లూరుమండలదానశాసనములు" మొదటి భాగములో పదునేనవ సంఖ్యయందుఁ బ్రకటింపఁబడినది. శృంగేరీ పీఠాధిపతులలోఁ బదునొకండవ వాఁడగు శ్రీ మాధవ విద్యారణ్యులవారి యాదేశమున విజయనగర రాజ్యము స్థాపింపఁబడిన విషయము గూడ నందే వివరింపఁబడినది. శ్రీ చాగంటి శేషయ్యగారా శాసనము నందలివిగా నుదాహరించిన శ్లోకముల నీక్రింద వ్రాయుచున్నాను.

" తథాహరిహరేశ్వర విరచయ్య తచ్ఛాసనం
నృపాసన మపాస్థితోచ్ఛ్రితసితాత పత్రోజ్వలః
విధాయఖలు షోడశా ప్రతినిధోనిదానా
న్యహోవ్యరాజిత విశాల సీమ్ని నగరేహి విద్యాభిదే ౧౭

అష్టపంచ యుగళైక సంఖ్యయా
సంయుతేన్నృప శకస్య వత్సరాత్పరే
ధాతృమాధవ వలక్షస ప్తమీ
పుష్యతార హరిలగ్నకే భుజే ౧౮

ఇందు "అష్టపంచయుగళైక" అను సంఖ్యను కాలము సూచింపఁ బడినది. అనగా, అష్ట : 8; పంచ : 5; యుగళ : 2; ఏక : 1 వరుసను 8521 అగును. "అంకానాం వామతోగతిః" అను నియతిని 1258 శా. శ. సంవత్సరమగుచున్నది. ఇది ధాతృనామ సంవత్సర మయియున్నది. ఈ ధాతృనామ సంవత్సరము క్రీ. శ. 1336 (శా. శ. 1258+78 = 1336) వ సంవత్సరమునకు సరిపడుచున్నది. దీనినిబట్టి విద్యానగర లేక విజయనగర సామ్రాజ్యస్థాపనమును, తత్సింహాసనము నధిష్ఠించిన

ప్రప్రథమ చక్రవర్తియగు హరిహరరాయల పట్టాభిషేకమును క్రీ శ 1336 వ సంవత్సరము ఏప్రియలు నెల పదునెనిమిదవ తేదిని జరిగియుండెననుట స్పష్టము.[1] ఈ విషయములను చారిత్రకులు సహితమంగీకరించియున్నారు సంగముఁడు తొలుత దేవగిరి. ప్రభువు ఈ సంగముఁడు వంశనామము పెట్టుటచేతనే హరిహర బుక్క రాయాదులకు సంగమ వంశీయులని పేరువచ్చినదను విషయము చారిత్రక ప్రసిద్ధమే

పై శాసనమునకు ఉపోద్బలకముగ మఱియొక శాసనము గలదు అది బాగే పల్లి శాసనమది[2] ఈ శాసనకాలముగూడ క్రీ శ 1336 వ సంవత్సరమే అందు వివరింపఁబడిన విషయములివి.

సంగమవంశమున్కి ఆద్యుఁడగు హరిహరరాయలు ఆనెగొంది (కుంజరకోనపురి) ను బరిపాలించుచుండగా, అంగకళింగాది రాజులు సామంతులుగా నుండిరి హరిహరుఁ డొకనాఁడు వేటకేఁగి యటనొక విచిత్రదృశ్యమును గాంచెను. వేట సహాయార్థము కొనితెచ్చిన జాగిలము నొక చెవులపిల్లి తరిమివైచినది అనంతర మా ప్రాంత మునఁగల పంపావిరూపాక్షుల సేవించి, యాసమీపముననున్న విద్యారణ్యులవారిని దర్శించి, వారి కీయుదంతము నెఱిఁగించెను త్రికాలవేదియగు నా మహనీయుఁ డా స్థల మాహాత్మ్యమును విశదపఱచినాఁడు ఈ మాహాత్మ్యము ననుసరించియే హరిహర రాయ లా స్థలమున సువిశాలమగు విద్యానగరమును నిర్మించినాఁడు. ఈ శాసనము నందు వ్యక్తములయిన మఱికొన్ని - విషయములును - గలవు. అందలి శ్లోకము లి దిగువ నీయఁబడినవి—

" అష్టపంచ యుగళైక సంఖ్యయా-
సంయుతేన్దుశక నృపస్య వత్సరే
ధాతృమాధవ వలక్ష సప్తమీ ష్వ
హ్నిసత్య నఘులగ్న -తారకే "

---

1 A History of South India Chapter XI. Page 230

2. „ Epigraphia Carnatica vol X Kolor Dt. Bg 70 (ఈ శాసన మున్నతు మూలప్రతి లభ్యముకాలెదు. చేతివ్రాత కాపీనాధారముగాఁగొని ప్రకటింపఁబడినది.) Further sources of Vijayanagara History vol I page 23.

ఈ శాసనమునందు సూచింపఁబడిన కాలమునకును, కాపలూరు శాసనములోని కాలమునకును భేదములేదు. మఱియు బిజాగేపల్లి శాసనమునందలి గాధ కాపలూరు శాసనమునందును గలదు.[1] మఱియును పట్టాభిషేకకాలమున సంపావిరూపాక్ష మహేశ్వరులకు ఫలాభిషేకము కూడ చేయింపఁబడినదని తెలియుచున్నది. పట్టాభిషేక సమయమునఁ జక్రవర్తులు వివిధములగు దానములను జేయుటయు, తమ యిష్టదైవతముల భక్తిమెయి నర్చించుటయు సామాన్యమగు విషయములేగదా! ఈ సంవత్సరమునఁ జేయఁబడిన దానమును బురస్కరించుకొనియే కాపలూరు శాసనము వెలసినది. హరిహరరాయభూపతి చంద్రగిరి రాజ్యములో పలనాటిసీమలో నుప్పముఖీ తీరమున నున్న కాపలూరు గ్రామమునకు హరిహరపురమని పేరుపెట్టి బ్రాహ్మణులకు ధారవోసి, తామ్ర శాసనమును వ్రాయించెను.[2] కావున పట్టాభిషేక, ఫలాభిషేకములును, గాపలూరుగ్రామ దానమునొక్కనాఁడే జరిగి యున్నవనుట స్పష్టము. ఈ విషయము లనుబట్టి క్రీ. శ. 1336 వ సంవత్సరమున విజయనగర రాజ్యస్థాపనము జరిగియున్న దనుటలో విప్రతిపత్తి లేదు.

## బుక్కరాయలు – యువరాజు

ఇట మఱియొక యంశము. హరిహర బుక్కరాయ లిరువురును విజయనగర సామ్రాజ్య స్థాపకులనుట లోకవిదితము. ఇరువుర పేర్లను జంటగానే పేర్కొనుటయుఁ బరిపాటి. సంగముని తనయులగు నేవురి యందును నగ్రజుఁడగుటచే హరిహరరాయలు సింహాసనస్థుఁడయినాఁడు. బుక్కరాయలాతనికి కుడిభుజమయి యుండెననుట సత్యమును, చారిత్రికమునయి యున్నది. ఇంతటి శౌర్యబల పరాక్రమములు గలవాఁడు కావుననే హరిహరుని తరువాత బుక్కరాయలే రాజయ్యెను. మఱియు నన్నగారి రాజ్యకాలమున నితఁడు యువరాజుగా నుండెను. ఈ విషయము బుక్కరాయల కుమారుఁడగు రెండవహరిహరరాయలు తమ తల్లిగారి పేరను జంబూరు గ్రామమునకు హొన్నలాపురమని పేరిడి, క్రీ. శ. 1378 వ సంవత్సరమున బ్రాహ్మణులకు దానమొసంగిన శాసనమునందు చెప్పఁబడినది[3] ఆశాసనమునందలి యీ క్రింది శ్లోకములను జూచినచో నీవిషయము వ్యక్తమగును.

---

1. ఆంధ్రులచరిత్రము. మూఁడవభాగము. పుట 323.
2. నెల్లూరు దానశాసనములు; ఆంధ్రులచరిత్రము : మూఁడవభాగము. పుట 319.
3. ఎపిగ్రాఫియా కర్నాటికా. వాల్యూము 5. చెన్నరాయపట్నం 256 వ సంఖ్య.

"విధాయ యువరాజం యో బుక్కరాజం నిజానుజమ్
ఉపేంద్రం ఇవదేవేంద్రో నిశ్శంకం అసిషజ్జగత్ " — 6
"యస్మిన్ బుక్కమహీపతే సంభవద్విశ్వంభరారక్షకే" —10

హరిహరరాయుల కాలమున నాతని తరువాతి వాఁడగు కంపన యువరాజు కావలసి యున్నది. తద్భిన్నముగ వానితరువాతివాఁడగు బుక్కరాయలను యువరాజుగా నియమించుటయు నీతనిప్రతిభావిశేషములు వ్యక్తపఱచును. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారును తమ పీఠికలో క్రీ. శ. 1344 వ సంవత్సరము నాటికి బుక్కరాయలు రాజ్యమునకు రాకున్నను యువరాజుగా నిర్వాహము చేయు సమర్థుఁడనియే చెప్పియున్నారు. వారు తారణాబ్దము బుక్కరాయల రాజ్యకాలములోనిదై యుండుననవసరము లేదని తెలుపు నవసరమున చెన్నరాయపట్నము శాసనమును పేర్కొనియున్నారు. హరిహర బుక్క రాయలిరువురును గలిసియే విజయనగర రాజ్యమును బరిపాలించుచున్నటులే పలు శాసనములందు గాననగును

ఇఁక హరిహర బుక్కరాయల రాజ్యకాలములనుగూర్చి చర్చింతము. ఈ విషయమున వివిధములగు మతములు కలవు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్రములో బుక్కరాయల కాలమును క్రీ. శ. 1355 వ సంవత్సరము నుండి క్రీ. శ. 1377 వ సంవత్సరము వఱకునని నిశ్చయించిరి. శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణ రావు పంతులుగారును నీకాలనిర్ణయమునే యంగీకరించిరి. అనఁగా వీరియభిప్రాయము ననుసరించి, హరిహరరాయలు క్రీ. శ. 1336 వ సంవత్సరమునుండి క్రీ. శ. 1355 వ సంవత్సరము వఱకును బరిపాలించినట్లు తెలియనగును. శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు, హరిహర రాజ్య కాలనిర్ణయమును బురస్కరించుకొని, యీ క్రింది విధముగా వ్రాసియున్నారు. "విజయనగర రాజ్యమును క్రీ. శ. 1335 సంవత్సరము మొదలు క్రీ. శ. 1356 వఱకు హరిహరరాయలు పరిపాలించెనని కొందఱు చరిత్రకారులు వ్రాసిరిగాని యీ కాల నిర్ణయమింకను నిర్వివాదాంశము కాలేదు."[1] కాని వీరి యభిప్రాయము ప్రకారము విజయనగర రాజ్యస్థాపన కాలవిషయము మాత్రము వివాదాంశముకాదు. విజయనగరాధీశులలో హరిహరుఁడు మొదటివాఁడు. ఇంతకుముందు చెప్పఁబడిన కాపలూరు శాసనమునుబట్టి విజయనగర

1. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము : పుట 11.

రాజ్యస్థాపనకాలము, హరిహరరాయల పట్టాభిషేక కాలము నిశ్చయముగాఁ దెలియుచున్నది. మఱియుఁ జారిత్రకులును నివ్విషయమును వివాదాంశముగాఁ బరిగణించుటలేదు. ఇందు రెండవ యంశమైన హరిహరరాయల రాజ్యకాల మే సంవత్సరముతో సంతమయినదియు, బుక్కరాయలే సంవత్సరమున రాజ్యమునకు వచ్చినదియు నిశ్చయింపఁ బడవలయును. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, షిమోగా మండలమునందు టి. యల్. 154 వ సంఖ్యను బ్రకటింపఁబడిన శాసనమునుబట్టి, శకసంవత్సరము 1268, వ్యయ నామ సంవత్సర మార్గశిర శుద్ధ ప్రతిపన్నాఁడు బుక్కరాయలు సింహాసన మధిష్ఠించినట్లు తెలిపియున్నారు.[1] అది క్రీ. శ. 1346వ సంవత్సరమునకు సరియైనది. సుప్రసిద్ధ చారిత్రకులగు శ్రీ కె. ఎ. నీలకంఠ శాస్త్రిగారు కూడ నీవిషయము నంగీకరించియున్నారు.[2] వీరును, శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారును కలిసి రచించిన గ్రంథమునందుఁగూడ నీవిషయముగలదు.[3] మఱియు శ్రీ శాస్త్రిగారు చూపిన సంగమ వంశవృక్షమునందు హరిహరరాయల కాలము క్రీ. శ. 1336 నుండి క్రీ. శ. 1357 వఱకు ననియు, బుక్కరాయల కాలము క్రీ. శ. 1344 నుండి క్రీ. శ. 1377 వఱకు ననియుఁ జూపియున్నారు. [A History of South India Page 300] తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన శాసనములలో సంగమవంశ వృక్షమునందు హరిహర బుక్కరాయల రాజ్యకాలములు వరుసగా, క్రీ. శ. 1336 నుండి క్రీ. శ. 1344 వఱకును; క్రీ. శ. 1343 నుండి క్రీ.శ. 1379

---

1. ఆంధ్రకవుల చరిత్రము : ప్రథమభాగము. పుట 328.

2 "Before he [Harihara I] died he had already nominated Bukka, the ablest of his brothers, to succeed him; indeed this 'prop of the throne' became joint ruler as early as 1346, with Gutti as his capital".
— A History of South India : Page 254

3 Though Harihara I s rule lasted, as shown by the evidence of the inscriptions, until 1354 — 55 AD., several records of Bukka make it clear that he was *ruling at Vijayanagara as King* even before the death of his brother. ......... It is evident from this that reigns of Harihara I and Bukka I overlap. The explanation for this overlapping must be found in the joint rule of the two brothers'.
— Further sources of Vijayanagara History Page 77 and 78

వఱకు ననియుఁ జూపియున్నారు.[1] కాని యీ కాలములను నిర్ధారించుటకు బలమగు నాధారములు నేమియు వారు తెలుపలేదు. మఱొక విషయము శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు. శా. శ. 1298 వ సంవత్సరము (అనఁగా క్రీ. శ. 1376 వ సంవత్సరము) నల సంవత్సర ఫాల్గుణ బహుళ పాడ్యమి భానువారము నాఁడు బుక్కరాయలస్తమించినట్లును వెలిబుచ్చియున్నారు.[2] ఇట్టి విపరీతములగు విషయజాలములో, శాసనస్థాపరముగ బుక్కరాయల పట్టాభిషిక్త కాలము క్రీ. శ. 1316 వ సంవత్సరమగుటను గూర్చి వివాదముండుట కవకాశములేదు. ఈ కారణము చేతనే శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారల యభిప్రాయము ననుసరించి, బుక్కరాయల రాజ్యప్రారంభకాలము సరికాదని తెలియుచున్నది. అట్లే శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారి యభిప్రాయమును గూడ నంగీకార్యముకాదు. ఈ విషయమున శ్రీ కె. ఎ. నీలకంఠశాస్త్రిగారు నిర్ణయించిన బుక్కరాయల రాజ్యకాలము కొంతవఱకు సమర్థనీయమగుచున్నది. హరిహరరాయలు క్రీ. శ. 1336 వ సంవత్సరము నుండి క్రీ.శ. 1357వ సంవత్సరమువఱకు పరిపాలించుచుండఁగా, (మహామండలేశ్వర బిరుదాంకితుఁడగు) బుక్కరాయలు సర్వాధికారముల రాజ్యభారమును వహించు చుండెననుట స్పష్టము. క్రీ. శ. 1340 వ సంవత్సరమున, నడిగడ్డ సీమ లోని ఉండవేలు శివరెడ్డికి విజయనగరాధిపతులు వ్రాయించి యిచ్చిన కౌలుశాసనము నందుఁగూడ బుక్కరాయలను ప్రత్యేకముగఁ బేర్కొనుట ప్రకృతవిషయమునఁ కొక ప్రబలాధారము;[3] మఱియు బుక్కరాయల దానశాసనములు క్రీ. శ. 1341 వ

---

1. Tirupati Devastanam Inscriptions Vol. VI Part II.
2. Further sources of Vijayanagara History Vol. III
Page 28
3. Further sources of Vijayanagara History Vol. III Page 28
24 [e] A Lease deed
"Hail prosperity! In the victorious year 1262 of the Salivahana Saka corresponding to the year Vikrama Jyestha Su. 10, Arirayaganda, Arirayamardana, the prosperous Maharajadhiraja, Rajaparameswara, Vira pratapa Harihararaya, who has the prosperous Mahamandaleswara Bukkaraya as the prop of his throne, granted a lease deed [Kaulu nirupa] to Vundavelu Siva Reddi of Nadigadda Sima :—
Order details — — "

సంవత్సరమునుండి కానవచ్చుటకు ప్రకృతశాసనమొక ప్రత్యక్ష సాక్ష్యము. కావున క్రీ. శ. 1344 వ సంవత్సరమునకుఁ బూర్వము నుండియే హరిహరబుక్కరాయ లిరువురును ఉమ్మడిగా విజయనగర రాజ్యమును బరిపాలించు చుండిరని చెప్పనగును. ఇందులకు హరిహరరాయల జరాభారము హేతువయినను గావచ్చును. కావున హరిహరరాయల రాజ్యకాలము క్రీ. శ. 1336 - 1357 వఱకు ననియు, బుక్కరాయల రాజ్యకాలము క్రీ. శ. 1344 - 1376 వఱకు ననియుఁ జెప్పవచ్చును. పయివిషయముల వలన క్రీ. శ. 1344 వ సంవత్సరమున, బుక్కరాయలు యువరాజుగనే కాక విజయనగర రాజ్యమునకు ఉమ్మడిప్రభువుగా పెంచుకలదిన్నె శాసనమును వెలయించినాఁ డనుటలో సందియములేదు.

## తారణ సంవత్సర నిర్ణయము

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రమును బ్రకటించుటకుముందు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు "ఆంధ్రకవుల జీవితము"లను రచించిరి. ఇది క్రీ. శ. 1881 వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడినది. వారు నాచన సోమనాథుని గూర్చిన చరిత్ర యేమియుఁ జెప్పలేదు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారల యభిప్రాయములను, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి మహాకవి కాలనిర్ణయమును గూర్చి చర్చించిన పట్టులనే వివరించితిని. శ్రీ వంగూరి సుబ్బారావుగారు, సోముని కాల నిర్ణయమునఁ గొంత పరిశ్రమించిరి. వీరు నాచన సోమనాథుని విషయమయి కొన్ని చారిత్రక విషయములను బ్రకటించిరి.[1] వీరు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారల యభిప్రాయముతో నేకీభవింపక, నాచన సోముఁ డెఱ్ఱాప్రెగ్గడకంటె పూర్వుఁడని నిరూపింప నమకట్టిరి. ప్రకృత దానశాసనమునకు ఎపిగ్రాఫియా కర్ణాటికాలో ప్రచురితములయిన ప్రతులు రెండుగలవని తెలుతనే స్పష్టపఱచి యుంటిని. శ్రీ చిలుకూరి వారు ప్రకటించిన శాసనము వీనిలో నొకదానికి సరియైనదే. శ్రీ వంగూరి సుబ్బారావుగారు తమకొక కన్నడపుఁబ్రతి లభించిన దనియు, నందు "రసజునయనేందుభిః" అని యున్నటులు స్థిరపఱచిరి. ఆ పయిని సందేహనివారణార్థము, శ్రీ వీరభద్రరావుగారు ప్రకటించిన శాసనమునకు మూలమును జూచి,

1. గ్రంథాలయ సర్వస్వము. ప్రథమ సంపుటము: ప్రథమ సంచిక.

వీరందు "ప్రసాభ్రసయసేందుబిః" అనియున్నదని చెప్పిరి. ఈ రెండు వాదముల యందును సూచింపఁ బడిన కాలములు శా. శ. 1216, శా. శ. 1206 సంవత్స రములు క్రమముగా నగుచున్నవి. అనఁగా నవి క్రీ. శ. 1294, క్రీ. శ. 1284 సంవత్సరములకు సరియైనవి. ఇందు క్రీ. శ. 1294 వ సంవత్సరము తారణాబ్దము కాదు; క్రీ. శ. 1284 వ సంవత్సరము తారణాబ్దమే యైనను, నాఁటికి విజయనగర సామ్రాజ్యము స్థాపింపఁ బడియుండలేదు. కావున నీరెండు శాసనములలోని కాలము నంగీకరింప వలనుపడదు. శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారీ పాఠముల నంగీకరింపక "సోమనాథకవియు, విద్యారణ్యులవారును, నెల్లూరి పెద్దయయుఁ గొంచెము హెచ్చుతగ్గుగా సమకాలికులనియే నా యభిప్రాయము" అని తమ నిశ్చితాభిప్రాయమును వెల్లడించి యున్నారు [1] మఱొకటి విషయముగూడ నిట విచారణీయము. శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు, "సోమనాథుని జీవితచరిత్రము"ను వ్రాయుచు, "ప్రాచీన లేఖమాల"లోఁ బ్రకటింపఁబడిన శాసనములను బట్టియు బుక్కరాయల వంశవృక్షమును నిర్ణయింప వచ్చుననిరి.[2] (చూడు : అనుబంధము I). ప్రాచీన లేఖమాలలో రెండవ హరిహర రాయల శాసనములు రెండుగలవు. అవి వరుసగా శా. శ. 1317 (క్రీ. శ. 1395), శా. శ. 1321 (క్రీ. శ. 1398) సంవత్సరములలో వేయఁబడినవి. శ్రీ వంగూరి సుబ్బారావుగారి యూహ ననుసరించి, బుక్కరాయ దానశాసన కాలము క్రీ. శ. 1284 వ సంవత్సరమని భావించినచో, యాతనితనయుఁడగు రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1395 వ సంవత్సరమున శాసనమును వెలయించుటెట్లు? తండ్రి వేయించిన శాసన కాలమునకును, తనయుఁడు వేయించిన శాసన కాలమునకును నడుమ నొక శతాబ్దము గడచినదనుట యసంభవము. కావున శ్రీ వంగూరివారి పాఠము సరికాదనుట స్పష్టము.

## మఱికొన్ని శాసనములు

బుక్కరాయలకు సంబంధించిన మఱికొన్ని శాసనముల నీదిగువ నుదాహరించు చున్నాను. బుక్కరాయలు సింహాసనము నధిష్ఠింపక పూర్వమే యాతనిని విజయ నగర రాధీశునిగా వ్యవహరించు చున్నట్లు వీనివలనఁ గూడఁ దెలియుచున్నది. ఇందు మొదటి శాసనము క్రీ. శ. 1344 వ సంవత్సరము నాటిది.

1. విజయనగర సామ్రాజ్యము నందలి ఆంధ్రవాఙ్మయ చరిత్ర. పుట. 15.
2. సోముఁడు : కవికాలనిర్ణయ విభాగము.

(i) కోలారు మండలము - చింతామణి తాలూకా 89 వ సంఖ్యను గల తమిళ శాసనము :

"స్వస్తిశ్రీ కాళయుక్తి సంవత్సరము నాలాయిరత్తు నానూరు నార్పత్తేటు ఇదన్మేల్ సెల్లానిన్రతా - - స్వస్తిశ్రీ మన్మామండ లేసురన్ అరియర రాయన్ కుమార వక్కరాయన్ వాలుక్కున్ - డోలుక్కుం జయమే అగ అట్టవట్టైత్తు డట్టిల్ వరందరం పెరుమాలం సెందన్ ... m స్వస్తిశ్రీ నిగరిలి చోలమండలట్టు... "

బుక్కరాయలు వ్యయనామ సంవత్సర మార్గశీర్ష శుద్ధ ద్వితీయనాఁడు (అనఁగా క్రీ. శ. 1346 వ సంవత్సరము డిసెంబరు మాసము) పట్టాభిషిక్తుఁడయినట్లు ముందు చెప్పఁబడినదిగదా! ఆ సంవత్సరమే యువరాజ్యత్వవమునకు బూర్వము వేఱొక శాసనము వెలసినది. ఈ కన్నడ శిలాశాసనము నందును బుక్కరాయలు రాజ్యముసేయు చున్నట్లుగానే కలదు.—

(ii) స్వస్తిశ్రీ శకాబ్ద 1268 నేయ . మీతె సాలువ వ్యయ సంవత్సరద అశ్వీజ బ 5 సో - లు శ్రీ మన్మహామండ . రాజాదిరాజ రాజపరమేశ్వర శ్రీ వీర బుక్కరాయరు పృథ్వీరాజ గెయివల్లి అవర కుమార ప్రతాప హరిహరరాయర నిరూపదిమ్ ప్రధాని మల్లపరసు. క్రొ(త్త)శాసన నివరిలి - చోళ-మండలద కోలాలనాడ ప్రభు ఇఖ సెట్టిగె పూర్వపల్లి మా.. "

ఈ క్రీ. శ. 1346 వ సంవత్సరపు శాసనమునందు బుక్కరాయలకు "రాజాధిరాజ, రాజపరమేశ్వర" అను బిరుదము లుండుట గమనింపఁదగినది. ఈ బిరుదములు విజయనగర సామ్రాజ్యాధీశ్వరుల కుండును. సాధారణముగా నివి యువరాజుల శాసనములలో గానరావు.

## సోమన జీవితకాల నిర్ణయము

నాచన సోమనాద మహాకవి కాలనిర్ణయమునకు వలయు వానిలో నతి ముఖ్యము లగు నాధారములు నాలుగు విషయములని చెప్పనొప్పును. అవి వరుసగ

(i) విజయనగర సామ్రాజ్య స్థాపనము

(ii) ఆంధ్రరాజ్య సింహాసనము నధిష్ఠించిన ప్రప్రథమ రాజన్యుఁడగు హరిహర రాయల రాజ్యకాలము

(iii) పిదప నాతని తమ్ముఁడగు బుక్కరాయమహీపతి పట్టాభిషేక కాలము

(iv) దానశాసనస్థమగు తారణ సంవత్సర విషయనిర్ణయము ననునవి. ఇందు విజయనగర రాజ్యస్థాపనము క్రీ. శ. 1336వ సంవత్సరమనియు, హరిహరరాయల రాజ్యకాలము క్రీ. శ. 1336 నుండి క్రీ. శ. 1357 వఱ కనియు, బుక్కరాయల పట్టాభిషేకకాలము క్రీ. శ. 1346వ సంవత్సర మనియు నింతవఱకు నిరూపింపఁ బడెను. హరిహరరాయలు క్రీ. శ. 1340వ సంవత్సరప్రాంతమునుండియే సర్వసమర్థుఁడగు బుక్కరాయలకు విజయనగర రాజ్య వ్యవహారములలో తనతో సమానమగు ప్రతిపత్తిని గల్పించి యుండెననుటయు సమంజసము. ఇంతకుముందు వివరింపఁ బడిన యాధారములనుబట్టి తారణాబ్దము హరిహరరాయల రాజ్య కాలములోనున్నప్పటికిని, సర్వసమర్థుఁడయి, యువరాజపదవియందున్న బుక్కరాయలు తమ యాస్థాన కవీశ్వరుఁడగు నాచన సోమనాథ మహాకవి వరేణ్యునకొక యగ్రహారమును (ఉసపెదన) వివాహోపలక్షణముగ దాన మొసంగి యుండెనని నిర్ణయింప వచ్చును. అనగా పెంచుకలదిన్నె యగ్రహార దానశాసనకాలము క్రీ శ. 1344వ సంవత్సరము; తారణాబ్దము ననుట. పై చర్చ ఫలితముగ నాచన సోమనాథ మహాకవి హరిహర బుక్కరాయల రాజ్యకాలములలో విజయనగరాస్థాన కవీశ్వరుఁడుగ వన్నెకెక్కి, తన యశశ్చంద్రికలను దశదిశల వ్యాపింపఁ జేసికొని నాఁడని నిర్ణయింపనగును.

శ్రీ వేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు నాచన సోమనాథుని కాలము నాతని గ్రంథమును బట్టియే నిర్ణయింప నగుననియు, నది వక్రోక్తిని సూచింపఁ బడినదనియు నొక వ్యాసమును రచించి యున్నారు[1]. ఉత్తర హరివంశమునందలి యీ క్రింది పద్యమును బట్టి "ఉత్తర హరివంశ కథలో కదేతర కాలముగా" నా విషయమును గ్రహింప వచ్చునని వారి యూహ.

---

1. భారతి. జనవరి 1963 — నాచన సోమనాథుని గ్రంథస్థకాలము.

గీ॥ మురనిశుంభ హయగ్రీవ నరకముఖులు
బరవసంబునఁ దలపడ్డ బవర ముకుట
భీకరం బయ్యె నుద్భటు లోకపాల
రచిత సమకాల బాహు విక్రమము చేత. ఉ. హరి. 1-26

"పయి పద్యమునఁ గడపటి పాదమున దన రచనాకాలము కాఁబోలును వ్యంగ్యసూచన చేసినాఁడు వక్రోక్తికవి నాచన సోమనాథుఁ" డని వారు వ్రాసియున్నారు. శ్రీరెడ్డిగారి వ్యాస సారాంశమిది:— పయి నుదాహరించిన పద్యము నందలి విక్రమశబ్దము సంవత్సరముగా గోచరించినను, నది పదునాలుగవ శతాబ్ది యుత్తరార్ధములోనిది కాదు. శ్లేష సంఖ్యలతో వక్రోక్తి కాలమును సమన్వయ పఱచుట కల్పనము కానేరదు. ఈ యభిప్రాయముల ననుసరించి, సమ: 2; కాల: 6; బాహు: 2, విక్రమ: 1 అగుచున్నది. ఈ రీతిని వ్యంగ్య సంఖ్యల కాక్షేపము, లేదని గ్రహించినచో నా సంఖ్యలు వరుసగా 2621 యగుచున్నవి. వానిని వామగతిని లెక్కించి చూచినచో, శా. శ. 1262 వర్షంబులగు విక్రమనామ సంవత్సరమగుచున్నది. దీనికి సరియగు కాలము క్రీ. శ. 1340 (1262+78) యగుట గణిత సిద్ధాంతము ఈ ప్రసంగము చేసిన పిమ్మట, శ్రీరెడ్డిగారి క్రింది యభిప్రాయమును వ్రాసియున్నారు.

"ఇట్టి గ్రంథస్థ వక్రోక్తి శాసన, సమకాలమును తిరస్కరించి, —"భాషా చరిత్రకుఁ బ్రబలాధారము గ్రంథస్థమయిన వాస్తవప్రయోగపఙ్క్తి; వ్యంగ్య గణితాదుల చరిత్రకుఁ బ్రత్యక్షసాక్ష్యము మృగ్యము; అనుమాన ప్రమాణము గౌణపక్షము "అని భాషాతత్త్వవేత్తలనుట ఏకాక్షి లోకరక్షకః అన్నటు లున్నది. సమదృష్టి యవసరము."

శ్రీ రెడ్డిగారు సూచించిన కాలముకూడ శాసనకాలమునకుఁ జేరువగనే యున్నది. కవి కాలనిర్ణయమునకుఁ గూడ కొంత వట్టు సరిపోవుచున్నది. కాని సమశబ్దమునకు రెండు, విక్రమశబ్దమునకు "ఒకటి" అని సంఖ్యలను నిర్ణయించుట ప్రసిద్ధము కాదని తోఁచును. "సామాన్య సంఖ్యాగణితములో పేర్కొన్న సంకేత సంఖ్యలు వక్రోక్తి గణితములో యుక్తి వ్యంగ్యసంఖ్యలు మారిన వనుట కాలదోషముకాదు" అని రెడ్డిగారి యభిప్రాయము. వీరి సమన్వయ సిద్ధాంతమునకుఁ బ్రమాణములు దొరకినచో నా కాలము నంగీకరించుట కెవరికి నభ్యంతర ముండదు. కాని శాసనస్థములగు నాధారము

లను బట్టి కాలనిర్ణయముచేయు టుచితముగదా! ఏది యెటులున్నను వీరి వక్రోక్తి కాల సూచనముగదా! ఏది యెట్లున్నను, వీరి వక్రోక్తి కాల సూచనయు, శాసనకాల విషయములకు సరిపడు చున్నందున నీ విషయమయి చర్చ నింతటితో ముగించు చున్నాను..

# ఉత్తర హరివంశ రచనాకాలము

ఇఁక నుత్తర హరివంశ రచనాకాలమును, సోమనాథుని జీవితకాలమును నిర్ణయింప వలసి యున్నది. బుక్కరాయని దానశాసనము నందలి యీ క్రింది శ్లోకముల నరయునది.——

> " యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే
> అష్టాదశపురాణానా మఖిలార్థార్థవేదినే
> అష్టభాషాకవిత్వశ్రీ శ్రీవాణీజిత సంపదే
> శ్రీమాన్నాచన సోమాఖ్యా మహాకవివరోఽప్యథా
> రాజానమాశిషశ్చైవ చిరజీవీభవత్వితి. "

పయి విషయములనుబట్టి నాచన సోమనాథుఁడు వేదవేదాంగముల నభ్యసించి, యష్టాదశ పురాణాంతర్గత విశేషముల నారసి, బహుభాషా ప్రజ్ఞానిధియై, మహాకవి బిరుదాంకితుఁడని వ్యక్తమగుచున్నది. సకల విద్యా పారంగత్వముచే శోభిల్లు నీ కవి శ్రేష్ఠుఁడు ప్రకృత దాన శాసనము నాఁటి కుత్తర హరివంశ మహాగ్రంథమును రచించి విద్వల్లోకమునఁ బ్రసిద్ధిఁజెంది యుండెనని నా విశ్వాసము, సమంజసము కూడను. కవి తన గ్రంథమునందే సకలభాషా భూషణ బిరుదమును జెప్పికొనెను. అష్టభాషా భూషణుఁడయి, యుత్తమ కవితా సంస్కారమును బొంది, సర్వోత్కృష్టమగు నిట్టి గ్రంథమును రచించు నాఁటికి సోమన ప్రౌఢవయస్కుఁడయి సుమారు ముప్పదియైదు వత్సరములకుఁ దక్కువకాని ప్రాయము వాఁడయి యుండును. అగ్రహారమును దానముగా గ్రహించుటకు ముందు సుమారైదు సంవత్సరములకుఁ బూర్వమే తన గ్రంథమును రచించి యుండెనని తలంచినచో, సోముఁ డుత్తర హరివంశమును సుమారు క్రీ. శ. **1340** ప్రాంతమున రచించి యుండును. మఱియు బుక్కరాయ మహీపతిని చిరంజీవయని యాశీర్వదించి నాఁడీమహాకవి; దాన మీయఁబడిన యగ్రహారమున మూఁడవ పాలు గ్రహించుట కర్హుఁడయి, యాగ్రామమునకు యాజమాన్యమును వహింప నియమింపఁ బడినాఁడు. ఈ విషయమ్ము లాశాసనము నందే యుల్లే

క్షింపఁ బడినవి. కావున నీ మహాకవి దానశాసన కాలమునకు సుమారు నలుబది వర్ష ముల ప్రాయము వాఁడయి యుండవలెను. అయిన సోముఁడు సుమారు క్రీ. శ. 1300 సంవత్సరముల ప్రాంతమున జన్మించి యుండునని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

నాచన సోమనాధ మహాకవి విజయనగర సమ్రాట్టగు ప్రౌఢదేవరాయుల కాలము వఱకును జీవించి యున్నట్లు లీక్రింది శాసనమును బట్టి వ్యక్తమగుచున్నది. ఈతఁడు ప్రౌఢదేవరాయులనుండి తురిమిళ్లదిన్నె గ్రామమును దానముగా గ్రహించి యున్నాఁడు. ఆ రెండు శాసనములను, ఊటీయందలి భారత ప్రభుత్వ శాసన ప్రకటనాధికారుల యనుమతి నీక్రింద పొందు పఱచు చున్నాను.[1]

[1] Tudumaladinne, Cuddapah Taluk, Cuddapah District on a slab forming the threshold of the Eastern entrance of the Kesava Temple [2]

Text A.

1 నాచన సోముని అగ్ర
2 హారం ఏకభో
3 గం తురిమిళ్ళది
4 న్నె ప్రౌఢ దేవ
5 రాయులు ఇచ్చిన
6 దత్తం

B.

1. తురిమెళ్ల దింన్నెలో నగ[ం]
2. పాలికరణం జూటూరి

1. Letter No 101 - 2/939 d 30-3-1963 of the Government Epographix for India Ootacamund, South India.
2. AR No. 422 of 1938 - 39.

3 బోడమ రాజు అం

4 జనేయునికి సదాసేవా

( Both in the characters of the 18th century. )

[11] Tudumaladinne, Cuddapah Taluk, Cuddapah District on the dhvajastambha in front of the Kesava Temple.[1]

Text

1 శ్రీ స్వస్తి శ్రీ జయాభ్యు
2 దయ శాలివాహ
3 న శఖవరుషంబు
4 లు ౧౪౩౧ అగునే
5 టి విరోధి సంవత్సర
6 ఆషాఢ సు ౧౧ గు
7 శ్రీమన్ మహారాజాధి
8 రాజరాజపరమేశ్వ
9 ర శ్రీ వీరప్రతాప శ్రీ క్రి
10 ష్ణదేవ మహారాయలు
11 విజె(య) నగరమందు వ్రజ
12 సింహాసనా రూఢుడై రా
13 జ్యంశేయగాను ఘండి
14 కోటసీమ లోని పు
15 ష్పగిరి ప్రాంత్యం పెం

1. AR 425 of 1938 - 39.

16 న్నకు వుత్తరం నాచి
17 రాజు సోముని అగ్రహా
18 రం తురుమిళ దిన చెన్నకే
19 శ్వరునికి పుష్పాల పాపన
20 [ యెల్లభ ] నిల్పిరా దివ్యగంభం.

పయి నుదాహరించిన వానిలో మొదటి శాసనము బుక్కరాయల మనుమడును రెండవ హరిహరరాయల కుమారుఁడునగు దేవరాయలచే వేయింపఁ బడినది. రెండవ హరిహరుని కాలమున నీ దేవరాయలు యువరాజుగనుండి యుదయగిరి రాజ్యమును బాలించుచుండెను.[1] రెండవ హరిహర రాయలు క్రీ. శ. 1377 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చినట్లును, క్రీ. శ. 1404 వ సంవత్సరమున స్వర్గస్థుఁడయినట్లును తెలియుచున్నది.[2] తరువాత వారసత్వపుఁ బోరాటములో జయముఁగాంచి, క్రీ. శ. 1406 వ సంవత్సరమున మొదటి దేవరాయలు ప్రౌఢదేవరాయలను పేరుతో సింహాసనము నధిష్ఠించెను.[3] ఈతఁడు రాజ్యమునకు రాకపూర్వము సుమారుఇరువదియైదు ముప్పది వత్సరముల కాలము ఉదయగిరి మండలాధిపతిగ నున్నటులు చారిత్రకాధారములు గలవు. కావున నీతఁడు సుమారు క్రీ. శ. 1380 ప్రాంతములో సోమునకు తురిమెళ్లదిన్నె గ్రామమును దానమొసఁగి యుండుననుట సంభావ్యమే. యువరాజుగా దానశాసనము వేయించుట విజయనగర రాజులకు పరిపాటే. బుక్కరాయ శాసనముగూడ యువరాజుగా నున్నపుడే గదా వెలసినది ! మఱియు విజయనగరాస్థాన కవీశ్వరుఁడుగ సోమనాథుని కీర్తి ప్రతిష్ఠల నెఱింగిన వాఁడగుట ప్రౌఢదేవరాయలీదానము నొసంగుటలో నాశ్చర్య ముండబోదు. అనఁగా నీ తురిమిళ్ళదిన్నె క్రీ. శ. 1380 వ సంవత్సరము ప్రాంతములో సోమనాథున కీయఁబడిన దనవచ్చును. దీనిని బట్టి సోముఁడు క్రీ. శ. 1380 వత్సరముల ప్రాంతము వఱకు జీవించి యుండెనని చెప్పనగును. మఱియు సోమనాథున కీయగ్రహరము (తురిమిళ్ళదిన్నె గ్రామము)

1 Indian antiquity Vol XXXVIII Page 91 and Nellore Inscriptions Kg. 23.
2. ( ఏడటూరు శాసనము ). Epigraphia Carnatica Vol. IV YD. 46 and Epigraphia Carnatica Vol. III Part II.
3. Asiatie Researches Vol XX Page 31.

దాన మొసంగఁ బడెననుటకు పయి నుదాహరించిన రెండవ శాసనముకూడ నుపోద్బలక మగుచున్నది. ఇది శ్రీకృష్ణ దేవరాయల కాలమునాటిది. ప్రౌఢదేవరాయల నాటి నుండి శ్రీకృష్ణ దేవరాయల నాటివఱకు సోముని యగ్రహారమని ప్రసిద్ధికెక్కిన నీతురి మెళ్ళదిన్నె గ్రామమును సోముఁడు దానముగా గ్రహించెననుటలో సందియముండుట కవకాశములేదు. కావున పయి నిర్ణయములను బట్టి నాచన సోమనాథుఁడు క్రీ. శ. 1300 వ సంవత్సరము ప్రాంతమున జన్మించి, క్రీ. శ. 1380 ప్రాంతము వఱకు జీవించి యుండెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఈతఁడు తన నలుబదవ యేట ఉత్తరహరివంశ మహాగ్రంథమును రచించి, బుక్కరాయనిచే పెంచుకలదిన్నె నగ్ర హారముగా దానమును క్రీ. శ. 1344 వ సంవత్సరమున బడసెను. తనజీవిత చరమ దశయందు తుతిమిళ్లదిన్నె యగ్రహారము నేకభుక్తముగా ప్రౌఢదేవరాయలచే నొసంగఁ బడి సత్కరింపఁ బడెను.

## ఎఱ్ఱయ హరివంశ రచనాకాలము

ప్రబంధ పరమేశ్వరుఁడగు నెఱ్ఱాప్రెగ్గడయు ఖిలపురాణమగు హరివంశము నాంధ్రీకరించినాఁడు. ఈతఁడు ప్రోలయ వేమారెడ్డి యాస్థాన కవీశ్వరుఁడు. కాకతీ యాంధ్ర సామ్రాజ్య పతనానంతరము క్రీ. శ. 1323 వ సంవత్సరమున రెడ్డిరాజ్యము స్థాపింపఁబడినదని పలువురు చారిత్రకుల యభిప్రాయము. అద్దంకి రాజధానిగ ప్రోలయ వేమారెడ్డి క్రీ. శ. 1323 వ సంవత్సరమునుండి క్రీ. శ. 1349 వ సంవత్సరము వఱకు రాజ్యమును బరిపాలించెనని శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు వ్రాసి యున్నారు. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు క్రీ. శ. 1324 - 1350 సంవత్సరముల మధ్య నీతఁడు రాజ్యమేలెననిరి. కాని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, క్రీ. శ. 1325 వ సంవత్సరమున రెడ్డిరాజ్య స్థాపనము జరిగెనని సోపపత్తికముగా నిరూపించి యున్నారు. మఱియు నీ ప్రోలయ వేమారెడ్డి రాజ్యకాలము క్రీ. శ. 1325 వ సంవ త్సరమునుండి క్రీ. శ. 1353 వ సంవత్సరము వఱకు ననియు సహేతుకముగ వారు నిర్ణయించి యున్నారు.[1]

హరివంశమునందలి యవతారికనుబట్టి, ఎఱ్ఱాప్రెగ్గడ తన హరివంశ గ్రంథమును ప్రోలయ వేమారెడ్డి కంకిత మిచ్చినటులు స్పష్టముగాఁ దెలియుచున్నది. మఱియు

1. History of Reddi Kingdoms. Page 76.

నీ యవతారిక యందలి యీ క్రింది పద్యమునుబట్టి, యెఱ్ఱయ తన రామాయణమును, వేమారెడ్డి తమ్ములలోఁ జివఱివాఁడగు మల్లారెడ్డి కంకిత మిచ్చినటులును వ్యక్తమగు చున్నది.

శా. నా తమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిస్తూతత
శ్రీ తోడన్ సముపేతుఁజేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటన్
జేతోమోదమొనర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింకనుం దనియ నేఁ గావ్యామృతా
స్వాదనన్. హరి. 1 . 38

( శంభుదాసుని మిగిలిన గ్రంథవ్యయమగు నృసింహ పురాణము నాంధ్ర మహాభారతా రణ్య పర్వశేషముల ప్రసక్తి ప్రకృతము మనకిట యనపసరముగాన విడిచి పెట్టు చున్నాను. )

ఇఁక నీ హరివంశ రచనాకాలమును గూర్చి యించుక పరిశీలించి, యద్దానిని నిర్ధారింతము. హరివంశమున నీ వేమారెడ్డి రాజధాని యద్దంకి యని చెప్పఁబడినది. ఈ సందర్భమున శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, హరివంశమునకుఁ బీఠికవ్రాయుచు[1] నిదిగువ వాక్యములను రచించిరి. క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్య మస్తమించిన పిదపనే ప్రోలయ వేమయ అద్దంకికి ఏలికయాయెను. చరిత్ర పరిశోధకులు చేసిపెట్టిన కృషివలన మనము క్రీ. శ. 1330 వ సంవత్సరము నుండియే ప్రోలయ వేమయ శాసనములను చూడఁ గలుగుచున్నాము. క్రీ. శ. 1323 కు వెనుక వేమయగాని వేమయ తండ్రి ప్రోలయగాని, అతని తండ్రిగాని, ( క్రీ. శ. 1255 లో అద్దంకి ప్రభు వయిన ) సారంగిపాణికిఁ బిదప నాయకు లయినటు లాధారములు దొరకనంత వఱకు క్రీ. శ. 1323 పిదపనే యద్దంకి వేమయ యేలుబడి లోనికి వచ్చెనని యనుకొనుట క్షేమము."

"తురుష్కదండయాత్ర లోరుగంటిని రణక్షేత్రముగా మార్చిన దాది ప్రతాప రుద్రుని నిధనము వఱకీ యద్దంకి యెవరి యేలుబడిలో నుండెనోకాని, క్రీ. శ. 1330

1. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము : వావిళ్లవారి ప్రతి. — పీఠిక,
శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిచేఁ బరిష్కృతము.

సంవత్సరమున పుట్టిన వల్వేరు శాసనమునను, హరివంశమునందును ఈ యద్దంకి, ప్రోలయవేమునికి రాజధానిగాఁ గానిపించుచున్నది. ప్రోలయ స్వర్గమున కతిథియైన తరువాత వేమయ యద్దంకి స్వాయత్తము చేసికొని యుండును. ఇటు లగునెడల క్రి. శ. 1323 - 1330 సంవత్సరముల నడుమ అద్దంకి వేమయ యేలుబడిలోనికి వచ్చెనని అనవచ్చును."[1]

ఇంతియుగాక శ్రీ చాగంటి శేషయ్యగారిట్లు వ్రాసియున్నారు. "బ్ర. శ్రీ వీరేశ లింగము పంతులు గారిచ్చిన వంశవృక్షములో వేమారెడ్డికి దొడ్డారెడ్డి యను నొక సోదరుఁడున్నట్లు కన్పట్టుచున్నది. హరివంశమున నాతనిపేరు కన్పట్టుటలేదు. కాని పైనిఁ జెప్పిన శాసనములో (మల్లవరము శాసనము) కోమటి ప్రోలయ కైదుగురు కుమారులని చెప్పుచు నందు దొడ్డారెడ్డిపేరు నుదాహరించి యున్నారు. కావున దొడ్డా రెడ్డి యున్నమాట నిజము. హరివంశము నాఁటి కాతఁడు చనిపోయి యుండును. అందుచేఁ గవియాతని పేరును జెప్పలేదని తలంప వలసి యున్నది. ఆ శాసనము శా. శ. 1247 లో వేమారెడ్డి వ్రాయించినది. దీనిని బట్టి హరివంశమును గవి క్రి. శ. 1325 వ సంవత్సరమునకుఁ దరువాత రచించెనని స్పష్టమగుచున్నది."[2]

పయి విషయములను బట్టి ఎఱ్ఱయ హరివంశ రచనము క్రి. శ. 1325 వ సంవత్సరమునకుఁ దరువాతనే యని వ్యక్త మగుచున్నది.

క్రి. శ. 1330 వ సంవత్సరమునుండి కానవగు వేమారెడ్డి శాసనములలో చీమ కుర్తి శాసన మొకటి. అందు శ్రీశైల అహోబల పర్వత సోపాన నిర్మాణ ప్రసక్తికలదు. ఈ విషయమును శ్రీ వేలూరివారు హరివంశ పీఠికలో వ్రాసియున్నారు. కాని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారా చీమకుర్తి శాసన విషయమును బహుధా చర్చించి, యా శాసనము పదునాలుగవ శతాబ్ది తరువాతఁ గల్పింపఁబడినదని నిరూపించి యున్నారు.[3] అనంతర కాలమున నీ శ్రీశైల అహోబల పర్వత సోపాన నిర్మాణ విషయము క్రి. శ. 1343 వ సంవత్సరమునందు వెలసిన ముట్లూరి శాసనమునందు

1. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము : వావిళ్లవారి ప్రతి — పీఠిక.
   (శతావధాని శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారిచేఁ బరిష్కృతము)
2. ఆంధ్రకవి తరంగిణి. నాలుగవ సంపుటము. పుట 101.
3. History of Reddi Kingdoms. Chapter V Page 92

కలదు. ఈ శాసన విషయమును జర్చించు సవసరమున శ్రీ మల్లంపల్లి వారా సోపాన నిర్మాణము క్రీ. శ. 1346 వ సంవత్సరమునఁగాని, యంతకుఁ గొంచెము పూర్వము కాని పూర్తియై యుండెనని భావించియున్నారు.[1] కాని నిజమున కీ సోపాన నిర్మాణ విషయము శా. శ. 1262 (1340 AD) వ సంవత్సరము నాఁటి దగు మంచాళ్ల దాన శాసనము నందే చెప్పఁబడి యున్నది. ఈ శాసనమునకు మూలప్రతి లభింపమి, నా యూహాధారమును గ్రహింప వలను పడదని శ్రీ శర్మగారు వ్రాసియున్నారు.[2] ఏది యెటులున్నను, శ్రీశైల అహోబల పర్వత సోపాన విషయము ప్రస్తావింపఁబడిన శాసనము సందలివిగా శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారిచే బ్రకటింపఁబడిన శ్లోకముల నిట నుదాహరింతును.

ఉద్ధృత్యభూమిం యవనాబ్ధిమగ్నాం
సంస్థాపయంతం ప్రకృతోత్తమార్యాః
సాక్షాత్కరో మానుష దేవభాజా
మహావరాహం పరికీర్తయంతి ॥

శ్రీశైల గంగాతట సీమ్నరమ్యాం
సోపాన వీథిం వదధేన వేమః
యాదివ్యతి స్వర్గ మనోద్యతానాం
నిశ్రేణిరివ ప్రథితానరాణాం ॥[3]

శ్రీశైలము పయినుండి యాత్రికుల సౌకర్యార్థము పాతాళగంగ వఱకును, హోబల నృసింహ క్షేత్రమునుండి దిగువ వఱకును సోపానములను నిర్మించి, లయ వేమారెడ్డి ధన్యుఁ డయినాఁడనుట సత్యము. ఇట్టి యసాధారణమగు ర్మాణ విషయము హరివంశమునఁ గానరాదు. ఎఱ్ఱయయు నద్దానిని తడవక విడిచె మటయు నంభావ్యముగాఁ దోపదు. కావున హరివంశము రచించిన నాఁటికి సోపాన

1. History of Reddi Kingdoms. Chapter V Page 92.
2. Foot Note No 34 on Page 85 — History of Reddi Kingdoms.
3. ఆంధ్రకవుల చరిత్రము : మూఁడవభాగము. పుట 422.

నిర్మాణము జరిగి యుండలేదనుటయు నంగీకార్యమే. శ్రీ చాగంటి శేషయ్యగారీ సోపాన నిర్మాణ కాలమును నిర్ణయింప కున్నను నీ విషయమునుగూర్చి యిట్లు వ్రాసి యున్నారు. "ఈ వేమారెడ్డి శ్రీశైలమునఁ బాతాళ గంగకు సోపాన పంక్తిని నిర్మించె నని, యీతని వంశీయులు వ్రాయించిన యనేక శిలాతామ్ర శాసనములలో వర్ణింపఁబడి యున్నది. ఆ విషయ మెందువలననో హరివంశమునఁ జెప్పఁబడలేదు. బహుశః హరి వంశ రచనానంతర మాపునకార్యము నాతఁడు చేయించి యుండవచ్చును."[1] మఱియు హరివంశమునకుఁ బీఠికవ్రాయుచు, శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు నీ యభి ప్రాయమునే సమర్థించియున్నారు.[2]

పయి విషయములనుబట్టి శ్రీశైల అహోబల పర్వతసోపాన నిర్మాణము క్రీ. శ. 1346 వ సంవత్సరముకంటె నిస్సంశయముగఁ బూర్వము. మంచాల్ల శాసనము మూల ప్రతి లభించినచో నీ సోపాన నిర్మాణము క్రీ. శ. 1340 వ సంవత్సరముకంటెఁ బూర్వ కాలికమగు నవకాశమును గలదు. కావున హరివంశ రచనాకాల మంతకుముందే యని గ్రహించుట సమంజసము. అది స్థూలముగ క్రీ. శ. 1335 వ సంవత్సర ప్రాంతమని నిర్ణయింపనగును.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశ రచనాకాలము; నాచన సోమనాథుని యుత్తర హరివంశ రచనాకాలము, పయి నిర్ణయముల ననుసరించి, క్రమముగ, క్రీ. శ. 1335, క్రీ. శ. 1340 సంవత్సరముల ప్రాంతమగును మఱియు నెఱ్ఱాప్రెగ్గడ గ్రంథము పూర్వ రచనము; సోమనాథుని గ్రంథ మనంతర రచనమునగును.

ఎఱ్ఱాప్రెగ్గడ, క్రీ. శ. 1325 వ సంవత్సరమునకుఁ దరువాతనే హరివంశమును రచించి, యద్దంకి ప్రభువగు ప్రోలయ వేమారెడ్డి కంకిత మిచ్చినట్లు ముందు నిరూ పించితిని. అంతకు ముందు రామాయణ గ్రంథమును మల్లారెడ్డి కంకితమిచ్చి, యాతని యభిమానమునకుఁ బాత్రుఁడయినాఁడు. రామాయణ, హరివంశముల రచించునాటికి, యెఱ్ఱాప్రెగ్గడకు నలుబది వత్సరముల ప్రాయముండుననుట సమం జసము. అనఁగా స్థూలముగ, క్రీ. శ. 1320 – 25 సంవత్సరముల నాఁటికి కవి శేఖరునకు నలువది సంవత్సరముల ప్రాయమని భావించినచో, నీతఁడు సుమారు

1. ఆంధ్రకవి తరంగిణి. నాలుగవ సంపుటము. పుట 99.
2. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము : వావిళ్లవారి ప్రతి ఇటీవలి ముద్రణము.

క్రీ. శ. 1280 సంవత్సరముల ప్రాంతమున జన్మించియుండును. ఎఱ్ఱాప్రెగ్గడ క్రీ. శ. 1280 సంవత్సరము ప్రాంతమునఁ బుట్టి యుండునను విషయమున శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు, శ్రీ చాగంటి శేషయ్యగార లేకాభిప్రాయమునే వెలిబుచ్చియున్నారు.[1] క్రీ. శ. 1163 - 1180 సంవత్సరముల నడుమ రాజ్యమేలిన వెలనాటి వీర రాజేంద్రుని బట్టి చూచినను, నన్ఁగా క్రీ. శ. 1175 సంవత్సరముల ప్రాంతముల నాతనిచే మన్నన లందిన భీమనకు నాలుఁగవ తరము వాఁడగు నీ యెఱ్ఱయ కాలము సరిపడుచున్నది.

అనపోతారెడ్డి రాజ్య కాలానంతరమున, అనవేమారెడ్డి రాజ్యారంభ కాలము నందెఱ్ఱాప్రెగ్గడకును, మఱికొందఱకును కొంతభూమి దాన మొసంగఁ బడినట్లు క్రీ. శ. 1364 వ సంవత్సరమునాటి కొల్లూరు శాసనమునందు గన్పట్టుచున్నది. కావున యెఱ్ఱాప్రెగ్గడ క్రీ శ. 1364 వ సంవత్సరము వఱకు జీవించి యుండెననుట స్పష్టము. ఈ కారణముచేతనే యిక్కవీశ్వరుఁడు క్రీ. శ. 1350 - 64 సంవత్సరములలో రాజ్యమేలిన అనపోతారెడ్డి యాస్థానము నలంకరించె ననియుఁ జెప్పవచ్చును. కావున ఎఱ్ఱాప్రెగ్గడ క్రీ. శ. 1280 సంవత్సరముల ప్రాంతమున జన్మించి, క్రీ. శ. 1365 సంవత్సరముల ప్రాంతము వఱకు నన్ఁగా సుమారెనుబది వత్సరముల కాలము జీవించి యుండెనని నిర్ణయింపనగును

నాచన సోమనాథుని జీవితకాలము క్రీ శ. 1300 నుండి క్రీ శ. 1380 సంవత్సరముల వఱకనియు, నెఱ్ఱాప్రెగ్గడ జీవితకాలము క్రీ. శ. 1280 నుండి క్రీ. శ. 1365 సంవత్సరముల వఱకనియు మీఁద నిరూపింపఁ బడినది. ఈ నిర్ణయములనుబట్టి, సోమనాథుఁడు ఎఱ్ఱాప్రెగ్గడ కంటె సుమారిరువది సంవత్సరములు చిన్నవాఁడయి యుండునని చెప్పవచ్చును. కావున నీ మహాకవు లిరువురును సమకాలికులయి, సుమారు మూఁడు దశాబ్దముల కాల మాంధ్ర కవితా సామ్రాజ్య సీమలలో స్వేచ్ఛా విహార మొనరించి రన నొప్పును.

---

1. ఆంధ్రకవుల చరిత్రము : ప్రథమభాగము. పుట 173.
ఆంధ్రకవి తరంగిణి : నాలుగవ సంపుటము. పుట 58.

# నాచన సోమనాథుని నివాసస్థానము - వంశాదులు

నాచన సోమనాథుని నివాసస్థానమును గూర్చి నిశ్చయముగాఁ జెప్పుట కాధార ములు లభించుటలేదు. ఈ విషయమునఁ బలువురి యభిప్రాయముల నిటఁదెలిపి, సమంజసమగు నిర్ణయమును గావింపవలయును. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు "ఇతఁడు (నాచన సోమనాథుఁడు) తన గ్రంధమును నెల్లూరి యందలి హరిహరనాదునకుఁ గృతి యిచ్చుటచేత నీతని నివాసము నెల్లూరి మండలములోని యేదో గ్రామమని తోఁచుచున్నది." అని చెప్పియున్నారు.[1] శ్రీ చాగంటి శేషయ్యగారు నాచన సోముని నివాసము కడప మండలములోని పెంచుకలదిన్నె యని చెప్పి యున్నారు. కాని వారి నిర్ణయమునకుఁ దగిన యాధారములను జూప సమకట్టి యుండలేదు.[2] ప్రకృతము లభ్యమగుచున్న "ఉత్తర హరివంశము" (వావిళ్ల ముద్ర ణము) నకుఁ బీఠికయందు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు. "విద్యా నగరాధిపతి యగు సంగమ బుక్కభూపాలునిచే నేటి కడప మండల మందలి పెంచు కలదిన్నె గ్రామమును బ్రతిగ్రహించుటచే నీకవి కడప మండలము వాఁడయి యుండ వచ్చు ననవచ్చును. ..వసంత విలాసము కృతిపతియగు మాచయ బ్రహ్మని శాసనము పల్నాడు తాలూకాలోని కారెమపూడిలో నున్నది. కావున నీకవి గుంటూరు మండలము వాఁడేని కావచ్చును." శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు సోముని గూర్చిన వివిధ విష యములను జర్చించియు, నికవి నివాసస్థానమును దడవి యుండలేదు. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు "సోముఁడు" అను గ్రంధమున నెల్లూరు మండలమునకుఁ జెందిన తిక్కనాదులను బేర్కొని, నాచన సోమనాదుని గూడ నెల్లూరు కవిగా తలంచి యున్నారు. అంతే. వారు వివరముల జోలికిఁబోలేదు.

పయి నుదాహరించిన వారల యభిప్రాయములను జర్చింతము. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు నెల్లూరి యందలి హరిహర నాధున కుత్తర హరివంశ

1. ఆంధ్రకవుల చరిత్రము. ప్రథమభాగము పుట 320.
2. ఆంధ్రకవి తరంగిణి. నాలుగవ సంపుటము పుట 122.

గ్రంథ మంకితమయినందున, సోమన నెల్లూరి వాఁడనిరి. కాని హరిహరనాథున కంకిత మిచ్చుట కదియే హేతువు కానక్కఱలేదు. ఏలన సోమనాథుఁడు గద్యలోఁ దిక్కన యెడఁ జూపిన యాదరమును బట్టియు, హరిహరాద్వైత సిద్ధాంతము నెడ నాతనికిఁగల యభిమానమును బట్టియుఁ దన గ్రంథమును హరిహరనాధునకుఁ గృతి యొసంగుట కవకాశము కలదు. అంతేకాదు. ఉత్తర హరివంశములో సోమన కృతిభర్త నెల్లూరి హరిహర నాథుఁడని యెక్కడనులేదు. కాక చితాల్‌దుర్గము మండలమున దేవనాగరి తాలూకాలో హరిహర గ్రామమునందు హరిహర దేవాలయము వేఱొకటియు నున్నట్లు తెలియుచున్నది. సోమన గ్రంథరచనమునకుఁ బూర్వమేబది వత్సరముల నాఁడు (అనఁగా క్రీ. శ. 1280 వ సంవత్సరమున) సాలువ తిక్కమ దేవుఁడా హరిహర దేవా లయమునకు బంగారు కలశముల నేర్పాటుచేసి యున్నాఁడు.[1] మఱొక విషయము. సోముఁడు, హరిహరనాథ సంబోధనము నందు విజయనగర ప్రభువయిన హరిహర రాయలను గూడ లక్షించి యుండుననియెడు వాదమును గలదు. "వేయునేటికి సల పొండవేయు సాటి, వీరుఁడిల లేఁడు ప్రతి రఘువీరుఁ డొకఁడు" అనుటలో విజయ విలాసకృతికర్త తన ప్రభువగు రఘునాథునిఁగూడ మనసు నందిడుకొని యుండెనని శ్రీ కొండవంటి శంకర నరసింహ బ్రహ్మంగారు వ్రాసియున్నారు. ఈ చమత్కారావహ మగు నూహయు సత్యము కావచ్చును.

సోముని వసంత విలాస గ్రంథ కృతిపతి యని వాకొనఁబడుచున్న మాచయ బ్రహ్మని శాసనమునుబట్టి, సోమన గుంటూరు మండలము వాఁడేని కావచ్చునని, శ్రీ వేటూరి వారు చెప్పియున్నారు[2] కాని మఱియే యితరాధారములును గానరానంత వఱకు నీ యూహను గ్రహించుట కవకాశము చాలదు. నాటి గుత్తిదుర్గము సందలి పెంచుకలదిన్నె గ్రామమును బుక్కరాయ పురముగా వెలయించి, బుక్కరాయ మహీ పతి, సోమునకు దానమిచ్చినాఁడు. అది నేటి కడప మండలములోనిది. శ్రీ శేషయ్యో గారు తలంచినటు లాగ్రామమే సోముని నివాసస్థానమని నిర్ణయించుట కాధారములు లేవు. కాని దానమును గ్రహించి, యాగ్రామ యజమాన్యమును వహించిన వాడిగ, సోముని నివాసస్థానము పెంచుకలదిన్నె లేక బుక్కరాయ పురమగుట సమంజసము. మఱియుఁ బ్రౌఢదేవరాయలచే నీకవిశేఖరునకు దాన మీయఁబడిన తురిమిళ్ళదిన్నె

1. ఎపిగ్రాఫియా కర్నాటికా. వాల్యూము XI Dg 59.
2. ఉత్తర హరివంశము : పీఠిక పుట 3.

యగ్రహారమును నేటి కడప మండలములోనిదే. సోమనాథునకొక యగ్రహార మొక మండలమునందు దాన మీయఁబడి యుండఁగా, ననంతరకాలమున నారాజ్య సింహాసనము నధిష్ఠించిన ప్రౌడదేవరాయలు, దాన మీఁదలచిన గ్రామము మఱియొక మండలము లోనిదిగా నిర్ణయింపఁ బడుననుట యుక్తముకాదు. మొదటి దానశాసనకాలము నుండియుఁ గడప మండలములోని పెంచుకలదిన్నె గ్రామము సోమనాథుని నివాసముగా నుండుటకుఁగల యవకాశములను బట్టియు, రెండవ దాన శాసనమునందలి గ్రామముకూడ కడప మండలములోనిదే యగుటను బట్టియు, నీకవి కడప మండల నివాసి యని చెప్పనొప్పును. మఱియు మహాకవియు, నాస్థాన కవీశ్వరుఁడునగు సోమనాథుని నివాసస్థానమునకుఁ గడుదూరమయిన గ్రామమును, బుక్కరాయలు దానము చేసి యుండఁడనియుఁ దలంపవచ్చును. కావున నాచన సోమనాథుని స్వస్థలము కడప మండలమునందలి దనియు, బుక్కరాయ పురమును దానముగా గ్రహించినదాది, యా గ్రామమే సోమనాథుని నివాసస్థాన మనియు నిర్ణయింప వచ్చును.

## సోమనాథుని వంశాదులు

శ్రీ విరూపాక్షుని చేవ్రాలున నాచన సోమనాథాదులకు బుక్కరాయ పురాగ్రహారము దాన మొసంగఁ బడినది. ఆ దాన శాసనమునందలి పదునెనిమిదవ శ్లోకము నందుత్తరార్ధమునుండి యీ మహాకవి వంశాదులకు సంబంధించిన విషయములు వ్యక్తపఱుపఁ బడినవి. ఆ శ్లోక పాదము లీ దిగువ నుదాహరింపఁ బడినవి——

> "ఆపస్తంబాఖ్య సూత్రాయ భారద్వాజాన్వవాయినే. 18
> యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే
> అష్టాదశ పురాణానా మభిజ్ఞాతార్థవేదినే. 19
> అష్టభాషాకవిత్వ శ్రీ శ్రీవాణీజితసంపదే
> సోమాయ నాచనాంబోధేః సోమయామితతేజసే. 20

మఱియు,

> శ్రీమన్నాచన సోమాఖ్య మహాకవివరోప్యథ
> రాజానమాశిషం చైవ చిరజీవీభవత్వితి. 27

పయి శ్లోకములందలి సారాంశమునుబట్టి నాచన సోమనాథుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, భారద్వాజ గోత్రుఁడు, యజుశ్శాఖీయ బ్రాహ్మణుఁడు, నాచన వంశాబ్ధి చంద్రుఁడు నని స్పష్టముగఁ దెలియుచున్నది. మఱియు నిమ్మహాకవి వరేణ్యుఁడు సకలాగమ వేదియు, అష్టాదశపురాణాభిజ్ఞాతార్థవేదియు, అష్టభాషాకవిత్వ శ్రీయుతుఁడును, శ్రీ శారదా కటాక్షలబ్ధవిభవోపేతుఁ డయి సుకవితా ప్రవాహ సంపదచేఁ దేజరిల్లు వాఁడును నని వర్ణింపఁబడి యున్నాఁడు. శాసనస్థమగు నీ విషయజాలముచే నితఁడగ్రహారమును దానముగా గ్రహించునాటికి మహాకవియై, మహావిద్వాంసుఁడయి కీర్తికాంత యొడి యందొదిగి యుండెననుట నిశ్చయము. "అష్టభాషా కవిత్వశ్రీ" యనుటలో నీతఁడు సంస్కృతాంధ్రములయందఖండ పాండిత్యమును కలిగి యుండుటయుగాక తమిళ కర్ణాటాది భాషలందును బ్రవీణుఁడయినట్లును జెప్పసగును. ఉత్తర హరివంశము దక్క నితరములగు కావ్యములు నేఁడలభ్యములైనను మఱికొన్ని గ్రంథముల నితఁడు రచించినట్లు తెలియుచున్నవి. ఏమయినను నీతని బహుభాషా పాండిత్యమును శంకింపఁ బనిలేదు. ఇట్టి ప్రజ్ఞాపాటవము లానాటి మహాకవులకు సర్వసాధారణమే యనుట సత్యదూరము కానేరదు. నన్నయాది మహాకవులందఱును దీని కుదాహృతులే యగు దురు. సోమనాథుఁడాపస్తంబ సూత్రుఁడని చెప్పఁబడి యుండుట బ్రాహ్మణుఁడనుటలో సందియములేదు. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, శ్రీ చిలుకూరి వీర భద్రరావుగారు నీ మహాకవి కులమును గూర్చిన యభిప్రాయము నంగీకరింపలేదు. శ్రీ వీరేశలింగము పంతులు గారీకవిని నియోగియనిరి. శ్రీ వీరభద్రరావుగారు, వేద వేదాంగ పారంగతుఁడయి యష్టాదశపురాణజ్ఞుఁడగుట వైదికియై యుండుసని తలఁచిరి. వీరిరువురును వారివారి వాదముల కితరములగు నాధారములఁ జూపలేదు. చారిత్ర కములగు నాధారముల జోలికిఁ బోక, ఆంధ్రవాఙ్మయారంభము నుండి తఱచి విమ ర్శించినచో, నియోగి, వైదిక భేదమంత స్పష్టముగా పరిగణింపఁబడినట్లు కానరాదు. సుమారు పదునైదవ శతాబ్దినుండియే నియోగి వైదిక భేదము ప్రబలమయినటులు దోఁచును. దానశాసనము నందు "సోమాయ నాచనాంభోధేః సోమయామితతేజసే" - అని యిరువదియవ శ్లోకమునను, ముప్పదియవ శ్లోకమున "నాచనాత్మజః" అనియు మాత్రము గలదు. ఇతరములగు నాధారములులేవు. వీనిని బట్టియే సోమనాథుని వంశనామము, గృహనామము, పితృనామము, నిర్ణయింపఁ బడవలసి యున్నది. సారస్వతాధినేతలు వంశమును గులమునుగూడ సముద్రముతోఁ బోల్చుట సంప్రదాయ మయినను, వేఱొకచో "నాచనాత్మజః" యని స్పష్టీకరించియుంటఁ గవిభావము నాచన

వంశమనిగాక, నాచనయొక్క కుమారుఁడని వ్యక్తమగుచున్నది. మఱియు నిమ్మహా కవి తరువాతి వారగు, పిల్లలమఱ్ఱి పినవీరన, ఎఱపాటి యెఱ్ఱన, కొఱవి గోపరాజు, కూచిమంచి జగ్గకవి, మొదలగువారు తమ గ్రంథములందుఁ బూర్వకవిస్తుతు లొనర్చు పట్టుల నీ క్రింది విషయములఁ జూడనగును.

1) 'నాచిరాజుసోము' — శృంగార శాకుంతలము
2) 'నాచనసుతుసోము' — సకలనీతి కథా విధానము
3) 'నాచిరాజుసోమన' — సింహాసన ద్వాత్రింశిక
4) 'నాచిరాజుసోముని' — సుభద్రాపరిణయము
5) 'నాచిరాజుసోముని' — తురిమెళ్ల దిన్నె శాసనము.

(AR 425 of 1938 - 39)

పయిని వివరింపఁబడిన యాధారములుగాక నితరములగు విషయము లేమియు బుక్కరాయ శాసనమునఁ గన్పట్టవు. వీనిని బట్టియే సోమనాధుని వంశనామమును, గృహనామమును, పితృనామమును, గులమును నిర్ణయింపవలసి యున్నది. శ్రీ చాగంటి శేషయ్యగారు తమ ఆంధ్రకవి తరంగిణియందు, సోమనతోఁబాటు దానమును గ్రహించిన మిగిలిన యైదుగురు వ్యక్తులకును పితృనామమును శాసనమున జెప్పియున్నారు' ఆ హేతువున సోముని తండ్రిపేరు గూడ జెప్పఁబడి యుండుట సహజమని యొక కారణమును బేర్కొని యున్నారు. ఇదియు సహేతుకమే. మఱియు నీతనికి రెండు వందల సంవత్సరములకుఁ దరువాతివాఁడగు ఎఱ్ఱయకవి "నాచనసుతుసోము" అని స్పష్టముగ స్తుతించి యుండుటయు నీతఁడు నాచన తనయుఁడగు సోముఁడని వ్యక్తమగుచున్నది. పయిని జూపిన కారణములచే నీ మహాకవికి "నాచన" అనునది యింటిపేరును, దండ్రిపేరును గూడ నయి యుండుననుట నిశ్చయము.

ఇఁక నీ కవిని గూర్చిన యర్వాచీన కవుల ప్రశంసలలోఁ గాననగు విషయముల నొకింత పరిశీలింతము. పయి నుదాహరింపఁబడిన పద్యభాగములలో "నాచన", "నాచిరాజు" లను రెండు విధములగు పేర్లుకలవు. "నాచన" అనునది గృహనామమనుట స్పష్టమయినప్పటికిని, "నాచిరాజు" అనునది పౌరుషనామమయి యుండెననుట కవకాశములు పెక్కులు గలవు. పౌరుషనామములు గృహనామములయి వెలయుట

సర్వసాధారణమయిన విషయము. మఱియు రాజు శబ్దము వైదికుల యింటిపేర్ల యందుండుట యపురూపము. ఇది వ్యవహార యోగ్యులయిన నియోగులలో బ్రసిద్ధ మయినది. కావున నీ "నాచిరాజు" లేక "నాచన" అను గృహనామమునుబట్టి నాచన సోమనాథుఁడు నియోగికులమునకుఁ జెందినవాఁడని భావింపఁబడినది. మఱియు సింహాసన ద్వాత్రింశిక గ్రంథమునఁ బూర్వకవులను స్తుతించు సవసరమున, కొఱవి గోపరాజీ క్రింది పద్యమును రచించెను—

చ. అనఘు హుళక్కి భాస్కరు మహామతి పిల్లలమఱ్ఱి పెద్దిరా
జును బినవీరరాజు కవిసోముని తిక్కన సోమయాజి కే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన నాచిరాజు సో
మన నమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్

పయి పద్యమునందు "మత్కులచంద్రుల" అను పదప్రయోగము గమనింపఁదగి యున్నది. కొఱవి గోపరాజు నియోగి కుటుంబమునకుఁ జెందిన వాఁడనుట నిశ్చయము గదా! ఈ గోపరాజుచే మత్కుల చంద్రులయిన వారలని ప్రత్యేకముగ నియోగులను బేర్కొనినాఁడు. ఈతఁడు వైదిక కవులను వేఱొక పద్యమున నుతించియుండుటయు నొక విశేషము. ఈ ప్రస్తావనయు నాచన సోమనాథుఁడు నియోగి బ్రాహ్మణుఁడని నిర్ణయించుటకే యుపకరించుచున్నది.

ఇక్కవిశ్రేష్ఠుని కవికాలాదుల విషయమున సందిగ్ధము లుప్పతిల్లి వివాదముల కవకాశము కలిగినటులే, దానముగ నీయఁబడిన యగ్రహారమునం దీమహాకవికి లభించిన బాగముల విషయముకూడ వివాదముల పాలయినది. బుక్కరాయ మహీ పాలుఁడు శ్రీ వాణీజిత సంపదచే నొప్పు నిమ్మహాకవికిని, మఱి యైదుగురు బ్రాహ్మణు లకును బెంచుకలదిన్నె యను గ్రామమును బుక్కరాయ పురముగఁ బేరుమార్చి దాన మిచ్చినాఁడు. ఈ యగ్రహారమును 110 భాగములుగ నొనర్చి యాఱుగురు బ్రాహ్మణు లకు పంచి యిచ్చినట్లు శాసనమునందు స్పష్టముగ గలదు. శాసనమునందు 29 నుండి 34 వ సంఖ్యనుగల శ్లోకములందీ దాన గ్రహీతల వంశ, నామాదుల వివరించి, వారివారి భాగములు సూచింపఁబడినవి. అందు మున్ముందటఁ బేర్కొనఁబడిన సోమ నాథ మహాకవికి బ్రత్యేకింపఁబడిన బాగముల విషయము, మనకు లభ్యమయిన శాసన ప్రతులు రెండింటను రెండు విధములుగఁ గన్పట్టుచున్నది. ఈ విషయమును బ్రత్యేక

ముగఁ జర్చించి నిర్ణయింతును. ఈతనికి ముప్పదియాఱు భాగములు అయ్యగ్రహార యాజమాన్యముతోఁబాటు లభించెను. రెండవవాఁడు భారద్వాజ గోత్రుఁడును, నాచన యొక్క తనయుఁడును నగు తల్లపకు నిరువది యెనిమిది భాగములు; మూఁడవ వాఁడగు కాశ్యపగోత్రుఁడును అన్నదాతాధ్వరి పుత్రుఁడునగు సింగయకు బదునొకండు భాగములు; నాలుగవ వాఁడగు కౌండిన్య గోత్రుఁడును దేవఋని కుమారుఁడగు సింగనకు బది భాగములు; ఐదవవాఁడు కాశ్యపగోత్రుఁడు నాగయకుఁ బుత్రుఁడునగు వత్సయకు మూఁడు భాగములు, ఆరవవాఁడు శ్రీ వత్సగోత్రుఁడును తిమ్మయాత్మజుఁడునగు భాస్కరునకు రెండు భాగములును పంచి యివ్వఁబడినవి. ఈ విధముగ నియాఱు గురు బ్రాహ్మణులకు భాగములు పంచి యివ్వబడినవని తలఁచినచో నీ భాగముల మొత్తము 110 విభాగములు చేయఁబడిన దనుటకు విరుద్ధముగఁ గానుపించును. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్రకవుల చరిత్రమునందు దక్క యెవరెవరికెన్ని భాగములను బంచి యిచ్చిరను విషయముగల శాసనభాగము మఱియే యితర ప్రతులయందును బ్రకటింపఁ బడలేదు. ఎపిగ్రాఫియా కర్ణాటికాయందు నాచన సోమనాథునకు లభించిన భాగములను దెలుపునంతవఱకు మాత్రమే (28 వ శ్లోకము) చూపఁబడి, యఁట నీ విధముగా వ్రాయఁబడినది - "Here follows names of vrithidars and details of boundaries." సోమనాథుని భాగముల విషయమును దెలుపు శ్లోకము మనకు లభ్యమయిన ప్రతులలోఁగల పాఠభేద మీ క్రింది విధముగాఁ గలదు.

Epigraphia Carnatica Mg. 158 సంఖ్యనుగల శాసనప్రతి :

శ్లో॥ స్వయమన్వకరోద్వృత్తిం దశోత్తర శతంకవిః
షడ్వింశదత్రభాగాః స్యుర్యజమానాహ్వాయ స్తతః. 28

Epigraphia Carnatica Gd. 46 సంఖ్యనుగల శాసనప్రతి :

శ్లో॥ స్వయమన్వ కరోద్వృత్తిర్ద శోత్తరశతం కవిః
షట్త్రింశ దత్రభాగాః స్యుః యజమానాహ్వాయా తతః. 28

బుక్కరాయలు అయ్యగ్రహారము నెన్నిభాగములు చేసినప్పటికిని, సోమున కెన్ని భాగములందుండి లభించినప్పటికి, సోమనాథకవి నా యగ్రహారమునకు యాజమాన్య

మును వహింప నిశ్చయించెననుట శాసన ప్రతులన్నింటను స్పష్టముగఁ గలదు. పయి నుదాహరించిన శాసనప్రతులలో షడ్వింశ, షట్త్రింశ అనఁగా 26, 36 భాగము లితని కీయబడినటులు గలదు. అందేది సరియైనదియు చర్చింతము. సోమనాథుఁడీ యగ్రహారమునకు యజమాని యని నిశ్చయింపఁబడెను. మఱియు మహాకవిగఁ గీర్తి ప్రతిష్ఠల నందినవాఁడు. శాసనమున 19 నుండి 27 వ శ్లోకము వఱకుఁ గల విషయము జూచినచో, నీ యగ్రహారమును బూర్తిగా సోమనాథునకే దాన మిచ్చివేసినట్లు తోఁచును. ఇంతియుగాక యాజమాన్యమును వహించు నీకవివరుఁడు నగ్రహారమునందలి భాగములను బంచి యిచ్చుటలోఁ బ్రారంభముననే పేర్కొనఁబడినాఁడు. మఱొక్క విషయము. ఈతని తరువాత నాచనాత్మజుఁడగు తల్లప్పకు నిరువది యెనిమిది భాగముల నిచ్చినారు. సోమనాథుఁడును నాచనకుఁ బుత్రుఁడే యని ముందు నిరూపింపఁబడినది. మహాకవి తండ్రియును, తల్లప్ప తండ్రియును నొక్కరే యైనను గానిదియు నిరూపించుట కాధారములులేవు. అది యిఁట నప్రస్తుతము. ఒక్కరె యనుకొనిన, నీ కవిసత్తముని యనుజుఁడును, నితని తరువాత పేర్కొనఁబడినవాఁడును యగు నా తల్లప్పకు నిరువదియెనిమిది భాగము లిచ్చియుండఁగా, రాజానుగ్రహమునకుఁ బాత్రుఁడయి, కవి పండిత శిరోమణిగ విద్వల్లోకమున బ్రతిష్ఠనందిన నీ మహాకవికి నిరువదియాఱు భాగము లిడి రనుట హాస్యాస్పదము; అసంబద్ధము; అనంగీకార్యము. కావున నీ హేతువాదముల బలమున సోమునకు బుక్కరాయపురమున ముప్పదియాఱు (షట్త్రింశ) భాగముల నిడి, యాజమాన్యము నప్పగించి, గౌరవించి నారనుటలో సందియములేదు. అనఁగా శ్రీ కందుకూరి వారు ప్రకటించిన శాసనప్రతి (Ep. Car Gd 46 యందలి పాఠమే సరియైనదనుట. షట్త్రింశ యని చెక్కఁబడిన పదము కాలక్రమమున మాసి చెడిన యొక ప్రతిలో షడ్వింశగా భాసించి యుండవచ్చును. ఈ ప్రతులన్నియు నొకే శిల్పాచార్యునిచే చెక్కఁబడి యున్నందున, శ్రీ కందుకూరివారు తలంచినటు లీ విషయమునఁ బాఠభేదము కలిగియుండిన దనుట సరికానేరదు.

ఇంక మిగిలిన ప్రతిగ్రహీతలకు లభించిన భాగముల విషయములో తల్లప్పకు 28; సింగయకు 11; సింగనకు 10 భాగములనుటలో నేరికిని యభిప్రాయభేదము లేదు. చివరి యిరువురగు వత్సయ, భాస్కరులకు శాసనమునందలి 32, 33 శ్లోకములలో వృత్తిత్రయ, వృత్తిద్వయ యని చెప్పఁబడినది. అనఁగా వీరికి క్రమముగా మూఁడు రెండు భాగములనుట. ఈ రీతి నీ యగ్రహారమును బంచి యిచ్చినారని తలంచినచో, వారిభాగముల మొత్తము తొంబది యని తేలును. అట్లయిన దశోత్తర

శతభాగములుగా విభజించిన విషయము పొల్లుపోవును. ఈ పాఠము ఎపిగ్రాఫియ కర్ణాటికాలో ప్రకటింపఁబడి Mg. 158, Gd. 46 శాసన ప్రతుల రెంటను 28 శ్లోకము నందలి పూర్వార్ధములలో నొకే విధముగా గలదు. మఱియు శ్రీ కందుకూరి వారును, శ్రీ చాగంటి వారును నీపాఠమునే యంగీకరించిరి. శ్రీ కందుకూరి వారు భాగ విషయ చర్చలో చివరివారగు వత్సయ, భాస్కరుల భాగములను వృత్తిత్రయ వృత్తిద్వయములకు బదులు క్రమముగ పదమూఁడు, పంద్రెండు భాగములుగా సవరించి, దశోత్తర శతభాగ నిశ్చయమును సరిపుచ్చిరి. కాని యీ నిశ్చయ మంగీకార యోగ్యముగాఁ దోపదు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, క్రీ. శ. 1910 వ సంవత్సరమున ప్రథమ ఉగాది సంచికలో బుక్కరాయ దానశాసనమును ప్రకటించిరి. వీరి శాసనమునకు మూలమేదియో తెలియరాదు. శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు "విజయ నగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము" న నాచన సోమనాథుని కాలాదుల చర్చకుఁ గడంగుచు, శ్రీ చిలుకూరివారి శాసనమునందలి కొన్ని భాగముల నుదాహరించిరి. అందును నీ "దశోత్తరశతం" అను పాఠమే గలదు. కాని శ్రీ చిలుకూరివారి శాసనమునే ప్రస్తావించి, శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు తమ "సోముఁడు" అను గ్రంథమునందు (క్రీ. శ. 1917 వ సంవత్సరము) శాసన పాఠమును బూర్తిగా నుదాహరించి యున్నారు ఇందు మాత్రము "దశోత్తరశతం" అనుటకు బదులుగా "దశోవరశతం" అని వ్రాసిరి. ప్రాయశః భాగముల మొత్తము తొంబదికి సరియగుచుండుటచే శ్రీ శాస్త్రిగారీపాఠమును సవరించి యుందురు. అనఁగా వీరి యభిప్రాయము పది తక్కువ నూఱు యని సమర్థించుట కవకాశము కలదు. శతముయొక్క యుదరమునందు దశగల సంఖ్య యనుచో శతమునందే పదిసంఖ్య గర్భస్థమైనదనియు నాకారణమునఁ బది సంఖ్య శతమునందు లోపించిన దను యర్థమును గ్రహించి, తొంబది సంఖ్యగా నిశ్చయింపవలయును. శ్రీ చాగంటివారును "దశోత్తర శతం" అను వాక్యమును దొంబది యని యర్థమిచ్చునట్లుగా "దశన్యూనశతం" అని సవరింప వలసి యుండునేమో!" అని వ్రాసిరి. శాసనము నందలి శ్లోకములలో వివరింపఁబడిన భాగముల మొత్తము నూటపదియను సంఖ్యకు సరిపడలేదు. మఱియు సింగయ, సింగనలకు పదునొకటి, పది భాగములని నిశ్చయించిన యనంతరము వత్సయ, బాస్కరులకు పదమూఁడు పంద్రెండు భాగముల నిశ్చయించుటలో నౌచిత్యమును గానరాదు. వత్సయ,

భాస్కరులకు, సింగయ, సింగనలకంటె నెక్కుడు భాగముల నీయఁదలఁచినచో వార లనే ముందుగాఁ బేర్కొని యుందురు. కావున వత్సయ, భాస్కరులకు మూఁడు, రెండు భాగములను క్రమముగా నిచ్చియుండి నటుల భావించి, మొత్తము భాగములను తొంబదియనుటయే సమంజసము. శ్రీ వేలూరి, శ్రీ చాగంటి వారల యభిప్రాయాను సారము దశోత్తరశతమను దానిని మార్చుట లెస్సయగును. అయిన దశోపరశత మను పాఠము గ్రాహ్యము.

# పూర్వహరివంశము : వివాదపరిష్కారము

సోమనాథుఁడుత్తర హరివంశమునే కాక పూర్వహరివంశమును గూడ రచించి యుండెనని కొందఱనుచున్నారు. ఇందు గ్రంథావతరణిక గానరాకుండుటయు, పూర్వ భాగ కథానుస్మరణముండుటయు, పూర్వహరివంశమును గూడ నితఁడు రచించి యుండుననుటకు హేతువు లనుచున్నారు. ఈ విషయమును గూర్చి తొలుత ప్రసం గించినవారు బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు. ఆంధ్ర సాహిత్య పరి షత్పత్రికలో వారిట్లు వ్రాసియున్నారు. "సోముఁడు పూర్వహరివంశమును రచించి నట్లొండు రెండు నిదర్శనములు గానవచ్చుచున్నవి. శ్రీ మదోగిరాల జగన్నాథ కవి రాజుగారు తమ సుమనోభిరంజన కావ్యము వ్యాఖ్యానమున నాచన సోమనాథుని యీ క్రింది ప్రయోగము నుదాహరించినారు.

"శతతాళదఘ్నహ్రదమున నుఱికెన్" సుమ. ద్వి. 48 వ. వ్యాఖ్య. ఈ పాదము గల పద్యము ఉత్తర హరివంశమున లేదు. ఇది శ్రీకృష్ణుండు యమునానది యందలి కాళియ నాగరాజు హ్రదమున నుఱికిన ఘట్టములోనిదని తోచుచున్నది. నలువది మూఁడేండ్ల క్రిందటఁ గవియే ముద్రింపించుకొన్న గ్రంథములోని దీయుదాహరణము. ప్రక్షిప్త మనుటకుఁగాని, లేఖకప్రమాదమనుటకుఁగాని, వలను పడునదిగాదు. కాళి యుని మడువున శ్రీకృష్ణుఁ డుఱికినది పూర్వ హరివంశములోని కథయై యున్నది.

నలువదేండ్ల క్రిందటి వఱకునుగల యిమ్మహాగ్రంథ మిప్పుడేమయ్యెనో యని భాషాభిమానుల కెవ్వరికి విచారము గలుగకుండును? మొన్నటి జగన్నాథకవియఁట! సోముని హరివంశపు నిండుప్రతియఁట! నేఁడు గానరాదఁట! కాలమా! శ్రీ జగన్నాద కవిగారి కుటుంబము గోదావరీ మండలములోని ఫ్రెంచివారి యానాము కడనున్న నీల పల్లె గ్రామమునకు వెడలిపోయినట్లు వినియుంటిని. మహనీయులెవ్వరైన దాని యుని కిని గనుగొందురుగాక యని వేఁడుచున్నాఁడను."

ఈ వాక్యములపయి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉత్తర హరివంశమునకుఁ బీఠిక వ్రాయుచు నందు దమ యభిప్రాయమునిట్లు తెలిపియున్నారు. "శతతాళదఘ్నహ్రదము

పేరు పింగళి సూరనార్యుఁడు రచించిన కళాపూర్ణోదయమందు సుగాత్రీశాలీనుల కథలో నున్నది. కాని పద్యపాఠము భిన్నవిధము గలది.

ఓగిరాల జగన్నాథ కవిగారు ప్రామాదికముగా దానిని హరివంశమందలి దానిగా స్మరించి యుందురేమో (అప్పకవి "ఒకనాఁడిందువదనుండు" ఇత్యాదిపద్యమును దెనాలి రామలింగని యిందుధరోపాఖ్యానమందలి దానిగాఁ జెప్పినట్లుగానే.)"

వేటూరివారి యభిప్రాయమునకుఁ బ్రత్యాఖ్యానముగ శ్రీ చాగంటి శేషయ్యగారు తమ "ఆంధ్రకవి తరంగిణి" లో నిట్లు వ్రాసియున్నారు

"కళాపూర్ణోదయమునందు శతతాళ దఘ్నహ్రద ప్రశంస గల పద్యములివి :—

క॥ ఘనరోముఁడగుచు నతఁడా
వనితయుఁ దోనరుగుదేర వడిఁజని యాచే
ర్పునను శతతాళ దఘ్నం
బనుపేరను వెలసియున్న హ్రదమున నుఱికెన్.

చ॥ అదె శతతాళదఘ్నమను సార్థపు నామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యందును బడ్డవారికిం
బ్రదుకులె యంచుఁ దప్పదు పురాకృత మెవ్వరికైన నంచుఁ గొం
తతడవు గుండెనేనపుడు తద్ద్విజముఖ్యుని జూచియొయ్యనన్.

ఈ రెండు పద్యములలోను గూడ "శతతాళదఘ్నహ్రద" మను సమాసపదము లేదు. ఇంతేకాదు. జగన్నాథకవి యెందుకొఱకీ వాక్యమును గ్రహించెనో, ఆకార్య మీ పద్యముల యందలి ప్రయోగముల వలన నెఱవేఱదు. జగన్నాథకవి 'దేవవల్లభహ్రాదినీ విలసితమయ్యు జంభజయాధిక సంపదఁదగి'' అని తన గ్రంథమున వ్రాసి, ఇందలి 'భ' యను నక్షరము లఘువగుటకు లక్ష్యము కొఱకు సంస్కృత సమాసములందు రేఫసంయుక్తవర్ణ పూర్వాక్షరమునకు లఘుత్వమును గల్పించిన పింగళి సూరనార్యాదుల ప్రయోగముల నుదాహరించుచు, నాచన సోమనాథునిదని పైనఁ జెప్పిన ప్రయోగ

మును లక్ష్యముగా నిచ్చియున్నాఁడు. కళాపూర్ణోదయమందలి పైరెండు పద్యములలోని ప్రయోగములు నీ లక్ష్యమునకు లక్షణములు గానేరవు. కందపద్యములోని హ్రదము సంస్కృతపదముతో సమసింపలేదు. రెండవ పద్యములోని హ్రదము పూర్వాక్షరమును గురువుగాఁ జేయుచున్నది. కాని లఘువుగాఁ జేయుటలేదు. కావున జగన్నాథకవి, శ్రీ ప్రభాకరశాస్త్రులు గారనినట్లు కళాపూర్ణోదయములోని శబ్దమును బొరపాటున నాచన సోమనాథుని దని వ్రాయలేదు. దీనిని బట్టి నాచన సోముఁడు పూర్వ హరివంశమును వ్రాసియున్నట్లే నిశ్చయింపఁదగియున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన హరివంశమున జగన్నాథకవి యుదాహరించిన పద్యపాదము లేదు. భాగవతమునఁ గాళియమర్దన కథయందు 'హ్రదమున' 'నుఱికెన్' అను శబ్దములున్నవికాని, 'శతతాళదఘ్న' శబ్దములేదు. శ్రీకృష్ణలీలలను వర్ణించిన పద్మపురాణమునను నీ వాక్యము గనుపట్టలేదు. ఏ విధముగాఁ జూచినను, బూర్వహరివంశమును నాచన సోమనాథకవి రచియించినట్లే కన్పట్టుచున్నది''

సోముని యుత్తర హరివంశమునందలి గద్యలోఁ గన్పట్టు ''భారత కథానంతరంబున'' యనుదాని నాధారముగాఁ గొని శ్రీ చాగంటి శేషయ్యగారు మఱియు నిట్లు వ్రాసియున్నారు. ''ఇతఁడు పూర్వభాగమును విడిచి యుత్తర భాగమును మాత్రమే రచియించి యున్నయెడల గద్యలో నా వాక్యములను వ్రాసికొనియుండడు. మఱియుఁ బూర్వభాగమును విడిచి, యుత్తర భాగమునే వ్రాయుట కవసరముగాని, కారణము గాని లేదు. ఈ మూఁడు కారణములును నాచన సోముఁడు పూర్వభాగమును రచియించెనని నిశ్చయముగాఁ జెప్పుటకుఁ జాలినంత సాక్ష్యము గాకపోయినను, అట్లు దృఢముగా నమ్ముటకుఁ దగినవిగా నున్నవని చెప్పవచ్చును.''

మీఁది ప్రసంగముల సారాంశ మీక్రింది విధముగాఁ జెప్పవచ్చును. సోముఁడు పూర్వహరివంశమును వ్రాసెను. ఇది వారి సిద్ధాంతము. దీని కుపపత్తులుగా వారు చూపినవి.

(1) అవతారిక లేకుండుట.

(2) పూర్వకథానుస్మరణము.

(3) గద్యలో 'భారతకథానంతరంబున' అని యనుట.

(4) ఉత్తర హరివంశమని తన గ్రంథమునకుఁ బేరిడుట.

వీనిని వరుసగాఁ బరిశీలింతము. అవతారిక వ్రాయుట ఆంధ్రకవుల కంపఱకును బరిపాటియగు విషయమే. ఇందభిప్రాయభేదమున కవకాశము లేదు. కాని యవతారిక వ్రాయవలెనను నియమము లెచ్చటను గానరావు. సంస్కృతమున మహాకవులగు కాళిదాసాదు లవతారికలు వ్రాయలేదు. వారి మార్గము ననుసరించి, సోమనయు నవతారికను మాని యుండవచ్చును లేదా సోమన యవతారికను రచించినను, నయ్యది యుత్సన్నమయి యుండవచ్చును. భాస్కర రామాయణమున నవతారిక గానరాదు. అంత మాత్రమున నా గ్రంథమునకుఁ బూర్వగ్రంథమొకటి యుండెనని మనమూహించుట కవకాశము లేదుగదా! ఘటికాచల మాహాత్మ్యమున కవతారిక వ్రాయకయే రామకృష్ణుఁడు విడిచెను. అట్లు విడుచుట కాతని మరణము కారణమని పండిత విమర్శకులు కొందఱు చెప్పుచున్నారు. కావచ్చును, కాకపోవచ్చును. ఏది యెట్లున్నను గ్రంథమున కవతారిక వ్రాయవలెనను నియమము కవులకు లేదనుట స్పష్టము. కాని సంప్రదాయమున్నది. సోమనకు పరమపూజ్యుఁడని చెప్పఁదగిన తిక్కన తన గ్రంథమున కవతారికను వ్రాసెను. ఆ మార్గము ననుసరించి సోమనయు నవతారిక వ్రాసెనని మనము నిశ్చయింప వచ్చును. ఆ యవతారిక యిప్పుడు కానరాదు. కావున నది యుత్సన్నమయినదని యూహింప నవకాశము గలదు. సోమన పూర్వహరివంశమును వ్రాసెనని తలంచువారీ యవతారికా విషయమునే మఱొక విధముగాఁ ద్రిప్పి చెప్పుచున్నారు. సోమన పూర్వహరివంశమును గూడ రచించెననియు, నా గ్రంథప్రారంభమున నవతారికను గూడ రచించెననియుఁ, బూర్వ హరివంశముతోఁబాటు ఆ యవతారికయు నశించినదనియు, మనకిప్పుడు లభించుచున్న యుత్తర హరివంశము సమగ్ర గ్రంథముకాక, హరివంశ గ్రంథమున నొకభాగమే యగుటచే నిందవతారిక గానరాకున్నదనియు, వారివాదము. సోమన ఉత్తరహరివంశమును మాత్రమే రచించె ననువారు అవతారిక మాత్రమే నశించినదని చెప్పుచున్నారు. పూర్వ హరివంశమును గూడ రచించెననువారు, అవతారికతోఁబాటు పూర్వ హరివంశము గూడ నశించిన దనుచున్నారు. అసలవతారిక వ్రాయుట, వ్రాయకపోవుట యనునవి పూర్వ హరివంశ రచనా నిర్ణాయకమగు విషయమే కాదు. పూర్వహరివంశమును రచియించెను గావున నిట యవతారిక లేదని చెప్పఁజాలము. ఇట నవతారిక లేకపోవుట కదియు నొక కారణము గావచ్చును కాని యదియే కారణమనుట సమంజసము కాదు. ఇతరాధారములు కూడ పూర్వ హరివంశ రచనమును సమర్థించునేని దీనిని గూడ మఱొక కారణముగఁ జెప్పవచ్చును. కావున నితరాధారములను గూడ పరిశీలించి, యిందెవ్వరి వాదము బలీయమో నిర్ణయింతము.

రెండవ కారణము పూర్వకథానుస్మరణము. దీనిని బట్టి కూడ పూర్వహరివంశము సోమన రచించెననిగాని, రచింపలేదనిగాని, చెప్పఁ జాలము. ఉత్తర హరివంశమున పూర్వకథాస్మరణ మున్నమాట వాస్తవమే. ఉత్తర హరివంశ ప్రారంభమున నిట్లున్నది.

కం॥ హరివంశ ప్రథమ కథాం
తరమునఁగల వింతలెల్లఁ దప్పక మదిలోఁ
దిరమయ్యెఁగదా మీఁదట
నరవర! యేకథలొకో? వినంబ్రియ మనుడున్.

ఉ. హరి. 1 - 3.

ఈ పద్యమును బట్టి సోమన పూర్వహరివంశమును రచించెననియు, నద్దానినే యిచ్చట స్మరించు చున్నాఁడనియు, కొందఱనుచున్నారు. కాని పూర్వ హరివంశమును రచింపకున్నను, నిట్టి స్మరణమావశ్యకమని సమ్యగ్విచారణ గావించినచో దెలియక పోదు. హరివంశేతి వృత్తమట్టిది. హరివంశము భారతమునకు ఖిలముగాని, స్వతంత్ర మగు పురాణముకాదు. అందులకే సంస్కృత హరివంశమున "మహాభారతే హరి వంశః" అని వ్రాయబడి యున్నది. గ్రంథ ప్రారంభమునఁగూడ శౌనకాది మహర్షులు సౌతినిట్లు ప్రశ్నించి యున్నారు."

తత్రజన్మ కురూణాం వైశంపాయనోక్తం రౌమహర్షణే
నతు వృష్ణ్యంధకానాంచ తద్భవాన్ వక్తుమర్హతి"

జనమేజయుఁడు వైశంపాయనుని గూడ నిట్లే ప్రశ్నించియున్నాఁడు.

'మహాభారత మాఖ్యానం బహ్వర్థం శ్రుతివిస్తరమ్
కథితం భవతాపూర్వం విస్తరేణమయాశ్రుతమ్
తత్రశూరాః సమాఖ్యాతా బహవః పురుషర్షభాః
నామభిః కర్మభిశ్చైవ వృష్ణ్యంధక మహారథాః
తేషాంకర్మావదాతాని త్వయోక్తాని ద్విజోత్తమ

తత్రతత్ర సమాసేన విస్తరేణై వమే ప్రభో
నచమే తృప్తిరస్తి కథ్యమానే పురాతనే
ఏకశ్చైవమతోరాశి ర్వృష్ణయః పాండవా స్తథా
భవాంశ్చవంశకుశల స్తేషాం ప్రత్యక్ష దర్శివాన్
కథయశ్వకులం తేషాం విస్తరేణ తపోధనా'——'

హరివంశ గ్రంథమును సమగ్రముగా నాంధ్రీకరించిన యెఱ్ఱనయు, నిట్టివిధముగాఁ బూర్వకథానుస్మరణము సేయుచునే హరివంశము నారంభించెను.

శా॥ వ్యాసప్రోక్తము భారతాగమము నీ వత్యంత హృద్యోక్తి వి
న్యాసంబొప్పఁగ విస్తరింపఁగఁగడున్ హర్షించె వీనుల్ సము
ల్లాసోద్భాసిని యయ్యెబుద్ధి శ్రుతితుల్యం బద్భుతార్థోదయ
శ్రీ సంభావిత మిప్పురాణము ప్రశంసింపంగ నిట్లొప్పనే.

ఉ॥ ఇమ్మహితేతిహాసమున నెందును నబ్బరతాన్వయ ప్రసం
గమ్మునఁ బూర్వభూపతుల కర్మవిశేషములున్ గుణప్రకా
రమ్ములు దేవదైత్యమునిరాక్షసయక్ష ఖగాది పుణ్య వృ
త్తమ్ములు ధర్మనిశ్చయ విధమ్ములు పెక్కెఱిఁగించి తింపుగన్

ఉ॥ కౌరవ పాండవ ప్రభవ గౌరవలీలలు నీవు చెప్పఁ దీ
పారెడుభంగి వింటిమి గుణాకర యింక జగత్త్రయంబునన్
ధీరులు శూరులున్ విభవదీప్తులు నా నుతిగన్న యాయదు
క్ష్మారమణాన్వయోత్తముల చందములున్ విన వేడుకయ్యెడున్

హరి. ఆ. ౧ – 46, 47, 48.

మీఁది యుదాహరణములను బట్టి మనకొక్క విషయము తేటతెల్ల మగుచున్నది. హరి వంశమును సంపూర్ణముగా రచించిన వారికిఁ గూడ పూర్వ కథాను స్మరణమావశ్యకమే యగుచున్నది. హరివంశ కథా స్వరూపమే యట్టిది. పూర్వు లిద్దానిని భారతాంతర్గత

మగు నొక భాగముగనే భావించినారు. భారత పారాయణానంతరము తచ్ఛాంతి గావింప హరివంశ పఠనమును గావించుట పూర్వుల యాచారము. కావున హరివంశ గాథలను సమగ్రముగ రచించినను, కొంతభాగమును మాత్రమే గైకొని రచియించినను, బూర్వ కథానుస్మరణము తప్పునదికాదు. కావున నికారణమును బట్టి సోముడు పూర్వ హరివంశమును రచించెనని నిశ్చితముగాఁ జెప్పఁజాలము.

మూఁడవకారణము, గద్యలో సోమన తిక్కన సోమయాజి ప్రణీతంబైన "శ్రీ మహాభారతకథానంతరంబున" అని చెప్పికొనియున్నాఁడు. పూర్వ హరివంశమును వ్రాయుచున్నచో "శ్రీ మహాభారతకథానంతరంబున" అని సోమన వ్రాసియుండఁ డని కొందఱి వాదము. హరివంశ గాథలన్నియు మహాభారతకథానంతరము చెప్పఁ బడినవే కదా! అట్టియెడ పూర్వ హరివంశమును వ్రాయునినాఁడు సోమన యిట్లు చెప్పుట సంభావ్యము కాదని యెట్లు చెప్పఁగలము? కావున ని కారణమునుబట్టి గూడ సోమన పూర్వ హరివంశమును వ్రాసెననిగాని, వ్రాయలేదనిగాని చెప్పలేము.

నాల్గవది "ఉత్తర హరివంశము" అని గ్రంథనామము. సామాన్యముగ ఉత్తర హరివంశ పదము పూర్వ హరివంశమును స్మరణకుఁ దెచ్చును. పూర్వోత్తరము లను నది పరిపాటి యగుమాట. కాని ఉత్తర శబ్దమున కనేకార్థములు గలవు. అందు శ్రేష్ఠమను నర్థమొకటి గలదు.[1] సోముఁడు తన హరివంశమునకు ఉత్తర హరివంశ మని పేరిడుటలో నీ శ్రేష్ఠార్థమును మనసునందిడుకొని యుండవచ్చును. హరివంశమున శ్రేష్ఠమగునది గొంతయు, శ్రేష్ఠముకానిది కొంతయు గలదా యని కొందఱు ప్రశ్నింప వచ్చును. ఈ శ్రేష్ఠత్వము హరివంశేతివృత్తమునకు సంబంధించినదికాదు. ఇది ముఖ్యముగ సోముని రచనావైదగ్ధ్యమునకు సంబంధించినదయి యుండును. సోముని యుత్తర హరివంశ రచనకుఁ బూర్వమే యెఱ్ఱన హరివంశమును సమగ్రముగ నాంధ్రీకరించి యున్నాఁడు. పలువురు పండిత విమర్శకు లీవిషయము నంగీకరించి యుండిరి. సోముఁడా హరివంశమును జూచియుండును. చూచినాఁడు కావుననే మరల హరివంశమును సమగ్రముగ నాంధ్రీకరించుట వ్యర్థమని సోమన యూహించి యుండును.

1. See Aptes' Sanskrit English Dictionary. Published under the auspicious of the Govt. of India, 1963. Page 101. Uttara ; (5) Superior, Chief Excellant.

హరివంశము నందలి కొన్నిగాథలను మాత్రము గైకొని తానొక విశిష్ట గ్రంథమును రచించెను. అయ్యది యెఱ్ఱన గ్రంథముకంటె శ్రేష్ఠతరమని చూపుటకయి దాని కుత్తర హరివంశమను బేరిడెను. నిజముగా తిక్కన తరువాత నెఱ్ఱనను జెప్పవలెను. కాని సోముని యభిప్రాయమునఁ దిక్కన తరువాత స్మరింపఁదగిన వాఁడు తానే. కావుననే గద్యలో "తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున" అని చెప్పి తిక్కన తరువాతి లేక తిక్కనతో సమానమగు స్థానము తనదేయని ప్రకటించు కొనెను. ఎఱ్ఱన గ్రంథమును సోమన చూచియుండెననుట కొక ప్రబల నిదర్శనము కలదు. మూలమున నూర్వశీనరకాసుర ఘట్టములేదు.[1] కాని యెఱ్ఱన గ్రంథమునఁ గానవచ్చుచున్నది. దానిని చూచియే సోమన తన గ్రంథమున నూర్వశీనరకాసుర ఘట్టమును బ్రవేశపెట్టెనని యూహించుట కవకాశము గలదు. సోమన గ్రంథమునే యెఱ్ఱన యనుకరించెనని యేలచెప్పరాదు ? అని కొందఱు ప్రశ్నింపవచ్చును. కాని మఱికొన్ని యితర కారణములను బట్టి యెఱ్ఱన గ్రంథమే పూర్వరచనయనియు, సోమన గ్రంథము తరువాతి రచన యనియు నిర్ణయింపనగును. క్లుప్తముగా నాయాధారములివి : క్రీ. శ. 1325 - 35 సంవత్సరముల మధ్యకాలమున యెఱ్ఱన హరివంశమును రచించెనని నిశ్చితముగా నిర్ణయింపవచ్చును. కాలమును గూర్చి చర్చించునపుడీ విషయములు సమగ్రముగా వివరింపఁబడినవి. క్రీ. శ. 1336 వ సంవత్సరమున గాని విద్యానగర సంస్థాపనమే జరుగలేదు. బుక్కరాయల దానశాసన కాలము క్రీ. శ. 1344 వ సంవత్సరమగుచున్నది. దానశాసన కాలమునకు రెండుమూఁడు సంవత్సరములకుఁ బూర్వము సోమన తన యుత్తర హరివంశమును రచించెనని చెప్పుట సమంజసము. పయి యంశములను బట్టి యెఱ్ఱన హరివంశమును సోమన చూచెననియు, తన హరివంశము దానికన్న మిన్నయని చెప్పుటకే "ఉత్తర హరివంశ" మని పేరిడెననియు నూహించుట సత్యదూరము కాఁజాలదు. ఈ నామ సార్థక్య మింకొక విధముగా కూడ సమర్థింపవచ్చును. సంస్కృత హరివంశమునఁగూడ పూర్వోత్తరభాగములు కలవు. ఒక్క నరకవధ తప్పించి, సోముఁడు తీసికొనిన కథ లన్నియు నుత్తరభాగము నందలివే. తత్కారణమునఁ గూడ సోమన దీని కుత్తర హరివంశమని పేరిడి యుండవచ్చును. మఱొక విధముగకూడ దీని నన్వయింప వచ్చును. ఉత్తర శబ్దమునకు "తరువాతి, అనుసరించిన" అను నర్థములు గూడఁ

---

1. నేను సంప్రతించిన సంస్కృత ప్రతులలో ఊర్వశీనరకాసుర ఘట్టము లేదు.

గలవు.[1] హరివంశమున మొట్టమొదట నున్నది హరివంశ పర్వమే. హరివంశ పర్వమునందొక్క గాథకూడ సోమన గైకొనలేదు. హరివంశ పర్వమున కుత్తరమున నున్న విష్ణు, భవిష్య పర్వముల నుండియే తనకుఁ గావలసిన గాథలను తీసికొనెను. కావుననే తన హరివంశమున కుత్తర హరివంశమని పేరు పెట్టుకొని యుండును. ఈ యన్వయము నంగీకరించినచో, నరకవధను గూడఁ దప్పింపవలసిన యావశ్యకత యుండదు. వీనిలో నేయర్థము సోమన మనసునందున్నదో యిదమిత్థమని చెప్పుట కవకాశములేదు. ఏది యెట్లున్నను ఉత్తర హరివంశమను పేరునుబట్టి పూర్వ హరివంశ మున్నదని నిశ్చితముగాఁ జెప్పజాలము.

ఇఁక ఓగిరాల జగన్నాథకవి యిచ్చిన ప్రయోగమును గూర్చి పరిశీలింతము. దీనిని ప్రప్రథమముగాఁ జెప్పినవారు శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారు. వారు చెప్పిన దానిని విమర్శింపుచు, శ్రీ వేటూరి వారు కొన్నిమాటలను జెప్పిరి. శ్రీ వేటూరి వారి విమర్శకు ప్రతి విమర్శను శ్రీ చాగంటివారు వ్రాసిరి. ఆ విషయములన్నియు ముందే చెప్పఁబడినవి. కాని శ్రీ చాగంటి శేషయ్యగారి విమర్శన మొక వింత ధోరణిలో నడచినది శ్రీమదోగిరాల జగన్నాథకవిగారు ప్రమాదవశమున సూరనార్యుని కళాపూర్ణోదయమునందలి పద్యపాదమును, హరివంశములోని పద్యపాదముగఁ జెప్పియుండ వచ్చునని శ్రీ ప్రభాకర శాస్త్రిగారి వాదము. పద్యపాదములు భిన్నముగా నున్నవనికూడ శ్రీ ప్రభాకర శాస్త్రిగారు చెప్పియున్నారు. అట్టియెడ శ్రీ చాగంటి శేషయ్యగారు మఱల నా పద్యముల నుదాహరించి, శతతాళదఘ్నహ్రదమను పదము ఒక్కచో నా పద్యముల యందులేదని పునరుద్ఘాటింపవలసిన యావశ్యకతలేదు. మఱియు కళాపూర్ణోదయ పద్యములయందలి ప్రయోగములవలన జగన్నాథ కవిగారి ప్రయోజనమును సాధింపఁ బడలేదని శ్రీ చాగంటివారు చెప్పియున్నారు. అవి యథాతథముగా నుదాహరించినచో, ఓగిరాలవారి ప్రయోజనము సాధింపఁబడదను మాట వాస్తవమే. పద్యపాదము భిన్నముగ నున్నదని శ్రీ ప్రభాకర శాస్త్రిగారే చెప్పిరికదా! ఓగిరాల వారి పొరపాటు గ్రంథ విషయముననే కాక, ప్రయోగ విషయమునఁ గూడ నుండి యుండవచ్చును. అట్లు భ్రాంతి నొందుట కవకాశమును గూడ గలదు. కావున నీ శతతాళదఘ్నహ్రద ప్రయోగము నొక్కదాని నాధారముగాఁ గొని సోముఁడు పూర్వ హరివంశమును వ్రాసెనని

1. Aptes' Sanskrit English Dictionary. Page 101. Uttara : Later, Latter, Following, Subsequent. పూర్వమేఘః, ఉత్తర మేఘః, ఉత్తరరామ చరితమ్.

స్థిరీకరించుట సాహసైకమూలమే యగుచున్నది. మఱొక విషయముకూడ మన మూహింపవచ్చును. శ్రీమదోగిరాల జగన్నాథకవిగారు "శతతాళదఘ్నహ్రదమున నుఱికెన్" అను ప్రయోగము నిచ్చుచు, నయ్యది నాచన సోమనాథుని ప్రయోగమని మాత్రమే చెప్పియున్నారు. అది నాచన సోమనాథుని పూర్వ హరివంశములోనిదని వారు చెప్పలేదు. ఉత్తర హరివంశమున నీ ప్రయోగము లేదుగావున నయ్యది పూర్వ హరివంశము లోనిదయి యుండునని శ్రీ వీరరాజు పంతులు గారూహించినారు. కాని సోముఁడు వ్రాసిన ఉత్తర హరివంశము మనకు యథాతథముగా వచ్చినదని చెప్పఁ జాలముకదా! ఇప్పుడు మనకుఁ గన్పట్టుచున్న ప్రతులలోఁ గూడ, ముఖ్యముగా కందుకూరివారి ప్రతికిని, వేటూరివారి ప్రతికిని, కొన్ని యెడల భేదములు కన్పట్టు చున్నవి. అప్పకవ్యాది లాక్షణికులుదాహరించిన పద్యములు కొన్ని నేటి యుత్తర హరివంశ ప్రతులలోఁ గానరావు. అట్టియెడ నీ "శతతాళదఘ్నహ్రదమున నుఱికెన్" అను పాదముగల పద్యము శిథిలమయి యుండుట కవకాశము లేకపోలేదు. ఇట్టి పద్యమున కనువగు ఘట్టము కూడ హంసడిభకోపాఖ్యానమునఁ గలదు. కృష్ణుఁడు కంసుని యమునలో నణఁగఁ ద్రొక్కెను. ఆ వృత్తాంతము హలధరునితో యుద్ధము చేయుచున్న డిభకునకుఁ దెలిసెను. ఆ మాట వినినంతనే డిభకుఁడు మహావేగముసఁ బాఱుదెంచి, యమునానదిలో నుఱికినట్లు చెప్పఁబడియున్నది. ఆ పద్యమిది—

మ॥ విని వేగంబునఁ బాఱుతెంచి యమునావేగంబునం బాకశా
సన శస్త్రప్రహతిం బయోధిఁ బడునాశైలంబు చందంబునన్
మునిఁగెన్ వెంట హలాయుధుండు దఱుమన్ మోహాంధ
కారంబులో
మునిఁగెం దజ్జలమెల్లఁ దల్లడపడ న్మొప్పెట్టు వెట్టన్ వడిన్.

ఉ. హరి. 4 - 298.

ఈ సందర్భమున "శతతాళదఘ్నహ్రదమున నుఱికెన్" అను పద్యముకూడ నుండి యుండవచ్చును. ఎందులకనఁగా డిభకుఁడొక్కమాఱు యమునలో నుఱికి యూరకొనలేదు. మఱల మఱల మునుఁగుచుఁ దేలుచు నుండెను. ఆ విషయ మీ క్రింది పద్యము వలనఁ దెలియనగును.

చ॥ అనుచు విలాపనాలసత నా యమునానది తీరభూమికిం
జని హరిఁగాంచి యోరి పురశాసనశిష్యుని హంసుఁగానవే
యనుటయు వాఁడెపో యమునయందు మునింగె ననంగ వెండియున్
మునుఁగుచుఁ దేలుచున్ డిభకమూఢుఁడు హంసునిఁ గానఁ డెయ్యెడన్.

ఉ. హరి. 4 - 301.

కావున నట్టి పద్యము ఉత్తర హరివంశమునఁ గూడ నుండుట కవకాశము గలదు. ఓగిరాల జగన్నాధకవిగారు భ్రాంతికి లోనుగాలేదని, మనమంగీకరించినప్పుడు కూడ, సోముఁడు పూర్వ హరివంశమును రచించెనను వాదము స్థిరపడఁజాలదు. ఆ పద్య పాదము నుదాహరించుచు, ఓగిరాల జగన్నాధకవిగారు, అయ్యది పూర్వ హరివంశము లోనిదని చెప్పకపోవుటయు, నుత్తర హరివంశమందుకూడ నట్టి పద్యముండుట కవకాశ ముండుటయు, సోమన పూర్వ హరివంశమును వ్రాసెనను వాదమును పరాస్తము గావించుచున్నది.

సోముఁడుత్తర హరివంశమును మాత్రమే రచించినచో నా రచనా ప్రణాళిక యెట్టిది? అంతటి మహాకవి అలవోకగా నేవో కొన్నికథలను దీసికొని గ్రంథమును రచించె ననుట పొసఁగదు. ఇఁక సోముఁడి కథలను గైకొనుటలోఁగల పరమార్థమును బరిశీలింతము. ఉత్తర హరివంశము నందలి కథలను బట్టి చూచినచో, సోమనాథుఁడు రెండు మూఁడు ప్రయోజనముల నాశించి, ఆ కథల నట్లు గైకొనినాఁడని చెప్పవచ్చును. ఉత్తర హరివంశమున నీ క్రింది కథలు ముఖ్యముగాఁ గన్పట్టుచున్నవి. ప్రథమాశ్వాసమున నర కాసురవధ గలదు. ద్వితీయాశ్వాసమున శ్రీ కృష్ణుఁడు, మృతులయిన విప్రకుమారుల రక్షించుటయు, పుత్రార్థము శివుని గూర్చి తపస్సు చేయుటయు, హరిహర సమాగ మమును వర్ణింపఁబడినది. తృతీయాశ్వాసమున పౌండ్రకవాసుదేవ సంహరణము చెప్పఁబడినది. చతుర్థాశ్వాసమున హంసడిభకోపాఖ్యానము కలదు. పంచమ షష్ఠా శ్వాసములందు బాణాసురకథ గలదు. ద్వితీయాశ్వాసమును విడిచినచోఁ దక్కిన

యైనాశ్వాసములయందును, రాక్షసవధయో, లేక రాక్షససములగు నృపులవధయో వర్ణింపఁబడి యున్నది. అనఁగా శ్రీకృష్ణవిజయము వర్ణింపఁబడియున్న దనుట. ద్వితీయాశ్వాసమున విప్రకుమారరక్షణమునందుఁ గూడ నతిలోకమహనీయమగు శ్రీకృష్ణ మాహాత్మ్యమును, ధర్మతత్పరత్వమును వర్ణింపఁ బడియున్నవి. మొదటినుండి తుది వఱకును గ్రంథమున శ్రీకృష్ణవిజయప్రతాపములును, తన్మాహాత్మ్యమును దాండవ మాడుచున్నవి. వీనిని బట్టి ఉత్తర హరివంశరచనమున నాచన సోమనాథుఁడుద్దేశించిన ప్రయోజనము మనకు సువ్యక్తమగుచున్నది. శ్రీకృష్ణనాయకమును, వీరరసప్రధానము నగు మహాప్రబంధమును సోమన రచింపనెంచెను. తత్ప్రయోజనముల కనుకూలము లగు కథలను మాత్రమే హరివంశమునుండి గైకొనెను. శృంగారాది ఇతర రసములు గౌణములుగా నచ్చటచ్చటఁ గన్పట్టును ఇందుధరోపాఖ్యానమునందును, ఉషా నిరుద్ధుల కేళీవినోదము లందును శృంగారరము గన్పట్టుచున్నది. శ్రీకృష్ణతపశ్చరణము నందును, హరిహర సమాగమము నందును, శాంతరసము గన్పట్టుచున్నది. ఇట్లే తక్కిన రసములు గూడ నందందు పోషింపఁ బడియున్నవి. వీరము మాత్రము ప్రధానరసము. సారస్వతమునకు సంబంధించినంత వఱకు సోమన యాశించిన ప్రయోజనమిది. సోమన వ్రాయఁ దలఁచినది వీరరసప్రధానమగు ప్రబంధముగాని, పురాణముగాదు. ప్రబంధోచితములగు వర్ణనలు గూడ ఉత్తర హరివంశమునఁ గాన వచ్చుచున్నవి. ఈ వర్ణనలను గూర్చి, ప్రతాపరుద్రీయమున నిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్
ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవాః
విప్రలంభోవివాహశ్చ కుమారోదయవర్ణనమ్
మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయాఅపి
వీతానియత్రవర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే
ఏషామష్టాదశానాం యైఃకైశ్చిదూనమపీష్యతే.

దీనినిబట్టి అష్టాదశవర్ణనలలో నొకటిరెండు లేకపోయినను, ప్రబంధత్వమునకు లోపములేదని మనకుఁ దెలియుచున్నది. ఉత్తర హరివంశమునందలి షష్ఠాశ్వాసాంత మున ద్వారవతీపుర వర్ణనము చేయఁబడినది. ఈ క్రింది పద్యములను జూచునది.

సీ॥ గంధర్వజయజయగాననాదంబులు
  శంఖారవంబులు సాము చేయ
ముత్యాలసేసలమొల్లంబుతోఁగూడ
  సురపుష్పవృష్టులు సొబగు మీఱ
ద్వారభాసురమణితోరణపంక్తితో
  విబుధజూటప్రభ వియ్యమంద
బర్హిర్ముఖారూఢభద్రసామజములు
  కేళిశైలంబుల గేలి సేయ

ఆ॥ సురభియుక్తధార సుకుమారమకరంద
సక్తియుక్తచిత్తషట్పదాళి
మధురనినదకలితమాన్యతరూద్యాన
మైనపురము చొచ్చె నచ్యుతుండు. ఉ. హరి. ఆ. 6 - 265

సీ॥ మానినీమంజులమంజీరకరరవ
  కేళీసరోహంసకీలితంబు
కామినీకాముకకలహప్రసాదన
  పండితశారికాభాసురంబు
సరసకథాలాపసంగీతసాహిత్య
  చతురశుకస్తోమసంచితంబు
అంగనాగండూషహాలాలసద్గంధ
  వకుళపుష్పావళీప్రకటితంబు

ఆ॥ విలసదగరుగంధవిస్ఫుటతరగంధ
మైనవివిధమందిరాంగణంబు
చూచి నెమ్మనమున నుడివడ నానంద
మంత కంత కుబ్బె నచ్యుతుండు. ఉ. హరి. ఆ. 6 - 266

సీ॥ గళితమదోదకగండస్థలీసంగి
మధుపఝుంకారాత్తమత్తగజము
హేషారవోద్ధతిపోషితనిస్సాణ
పటుహాభేరీధ్వానబహుళహయము
ప్రాకారచితరత్నబహువిధతరధామ
లిప్తప్రసాధనసమూహదీప్తతలము
ఫాలస్థలీకృత ప్రకటితాంజలిపుట
పరిచారికావళీభాసురంబు

ఆ॥ ద్వారఖచితరత్నతోరణోపాంతావ
లంబిమౌక్తికోపలసిత మైన
నగరి చొచ్చె శౌరి నానావిధానూన
వినుతిలసితహృద్వివేకుఁ డగుచు. ఉ. హరి. ఆ. 6 - 269

తృతీయాశ్వాసమునఁ బౌండ్రక వాసుదేవుఁడు హరాత్తుగ నర్ధరాత్రమున ద్వారకా నగరము పయి దాడి వెడలి ముట్టడించెను. ఈ వార్త విని బలరామ సాత్యకులు చతురంగ బలముతో సమకొంచి వారల నెదుర్కొనిరి. పోరు ఘోరంబుగా సాగు ఘట్టమునందు సూర్యోదయ వర్ణన మీ క్రింది విధముగా గలదు.

సీ॥ కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన
పురుహూతునిల్లాలి బొట్టనంగఁ
జక్రవాకములకుఁ జల్లఁగా మందు ద్రా
గించినచెంద్రపుగిన్నె యనఁగఁ
బార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్న
యలరుగెందమ్మికోహళి యనంగఁ
తొలిదిక్కు తొయ్యలి చెలులపైఁ జల్లంగ
నిండ ముంచినపైఁడికుండ యనఁగ

తే॥ మేరుధరణీధరంబుతో మేలమాడ
నుదయగిరిరాజు దల యెత్తెనో యనంగఁ
గ్రమముతో నించుకించుక గాన నగుచు
భానుబింబంబు గన్నులపండు వయ్యె. ఉ హరి ఆ 3 - 86

హంసడిభకోపాఖ్యానమున హిడింబుఁడను రాక్షసుని యస్తమయముతోఁ బాటుగ సూర్యాస్తమయమును సోమన రచించినాఁడు. ఆ వర్ణన మీ దిగువ నీయఁబడిన పద్యమునఁ జూడనగును.

సీ॥ కడపంగ రాకున్న కాలఖడ్గము చేతఁ
బగలింటితల నేలఁ బడినయట్లు
సాయంతనం బనుజాలరి జలధిలోఁ
బచరింప వల డిగ్గఁ బాఱినట్లు
పొడవైనయాకాశభూరుహంబున సంధ్య
గోయంగ గొల ద్రెవ్వి కూలినట్లు
చరమదిగ్బేతాళకరమున వరుణుండు
గడివెట్టఁ బోల పొట్ట నడఁగినట్లు
తే॥ కుంకుగుబ్బలిపొరకి కొప్పరించి
పట్టఁ జాలక వైచినబ్రద్దపరికిఁ
బాటియగుచు ముగురపొత్తుపళ్లెరంబు
భానుమండల మంతఁ జూపట్టు దయ్యె. ఉ హరి ఆ 4 - 271

బాణాసురకథలోనిందుధరోపాఖ్యానమునందు శోణితపురోద్యానమున శివపార్వతులొక్కనాఁడు విహరించినారు. ఆ సందర్భమున జలకేళి వనకేళ్యాదుల నతివిస్తరముగా సోమన వర్ణించియున్నాడు. ఆ పట్టమునందలి పద్యములఁ గొన్నింటి నిట నుదాహరించుచున్నాను.

## ఉద్యానవనవిహారవర్ణనము

సీ॥ కిసలయంబులతోడఁ గెంగేలు దడఁ బెట్టి
 విరులపై నఖకాంతి విజ్జరాల్చి
లేఁదీగలకుఁ దనూలీలఁ గానుక యిచ్చి
 గుత్తులుఁ బాలిండ్లు గొలిచి చూచి
చలిగాలి నిశ్వాససౌరభంబుల నాఁగి
 యళిపఙ్క్తిఁ గురులతో నలుక దీర్చి
పుష్పాళ్కు సెలగందములు వియ్య మందించి
 పూఁదేనెఁ జెమటల బుజ్జగించి
తె॥ తొడలు నన(టికంబంబులు మెడలుఁ బోఁక
బోదెలు నెలుంగులును బరపుష్టరుతులు
మాటలును గీరభాషలు మక్కళించి
చిగురుఁబోఁడులు వనకేళి చేయఁ జేయ. ఉ హరి ఆ 5 - 48

మ॥ సహకారాధిపుఁ గౌఁగిలించికొని వాసంతీలతాకాంత సా
రహరిద్రారసగౌరకేసరములన్ రంజిల్లుమాధ్వీకవా
ర్లహరీస్వేదము చూపఁ బట్టపగ లేలా యింతటన్ సిగ్గులే
దహహాయంచుఁదొలంగినవ్వేఁజెలిమాకైముద్దరాలయ్యెడన్.
ఉ హరి ఆ 5 - 50

మ॥ ఒకరామాతిలకంబు రత్నరుచితో నొప్పారుమందారకో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్ రాఁగాలతాసక్తచూ
చుకచేలాంచలయైమలంగివిడుమంచుం గేలు సాఁచెన్ ససా
యకమౌర్వీం దెగగొన్నమన్మథునిప్రత్యాలీఢపాదంబునాన్.
ఉ హరి ఆ 5 - 51

## జలకేళీవిహారవర్ణనము

చ॥ తలిరులఁజోఁకెనో దొనలఁదాఁకెనో తొండపుఁ బిండుఁబ్రాఁకెనో
పులినము లెక్కెనో కనకపుంగలశంబులుద్రొక్కెనో మెఱుం
గులగమిఁ జిక్కెనో యనఁ దగుం దలఁపంగఁ దరంగమాలికల్
మెలఁతలయంగసంగతులమీఁదికి మీఁదికి నాసచేయుచున్.
ఉ హరి ఆ 5 - 63

సీ॥ అరుణారవిందంబు లని మ్రొక్కెనో కాని
చిగురుటాకుల నింత సేర రావు
పులినంబు లని చాల బుజ్జగించెనో కాని
మరుచక్రముల నింత మరిగి రావు
చక్రవాకము లని సవరించెనో కాని
కరికుంభముల నింత గదియ రావు
గండు మీలని చాల గారవించెనో కాని
పూవుఁదూఁపుల నింత వొంది రావు
తే॥ తరఁగ లాత్మీయదనములద్దాయ లైన
చరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి
తరఁగ లింతులు పైకొన్నఁ దలఁకినట్లు. ఉ హరి ఆ 5 - 64

చ॥ అలఁతితరంగలుం దఱులు నంబురుహంబుమొగంబుషట్పదం
బులు నలకంబులున్ సుడియుఁబొక్కిలినెక్కుడువేడ్కసేయఁగాఁ
నెలఁతుకసంగడిం గమలి నింగిని ఝుట్టెడుమిన్నునీరిపైఁ
గ్రోలిచి భవాని చేర్చెఁ జనుగుబ్బలజోడుగ జోడుజక్కవల్.
ఉ హరి ఆ 5 - 65

చ॥ కరఁగినపూఁతచేఁ గనకకందుకకాంతి వెలుంగుచన్నులం
బిరిగొను దొడ్డముత్తియపుఁబేరులు వాయఁగ మన్మథాంకముల్
దరుణుల నంబికావిభుఁడు దార్కొనుచోఁ గనుచాటు మాటుగాఁ
దరఁగలు చల్లుశీకరవితానము మానము గావకుండునే.

ఉ హరి ఆ 5 – 66

పయి నుదాహరించినవి కాక ప్రబందోచితములగు మఱికొన్ని వర్ణనలును ఉత్తర హరివంశమునఁ గలవు. ఒక్క ద్వితీయాశ్వాసమునఁ దప్ప మిగిలిన కథల యందన్నింటను శ్రీకృష్ణుఁడు ఘోరయుద్ధముల నొనర్చి దుష్టశిక్షణమును శిష్టరక్షణమును గావించినాఁడు. యుద్ధవర్ణనములును ప్రాబంధిక వర్ణనలలో నొకటిగదా! నాచన సోమన కదనములనే కాక, యుద్ధసంరంభము, కదనరంగములను గూడ తనివిదీర విపులీకరించి వర్ణించినాఁడు. ఇట్టి వర్ణనముల నితఁడు సుదీర్ఘములగు వచనములందే రచించి యుండుట కాననగును. వీనియందు సోమన రచనా వైశిష్ట్యమును ప్రకటించు నట్టి యొకానొక మల్లయుద్ధవర్ణనమును గలదు. పరికింపుఁడు.

## మల్లయుద్ధవర్ణనము

వ. మఱియు వివిధంబు లగువిన్నాణంబుల నొడిచియు నెమ్ములు నలియఁ బొడిచియు మండి దాఁకించియుఁ గదలు సోఁకించియుఁ దల దల నాగించియు భుజంబులు భుజంబులతో స్రగ్గించియుఁ గక్షంబు కక్షంబుతో ఘట్టించియు వక్షంబు వక్షంబుతో ధట్టించియుఁ గరంబులు కరంబులతో నప్పళించియుఁ బిక్కలు పిక్కలతో నుప్పళించియుఁ జరణంబులు చరణంబులతోఁదాఁచియు నడుము లాగించివైచియు ఉలాయంబులు మలయుమాడ్కిఁ బులులు దలపడ్డపోలికఁ గరులు పోరాడు కయివడి సింగంబులు పెనంగుభంగి నుపతాయితో నళువాయి నిరువురుం జదిసియుం గుదిసియు నచ్చలంబునం జమురు చల్లినమంటల కయివడి బ్రత్తితాల్చినవడువున నిమ్మపండు నలంచినపగిదిఁ బాదరసంబు

మర్దించుపంతంబునఁ జోళంబు విఱుచుతెఱంగున మనసునం బలిమి లేక విసువక పరస్పరజయకాంక్షలం బరాక్రమించునవసరంబున.

ఉ హరి ఆ 3 - 70

ఉషాకన్య చెలికత్తెయగు చిత్రరేఖ తననేర్పుకలిమి, ననిరుద్ధుని దెచ్చి ఉషా నిరుద్ధుల సమాగమము నేర్పఱచినది. దైవనిర్ణయబలంబున సంఘటిల్లిన నాప్రేమికుల ప్రణయమట్టమున రతోత్సవంబును, దత్పూర్వఘట్టమున నుషాకన్య స్వప్నమును గని పరితపించు పట్టుల విరహమును గాననగును.

నరసభూపాలీయమను కావ్యాలంకార సంగ్రహము ననుసరించి, యష్టాదశ వర్ణ నములలో నొకట్టియగు దూత్యమునకు మాఱుగ దౌత్యము నంగీకరించినచో నుత్తర హరివంశమున హంసడిభకోపాఖ్యానమున జనార్దనుని రాయబారము మఱియొక ప్రబంధ లక్షణముగా భాసించును. కావ్యాలంకార సంగ్రహమున నీక్రింది పద్యము గలదు.

క॥ పురసింధునగర్త్వినశశి
సరసీవనమధురతిప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయనయ
విరచన యాత్రాజిదౌత్యవిభువర్ణనముల్[1]

నన్నెచోడుని కుమార సంభవమునఁ జెప్పఁబడిన పదునెనిమిది వర్ణనములలోఁగూడ దూత్యమనియే పేర్కొనఁబడి యున్నది. ఆ పద్య మీ దిగువ నుదాహరింపఁబడినది :—

క॥ వనజలకేళీరవిశశి
తనయోదయమంత్రగతిరతిక్షితి పరిణాం
బునిధిమధుఋతుపురోద్వా
హనగవిరహదూత్యవర్ణనాష్టాదశమున్[2] కుమార 1 - 44

1. కావ్యాలంకారసంగ్రహము : పుట 233. Second Edition 1959.
2. కుమారసంభవము : వావిళ్లప్రతి 1 - 44 పుట 9.

కైలాసపర్వతవర్ణనము, వేట, యుద్ధసంరంభము, నంతఃపురవర్ణనములును, ప్రబంధము లందుఁ దఱచుగఁ గన్పట్టునట్టివే. శ్రీకృష్ణుఁడు ఘంటాకర్ణున కింద్రపదమునిడి, తన్ను దర్శింపవచ్చిన సంయమీశ్వరుల వీడ్కొని, తపోదీక్షను గొనుటకయి, కైలాసమునకేగిన సందర్భమున కైలాసనగవర్ణనము గావింపఁబడినది. సుదీర్ఘ మగుటమూలముననను, జటిలములగు సంస్కృత సమాసముల ప్రయోగము మూలముననను, నా వర్ణనలలో నా పర్వతరాజ గాంభీర్యము ప్రస్ఫుటమగుచున్నది. (చూడుః అనుబంధము 3 (i)) పశుపతి వరప్రసాద సమ్మద భరితులయిన హంసడిభకుల వేట యత్యంత రమణీయ ముగా వర్ణింపఁబడినది. కరితురగరథపదాతులు వెంటరా వేటాడననువగు పరి కరములఁ గొనిపోవుటయు, వేఁట వివరములును నీ దిగువ పద్యముననను, గద్యముననను జూడనగును.

## వేఁటవర్ణనము

క॥ వెలివాఱును గాలురులును
వలలుఁ దెరలు దీమములును వడిఁ దీరిన కు
క్కలు నారెగోలలును మం
డలక్రోవులు వేఁట కారడంబుఁ బెనుపఁగన్. ఉ. హరి 4-22

వ. ఇవ్విధంబున నెగసినయిఱ్ఱి నాలుగుకాళ్ళనుం ద్రెవ్వ నొక్క మ్మున నేసి చనునెడ మఱియు నప్పటప్పటికిం జొప్పరుల వలన నుప్ప తిల్లిన చప్పుళ్ళకుఁ దెప్పరంబైనతుప్పలం దూఱుదుప్పులును (నిడువేఁటు కార్లు) (వేఁటుకుం) గడంగిన నడికి నడికి కడవారికి నెడగాక తొడిగిన యమ్ములనపడి పొరలుపిడుల విడువక చిడిముడి పడుకడఁతులును నీఁ టెలకుం బో టుబ్బక సూటిమెయి దాఁటియు నేట్లుచే వికుతాటుం బైన లేటి కదుపులును బిఱుంద 'రొప్పుచొాటిగాఱకుఁ గాక వెఱచఱచి పఱచు నెడ్లఁ దెఱపి నుఱికినతొఱుత్రొక్కునం గుక్కలచేఁ బఱిపఱి యైనయుఱు ములును గొంథఱుగొందఱు ముందటుం గొందలం బంది యందంద నందడిం గ్రిందుమీఁదుగా వైచినం జిందఱ వందఱులుగా మ్రందినక్షుందే

ళ్లును నేదెసఁ దొలంగినను నూదిపిఱిందిత్రాడై యాదిగొని పాదులవారిచే యాదులకాదులచే మూదలించిన సీదరంబులతోఁ బాదుకొనిన యేదులును నివ్వలవ్వలనుండి యెడత్రెవ్వకుండఁ ద్రవ్వినయోదంబులం బడి క్రొవ్వఱక మవ్వంబు నివ్వటిల్లం బట్టువడినచివ్వంగులునుం గలిగినం గనుంగొనుచు వెండియుఁ గ్రిఁగాలి నోలిం జాలుకొలిపినకాలువల లకుం బాలువడి లోలోపలం గళవళించియు దోడ్తోడ జోడెంపువలలకు లేటివేడెంబు చేసినం గూడఁబడియును మున్ను పన్నినకన్నెవలల సన్నసన్నం బోవక యన్నునం గన్ను దిరిగిపడి సన్నసున్నంబుగా దన్నికొనియును నడ్డగించి నించినయొడ్డువలలకు సడ్డించి వెడ్డునం బడక గడ్డుటికియు మృగంబు లనేకంబులు వొలియుటయును వేఁట చాలించి హంసడిభకులు నడవులం దిరిగి పరిశ్రాంతులై సేనాసమేతంబుగా మగుడం దలంచి మధ్యాహ్నసమయంబున. 4 - 29

ఈ యాశ్వాసముననే హంసడిభకులు తమ తండ్రిచే రాజసూయము చేయింప సమకట్టి, తదవసరమున సేయించిన జనార్దనరాయబారము విఫలమైన కారణముగా నారాజకుమారులు శ్రీకృష్ణునిపయి దండెత్తిరి. పుష్కరసరస్తీరమున తమ సేనల నాయత్త పఱచు విషయము నొక పెద్ద వచనమునందు విపులముగ రచించినాఁడు సోమనాథుఁడు.

మఱియు బాణాసురకథలో నుషాకన్య స్వప్నమునం గాంచిన యపురూప సుందరాకారుని వైనము కనుగొనుటకయి చిత్రరేఖ తన నేర్పున ముల్లోకంబులందలి మూర్తులం బటమున ముద్రించి, చనుదెంచు ఘట్టముననంతఃపురవర్ణనమొండు సేయఁబడినది. అంతఃపురవర్ణన మాంధ్రప్రబంధ విశిష్ట లక్షణ మనవొప్పును. కైలాసపతియగు నప్పరమేశ్వరుఁడే ప్రమథగణసేవితుండై స్వయముగఁ గాచు నయ్యసురరాజగు బాణాసురుని నగరిలోనుండు కన్యాంతఃపురవర్ణన మత్యంత రమణీయముగాఁ జేయఁబడినది. ( చూడు. అనుబంధము 3 (ii) )

కాని యింతకంటె నుదాత్తమగు ప్రయోజనము మఱియొకండు గలదు. ఈ యుత్తర హరివంశమునందు సోమన తీసికొనిన మొదటికథ నరకాసురవధ. రెండవ

కథ, తన కుమారుఁడు చనిపోగా నొక బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునభ్యర్థించుటయు, శ్రీకృష్ణుఁడా బ్రాహ్మణకుమారుల రక్షించుటయు నగుచున్నది. మూఁడవది మంటా కర్ణుని కథ. ఈ మూఁడు కథలును మొదటి రెండాశ్వాసములందును గలవు. మూఁడు నాలుఁగాశ్వాసములలో పౌండ్రక వాసుదేవ, హంసడిభకోపాఖ్యానములు గలవు. పంచమ షష్ఠాశ్వాసములయందు బాణాసురకథ కలదు. ఈ కథల నెంచికొని, వ్రాయుటలో నాచనసోమన, తనకావ్యమున నొక మహాప్రయోజనమును సాధించెను. దీనిని ప్రబంధధ్వని యందురు. ఈ ప్రబంధధ్వని యందలి తరతమ భేదమును బట్టియే, కవులయందలి తరతమభేదములు నిర్ణయింపఁబడుచున్నవి. ఈ ఐదుకథలలోని రహస్యమును విచారించినచో, వానిని గ్రహించుటలో సోమన పాటించిన యౌచిత్యమును, వానివలన సోమన సాధించిన మహాప్రయోజనములును వ్యక్తములగును. మొదటికథను విచారింతము. నరకుఁడు భూదేవికొడుకు. ప్రళయసముద్రమునుండి భూమిని యజ్ఞవరాహమూర్తి ఉద్ధరించునపుడు పుట్టినవాఁడని పురాణములు చెప్పుచున్నవి. మన పురాణములయందు మహార్థములు గర్భితములయి యున్నవి. ప్రళయార్ణవము భూమిని గ్రసించునపుడా భూమియందలి సర్వప్రాణికోటియు నశించి యుండును. భగవంతుఁడు భూమినుద్ధరించెను. ఆ యుద్ధరణ సమయముననే నరకుఁడు పుట్టినాఁడు. తరువాత మరల భూమిపయి ప్రాణికోటి సృష్టి జరిగినది. అనఁగా నరకుని జన్మసృష్టికిఁ బూర్వమే జరిగినదనుట. మన పురాణముల ప్రకారము ఇరువదియేడు మహాయుగములు నడిచిన తరువాత నిరువది యెనిమిదవ మహాయుగమునందలి ద్వాపరమున మహావిష్ణువు శ్రీకృష్ణుఁడయి యవతరించినట్లు తెలియుచున్నది. నరకుఁడు సామాన్య రాక్షసుఁడే యైనచో, నిన్నిమహాయుగము లేమి సేయుచున్నట్లు? కావున నిందెద్దియో మహార్థమిమిడి యుండును. దాని నీ విధముగా సమన్వయింప వచ్చును.

ప్రళయసముద్రమునుండి ధాత్రి సముద్ధరింపఁబడినపుడు భూమిలోనుండి పెద్ద మట్టిపెళ్లయొకటి యల్పగ్రహ పరిమాణము కలది విడిపోయి యంతరిక్ష ప్రదేశము దాటిపోయి యుండవచ్చును, అంతరిక్షమనఁగా వాయువు వ్యాపించి యున్నంత మేరలోని యాకాశము. ఈ మట్టిపెళ్ల సూర్యమండలమునకు ప్రాగ్దిశగా మింటిలోనికిఁబోయి పూర్తిగా నంతరిక్షమును దాటిపోక, భూమిచేతను నాకర్షింపఁబడక అన్నికోట్ల సంవత్సరము లూగాడుచుండి యది గగనమున నున్న స్వర్గలోకసన్నికర్ష గలుగుచుండి విడివడి ద్వాపరాంతమున భూగోళముతోడి సన్నికర్ష పొందుటకు రాబోవుచుండెను. కొన్ని

యాకాశమునందలి గోళములు పట్టుతప్పి పడిపోవుటయు కలదుకదా! ఈ నరకుఁడట్టి గోళము. ఇదియు మట్టిపెళ్ళ యగుటచేత నంతరిక్షమార్గమున వ్యాపించినచో భూమితోడి సంఘర్షణము మిక్కిలి యుత్పాతహేతువగును. ఈ యుత్పాతము నివారింపఁగల వాఁడెవ్వఁడు? శ్రీకృష్ణ దేవుఁడొక్కఁడే. ఆయనయే సాక్షాద్విష్ణుమూర్తి; అండపిండ బ్రహ్మాండముల కధినేత. ఆయన ప్రాగ్జ్యోతిషమున కరిగి, యామట్టి పెళ్లను ఛిద్రుపలుగాఁ జేసెను. ప్రాగ్జ్యోతిషమున కరుగుట యనఁగా నాకాశయానమున నంతరిక్షములోనికిఁ బోవుట.

ద్వితీయాశ్వాసమున రెండు కథలు కలవు. అందు మొదటిది మృతులయిన బ్రాహ్మణ బాలకులను శ్రీకృష్ణుఁడు బ్రతికించుట. శ్రీకృష్ణుఁడొకప్పు డొకనాఁడు దీక్షితుఁడయి యుండఁగా, నొక విప్రుఁడు వచ్చి, తన పుత్త్రుని రక్షింపుమని యర్థించెను. శ్రీకృష్ణునానతిని గైకొని యర్జునుఁడు మృత్యువును శిక్షింతునని పోయి సమర్థుఁడు కాక తిరిగివచ్చెను. మరునటి దినమునఁ గృష్ణార్జునులు విప్రునితోఁగూడ రథముపయి బయలుదేరిరి. మేరువు, వర్షాచలములను దాటి, సముద్రుఁడు మార్గమీయఁగా నడచి, బహుపర్వతముల నతిక్రమించిరి. అచ్చట 'అత్యంత భయంకరకర్దమసంతమసంబున' రథము సాగకుండినది. అది చీకటికొండ చందమునఁ దోచినది. అత్తిమిరంబును శ్రీకృష్ణుఁడు సఱకివైచెను. అప్పుడచ్చోట నద్భుతాకారుఁడగు పురుషుఁడొకఁడు తోఁచెను. అర్జునుని, విప్రుని రథమున నునిచి, జగన్నాథుఁడగు నా జనార్దనుఁడా తేజములోనికిఁ బోయెను. బ్రాహ్మణుని చనిపోయిన నలువురు కుమారులను దెచ్చెను. ద్వారవతినుండి యంతదూరము పోవుట కొకపూట పట్టినది. కాని 'వచ్చితిమి క్షణమ్మున ద్వారవతికి మేము' క్షణమ్ములో తిరిగివచ్చిరి. అప్పుడర్జునుఁడు మహాద్భుతచిత్తుఁడయి యీ యాశ్చర్యమేమని శ్రీకృష్ణు నడిగెను. దానికి శ్రీకృష్ణుఁడు చెప్పిన సమాధానమిది: ఆ తేజోమయ మయిన రూపము శ్రీకృష్ణదేవుని యొక్క ప్రకృతియందు జరాచరంబు భాసించు నొక చెరువు. దానిలోనున్న యందతమసము పరమేశ్వరుఁడు. భేదకుఁడునుతానే. సర్వంబు నుచిత గమ్యము. ఇది రహస్యము. ప్రణవము తనమూర్తి. "అత్యంత నియతమతికిఁదప్ప నీ మంత్రి మొరులకుఁ దగదు తెలుప." దీనివలన నేమి తెలిసినది? ఇది యోగమూలము. యోగీశ్వరేశ్వరుఁడయిన శ్రీకృష్ణదేవుఁడే చేయఁగలఁడు. ఇది ప్రణవ విద్యోపాసకులకు మాత్రమే తెలియఁగల

సర్వజ్ఞుండగు నీమహాకవి, శ్రీకృష్ణనాయకముగ నొక ప్రౌఢప్రబంధమును రచించె ననుట సమంజసము. కావున నాచన సోమనాథుఁడు "ఉత్తర హరివంశము" ను మాత్రమే రచించెను.

---

ఏబదియవ పుట అధస్సూచికలో పేర్కొనఁబడిన సంస్కృత హరివంశ ప్రతుల వివరములు :—

1. గంగా విష్ణు శ్రీకృష్ణదాసు లక్ష్మీవేంకటేశ్వరప్రెస్సు, కల్యాణిసగరము, బొంబాయి రాష్ట్రము. శా. శ. 1833.
2. ముంబయ్యాం శ్రీకృష్ణదాసాత్మజ క్షేమరాజశ్రేష్ఠినా శ్రీ వేంకటేశ్వర ముద్రణాలయే ముద్రితమ్, బొంబాయి. శా. శ. 1848.
3. నీలకంఠుని భారతభావదీపముతో రామచంద్రశాస్త్రి కింజవాడేకర్ చే పరిష్కృతము. చిత్రశాలాప్రెస్సు, సదాశివపేట, పూనాసిటీ, క్రీ. శ. 1936.
4. గీతాప్రెస్సు, గోరక్‌పూర్ వారిచే ప్రకటింప బడినది. [హిందీ తాత్పర్యముతో] క్రీ. శ. 1959.

# సోమనాథుని బిరుదములు

ఉత్తర హరివంశమున( బ్రత్యాశ్వాసాంతము సందును గన్పట్టు గద్యలో "శ్రీ మత్సకల భాషాభూషణ, సాహిత్యరసపోషణ, సంవిధానచక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీనగుణసనాథ" అను బిరుదములు గానవచ్చుచున్నవి. వీనిలో సకల భాషాభూషణ బిరుదము సోమనకుఁగల బహుభాషాపాండిత్యమును వ్యక్తీకరించును. సామాన్యముగఁ బూర్వకవులందఱును సంస్కృతాంధ్రములందసమాన పాండితీప్రతిభలు గలవారే. నన్నయగారి "ఉభయభాషాప్రౌఢి," శ్రీనాథాదులచే బహుధా ప్రశంసింపఁ బడినది. తిక్కనగారు తనకుఁగల ఉభయభాషాశిల్పరచనా చమత్కృతిని నిర్వచనోత్తర రామాయణమునఁ జెప్పికొనియున్నాడు. దగ్గుబల్లి దుగ్గన తన నాసికేతూపాఖ్యానమున శ్రీనాథునకుఁ గల సంస్కృత ప్రాకృతశౌరసేని ముఖ్యభాషాపరిజ్ఞాన పాటవము నుగ్గడించి యున్నాఁడు. దీనిని బట్టి శ్రీనాథునకు సంస్కృతాంధ్రములందేగాక ప్రాకృత భేదములగు శౌరసేన్యాదుల యందపార పాండిత్యము గలదని వ్యక్తమగుచున్నది. హుళక్కి భాస్కరాదులకు అష్టభాషలయందు పాండిత్యము గలదని వారి గద్యలను బట్టి తెలియుచున్నది. శ్రీకృష్ణదేవరాయలకుఁగల బహుభాషాపాండిత్యము చారిత్రకమగు సత్యము. అనఁగా చరిత్రకారులు కూడ నద్దాని నంగీకరించిరనుట. ఇఁక నాచన సోముఁడు తాను సకలభాషాభూషణుఁడనని చెప్పికొనుటలో నాతనికిఁగల బహుభాషా పాండిత్యము నా బిరుదములో నాతఁడు వ్యక్తముచేసిన మాట వాస్తవమే. కాని యా భాషలెవ్వియో, వాని సంఖ్యాపరిమితి యెట్టిదో మనకు స్పష్టము కాలేదు. గ్రంథమును బట్టి చూచినచో నాతఁడు సంస్కృతాంధ్రములయందసమాన పాండిత్యముగలవాఁడను మాట తేటతెల్లమగుచున్నది. కాని యీతనికిఁ గల యితర భాషాపాండిత్యమును సూచించు పట్టములుగాని, పద్యములుగాని, పదములుగాని కానరావు. ఈతని కాల నిర్ణయమునకై యింతవఱకు నందఱు నుపయోగించుచున్న బుక్కరాయల శాసనము నందుఁగూడ "అష్టభాషా కవిత్వ శ్రీ వాణీవిజిత సంపదే" అని యీతనిఁ గూర్చి చెప్పఁ బడియున్నది. దీనిని బట్టి నాచన సోమన గూడ హుళక్కి భాస్కరాదుల వలెనే అష్ట భాషాపాండితీవిభూషితుఁడని నిర్ణయింపనగును. ప్రాయు గ్రంథ మాంధ్రగ్రంథము

కావునను, దానికి మూలమగు గ్రంథము కూడ సంస్కృతము నందే కలదు కావునను, సోమన తన యుత్తర హరివంశమునఁ దనకుఁగల అష్టభాషాపాండితీప్రకర్షను జూపుట కిష్టపడకపోయి యుండవచ్చును. మఱియు నాంధ్రవాఙ్మయమున సన్యభాషాపదము లను విరివిగా వాడిన వారిలోఁ బ్రథముఁడు శ్రీనాథుఁడే యని చెప్పవచ్చును. శ్రీనాథు నకుఁ బూర్వమునఁగల మహాకవులెవ్వరును అన్యదేశీయములయెడ మక్కువ జూపిన వారు కారు. నాచన సోముఁడు సన్నయ తిక్కనల మార్గము ననుసరించినవాఁడు. అందును గవిబ్రహ్మ యెడ నాతనికిఁగల గౌరవమపారము. అందులకే గద్యయందుఁ గూడ "ఇది శ్రీ మదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర, బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథాసంతరంబున" అని సోమయాజిని స్మరించియున్నాఁడు. మఱియు, నాంధ్రవాఙ్మయమునఁ దిక్కన తరువాతఁ జెప్పఁ దగినకవి నాచన సోముఁడే యను నాత్మప్రశంసయు నిందుఁ గానవచ్చుచున్నది. కావున సోమనకు పరోక్షగురువు తిక్కనయే తిక్కన తన నిర్వచనోత్తర రామాయ ణముసగాని, మహాభారతమునగాని అన్యభాషాపదములను వాడియుండలేదు. తిక్కన మార్గముననే సోమనయు నడచెననుటలో విప్రతిపత్తియును లేదు.

## సాహిత్యరసపోషణ బిరుదసార్థక్యము

సాహిత్యరసపోషణము రెండవది. నిజమాలోచించినచో సోమనాథునకుఁగల బిరుదములలో సాహిత్యరసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీనగుణసనాథ బిరుదములే ముఖ్యములని చెప్పవచ్చును. వీనిని బట్టియే యాతని సంపూర్ణ కీర్తి బిరుదము సార్థక మగుచున్నది. "సాహిత్యరసపోషణ" బిరుదమును గూర్చి చర్చించుటకు ముందు సాహిత్య, రస శబ్దముల నిర్వచన మావశ్యకమయి యున్నది. సామాన్యముగ వాఙ్మ యము, సారస్వతము, సాహిత్యము నను మూఁడు పదములు పర్యాయపదములుగ వాడఁబడుచున్నవి. కాని శబ్దతత్త్వమునుబట్టి పరిశీలించినచో నామూఁడు పదములును సమానార్థకములుగావనియు, నయ్యవి వ్యక్తీకరించు భావముల యందించుక భేదము గలదనియు స్పష్టమగును. వాక్ శబ్దముకంటె మయట్ ప్రత్యయము పర మగునపుడు వాఙ్మయమను పదము సిద్ధించు చున్నది. మయట్ ప్రత్యయము వికారప్రాచుర్యార్థ ములయందు వాడబడును. ఇఁట వికారార్థమున బ్రయుక్తమైయున్నది. వాగ్రూపము కలది లేదా వాగ్వికారమైనది సర్వమును వాఙ్మయమే యగుచున్నది. అనఁగా మనము మాటాడు మాటలును, వ్రాయు వ్రాతలును, సర్వమును వాఙ్మయ శబ్దవాచ్యములే

యగుచున్నవనుట. కాని రాజశేఖరుఁడు తన కావ్యమీమాంస యందు వాఙ్మయ పద మునకుఁగల యీ విపులార్థమును పరిమితము గావించినాఁడు. "తద్ద్విధా - శాస్త్రకావ్య భేదేన"—అను వాక్యమునందు వాఙ్మయము శాస్త్రకావ్యభేదమున ద్విధా విభజింపఁబడి యున్నదని యాతఁడు స్పష్టము గావించియున్నాఁడు. రెండవది సారస్వతమను పదము "సరస్వత్యాః ఇదం సారస్వతమ్"—అని తన్నిర్వచనము. లేదా "సర స్వతీ దేవతా యస్య సారస్వతమ్"—అనియుఁ జెప్పవచ్చును. "సరస్వతీ సంబంధ మగునదంతయు సారస్వతము లేదా సరస్వతీ దేవతాకమగునది సారస్వతము" అని పై నిర్వచనముల కర్థము. ఈ నిర్వచనము గూడ వాఙ్మయ నిర్వచనము వలెనే విపు లార్థ సూచక మగుచున్నది వాగ్దేవతయే సరస్వతి కావున వాగ్రూపమంతయు సర స్వతీ దేవతాకమే యగుచున్నది. నేఁడు వాడుకలో మాత్రము రాజశేఖరుఁడు చెప్పిన కావ్యవాఙ్మయమునకుఁ బ్రత్యామ్నాయముగనే సారస్వతమను పదము ప్రయుక్తమగు చున్నది. ఆంధ్రసారస్వతమనునపుడు ఆంధ్రభాషలో వ్రాయఁబడిన కావ్యములనియే యర్థము చెప్పవలసియున్నది. అనఁగా సారస్వత పదముగూడఁ బరిమితార్థముననే ప్రయుక్తమగు చున్నదనుట. మూఁడవ పదము సాహిత్యము. "హితేన సహితమ్ సాహిత్యమ్" "సహితస్య భావః సాహిత్యమ్" అని తన్నిర్వచనము. హితముతోఁ గూడినది సహితము సహితముయొక్క భావమే సాహిత్యము. కాని యీ నిర్వచనము వలన వస్తుస్వరూపము సమగ్రముగ వ్యక్తముకాలేదు. హితమనఁగా నెట్టిది ? అను ప్రశ్న మఱల మిగిలియేయున్నది. ఈ హితశబ్దమునకు పలువురు పలువిధములగు నర్థములను జెప్పియున్నారు. "హితం మనోహారిచ దుర్లభం వచః" అను భారవిసూక్తి యొకండు గలదు. హితమగునది మనోజ్ఞము కాఁజాలదు. మనోజ్ఞమగునది హితము కాఁజాలదు. తొలుదొల్త నాహ్లాదమును గల్గించి యనంతరము దుఃఖహేతువగుట మనోజ్ఞతాలక్షణము. తొలుత నప్రియమైన ననంతర కాలమున సౌఖ్యహేతువగునది హిత మనఁబడును. దీనిని బట్టి చూచినచో పథ్యమే హితమని చెప్పవలెను. ఈ హితమునే గీతాచార్యుఁడు సత్త్వగుణ సంబంధియగు సుఖముగఁ జెప్పియున్నాఁడు.[1]

---

1. శ్లో॥ యత్తదగ్రేవిషమివ పరిణామేఽమృతోపమం
తత్సుఖం సాత్త్వికంప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజం
విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽ మృతోపమం
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్.

భగవద్గీత : అష్టాదశోధ్యాయము 37, 38

సృష్టియంతయు సత్త్వరజస్తమోగుణాధీనము. మానవులందఱి యందును గూడ నీ మూఁడు గుణములును గన్పట్టుచుండును. అజ్ఞానజన్యము తమస్సు; రాగాత్మకము రజస్సు; జ్ఞానఫలము సత్త్వము. ధూమ విరహితమయి కేవలము జ్యోతివంటిది సత్త్వగుణము; ధూమసహితమగు జ్యోతివంటిది రజోగుణము; కేవలధూమమువంటిది తమోగుణము. కేవలము తమోగుణము జడత్వలక్షణము గావున నందెట్టి సృష్టియు నుండఁజాలదు. రాగాత్మకమగు రజోగుణమునందే సృష్టియంతయును జరుగును. జరిగిన సృష్టికి ఉన్నతత్వము గల్గించునదియే సత్త్వము ఈ సత్త్వ సంబంధమగు సుఖమే హితముగఁ బరిగణింపఁబడుచున్నది. అనఁగా ఉన్నదానిని ఉన్నతోన్నతమగు స్థానమునకుఁ గొనిపోవునది హితమనుట. మానవుఁడు పెక్కు గ్రంథములను పఠించును. పఠించిన గ్రంథములన్నియు నాతని నున్నతస్థితికిఁ గొనిపోఁజాలవు కొన్ని గ్రంథములను బఠించుట వలన నాతనియందలి పశుత్వము ప్రకోపించును. కొన్ని గ్రంథములను బఠించుట వలన నాతనియందు దివ్యత్వము శోభించును. మానవుని యందుఁ బ్రకృతిసిద్ధముగనున్న పశుత్వమును బరిహరించి, అతనిని దివ్యత్వమునకుఁ గొంపోవునదియే సాహిత్యమనఁబడును. సాహిత్యమను పదమునందలి హితశబ్దమున కింతటి విపులార్థము కలదు. అట్టియెడ నీ సాహిత్యశబ్దము గూడ విపులార్థ సూచకమే యగుచున్నది. చతుర్వేదములును, శిక్షావ్యాకరణాది వేదాంగములును, అష్టాదశ పురాణములును, తదుపపురాణములును, షడ్దర్శనములును, కాళిదాసాది మహాకవి కృతికావ్యములును సాహితీశబ్దవాచ్యములే యగుచున్నవి. కాని యింతటి విపులార్థమున నీ పదము నేఁడు ప్రయుక్తమగుచున్నట్లు కానరాదు. రాజశేఖరుఁడు చెప్పిన కావ్యవాఙ్మయమే నేటి సాహితీపదమున సూచింపఁబడుచున్నది. నేఁడు వాఙ్మయ మన్నను, సారస్వతమన్నను, సాహిత్యమన్నను కావ్యజాలమనియే యర్థము. మఱి సాహిత్యరసపోషణ బిరుదము నందలి సాహితీ శబ్దమునకుఁగూడ కావ్యజాలమనియే యర్థము చెప్పినచో నా బిరుదమునకుఁ గావ్యమునందలి రసమును బోషించు వాఁడని యర్థమేర్పడును. కవులందఱును రసపోషకులేకదా! రసప్రధానముకానిది కావ్యము కాదుగదా! అట్టియెడఁ బ్రత్యేకముగ నీ బిరుదమును జెప్పికొనుటలో సోముని యుద్దేశ మేమి? అను ప్రశ్న కలుగుట సహజము. సోమన యిట సాహిత్యశబ్దము నేటి పరిమితార్థమున వాడలేదు. అనఁగా నాతనికా బిరుదము నిచ్చినవారు నేటి పరిమితార్థమున వాడలేదనుట. ఇచట సాహిత్యశబ్దమునకు మొదట చెప్పఁబడిన విపులార్థమే యన్వయించును.

ప్రబంధరచనాప్రణాళిక :

హరివంశము సంస్కృతమున ఖిలపురాణము. మీఁదఁ జెప్పినయట్లు పురాణము లన్నియు హితకోటిలోనే చేరును. కావున నీయది సాహితీ గ్రంథమగుచున్నది. కాని పురాణములు కథా ప్రధానములు. కావ్యముల వలె రసప్రధానములు కావు. కథా ప్రధానమగు పురాణమును గూడ రసప్రధానమగు కావ్యముగ సంతరించు నేర్పు సోమునకుఁ గలదని సాహిత్యరసపోషణ బిరుదము వ్యక్తీకరించుచున్నది. మఱి సోముఁడు హరివంశమును సమగ్రముగ నాంధ్రీకరింపలేదుకదా! రసవద్ఘట్టములను గొన్నిఁటిని మాత్రము గైకొని ప్రబంధీకరించి యున్నాడు. అట్టియెడ సాహిత్యరస పోషణ బిరుదమునకు మీఁది యర్థమెట్లు పొసఁగును? అని కొందఱు సందేహింప వచ్చును. ఈ విషయము మున్ముందు విపులముగఁ జర్చింపఁబడును. సంగ్రహముగ మీఁది ప్రశ్నలకు సమాధానమిది. హరివంశముసందలి రసవద్ఘట్టములను గొన్నిఁటిని అలవోకగాఁ గైకొని సోముఁడు హరివంశమును రచింపలేదు. సోముని హరివంశమున సంస్కృత హరివంశగతార్థమంతయు బిండీకృతమై యున్నది. కథాప్రధానములగు పురాణములయందు ఒక్క సత్యమును బోధించుటకు పెక్కుకథలు కల్పింపఁబడును; ఒక్క తత్త్వమును బ్రతిపాదించుటకు భంగ్యంతరమున బహువిధములగు నర్థ వాదములు గల్పింపఁబడును. స్త్రీశూద్ర ద్విజబంధువులకు వేదార్థములను బోధించుటకై పురాణములు కల్పింపఁ బడినవి కావున నిట్టిమార్గమును బురాణకర్తలు గైకొనినారు. అనఁగా నల్పబుద్ధులకు భంగ్యంతర ప్రబోధక మావశ్యకమనుట. సోమన తన యుత్తర హరివంశమున నీ భంగ్యంతర బోధనావిధానమును బరిహరించియున్నాఁడు. సంస్కృత హరివంశమునందలి యేయే ఘట్టములను గైకొనినచోఁ దత్పురాణ ప్రతిపాదితతత్త్వము సమగ్రముగ వ్యక్తమగునో ఆయా ఘట్టములను మాత్రమే గైకొని ప్రబంధోచితమగు మార్గమున తన గ్రంథమును రచించినాఁడు. కావున ఉత్తర హరివంశము, హరి వంశమునందేకదేశము మాత్రమే యనుకొనుట పొరపాటు. పురాణమగు హరివంశ మును రసవ్యంజకముగ సోముఁడు సంతరించెను. కావుననే యాతనికి సాహిత్యరస పోషణ బిరుదము అన్వర్థమగుచున్నది.

ఇది యొక యర్థము. సాహిత్యశబ్దమున కింతటి విపులార్థమును గ్రహింపక సామాన్యార్థమును గూడ గ్రహింప వచ్చును. అట్టి యెడ సాహిత్య శబ్దమునకు

"కావ్యజాలము" అను సామాన్యార్థమును గైకొనవచ్చును. అట్టియెడ నీ బిరుదమున "రసవ్యంజకములుగా కావ్యములు వ్రాయువాఁడు" అను నర్థము వచ్చును. కవులం దును రసపోషణము గావించువారే. కాని తత్పోషణార్థము వారవలంబించు విధ ములు వేఱగును. రసపోషణార్థము సోమన యవలంబించు మార్గమునకొక వైశిష్ట్యక గలదు. ఆ మార్గమనితర కవి సాధారణమై ప్రత్యేకలక్షణలక్షితమై యొప్పుచుండున అందువలనఁ గూడ నీతని సాహిత్యరసపోషణ బిరుదమన్వర్థమగుచున్నది. మఱియ నీతని సాహిత్యరసపోషణ బిరుదమును, నవీనగుణసనాథ బిరుదమును ఒండొంటిత గలసియే యుండును. ఈతని కవితకుఁగల నవీనగుణసనాథత్వమే యాతని సాహి రసపోషణమందలి వైశిష్ట్యమనియుఁ జెప్పవచ్చును.

## గడుసుపోకడలు :

భావమొక్కటియే యయ్యు తద్వ్యక్తీకరణ సామర్థ్యమును బట్టి తన్నైశిత్యమ మారుచుండును. భావవ్యక్తీకరణ విషయమున నాచన సోమనాథుఁడవలంబించ మార్గములు పెక్కులు. పదగతియందును, భావగతియందును జిగియు బిగియుఁ జెడకుండ గడుసుపోకడలు పోవునేర్పు సోమనకు మిక్కుటముగాఁ గలదు. నరకుఁడు సమస్తదేవతల జయించి దిగ్విజయము గావించెను. ఈ యర్థమును వ్యక్తీకరించుటలో సోమన పోయిన గడుసుపోకడ లీ క్రింది పద్యమున వ్యక్తమగును.

మ॥ ధనదాంతఃపురతారహారములు యాదఃపాలబాలాఘన
స్తనకాశ్మీరము ధర్మరాట్కులవధూసంవ్యానకౌశేయమున్
దనుజేంద్రారి వరావరోధదయితాధమ్మిల్ల మాల్యంబులున్
గినుకం దెచ్చిఘటింపఁ జూచు జయలక్ష్మీ నిత్యనైపథ్యమున్.

ఉ. హరి. 1 – 16

కుబేరుని, వరుణుని, యముని, ఇంద్రుని జయింపవలెనను నౌత్సుక్యము నరకు నకుఁ గలదు. ఈ యర్థమునే భంగ్యంతరమున సోమన చెప్పినాఁడు. జయలక్ష్మిని నూత్నవస్త్రభూషణాదుల నలంకరింపవలెనని నరకుని యభిప్రాయము. వాని కొఱ కన్వేషణము ప్రారంభించెను. కుబేరాంతఃపురమునఁ గల యంగనలు ధరించు తార

హారములు వానికి నచ్చినవి. వరుణుని స్త్రీలు తమ కుచములపై వ్రాసికొనియెడు కాశ్మీరము గూడ నాతనికి రుచించినది. యముని యంతఃపురకాంతలు ధరించు పట్టుపుట్టములును, ఇంద్రుని ప్రియురాండ్రు ధమ్మిల్లముల యందు ధరించు మాల్యము లును నాతనికి నచ్చినవి. ఈ వస్త్రమాల్యభూషణములను గైకొని, జయలక్ష్మి నిత్యానై పథ్యమును గావింప నరకుఁడువ్విళులూరినాఁడు. "మీఁదఁ జెప్పఁబడిన దేవతలను నరకుఁడు జయింపనెంచెను" అనునదియే పద్యభావము. ఈ భావమును భంగ్యంతర ముగాఁ జెప్పుటలో సోమన సాధించిన ప్రయోజనములు పెక్కులు గలవు. ఈ మాల్యాంబరాదులను ఆ దేవతాసార్వభౌములను యాచించి నరకుఁడు సంపాదింప నూహింపలేదు. వారిపై నరకునకుఁ బ్రత్యేకమగు వైరము కలదు. అందులకే "గినుకందెచ్చి" అని కవి చెప్పియున్నాఁడు. ఈ కినుక సహజము, నైమిత్తికము గూడ నైయున్నది. రాక్షసుఁడు గావున దేవతలతోడి సహజవైరమాతనికిఁ గలదు. బ్రహ్మ వరగర్వితుఁడు గావునఁ దన బలపరాక్రమముల వ్యక్తీకరించి దిక్పతుల నోడింపవలయు ననెడి యుత్సాహమాతనికిఁ గలదు. మఱియొక విశేషము : జయము తన్నే వరించు నను నిశ్చితాభిప్రాయము కూడ నరకునకుఁ గలదు. జయలక్ష్మి యున్నప్పుడే గదా తన్నిత్యానైపథ్య సంఘటనము! కావున జయలక్ష్మి తన్నే వరించునను స్థిరనిశ్చయము నరకునకుఁ గలదను మాటకూడ నిందే ధ్వనితమగుచున్నది. ఇట్లు ధ్వని ప్రధానముగా ప్రతిభావమును వ్యక్తీకరించు నేర్పు సోమునకుఁ గలదు.

## వ్యంగ్యవైభవము :

ఉ॥ శూలి విలోకనానలము సోఁకు రతీశుఁడెఱుంగుఁ గాన య
బ్బాలమనంబుతో విరహపావకదాహము నోర్చె నన్న న
ల్లేల హొసంగు దేహము దహించిన యంతటితో మనోజుఁడై
గాలియ చిక్కెఁగానఁ జెడఁగాలఁడువో యెటువంటి మంటలన్.

ఉ. హరి. 5 - 121

ఈ పద్యమున బాణుని పుత్రియగు నుష యనుభవించెడు విరహము వర్ణింపఁ బడి యున్నది. ఆమెను విరహమగ్నివలె దహించుచున్నది. విరహమునకుఁ గాత కుఁడు మన్మథుఁడు. అట్టియెడ మన్మథుఁడు విరహాగ్నియందుఁబడి దగ్ధము కావలెను

గదా! అట్లు కాలేదు. ఉపరి విజృంభించుచున్నాఁడు. దీనికిఁ గారణమును మొదట నొక విధముగా నూహించినాఁడు కవి. మన్మథుఁ డొకప్పుడు ముక్కంటి కంటిమంటల కెఱయైనాఁడు. తద్భీషణానలమున కోర్చిన రతీశుఁడు విరహానలమును సహించుట కష్టతరముగాదు. కావుననే సహింపఁగలిగినాఁడు ఇదియొక యూహ. కాని యీ యూహ కవికి నచ్చుటలేదు. శూలి కంటిమంటలలో మన్మథుఁడు దగ్ధమే యైనాఁడు. అప్పటి యాతని దేహమంతటితో నంతరించినది. కాని దహనానంతరము మన్మథుఁడు మనోజుఁడైనాఁడు. ఇఁకనెట్టి మంటలకును గాలని శరీరమును ధరించినాఁడు. కావుననే ఉషాబాలయందు క్షణక్షణ ప్రవర్ధమానమగుచున్న విరహానల శిఖలు మనోజుఁడగు మన్మథుని దహింపలేకున్నవి. అనఁగా ఉషాబాల మదనానలదంద్యహ్యమానమానసయై యున్నదని భావము. ఈ పద్యమున తొలుత మన్మథపహసము భంగ్యంతరమున సూచింపఁబడినది. "శూలి విలోకనానలము సోఁకు రతీశుఁడెఱుంగు" అని గడుసుగాఁ జెప్పినాఁడు కవి. ఈశ్వరుఁడు తన నయనాగ్నిచే మన్మథుని దహించిన మాట వాస్తవమే. కాని యా మన్మథుఁడే మనోజుఁడై తన్ను దహించిన యా ముక్కంటినే జయించి పర్వతరాజపుత్రికి దాసుని గావించినాఁడు. వారిరువురి ప్రణయ కేళీవిలాసములను గాంచియే ఉషాకన్య మగని కూరిమిపై మనసుపడినది. విరహాగ్నికి లోనైనది. తొలి నుండియు మన్మథునకుఁగల ప్రజ్ఞ యిచ్చట కూడ స్పష్టమైనది. అసల సంస్పర్శన మున మదనుఁడు విజృంభించునే కాని దగ్ధుఁడు కాఁడు. మన్మథుని దహించితినను కొన్న శూలియు తుదకు మన్మథప్రతాపమునకే లోనైనాఁడు. అట్లే ఉషాబాల విరహానలము కూడ మన్మథుని దహించుటకు మాఱుగ తద్విజృంభణమునకే తోడ్పడినది. ఇందు మన్మథ ప్రతాపము వ్యంజితమగుచున్నది.

**అలంకారధ్వని :**

లోకోత్తరములగు నలంకారములను గల్పించి, మనోజ్ఞములగు భావములను వ్యంజింపఁజేయు శక్తి సోమన సొమ్ము. ఈ క్రింది పద్యమును దిలకింపుడు.

**తే॥** ఎసఁగు సంతాపభరమున నిట్టునట్టుఁ
బొరలు శయ్యాతలంబునఁ బువ్వుబోఁడి
తివురువిరహానలంబున దివ్వెలెత్తఁ
జిత్తజాతుండు వత్తిఁదాల్చిన విధమున. ఉ. హరి. 5 - 129

ఇందును ఉషాకన్య విరహమే వర్ణింపఁబడినది. ఉషాకన్య విరహభరమున శయ్యాతలముపయి నిటునటు కదలుచున్నది. ఈ దృశ్యము నుత్ప్రేక్షించి చెప్పెఁనాడు కవి. ప్రమిదలోని దీపము కొంచెము తగ్గుచున్నచో నందలి వత్తి నిటునటు కదల్చి ముందటికి త్రోయుదురు. అప్పుడు దీపశిఖ చక్కఁగ వెలుగును. చిత్తజాతుఁడు విరహానలమున దివ్వెలెత్తఁ దలఁచినాఁడు. ఆ దివ్వెకు వత్తి ఉషాకన్యయే. శయ్యపయి నిటునటు బొరలుచున్నప్పుడామె శరీరము కదలుచున్న వత్తివలెఁ గన్పట్టుచున్నది. దివ్వె వత్తిని గాల్చివేయును. కాని వత్తి లేకున్నచో దివ్వెయే లేదు. విరహానలము కూడ నట్టిద. ఎవరి నాశ్రయించుకొని విరహానలము సముద్భూతమగునో వారినే యది పీల్చి పిప్పిచేయును. మఱి దీనిని వదల్చుకొనరాదా ? అన్నచో, "చిత్తజాతుఁడెత్తిన దివ్వెయద్ది", అని సమాధానము. చిత్తమున్నంతకాలము చిత్తజాతుని వదలించుకొను టెట్లు? అది యనుభవింపక తీరని యొక మహావ్యథ. కాని యీ పద్యమున నింకొక స్వారస్యమున్నది. దివ్వెలేని వట్టి వత్తికి ప్రాధాన్యమేమి కలదు ? వట్టి వత్తి చీకటిని బోగొట్టఁజాలదు. కావున నీ విరహతాపము నిజముగా జీవితమున కొక వెలుగు. ఆ వెలుగునే పార్వతి యామెకుఁ బ్రసాదించినది. ఆ వెలుఁగులోనే ఆమె యానంద మనుభవించుచున్నది. ఒకవంక బాధాకరమయ్యు నింకొకవంక ఆ బాధయందే సంతోషమును సంతరించు శక్తి విరహమున కున్నది. ఈ మహార్థమంతయు నింత చిన్న పద్యములో నొక్క యలంకారద్వారమున వ్యంజింపఁజేసినాఁడు సోమన. అలంకార ధ్వని కిది యుదాహరణము.

## నిగూఢార్థపదప్రయోగవైశిష్ట్యము :

నిగూఢార్థములను బొసఁగించి సాహితీరసపోషణ గావించుటలో సోమన దిట్ట. మహర్షులు శ్రీకృష్ణునకు నరకాసురుని దుశ్చేష్టలను జెప్ప నీక్రిందిపట్టమున నిగూఢములగు భావములు పొసగింపఁబడినవి.

మ॥ అరుణాంభోరుహపత్రనేత్రుఁడు సముద్యద్భ్రూకుటీభంగ భా
సురఫాలస్థలుఁడుం జలాచల మహశ్మశ్రూలాయమానవ్యథా
పరివేషాననభానుమండలుఁడునై ప్రత్యక్షరౌద్రంబనన్
నరకాలంభవిజృంభణంబు నెఱపెన్ నారాయణుండాకృతిన్.

ఉ. హరి. 1 - 117

గీ॥ ఇట్లు మ్రొక్కిన మునియాదవేంద్రసమితి
సంతసము నొంద నరకునిఁ జంపువాఁడ
నందఱును జూడనని పంతమాడు హరికి
మఱియు మ్రొక్కుచు సంయముల్మగిడి చనిరి.

ఉ. హరి. 1 - 121

మహర్షుల బాధలు వినినంతనే శ్రీకృష్ణుఁ డప్రతిహత క్రోధవివశుఁడయినాఁడు. అప్పుడాతని యాకృతి కొక విలక్షణత యేర్పడినది. అతనియందు నారాయణత్వము ప్రస్ఫుటమయినది. ఈ నారాయణాకృతికిని, సామాన్యుఁడగు శ్రీకృష్ణునియందుఁ గన్పట్టు నారాయణాకృతికిని భేదముకలదు. నారాయణుఁడు పుండరీకాక్షుఁడు. శ్రీకృష్ణుఁడును బుండరీకాక్షుఁడే. సితాంభోజమును బుండరీకమని యందురు. పుండరీకాక్షుఁడనఁగా తెల్లఁదామరల వంటి కన్నులు కలవాఁడని బావము. నారాయణుని కన్నులట్టులే యుండును. నారాయణాంశజుఁడగు శ్రీకృష్ణుని కన్నులును నట్టివే. కాని నేఁడు నారాయణుఁడు పుండరీకాక్షుఁడు కాఁడు. అరుణాంభోరుహపత్రనేత్రుఁడు. కోపముచే నాతని కన్నులెఱ్ఱవడినవని భావము. సూర్యమండలమే శ్రీమన్నారాయణుని యానన ముగాఁ జెప్పఁబడినది. నేఁడా యానన భానుమండలము చలాచలమనస్థూలాయమానవ్యథాపరివేషావృతమయి యున్నది. సూర్యునకు గుడికట్టును. సూర్యపరివేషము సువృష్టి సూచకము. సువృష్టి జగత్కళ్యాణసంధాయకము. ఇచట శ్రీకృష్ణుని వ్యథ పరివేషముగాఁ జెప్పఁబడినది. ఈ వ్యథ గృహచ్ఛిద్రాదుల వలనఁగాని, స్వజననష్టాదుల వలనఁగాని కలిగిన వ్యథ వంటిది కాదు. ఈ వ్యథ వలన శ్రీకృష్ణుఁడు నరకసంహారము గావించును. తన్మూలమున జగచ్ఛ్రేయము గలుగును. కావుననే మనస్థూలాయమానమగు వ్యథను పరివేషముతో బోల్చినాఁడు కవి. మఱియు మఱొక విశేషము. నారాయణుఁడు సత్త్వస్వరూపుఁడు; స్థితికర్త. అతనియందు రుద్రాంశ ప్రవేశించిననే కాని యాతఁడు సంహారకాండను నెఱపఁజాలఁడు. రుద్రుఁడు జగత్సంహర్త. నరకుని జంప నభిలషించిన శ్రీకృష్ణుని యందు నారాయణాంశతో పాటు రుద్రాంశయుఁ బ్రస్ఫుటమైనది. "ప్రత్యక్షరౌద్రంబనన్"—అను మాటలో నీ యంశమునే వ్యంజింపఁజేసినాఁడు కవి. ఇందు మఱికొన్ని విశేషములు గూడఁ గన్పట్టుచున్నవి. సోమునకుఁ దిక్కన పరోక్షగురువని చెప్పవచ్చును. ఈ పద్యమునందు సోమన శ్రీకృష్ణుని నేత్రములను 'అరుణాంభోరుహములు" గా చిత్రించి యున్నాఁడు. ఈ భావము భారతమందు శ్రీకృష్ణ

రాయబారసందర్భమున కవిబ్రహ్మ చెప్పిన యీ క్రింది పద్యభావమునకు సరిపోవు చున్నది.

"పుండరీకాక్షుఁడగు పెల్లఁబోయి యప్పు
డరుణకమలాక్షుఁడయ్యె మురాంతకుండు"—

చెనటి యగు దుర్యోధనుని విపరీత చేష్టలకును, పలుకులకును గినిసి పుండరీ కాక్షుఁడగు కృష్ణుఁడు అరుణ కమలాక్షుఁ డయినాఁడఁట. రెండవ పద్యమున హరికి మహర్షులు నమస్కరించినట్లు చెప్పఁ బడియున్నది. ఇచ్చట హరిశబ్దప్రయోగము నకుఁ బ్రత్యేకప్రయోజనము కలదు. హరించువాఁడు గావున హరి. మునుల మానస ములను హరించినాఁడు గావున శ్రీకృష్ణుఁడిచ్చట హరియైనాఁడు. ముందు నరకుని ప్రాణములను హరించువాఁడు గావునను శ్రీకృష్ణుడు హరియే యగుచున్నాఁడు. మఱియును, హరశబ్దమునకును, హరిశబ్దమునకును వ్యుత్పత్తిలో భేదము లేదు. పరమార్థమున హరికిని హరునకును భేదములేదు. ఇట్లు నిగూఢముగ బహ్వర్థములను ధ్వనింపఁజేయుట సోమన ప్రత్యేకత.

ఈ ఘట్టమున నింకొక విశేషముకూడఁ గలదు. అది పురాణాంతర్గతమగు నంతరార్థమునకు సంబంధించినది. నరకుఁడు సామాన్య రాక్షసులవంటివాఁడుకాఁడు. రసాతలగామియగు భూమిని నారాయణుఁ డుద్ధరించిన సందర్భమున, భూదేవతకు నారాయణుని వలనఁ గలిగిన సంతానము నరకుఁడు కావున నాతని యందు నారా యణాంశ కలదు. భూదేవతాకమగు సహిష్ణుతయు, అప్రతిహతశక్తియు నాతనియందు నిబిడీకృతములయి యున్నవి. సంధ్యాకాలమున జనించుటచే నాతఁడు రాక్షసుఁడయి నాఁడే కాని లేకున్న నాతఁడు దివ్యులలో దివ్యుఁడుగాఁ బరిగణింపఁ దగినవాఁడు. అట్టి నరకుని సంహరించుటకు సాక్షాన్నారాయణుఁడే సమర్థుఁడు. కావుననే మీఁది ఘట్ట మున నారాయణపదప్రయోగము సముచితము నన్వర్థము నగుచున్నది.

## రసపోషణసామర్థ్యము :

సోమన తన హరివంశమున నవరసములను యథోచితముగాఁ బోషించినాఁడు. ఉత్తర హరివంశము వీరరసప్రధానమగు నొక మహాప్రబంధము. ఇందు ప్రథమా శ్వాసమున నరకవధ చెప్పఁబడినది. ఇది శ్రీకృష్ణుని వీరవిక్రమాటోపమును ప్రబ

ర్శించు పట్టము. తృతీయాశ్వాసమునఁ బౌండ్రక వాసుదేవుని విజృంభణమును, అన్యాశమును, చతుర్థాశ్వాశమున హంసడిభకోపాఖ్యానమును, పంచమ షష్ఠాశ్వాసముల యందు బాణాసుర వృత్తాంతముఁ జెప్పఁబడియున్నది. ఇవి యన్నియు శ్రీకృష్ణుని పరాక్రమమును స్పష్టీకరించుసవియే. నరక విజయముతోఁ బ్రారంభమయిన యుత్తర హరివంశము, శ్రీకృష్ణుఁడు బాణుని జయించుటతో ముగియుచున్నది. అనఁగా ఉపక్ర మోపసంహారములయందు వీరమే పోషింపఁబడినదనుట. మధ్యభాగమందుఁ గూడ పౌండ్రక వాసుదేవుని, హంసడిభకులను శ్రీకృష్ణుఁడు జయించుటయే చెప్పఁబడి యున్నది. ఈ గాథ లన్నింటియందును వీరము రసము; శ్రీకృష్ణ గతమగు నుత్సా హము స్థాయిభావము, శ్రీకృష్ణుఁడే నాయకుఁడు. ఇందు వీరమంగిరసము. పంచమా శ్వాసము నందలి యిందుమతీపాఖ్యానము మొదలుకొని, ఉషానిరుద్ధుల కలయిక వఱకు శృంగారము పోషింపఁబడినది. ద్వితీయాశ్వాసమున శ్రీకృష్ణుఁడు తపోదీక్షను గైకొను టయు, హరిహర సమాగమమును వర్ణింపఁబడినవి. ఇందు శాంతరసము పోషింపఁ బడినది. యమునా జలంబుల మునింగిన హంసుంగానక, డిభకుఁడాక్రోశించు నిక్రింది పద్యములయందు హాస్యరసము పోషింపఁబడి యున్నది.

కం॥ వ్రేలెడు వెంట్రుక లిరుగడఁ
దూలఁగఁ దలయూచుఁదొప్పదొప్పన నోరుం
గేల నడచికొను సెలవుల
లాలలు దొరుగంగ నన్నలాయని యొఱలున్.

ఉ. హరి. 4 - 302

కం॥ ఊలం దల యడిచికొనున్
నేలంబడి పొరలు లేచు నెత్తురు లుమియుం
గేలిఁబడి రిపులు చూడఁగ
నాలుక వెటికికొనుఁ జావునకుఁ దన్నికొనున్.

ఉ. హరి. 4 - 303

ప్రథమాశ్వాసమునందలి దేవదానవ యుద్ధవర్ణనమునను, తృతీయాశ్వాసము నందలి ఏకలవ్య విజృంభణ వర్ణనము నందును, షష్ఠాశ్వాసమునందలి శివకేశవ యుద్ధ

వర్ణనము నందును రౌద్రరసము పోషింపఁబడియున్నది. తపంబున కేగు శ్రీకృష్ణునకు పిశాచద్వయము కన్పట్టు ఘట్టమున బీభత్సరసము పోషింపఁబడియున్నది. కూటస్థుఁడును, బ్రహ్మస్వరూపుఁడును నగు పురుషుఁడు విప్రకుమారుల నపహరించు ఘట్టము నందును, కాశీపతి పంపిన కృత్యపై శ్రీకృష్ణప్రయుక్తమగు సుదర్శనము విజృంభించు ఘట్టమునందును, భయానకరసము పోషింపఁబడియున్నది. చండమూర్తియు, క్రూర స్వభావుఁడును నగు నరకుని సభకేగుచున్న నూర్వశీ రూపచిత్రణమునందును, నర కుని పరివారము పెట్టుబాధల కోర్వలేక మునులాక్రోశించు ఘట్టమునందును, మునులు పుండరీకాక్షునితో హంసడిభకులు తమకుఁ గావించిన భంగపాటును వివరించు ఘట్టము నందునను కరుణము పోషింపఁబడియున్నది.

**ఊర్వశీరూపచిత్రణము :**

సీ॥ తొడవు లూడ్చిననైనఁదొయ్యలి రూపుతోఁ
  జిన్నవోయిన పట్లు సెన్ను మీఱు
విరులు వుచ్చిననైన వేఁది పెన్నెఱితావిఁ
  బాయని జవ్వాది బయలు మెఱయు
బూఁతరాల్చిననైనఁ బొలఁతుకమైచాయ
  గవుసెనలోనున్న క్రమము దెలుప
మడుఁగుమాసిననైన మగువపిఱుందు సో
  యగము చూపఱచిత్త మాఁకగొలుప
తే॥ మురిపముల నుజ్జగించిన ముగుదనడపుఁ
గలికిచూపుల వీడ్కొన్న కన్నుఁగవయుఁ
జిరునగవు నోసరించిన చిగురుమోవి
నింతి మది భీతి వెలుపలి కెఱుకసేయ. ఉ. హరి. 1 – 57

**మునులాక్రోశించు ఘట్టము :**

సీ॥ జడలుకంపలు వట్టి జరుగనీకున్నచో
  విడిపింప శిష్యుల వెదకువారు
జన్నిదంబులు కాలిసంకెలలై పడ్డఁ
  దెగఁదన్ని మిన్నక తిరుగువారు

ముందటి దిక్కూడి మొలత్రాడు దవిలిన
తోఁకగోచులవెంటఁ దూలువారుఁ
దగయెత్తి పోలేక దండంబు లటువైచి
"హా విధీ" యని చేతులార్చువారుఁ

తే॥ గడవసంబుల మోఁదినఁ గలఁగువారు
వల్కలంబులు దోఁచిన వంగువారుఁ
జెఱలువోయిన వారలఁ జీరువారు
నై మునీంద్రులు గలఁగి రయ్యాశ్రమమున. ఉ. హరి. 1-102

వసుంధరాదేవి రూపవర్ణనము :

సీ॥ మాఁగువాఱిన చంద్రమండలంబునుఁ బోలె
వదనారవిందంబు వన్నెదఱుఁగ
మకరందమున నిండు మధుకరంబులుఁబోలె
నేత్రోత్పలంబులు నీటఁ దేల
నెఱి దప్పి వ్రాలిన నీలిమేఘమువోలెఁ
గచభారబర్హ మగ్గలము వీడఁ
దొడఁగి చాలఁ జలించు తొండంపుఁగవవోలె
నూరురంభాస్తంభయుగము వడఁకఁ

తే॥ గడఁకలేని తనూవల్లి ఘర్మజలము
దళముగాఁ జిందఁ జెందని తాల్మితోడ
వగపుచిత్తరువో కళవళము కరువో
యనఁగ నొకకాంత గానంగనయ్యెనంత. ఉ. హరి. 1-178

మునుల భంగపాటు :

సీ॥ ఈకమండలు పఙ్క్తి సెటుచూతు నిట్ల త
త్పాపమస్తంబులు వగుల కున్న
నీదండనివహంబు నెటుచూతునిట్లు త
ద్ధూర్తహస్తంబులు దునియ కున్న

సీ వల్కలవ్రాత మెటుచూతు నిట్లు త
   త్కపట చర్మంబులు గాలకున్న
నీ శిక్య సముదాయ మెటుచూతు నిట్లు త
   ద్ద్వేషణాంత్రంబులు ద్రెవ్వకున్న
తే॥ నకట మోమోట లేక తారంత చేసి
బ్రదికిపోయిరె పులిపేషవడినఁ బసుల
వాండ్రె యెక్కడి ఠనుకత వచ్చెనాకు
మునులలోపల నాలుక ముల్లు విరిగె. ఉ. హరి. 4-102

ద్వితీయాశ్వాసమున శ్రీకృష్ణుఁడు, విప్రకుమారులఁ గొనితెచ్చు పట్టమున నద్భుత రసము పోషింపఁబడినది.

శా॥ ఆకాశంబు వెలుంగఁ దోఁచెనటపో నత్యద్భుతాకారుఁడై
రాకాచంద్రదివాకరానలశిఖారత్న ప్రభాజాలరే
ఖాకాంతిం బురుమండొకండచట లోకంబెల్ల నిండించినన్
మాకన్నుంగవ లిట్టిరూపమని నమ్మంజాలవయ్యెన్నృపా.
ఉ. హరి. 2-50

## రసదృష్టి : కథాదృష్టి :

కావ్యరచనా శిల్పమునందు రసదృష్టికిని, కథాదృష్టికిని చాలభేదము గలదు. ఒక్కటే కథ నాశ్రయించియున్న ప్రబంధములందు రసదృష్టి ప్రధానముగాఁ గన్పట్టు చున్నది బహుకథాత్మకములగు పురాణములయందు కథాకథనదృష్టి మిక్కుటముగఁ గన్పట్టుచున్నది. ఈ రెండు దృష్టులు నేకీభవించుట సాధారణముగఁ జూపట్టదు. కథాకథనవిధానమునకు లోపమురాకుండ రసాత్మకముగఁ గావ్యమును నిర్మించునేర్పు అలఁతి యలఁతి కవుల కబ్బునదికాదు. ఆంధ్ర వాఙ్మయమునందలి మహాకవులెవ్వరు ని క్లిష్టమార్గము ననుసరించినవారు కారు. అతిలోక సాధారణమగు ప్రజ్ఞా నైపుణ్యముచే నిమ్మహాకార్యమును సర్వంకషముగా సాధించిన మహాకవి నాచన సోముఁడొక్కఁడే. కథా దృష్టితో వ్రాయు కావ్యమున వస్తుగత శిల్పమధికముగ నుండును. వీనియందుఁ

గూడ రసాధానము లేకున్నచోఁ గావ్యమునకు శోభలేదు. రససృష్టి చేయుటలో పలు మార్గము లున్నవి. విభావానుభావ వ్యభిచారీభావ సంయోగమున రస నిష్పత్తి గావించుట సర్వసాధారణమగు మార్గము. కాని యీ మార్గము ఏకకథానిష్ఠమయిన కావ్యమున శోభించినట్లు, బహుకథాత్మకమగు కావ్యమున శోభింపదు. మఱియు నిట్లన్ని రసములును ప్రపంచించి పోషించినచో అన్ని రసములకును బ్రాధాన్యమేర్పడును. అప్పుడంగి రసమెద్దియో నంగరసము లెవ్వియో నిర్ణయించుటయుఁ గష్టసాధ్యమగును. అట్టియెడ మహాకవులనుసరించు మార్గమొకటి కలదు. రసమును ఒక్క సంచారీ భావముచేత గాని ఒక్క అనుభావ విశేషముచేతగాని వ్యంజితము గావింపవచ్చును. నాచన సోమన బహుకథాత్మకమగు తన ఉత్తర హరివంశ మహాకావ్యమున నీ మార్గమునే యవలంబించినాఁడు. క్లిష్టమగు నీమార్గము నవలంబించి సర్వథా కృతకృత్యుఁడైనాఁడు. ఉదాహరణమునకీ క్రింది పద్యమును గైకొందము.

చ॥ కిసలయ పత్త్రికన్ మకరకేతన నూతన వార్తలన్నియుం
బొసఁగలిఖించియందుఁ దలపూవులుఁ దమ్మయు నానచేయునా
కొసరు తెఱంగెఱింగి కుచకుంభములం బతిదాల్చునన్ను సం
తసమున వ్రాసి యిచ్చినఁ గా చెలికత్తెల కేనుమ్రొక్కుదున్.

ఉ. హరి. 5-123

ఉషాకన్య అనిరుద్ధునితోఁ గలసినట్లు కలఁగన్నది. తెలివి వచ్చినతరువాత గూడ నాకలలోని యనుభూతులనే యామె మాటి మాటికి స్మరించుచున్నది. అట్టి స్మరణ లలో నొక్కదాని నీపద్యము వ్యక్తీకరించుచున్నది. కలలో ననిరుద్ధుఁడు తన్ను గవియు నప్పుడు తన తల పూవులును, తమ్మయు నానచేసి యున్నాఁడు. అప్పుడు ఉషా కన్యకకు సిగ్గుముంచుకొని వచ్చినది. కొసరి కొసరి యాతఁడవ్వానినే గోరినాఁడు. ఉద్వేగమున నామె ఆతనిని తన కుచకుంభములకు హత్తుకొన్నది. ఇది యంతయుఁ గలలోని ముచ్చట. దీనిని చిత్రపటమునందు వ్రాసి తనచెలులు తనకుఁ జూపింప వలె నని యాముద్దరాలి వాంఛ. అట్లు చూపిన చెలికత్తెల కామె నమస్కరించునట. ఇందు 'స్మృతి'[1] అను సంచారీభావము ముఖ్యముగాఁ గన్పట్టుచున్నది. 'చాపలము'[2] ను

1. సంస్కారజన్యం జ్ఞానం స్మృతిః. స్మృతియగు పూర్వానుభవస్మృతి. కావ్యా. సం.
2. రాగద్వేషజనితా చేష్టాద్యనవస్థితి. చాపలము – ఇటవాగజనిత చేష్టానవస్థితి సూచితము.

'త్రపయుఁ'[1] గూడఁ గన్పట్టుచున్నవి. ఈ సంచారీభావములను మాత్రమే యాధారములుగఁ గైకొని సోమన యిందు శృంగారమును వ్యంజింపఁజేసియున్నాఁడు.

## నవీనగుణసనాథ బిరుద సార్థక్యము

ఇఁక నీతని నవీనగుణసనాథత్వమును బరిశీలింప వలసియున్నది. ఈతనికిఁ బూర్వము ప్రసిద్ధులైన కవులాంధ్రమున నిర్వురేగలరు. వారే నన్నయ తిక్కనలు. ఎఱ్ఱనయు నీతని కించుకఁ బూర్వుఁడనియే చెప్పవచ్చును లేదా యెఱ్ఱన వార్ధక్యమున నీతఁడు బాలుఁడై యుండెననియు చెప్పనగును. ఎఱ్ఱన రచించిన గ్రంథముల నీతఁడు చూడలేదనియుఁ జెప్పఁజాలము. ఒకమాట మాత్రము నిశ్చితము. నన్నయ తిక్కనల కవిత్వము నీతఁడు బహువారములు పఠించినాఁడు అందు కవిబ్రహ్మయగు తిక్కన కవితారీతుల నాకళించుకొనుటకు సర్వథా యత్నించినాఁడు. మఱియు నంతటితోఁ దృప్తినొందక కవితాశిల్పమునందుఁ దనకుఁగల నైపుణ్యమునుగూడ వ్యక్తీకరించుటకు యత్నించినాఁడు. నన్నయ తిక్కనల యడుగు జాడలలోనే సోమనయు నడచినచో నీతనికి నవీన గుణసనాథ బిరుదమన్వర్థము కాఁజాలదు. ఈతని కవిత్వమున నంతకుఁ బూర్వములేని క్రొత్తపోకడలు కొన్ని కలవు. అవియే నవీనగుణములు. వాని కలిమి నీతఁడు నవీనగుణ సనాథుఁడయినాఁడు. తరువాతి ప్రబంధకవులనేకులు సోమన ననుకరించి వ్రాసిరి. వారి వ్రాతలలో సోమన పోకడలు గన్పట్టుచుండును. కాని వారెవ్వరును నవీనగుణసనాథ బిరుదమున కర్హులుకారు.

సోముని నవీనగుణసనాథత్వమును బరీక్షించుటకు ముందు తత్పూర్వ కవులగు నన్నయ తిక్కనల కవితారీతులను గొంతపరిశీలింప వలసి యున్నది. మఱియుఁ గవిత్వమునకు మూలభూతములగు నితర ధర్మములను గూడ సమీక్షింప వలసి యున్నది. నన్నయ తిక్కనల కవితయందుఁ బ్రధానముగ మనకుఁ గన్పట్టు గుణము సంయమము. ఎట్టి భావమును గూడ విశృంఖలముగా ప్రపంచించుటకు వారంగీకరింపరు. సోమన కవితయందు ముఖ్యముగఁ గన్పట్టు గుణము ప్రపంచీకరణము లేక విపులీకరణము సంయమ ప్రపంచీకరణములలో నెయ్యది గొప్పది యెయ్యది గరీయసి యను ప్రశ్నమున కిట తావు లేదు. కవులకుఁ గల రుచి భేదము మీఁదను,

1. **స్త్రీణాం పురుషముఖావలోకనాదేః వైవర్ణ్యాధోముఖత్వాది కారణీభూతశ్చిత్తవృత్తి విశేషము.**

దృష్టిభేదము మీఁదను నీ గుణద్వయ మాధారపడియున్నది. భావసంయమనము కొందఱికి సమ్మోదావహము. భావమును వెల్లివిరియించినచో కొందఱికి హర్షదాయకము కావున నీ గుణద్వయమునందు తరతమ భేదము నూహించుట సమంజసముకాదు. సోమన యందుఁ గన్పట్టు నవీనగుణములలో మొదటిది యిదియే యని చెప్పవచ్చును.

ఉక్తివైచిత్రి :

భావానుగుణముగ శబ్దములను బ్రయోగించుట సన్నయ తిక్కనల సొమ్ము. కాని శబ్దసంఘాసమున భావమునకు దీప్తియు వైశిష్ట్యమును గల్పించు ప్రయత్నము తఱచుగా వారు చేసినట్లు గానరాదు. పదసంయోజనముచే భావమునకు దీప్తిని గలిగించు ప్రయత్నము నాంధ్రవాఙ్మయమునఁ దొలుత గావించిన ప్రతిష్ఠ సోమునకే చెల్లిన దనవచ్చును. ఉదాహరణము :

సీ॥ ఉరముకౌస్తుభరత్న ముదయాద్రితటమునఁ
  బొడతెంచుకలువలబోటుబోటు
శిరముకిరీటంబు సురగిరినెత్తాన
  రాజిల్లుపగలింటిరాజురాజు
కటిపచ్చఁబట్టు దిగ్దంతికుంభస్థలిఁ
  జూపట్టురేయెండజోడుజోడు
చేతిశంఖంబు గర్జితగజేంద్రముకేలఁ
  బరగువెన్నెలపూవుబంతిబంతి
తే. యై కొలువులోనఁ దేజోమయంబు సేయ
మౌక్తికవితానమయసభామండపమున
సత్యభామాసఖీకటాక్షములగములఁ
జూఱ గొనుచున్న దేవకీసుతునిఁ గంటి. ఉ. హరి. 4-181

ఇది లాటాను ప్రాసభ్రాంతిని గలిగించు యమకము. ఇందు స్ఫురించు నర్థములోని చమత్కృతి తద్భ్రాంతితోఁ గూడిన యమకమునందే పుట్టుచున్నది. ఇట్టి రచనా వైచిత్రి సోముని యందే తొలుతఁ గన్పట్టు చున్నది. ఉక్తివైచిత్రి యందుఁ గూడ సోమనయే ముందంజవేసెనని చెప్పవచ్చును.

ఉ॥ కొలువఁగ నేర నిన్ను శతకోటివిభాకరతేజు డగ్గఱం
బిలువఁగ నేర నిన్ను మునిబృందవివేకవిమర్శదూరునిన్
విలువఁగ నేర నిన్నుఁ బృథివీవియదంతరభిన్ను నేమిటన్
నిలువఁ గదయ్య నాహృదయనీరజకర్ణికపై మహేశ్వరా.

ఉ. హరి. 5 - 9

చ. ఒరసిరి నిన్నుఁ దర్కనికషోపలధారలవన్నెఁ గాన రె
త్తరసిరి విశ్వముం గపిల యైనను నీదెస ముల్లు సూపఁగా
బెరసిరి బ్రహ్మముఖ్యు లగుపెద్దలు బచ్చులు వోలెనెల్లచో
నెరసిరి గాసి నిన్నెఱుఁగ నేరరు నావశమే మహేశ్వరా.

ఉ. హరి. 4 - 11

"కొలువగనేరనిన్ను, పిలువగనేరనిన్ను, ఒరసిరి, అరసిరి, బెరసిరి, నెరసిరి— ఇట్లు సమాసరూపములు గల శబ్దములు పద్యచరణాదుల యందు జొనుపుటచేత పద్యరచనయందొక క్రొత్తవిచ్ఛిత్తి కలుగుచున్నది.

## లోకోక్తులు - జాతీయములు :

లోకోక్తులు భాషకుఁ జీవగఱ్ఱ వంటివి. వీనివలనఁ గవితకుఁ బుష్టికల్గును. భావ నైశిత్యమినుమడించును. భావము సూటిగా హృదయమున నాటుకొనును. నాచన సోమునకుఁ బూర్వమున్న కవులుగూడ నందందు లోకోక్తులను వాడియే యుండిరి కాని సోమునివలెఁ దఱచుగా వాడినవారు కారు ఈ క్రింది లోకోక్తులను గమనించినచో సోమునకుఁ దత్ప్రయోగమునందుఁగల యభిరుచియు, నేర్పును వ్యక్తములగును.

1. అంజెదవు గాకసను, జెం
తం జేఱఁగనీక యెంత దఱిఁగిన మిరియా
లుం జొన్నలు సరిపోవే
2. కనికని కొఱ్ఱివ్వడింటికంబము సేసెన్
3. శిరసుండగ మోఁకాలను సేసలు పెట్టుట

4. కుమ్మరావమున రాగిముంత లేరంగఁగలవె
5. జీలుగు వెరిగిన మూలెకుఁ గంబంబుకాదు
6. వరుగుతో దాగరయు నెండవలసినట్లు
7. తెఱఁగు మాలి తవుడు తిని చచ్చువానికి
8. దాగం బోయి తలారి వాని యెదుటం దాగంగ నికేటికిన్
9. దువ్వఁజూచి నక్కయొడలు గాల్చుకొన్న వడువున
10. ఆలిగి తన్నినఁ బఱపు పయిం బడినయట్లు

ఇట్టి లోకోక్తులును జాతీయములును సోముని హరివంశమున కొల్లలుగాఁ గలవు. వాని నన్నిటి నిట నుదాహరించుట యప్రస్తుతమగును. సోముని పలుకుబళ్ల యందొక వింత పోకడయు, గడుసుదనము నుట్టిపడుచుండును.

కం॥ అనుమం బరిఘము వైచిన
దనుజాంతకుఁ డొడిసి పట్టి తనఘనహేతిం
దునుకలుగ నఱికి నీపొం
గినపుడిసెఁడుఁ బోయె ననుచు గేలి యొనర్చెన్.

ఉ. హరి. 4 – 237

ఇది హంసడిభకోపాఖ్యానము నందలి పద్యము. విచక్రుఁడను రాక్షసునితో శ్రీకృష్ణుఁడు యుద్ధము చేయుచుండెను. అప్పుడు విచక్రుఁడొక పరిఘను గైకొని శ్రీకృష్ణుని పయి వైచెను. ఆ పరిఘమును "దనుజాంతకుఁ డొడిసిపట్టి తన ఘనహేతిం దునుకలుగనఱికి—" వైచెను. అట్లు గావించి "నీ పొంగిన పుడిసెడుఁబోయెను" అనుచు విచక్రుని గేలి యొనర్చెను. విచక్రునకుఁగల మహాశస్త్ర మాపరిఘమే. ఆ పరిఘను శ్రీకృష్ణుఁడెదుర్కొనలేఁడని యాతని యూహ. కాని దనుజాంతకుఁడద్దానిని వమ్ము గావించెను. ఇట పుడిసెడను పదము అల్పార్థము నందుపయుక్తమయి యున్నది. అల్పమగు నొక యాయుధమును గైకొని విచక్రుఁడు మిడిసిపడినాడు. అదియే యొక మహాస్త్రమనుకొని గర్వోన్మత్తుఁడయినాఁడు. దానికిఁ గారణమాతని క్షుద్రత్వమే. నీచుఁడగు వాఁడు పుడిసెడు గలిగినంతనే మహార్థము లభించినట్లు పొంగి పొరలును. కాని యా పుడిసెడును బోయినప్పుడు వాని ముఖవైచిత్రిని గనవలసియే యుండును. ఇంతటి యర్థమును ఒక్కమాటలో పొదిగి పొసఁగించెడి గడుసుదనము సోమనకు మాత్రమే కలదు.

మ॥ నిను రప్పింపక మున్న వేగపడి పూనెన్ శార్ఙ్గకౌమోదకీ
వనమాలాంబుజచక్రభూమికలు గైవారంబు చేయించె నే
లిననాగారులచేత యాదవుల నోలిం గొల్చి కూర్చుండఁగాఁ
బనిచెం గేశవుఁడైంద్రజాలికుగతింబ్రాఁతయ్యె నీకంతటన్.

ఉ. హరి. 4 - 188

హంసడిభకులు వరగర్వమున పోతరించి, తమ తండ్రిచే రాజసూయమును జేయింప సమకట్టిరి. రాజసూయాధ్వరప్రవర్తకునకు రాజు లందఱును గప్పము కట్టవలెను. ఆ కాలమున శ్రీకృష్ణబలదేవ సాహాయ్యమున యాదవు లప్రతిహతులై యుండిరి. వారి కడ కప్పముగ నుప్పును గైకొనవలెనని హంసడిభకులు సంకల్పించిరి. జనార్దనుఁడను బ్రాహ్మణ సఖుని యాదవుల కడకు రాయబారిగాఁ బంపిరి జనార్దనుఁడు శ్రీకృష్ణ భక్తుఁడు. రాయబారమునకేగి తిరిగివచ్చిన జనార్దనుఁడు, హంసడిభకులకడ శ్రీకృష్ణ మహాత్మ్యము నుగ్గడించెను. అప్పలుకులు వినినంతనే హంసుఁడు క్రుద్ధుఁడై మీఁది వాక్యములను బలికెను. బైరాగులు భిక్షాటనమున కయి యూరిలోనికిఁ బోవుటకు ముందు చెఱువు నొడ్డున గూర్చుండి భిక్షాటన కుచితమగు వేషమును ధరింతురు. అట్లే శ్రీకృష్ణుఁడు కూడ జనార్దనుఁడు, హంసడిభకుల కడనుండి రాయబారిగా వచ్చుచున్నా డను వార్త వినినంతనే వేగపడి "శార్ఙ్గకౌమోదకీ వనమాలాంబుజ చక్ర భూమికల" ను బూనినాడఁట. ఏలిన నాగారుల చేత గైవారములు సేయించు కొన్నాఁడఁట. యాదవుల నందఱ నొక్కచోఁ జేర్చి తన్ను గొల్చువారిగాఁ గూర్చుండఁబెట్టినాఁడట. ఇంద్రజాలికుఁడు పెక్కు వస్తువులను క్షణమాత్రమున సృజించును. కాని అవి యెందుకును బనికిరావు. కొలఁది కాలమునకే యవి యంతరించును. అట్లే శ్రీకృష్ణుఁడు చూపిన యయ్యైశ్వర్యమును, నాడంబరమును క్షణికములనియు, అతని యాయుధము లగు శార్ఙ్గకౌమోదకీ చక్రములు నిరర్థకములు, శక్తిహీనములు ననియు హంసడిభకుల యభిప్రాయము. యాదవులలో నాతనికిఁ గల పలుకుబడియు స్వల్పమే యనియు వారియూహ. నాగారులన్న బహువచనము పరమనిందావ్యంజకము.

పద్యరచనాచమత్కృతి :

ఇతఁడు సీసపద్యములలో పలు చమత్కారములు చేయును.

సీ॥ అభ్రంకషంబైన యాలపోతు నితండు
  త్రుంచినాఁడీతండు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు
  గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
  దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడిపన్నగేంద్రు నితండు
  మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు
తే॥ నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడుసంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు. ఉ. హరి. 2-180

మొదలైన సీసపద్యములు శివుఁడు, కృష్ణుఁడేకత్ర స్థితులైనపుడు దేవతలు చేసిన వర్ణనగా వ్రాసినాఁడు.

"నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁజెప్పంగఁ జెప్పంగఁ జూపఁగలిగె.

వృషభాసురమర్దనము శ్రీకృష్ణుఁడు చేసెను. ఇది నేఁడు. నందీశ్వరుని శివుఁడు పెంచెను అదినాఁడు. కృష్ణుఁడు నాఁడు గజేంద్రమును రక్షించెను. శివుఁడు గజాసురుని శిక్షించెను. ఇదినేఁడు. గజేంద్రరక్షణము ఉత్తమమన్వంతరములో జరిగినది. కృష్ణుఁడు వృషభాసురుని జంపుట చూపవచ్చును. శివుఁడు నందిని బోషించుట చెప్పఁదగినది. ఆ విధముగనే "సారసమ్మున లేవ నీరసమ్మునఁజావ, పద్మాసనుఁడు వీరిపాలగనియె" మొదలైన పద్యములు గూడ 'మనుపఁ జెరుపంగ జెరుపంగ మనుప నేర్తు' రన్న శబ్దముల యర్థములలో జొనిపినాఁడు. ఇట్టి చమత్కార పద్యములనేకములు గలవు. ఇది యంతయు నీతని పద్యరచనా గతమైనట్టి నవీనగుణ సనాథత్వము.

**ఔచిత్యనిర్వహణము :**

కథాగతియందుఁ గూడ నీతని రచనలో నవీనగుణసనాథత్వము కలదు. అది పరమరహస్యముగ నుండును. రుక్మిణి తనకుఁ బుత్త్రునిమ్మని భర్తయైన భగ

వంతుని ప్రార్థించినది. వరము నడిగినది. కొడుకు నిమ్మని భార్య భర్తనడుగుట యేమి? 'పాదప్రణామక్రియా ప్రారంభంబగు భక్తిఁ గుట్మలిత హస్తాంభోజయై' యడిగినది. ఇట్లు పుత్త్రార్థినియై స్త్రీ పురుషుని ప్రార్థించుట వేదకాలధర్మము. శృంగార రసము రసచూడామణిగా, స్త్రీ పురుష సంగమము కామభావమధురముగా మానవుఁడు తీర్చిదిద్దికొనిన నాటి ధర్మమది. ఆ పిమ్మట నీ రసవిషయము పెరిగినది. ప్రేమ మాధుర్యము పెరిగినది. ఈ ప్రార్థనకు శ్రీకృష్ణుఁడిచ్చిన సమాధానము ప్రేమమార్గమున నున్నది; రసమార్గమున నున్నది. సంభోగ శృంగారవ్యంజకమునైయున్నది.

చ॥ అనిమురాంతకుండు దరహాసముమోమునఁ దొంగలింపనో
వనజదళాక్షి నీకుఁ దగవా యిటు లాడుట నన్ను నీవె వేఁ
డిన నటు చేయకుండుట ఘటిల్లునె చేసిన నెవ్వరైన మె
చ్చనిపనియేనుజేయుదునె సంతసమందుముకోర్కిఁదీర్చెదన్.
ఉ. హరి. 2-79

క॥ తనవలచుకాంత యేపని
మనమునఁ దలఁచినను జేయుమగవానికి న
వ్వనితబిగియారుకౌఁగలి
దినదినమును మదనకామధేనువు గాదే. ఉ. హరి. 2-80

అని యీ రీతిగా లక్ష్మీనారాయణులయిన రుక్మిణీకృష్ణులయందు వేదకాలమునాటి ధర్మమును, లీలామానుషమూర్తులయిన వారలయందు రసధర్మమును గలిపిచేయుట నాచన సోమునియొక్క నవీనగుణసనాథత్వ లక్షణమునకు శేఖరీభూతమయిన విషయము.

## సంవిధాన చక్రవర్తి బిరుదసార్థక్యము

నాచన సోమునకుఁగల మఱియొక బిరుదము సంవిధాన చక్రవర్తి యనునది. ఈ బిరుదమునకుఁ గూడ నితఁడు సర్వథా తగియున్నాఁడు. కథాకథనమునకు సంవిధానకల్పనము ఆయువుపట్టువంటిది. ప్రతికథయందును గొన్ని సంవిధానములు లేక సన్నివేశములు నుండకతప్పదు. ఆ సన్నివేశములను సముచితముగఁ బెంపొం

దించి, కథాకథనమును గావించుటయందే కవికిఁ గల శక్తిసామర్థ్యములు వ్యక్తము లగును. సన్నివేశకల్పన మన సామాన్య విషయము కాదు. అందు మహాకవులు మాత్రమే కృతకృత్యులు కాఁగలరు. కథాసంవిధానకల్పనమును నిసర్గరమణీయముగ నడిపించుటలో సోమన మేటియని చెప్పవచ్చును. వీనిని వరుసగాఁ బరిశీలించినగాని సోమనకుఁగల సంవిధానచక్రవర్తిత్వబిరుదము నందలి సార్థక్యము సువ్యక్తముగాదు.

**ఊర్వశీనరకాసుర సంవాదము :**

ఉత్తర హరివంశము నరకాసుర వృత్తాంతముతోఁ బ్రారంభమగుచున్నది. బ్రహ్మవరగర్వితుఁడగు నరకుఁడు స్వర్గముపయి దాడి వెడలి యింద్రాద్యఖిల దిక్పతులను జయించినాఁడు. సంగరవిజయోత్సాహమున సింహనాదము సేయుచు, అమరావతీవైభవముఁ బరిశీలించు నుత్సాహముతో బయలుదేరినాఁడు. ఆతని కిరుఁకెంకలను వెనువెంటను నడచు రాక్షసవీరులు, 'వరుణసైన్యవార్థిబడబానల! దండధర సేనావసదావానల! హరసఖా వీరభట హరిణశార్దూల! సురరాజశూర పరివార వారివాహపవన!' అని ఆతనిని కైవారంబులు సేయుచు హెచ్చరించుచుండిరి. కాని అమరావతి యందాతఁడూహించిన వైభవము గన్పట్టుటలేదు. నృత్తగీతములును, నిస్సాణపటహ సంజాతములును లేని చదుకములును; కాశ్మీరనికరంబును, గల్హారపుష్పోపహారములును లేని సౌధాంగణములును; మణితోరణములును, మహనీయశృంగార వారణంబులును లేని వాకిళులును; కర్పూరధూమము, కాంతాకటాక్షనిరీక్షములు లేని గవాక్షములును; కదళికాదుకూలములును, గంపమాస చమరవాలంబులును లేని చంద్రశాలలును నాతనికిఁ గన్పట్టినవి. ఇట్లు శూన్యములగు సౌధాంగణాదులను గాంచి, దిక్పాల మర్దనుఁడగు నరకుఁడు ప్రమదకల్లోలలోలమానసుఁ డయినాఁడట. ఇది నరకుని మనఃప్రవృత్తికి నిదర్శనము. నిజముగా నమరావతి సకలవిభవాభిరామమయి యున్నచో నరకుఁడు సహింపఁజాలఁడు. మఱియు నిర్దయులగు దైతేయులు విజృంభించి నిర్జరాంగనలను బాధించుచుండిరి. మఱియు నందందు సురలు పాఱవైచిన శస్త్రాస్త్రములును, గూలినమేడలును, నెఱిదప్పిన వాడలును నరకునకు దృగ్గోచరంబు లయినవి. వాని నన్నిటినిగాంచి, నరకుఁడొక చిరునవ్వునవ్వినాఁడు. భాసురంబగు జంభారి వాహనము నవతరించి, కక్ష్యాంతరములు గడచి, యంతఃపురమున కేగినాఁడు కాని యంతఃపురము కూడ శూన్యమే. అందున్న కాంతలు నరక ప్రతాపమునకు వెఱచి, యంతఃపురమును వీడి యెచ్చటికో పోయినారు. విజయాట్టహాసముతో నరకుఁడు సభామండపమునందలి రత్నసింహాసనముపయి నాసీనుఁడయినాఁడు.

ఇంతవఱకుఁ గవి ఊర్వశీ ప్రసంగమునే తేలేదు. నరకుని కూర్వశిపయి ప్రత్యేకమగు దృష్టిగలదని గూడ సూచింపలేదు. ఇట్లు కవి మూకీభావమును వహించుటకు నరకుని మనఃప్రవృత్తియే కారణము. ఇట్టి మనఃప్రవృత్తి రాక్షసులందఱి యందును గన్పట్టును. దేవదానవులకు సహజవైరము గలదు. ఆ సహజవైరమును బురస్కరించుకొని రాక్షసరాజులమరావతిని జయింతురేకాని అందేనివసించి, దేవభోగముల ననుభవించుచు, రాజ్యముసేయ గోరరు. రావణాది రాక్షసు లెవ్వరును స్వర్గ రాజ్యపరిపాలనమును జేసినవారు కారు. ఇంద్రాదుల జయించుటయే వారి పరమ ప్రయోజనము. దేవతలను బాధించుటయే వారికి ప్రమోదావహము. రంభాద్యప్సరసలచేత వారూడిగములు సేయించుకొనవచ్చును. వారి నృత్తగీతనై పుణ్యమును మెచ్చుకొనవచ్చును. ఏది యెట్లున్నను నిర్జరాంగనలు వారికి బానిసలే. కాని ప్రియురాండ్రు మాత్రము కారు. కావున నరకున కూర్వశిపయి ప్రేమగలదనిగాని, ప్రత్యేకమగు దృష్టిగలదనిగాని, యూహించుట కవకాశములేదు. కాని సభాభవనమున రత్నసింహాసనాసీనుఁడయినంతనే నరకున కూర్వశి జ్ఞప్తికి వచ్చినది. రంభాదులగు నప్సరసలు పెక్కురుండగ నరకున కూర్వశియే జ్ఞప్తికి రానేల? అప్సరసలలో నగ్రగణ్య రంభగదా! మఱియు నింద్రునకు మిక్కిలి కూర్మిసేయు వనితయు రంభయేగదా! అట్టియెడ నరకుఁడూర్వశినే ప్రత్యేకముగాఁ బిలిపింపనేల? ఈ ప్రశ్నకు సమాధానము కవి నిగూఢముగనే యుంచినాఁడు. నరకుఁ డూర్వశినే స్మరించుటకుఁ గారణమొండు గలదు. అప్సరసలందఱును సముద్రమథనావసరమున నావిర్భవించిరి. ఊర్వశి మాత్రమట్లు జనింపలేదు. ఆమె నారాయణాంశ. నరనారాయణుల తపంబులకు వెఱచి, యింద్రుఁడప్సరోగణముఁ దత్తపోభంగము గావింపఁ బంపెను. వారును నప్పురాణమహర్షులకడ తమ నెఱజాణతనముం జూపిరి. నారాయణమహర్షి చిరునవ్వున వారిని దిలకించి, తన యూరువులనుండి కొంత రక్తమును దీసి, జగన్మోహన రూప లావణ్య భాసురయగు నొక యంగనను సృజించినాఁడు. ఆమెయే ఊర్వశి. ఆమె యందచందములఁ జూచి, మహేంద్రప్రేరణమున వచ్చిన యప్సరసలు సిగ్గుపడి మగిడి చనిరి. ఊర్వశీ సౌందర్యమునకు ముగ్ధుఁడయి దేవేంద్రుఁడామెను గూడ స్వర్గమునకు రప్పించుకొనెను. కావున ఊర్వశి నారాయణాంశజ. నరకుఁడు గూడ నారాయణాంశజుఁడే. కావుననే యాతనికి తొలుదొల్త నూర్వశియే జ్ఞప్తికివచ్చినది. నారాయణాంశజుఁడగు తాను అప్రతిహత పరాక్రమమున స్వర్లోకమును జయించినాఁడు. తన సభయందు నారాయణాంశజయగు నూర్వశి ప్రధానస్థానము నాక్రమించి, యప్సరోగణ

మున కగ్రేసరయై చెలంగవలెనని యభిలషించినాఁడు. కావున తొలుత నూర్వశిని బిలువనంపునపుడు నరకునకామెయెడ నెట్టి దుశ్చింతయును లేదు. అప్పటి కాతఁడామె రూప సౌందర్యముల నెఱుంగనే యెఱుంగఁడు. నరకుని యంతరంగమునఁ గల యీ భావమును రక్కసు లెవ్వరు నెఱుంగరు. ఊర్వశిని రక్కసులు పట్టి తెచ్చిరి. నరకుఁడామెను జూచెను. చూచినంతనే మదనపరవశుఁడాయెను. ఊర్వశి యప్సరస. అప్సరసలకు వావివరుసలులేవు. కావున నామెయెడ నరకుఁడు కామదృష్టిని బరపుటలో పాపశంకకానరాదు. కాని యాతనికి ఊర్వశియెడ జనించిన కామ ప్రకోపము హఠాత్సంభవము. త్రిజగన్మోహనమగు నామె సౌందర్యమున కాతఁడు ముగ్ధుఁడయినాఁడు. సకల దిక్పాలమర్దనుఁడగు తన్ను కామోపభోగముల నామె యోలలాడించునని యువ్విళులూరినాఁడు. కామాంధుఁడగు నాతఁడూర్వశి దైన్యావస్థను గమనింప లేక పోయినాఁడు. అందులకే ఆమె వచ్చునరికి నరకుఁడు చొళ్లెంబు నిమురుచుఁ బైకొంగ నువ్వు పఱచుచు గేదరిరేకు నఖంబుల జీఱుచు, గులుకుచుఁ గోర్కులఁదేలుచుండెను. అట్లు మదన వికారమునకు లోనైన యాకఱకు రక్కసుని మనసు నొవ్వకుండ తప్పించుకొను టెట్లాయని యూర్వశి తలపోయుచుండెను.

ఇచ్చట నీ యిర్వురి మనఃప్రవృత్తులును ముఖ్యముగా గమనింపవలయును. ఊర్వశిలేకున్న తన కొలువు సింగారమునకు లోపమని భావించి, నరకుఁడామెను దీసి కొనిరా భటుల నియోగించెనేకాని, ఆమెయెడ వలపుగొనికాదు. కాని యామె జగన్మోహనాకృతిఁ జూచినంతనే కఱకు రక్కసుని మనసు వెన్నవలె కరగినది. ఇదియొక హఠాత్పరిణామము. ఉగ్రప్రవృత్తిగల నరకుఁడు తన్ను బిలిచి, నిండుకొలువులో పరిభవించునేమో యని బెదురుచు దీనాననయై సభకేతెంచిన యూర్వశికిఁ గూడ నరకుని మనఃప్రవృత్తి యందలి యీ హఠాత్పరిణామ మచ్చెరువు గొల్పినది. అందులకే తొలుత జంకుచు మాటాడిన యూర్వశి తరువాత జంకుగొంకులు లేకుండ నెఱవిచ్చిన మోముతో మాటాడినది. కాని ఆతని నుండి తప్పించు కొనుటకయి యామెచేసిన యధ్వరభాగాపహరణప్రసంగము మాత్రము తొలినుండి యామె యూహించుకొనినది కాదు. అప్పటికప్పుడామెకుఁ దోచిన యూహ అది. కావున నిదియును నొక హఠాత్పరిణామమే యని చెప్పవచ్చును. ఆ కోరిక వలనఁ గలుగు విపరీత పరిణామముల నామె యూహించియే యున్నచో నప్పుడామె యట్టి కోర్కె గోరియుండెడిది కాదేమో. ఆమె కోర్కె వలననే నరకుఁడు విజృంభించి, మహర్షుల బాధించినాఁడు. హఠాత్సంభవములగు నీ మనఃప్రవృత్తులను సోపానపరంపర వోలె సోమన చిత్రించినాఁడు. అట్లు చిత్రించుటలో సోమన చూపిన మనస్తత్త్వపరిజ్ఞానము నొకింత బరికింతము.

సభాప్రవేశము గావించు నప్పుడూర్వశి రూపవర్ణన మిట్లు గావింపఁబడినది.

సీ॥ తొడవు లూడ్చిననైనఁ దొయ్యలిరూపుతోఁ
జిన్నవోయినపట్లు సెన్నుమీఱ
విరులు పుచ్చిననైన వెలఁదిపెన్నెఱితావిఁ
బాయనిజవ్వాది బయలుమెఱయ
బూఁత రాల్చిననైనఁ బొలఁతుకమైచాయ
గవుసెనలోనున్నక్రమము దెలుప
మడుఁగు మాసిన నైన మగువపిఱుందుసో
యగము చూపఱచిత్త మాఁకగొలుప

తే॥ మురిపముల నుజ్జగించినముగుదనడపుఁ
గలికిచూపుల వీడ్కొన్న కన్నుఁగవయు
జిఱునగవు నోసరించిన చిగురుమోవి
నింతి మది భీతి వెలుపలి కెఱుక సేయ. ఉ. హరి. 1 – 57

"అజ్ఞోటి దిట్టగావునం దలంకక" వచ్చునప్పుడు "మునుముట్టిన భయకారణంబున" ఆమె రూపెట్లున్నదని కవి మీఁది పద్యములో వర్ణించియున్నాఁడు. దిట్టగావుననే నరకుని సభకుఁ దనకూ దానే వచ్చినది. రక్కసులామె నీడ్చి తెచ్చినట్లు కవి చెప్పలేదు. కాని జగద్భయంకరుఁడగు నా రాక్షసుఁడు తన్నేమిసేయునో యను భయము మున్నె యామెకు గలిగి యున్నది కావుననే మనసున దిట్టతనమెంతయున్నను, రూపము నందలి దైన్యము నామె కప్పిపుచ్చుట కనువుగాలేదు. ఆమె తొడవులు ధరింపలేదు. కాని నగలు తీసివేసిన యాచోట్లు సహజమగు నామె సౌందర్యముచేతనే చెన్నుమీఱి యున్నవఁట. పూవులు తీసివేసినను ఆమెకొప్పు జవ్వాదితావుల గుబాళించు చున్నదఁట. ఇంద్రుఁడు విజితుఁడయిన కారణమున నిట్లు నిరలంకృతయైయున్న యూర్వశి సర్వ భూషణభూషిత వోలె భాసించినది. కాని యీ భీతి ఆమె యందెంతకాలమో నిలువ లేదు. కామోపహతుఁడగు నరకుని చేష్టలఁ గాంచినంతనే ఆమెకుఁ గొంత లజ్జ జనించి నది. లజ్జపడుచు నామె చేరువనున్న కంబముం గదిసి చిత్తరువో యన్నట్లు నిలు చున్నది. అప్పుడామె చూపులు ఆమె వక్షస్థలమునందే నిలిచియున్నవి. నరకుఁ

డామెను జూచి సంభాషింప మొదలిడెను. సంభాషణకుఁ బూర్వమామెను సంబోధింప లేదు. అట్లు సంబోధింపక పోవుటకు నరకుఁడామె యెడ నప్పటికే మెత్తవడి యుండుట కారణము. తొలుత తన దిగ్విజయమును గూర్చి చెప్పినాఁడు. తత్పరిణామముగ నిర్జరాంగనలు అమరావతిని వీడిపోవుటను స్పష్టము చేసినాఁడు. అందఱు పోవునపు డూర్వశి మాత్రమేల పోరాదు? 'నీవు పొత్తులదానవు. అందులకే నీవు ప్రోలు తొలఁగి పోరాదు' అని నరకుని సమాధానము. ఊర్వశితోడి నరకుని యీ తొలి సంభాషణ మాతని మనఃప్రవృత్తికి దర్పణము వంటిది. కావున దానినిందు పొందు పఱచు చున్నాఁడను.

ఉ॥ ఆలలితాంగిఁ జూచి నరకాసురుఁ డిట్లను బాకశాసనుం
డాలములో ననుం గదిసి యంతక పాశి కుబేరయుక్తుఁడై
తోలుపులం బడెన్ సతులుఁ దోడనె డాఁగిరి దైత్యభీతలై
ప్రోలు దొలంగి తేమిటికిఁ బొత్తులదానవు నీవు తొయ్యలీ.

ఉ. హరి. 1 – 61

ఉ॥ నాకపురంబులో మెఱసి నందనకేళిఁ జరించి దివ్యకాం
తాకరతాలవృంతసముదాయసమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయగౌరవధన్యుఁడ నైన నాసభన్
నీకనుదోయివెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే.

ఉ. హరి. 1 – 62

మ॥ అవె సుత్రామరథంబు; లల్లవె కుబేరానేకపశ్రేణు; ల
ల్లవె వార్ధీంద్రుతురంగమంబు; లవెప్రేతాధీశవీరావళుల్
దవులం బాఱినఁ బట్టితెచ్చి రనిలోదైతేయు లేనొమ్ము లిం
దువిదా నీకుఁబ్రియంబుగై కొనుము నీయుల్లంబు దెల్లంబుగన్.

ఉ. హరి. 1 – 63

ఉ॥ కౌఁగిటి కాస చేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చి రా
రాఁ గొఱగానివాఁడనయి రామలతో నగుఁబాటు దేను నీ
కేఁగలఁగంగ సంపదల కేలవిచారము పద్మగంధి? నీ
లోఁగిటఁజేర్చ నేయుభయలోకసుఖంబులు నన్నుఁబొందినన్.
ఉ. హరి. 1 - 64

ఇందు మొదటి పద్యమునందలి భావము ముందే వివరింపఁబడినది. రెండవ పద్యమున నరకుని మనఃప్రవృత్తి మఱికొంత ముందునకుఁ బోయినది. తొలి పద్యమునందలి 'తొయ్యలి' అను సంబుద్ధి యందుఁ గన్పట్టు మసృణభావము 'నీ కనుదోయి వెన్నెలలు నిండక కోర్కెలు నాకు నిండునే' అను వాక్యమున ద్విగుణీకృతమై వ్యక్తమగుచున్నది. 'నిండక-నిండునే-' అను పదములు నరకుని కోర్కెలు పట్టి యిచ్చుచున్నవి. ఊర్వశి కనుదోయి వెన్నెలలు తన సభాభవనమంతయు నిండి యుండవలెనని నరకుని కోర్కె. నరకుఁడామె సౌందర్యమును మెచ్చుకొనుచున్నను, దీనమగు నామె యవస్థను, ఆ యవస్థకుఁ గారణమగు నామె మనసులోని భీతి నాతఁడు గమనింపక పోలేదని దీనిని బట్టి వ్యక్తమగుచున్నది. నిండయిన యామె యానందమే తన కొలువునకు నిండుతనము నిచ్చుననియు, నామె యానందమే తన యానందమనియు నరకుఁడిందు సువ్యక్తము గావించినాఁడు. మూఁడవ పద్యమున నరకుఁడు మఱొక మెట్టు పైకి పోయినాఁడు. స్త్రీలకు సొమ్ములయెడఁగల ప్రీతి యాతనికిఁ దెలియును. "ఏ సొమ్ము లిం దువిదా నీకుఁబ్రియంబు? గైకొనుము నీ యుల్లంబు దెల్లంబుగన్" అని చెప్పి, యూర్వశి మనసును లోఁగొనుటకు యత్నించినాఁడు. దీనినిబట్టి నరకుఁడు వట్టి మొరటు రక్కసుఁడు గాఁడనియు, చనవుచేసికొను నైపుణ్యము గలవాఁడనియుఁ బ్రత్యేకముగ స్త్రీ స్వభావము నెఱింగిన వాఁడనియు వ్యక్తమగుచున్నది. తరువాతి పద్యమున నరకునకుఁ గల లోకజ్ఞత వ్యక్తమగుచున్నది. మఱియు నాతనికిఁ గల ఋజుత్వము గూడ స్పష్టమగుచున్నది. కామాతురుఁడగువాఁడు తాను వలచిన వనితను మెప్పించుటకయి, ప్రౌఢతన ముట్టిపడునట్లు మాటలాడును. అబద్ధములు చెప్పి, ప్రమాణములఁ గావించి, మెఱమెచ్చు మాటలఁ గవ్వించియు నామెను లోఁగొనుటకు యత్నించును. తన తృష్ణ తీరినంతనే ఆమెను వదలివేయును. అప్పుడామెకు నలుగురిలో నగుబాటు తప్పదు. జాణతనమునఁ బెరొన్నికఁ గన్న యూర్వశి కిట్టి సందియములు గలుగుట సహజము. ఆ సందియములను బోగొట్టుట తన కర్తవ్యమని

నరకుఁడు భావించెను. అందులకే "కౌగిటి కానఁజేసి నొడికారితనంబున నిన్నుదేల్చి రారాఁగొఱగాని వాఁడనయి రామలలో నగుబాటుదేను" అని చెప్పి కామాతురుల యెడ స్త్రీలకుఁ గలుగు సహజమగు సందియములు తొలగింప నరకుఁడు యత్నించెను. ఇది యాతని పరేంగిత గ్రహణ పటిష్ఠతను వ్యక్తీకరించు చున్నది. "నీకేఁగలుగంగ సంప దల కేల విచారము పద్మగంధి?" అని యూర్వశిని నాగరకముగ బుజ్జగించినాఁడు. 'నీఁగలుగంగ' అను మాటలో నొక విధమగు గర్వచ్ఛాయ గన్పట్టుచున్నది. స్వర్లోక మును గూడ జయించిన తనయుంతదండ లుండగా నూర్వశి కింక త్రిలోకములందును బొందరానిదిగాని, పొందలేనిదిగాని, యుండదని దాని భావము. పద్మగంధి యను సంబుద్ధిలో తనయందలి సౌందర్యలోలుపత్వము వ్యక్తీకరించినాఁడు నరకుఁడు. తన్ను బొందిన నుభయలోక సుఖములను నామె లోగిటఁ జేర్తునని బాస యిచ్చినాఁడు. స్వర్వేశ్యగావున నూర్వశికి స్వర్లోకసుఖములు తెలియును. భూలోకసుఖములను గూడ నామెకుఁ గలిగించి, యామెను తృప్తి బొందింతునని నరకుఁడిచ్చట చెప్పు చున్నాఁడు. దీనికి వేఱొక యర్థము గూడఁ జెప్పవచ్చును. ఇంతవఱకు రాక్షసులు భయంకరులనియే యామెకుఁ దెలియును. నిర్జరులతోడి సౌఖ్యమామెకుఁ దెలియును. రాక్షసులు భయంకరులే కాక నాగరికముద్రల నెఱింగిన మేటి వీరులనియు, వారితోడి పొందునఁ గూడ నమందానందమును స్త్రీలు బొందఁగలరనియు నరకుఁడిందు సూచించి యుండును. ఇటలోకశబ్దమునకు జనమనియర్థము చెప్పవలెను."లోకస్తుభువనేజనే."

ఈ మాటలు విన్నంతనే ఊర్వశి చింతాక్రాంతయైనదఁట. ఇఁట చింతాక్రాంత యనఁగా దుఃఖముపొందినది యని యర్థము చెప్పవచ్చును. లేదా ఆలోచనలో పడినది యనియు నర్థము చెప్పవచ్చును. మొదటియర్థము కంటె రెండవ యర్థమే మేలుతర మని చెప్పవచ్చును. ఇట నామె దుఃఖించుట కవకాశము లేదు. నరకుఁడామె యెడ క్రౌర్యము వహింపక మెత్తని భావమునే ప్రకటించెను. ఆ భావ మామెకు నచ్చవచ్చును; నచ్చకపోవచ్చును. కాని యామె దుఃఖించుటకు మాత్రమవకాశములేదు. ఆలోచనకు మాత్ర మవకాశమున్నది. నరకుఁడామె పొందు నాశించినాఁడు. అదియామె కిష్టమే యగుచో నాలోచనలకును దావులేదు కాని యా క్రూరునితోడి పొందామె కిష్టములేదు. తనకిష్టము లేదని మఱొకరైనచో బహిరంగముగాఁ జెప్పవచ్చును. కాని సకల దిక్పాలకులను జయించి, స్వర్లోకసింహాసనాసీనుఁడయి యున్న నరకునితో నట్లు చెప్పుట ప్రమాదకరము. అట్లు చెప్పినంతనే యాతని మనసు మారి రాక్షసహజమగు క్రౌర్యమాతని నావేశింపవచ్చును. అప్పుడాతఁ డామెనెట్టి బాధలకు గుఱిసేయునో

యూహించుట కష్టము. మఱి యాతని కోరికకు ఔననియో కాదనియో ప్రత్యుత్తర మీయక తప్పదు. మూకీభావమును వహించుట మఱియు ప్రమాదకరము. అప్పు డామెకుఁ గర్తవ్యమొక్కటియే గలదు. అతని కోరిక కొప్పుకొనుచున్నట్లే నటించి తప్పించుకొనవలెను. ఇందు నేర్పు చాల కావలయును. తన్నామె మోసగించుటకు యత్నించుచున్నదని యా కరకు రక్కసుఁ డొక్కింత పసిగట్టినచో నామెను చిత్రవధల కెరగావించుట కాతఁడు వెనుదీయఁడు. ఇన్ని చిక్కులు ముందున్నవి కావుననే యామె తొలుత నాలోచనాధీనయైనది. తరువాత నొక్కింత తెలిసినదఁట. అనఁగా నామె కెద్దియో యుపాయము గోచరించిన దనుట. ఆ యుపాయ మిట్టిదని కవి తొలుతఁ జెప్పలేదు. మాటల వెంబడి నదియే తెలియఁగలదని కవి యూహ. ఈ క్రింది పద్యములలో నామెకుఁ దోచిన యుపాయము నందలి తెలిఘట్టము వ్యక్తమగును.

చ॥ చతురవచోవిలాస గుణసాగర! సాగరమేఖలావనీ
పతియగునీకు నింతు లొక భ్రాంతియె? నీ విటు గోరుటెల్ల నా
యతులితభాగ్య; మింత నిజ;మైనఁ గలంగకమున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి యొకనాఁడయినన్ ననుగారవించితే.
ఉ. హరి. 1 - 66

ఉ॥ నావుడు దానవేశ్వరుఁడు నవ్వుచు నూర్వశితోడ నిట్లనున్
నీవిటు దూఱ నేర్తువని నేరమి వెట్టితి గాక యేను మీ
దేవత లున్నవీటి కరుదెంతునె మిండఱికంబుచేఁతకై ?
లావున రాక వే ఱొకతలంపున వచ్చినఁ గీడు పుట్టదే ?
ఉ. హరి. 1 - 67

చ॥ అనుటయుఁబూర్ణచంద్రముఖియద్దనుజేంద్రునితోడనిట్లనున్
మనమున నింతమాత్ర మనుమానము గల్గిన నిందు నిన్ను ర
మ్మనుట పొసంగ; దొక్కదినమైనను నీవిహరించుచోటికిన్
ననుఁ బిలిపింప వైతి తగునా చన వింతకు నాకుఁ జెల్లదే ?
ఉ. హరి. 1 - 68

ఈ పద్యములలో మనకు రెండు విషయములు ముఖ్యముగా సువ్యక్తమగు చున్నవి. ఒకటి ఊర్వశి నెఱజాణతనము; రెండు నరకుని బుద్ధిమాంద్యము; సామాన్యముగ నెట్టివారును పొగడ్తలకు లోనగుదురు. చనవుచే విషము త్రాగింప వచ్చును కాని బలిమిచేఁ బాలుఁ ద్రావింపలేమను సామెత నేటిదికాదు. వరబలదర్పోద్ధతుఁడగు నరకుని మంచిమాటలచే వంచింపఁ దలఁచినది యూర్వశి. తాను వలచిన కాంత తన్ను పొగడుట కంటె హృదయంగమము, వాంఛనీయమునగు విషయ మెట్టివానికి నుండదు. దర్పోద్ధతుఁడగు నరకుని విషయమున నియ్యది ప్రత్యేకముగఁ జెప్పఁ బని లేదు. "చతురవచోవిలాస" ఇది యూర్వశి చేసిన మొదటి సంబుద్ధి. తన్ను జూచి నంతనే నరకుఁడు కొన్ని మాటలాడినాఁడు ఆ మాటలయందు చాతుర్య ముట్టిపడు చున్నదనియు, నయ్యవి తన్ను మిక్కిలిగ నాకర్షించినవనియు, నీ సంబుద్ధివలన నూర్వశి నరకునకు స్పష్టము చేసినది. నిజమునకుఁ దొలుత నరకుఁడాడిన మాటలలోఁ గొంత చాతుర్యమును గన్పట్టుచున్నది. ఎట్లయినను వెంగలితనము మాత్రములేదు. "గుణ సాగర" ఇది రెండవ సంబుద్ధి. ఇందలి నిజానిజముల దెలిసికొన నెవ్వరికిని సాధ్యము గాదు. ఎట్లయినను నీ ప్రశంసకు తలయూచని వారుండరు. ఈ రెండు సంబుద్ధులలో నూర్వశికిఁగల వాఙ్నైపుణ్యమును, లోకజ్ఞతయు వ్యక్తమగు చున్నవి. ఎట్టి పొగడ్తలఁ గావించిన నెంతటి మదోద్ధతుఁడయినను దలయూచి మెచ్చుకొనునో అట్టి పొగడ్తలనే యామె గావించినది. "సాగరమేఖలావనీపతి యగు నీకు నింతులొక ప్రాఁతియె? నీవిటు గోరుటెల్ల నా యతులిత భాగ్యము!" ఈ మాటలలో తొలుత నరకుని విజయోన్నతిని శ్లాఘించినది. అంతటివాఁడు తన్ను గోరుట తన యదృష్టమని తన సంతుష్టిని వ్యక్తము గావించినది. నా యతులిత భాగ్యమనుటలో నింతకుముందు తాననుభవించిన భోగభాగ్యము లన్నియు నీ భాగ్యమునకు అనఁగా "నరకుఁడు తన్నుగోరుట" యను భాగ్యమునకు సాటిరావనుభావము వ్యక్తమగుచున్నది. ఇంతవఱకు సంభాషణ సవ్యముగనే నడచినది. తరువాత నొక్క విరుపులో తన గడుసుదనమును వ్యక్తముగావించినది. తన గడుసుదనమంతయును జూపినది. 'కలంగకమున్న వైభవోన్నతి మెఱయుంగవచ్చి యొకనాఁడయినన్ నను గారవించితే'—ఇదియొక చిన్నప్రశ్న. ప్రేమగలవారే యిట్టి ప్రశ్నలు వేయుట కర్హులు. ఇట్టి ప్రశ్నలలోనే ప్రేమికులు తమ కొండొరులపైఁ గల యధికారమును వ్యక్తీకరించుకొందురు. నా మనసిప్పుడు కలఁగి యున్నది. ఇట్లు నా మనసు కలంగుటకుఁ గారణము నీకు నాయెడ వలపు గలదని తెలియక పోవుటయే ఇట్టి వైభవముతో నిచ్చటకువచ్చి మున్నెన్నఁడయిన నన్ను గారవించితివా? అట్లొకసారి

69063 / 41184

ర్థైన గారవించినచో నేఁడు నామనసింత కలఁతనొందుట కవకాశములేదుగదా! మఱియు నాయెడల ప్రేమగలవాఁడవు గావున నీ వైభవోన్నతులకు నేనుప్పొంగెడి దాననుగదా! ఇది యూర్వశి భావము. ఇంతటి మహార్థము నొక్క చరణములో నిమిడ్చిన సోమన నిజముగాఁ బ్రశంసార్హుఁడు.

దీనికి నరకుఁడిచ్చిన సమాధానములో నాతని బుద్ధిహీనత వ్యక్తమగుచున్నది. ఊర్వశి మాటలాతనికి రుచించినవి, కావుననే నవ్వుచు సమాధాన మిచ్చినాఁడు. కాని యా సమాధానములో తన బేలతనమును వ్యక్తము గావించినాఁడు. "నేను మీ దేవత లున్న వీటి కరుదెంతునె మిండరికంబుచేతకై? లావున రాక వేఱొక తలంపున వచ్చిన గీడు పుట్టదే?" ఇవి నరకుని మాటలు. "మిండఱికంబుచేతకై" యని చెప్పినంతనే, అతని తొలివలపులోని సౌకుమార్యము కొంత సడలినది. మఱియు తానొంటిగ మిండఱికంబు చేతకయి వచ్చినచోఁ గీడు ముట్టునని చెప్పి, తనకుఁగల బలపరాక్రమములను గూడ నరకుఁడు కొంచెపఱచు కొనినాఁడు. ఆతని బుద్ధిహీనతను ఊర్వశి పసిగట్టినది. ఆమె వాంఛించు చున్నదియుఁ గూడ నదియే. ఆమె యిఁక చింతాక్రాంతగాదు. పూర్ణచంద్రముఖి. ఆ బుద్ధిహీనునింకయు రెచ్చగొట్టవలయునని యామె సంకల్పము. "నీకీ మాత్ర మనుమానమున్నచో నిన్ను రమ్మనుట పొసఁగదు. నన్నయిన నీ వీటికి రప్పించు కొంటివా ? ఆమాత్రపు చనువు నాకులేదా ?" అని పలికినది. ఈ మాటలకు నరకుఁడిచ్చిన సమాధానములో కూడ నాతని మొరటుతనము వ్యక్తమగుచున్నది.

క॥ పగవాఁడతు దేవేంద్రుఁడు
మగువా నీ వతనికొలువుమానిసివటు నిన్
దగవు చెడి పిలువఁ బనుచుట
మగతనమే యిట్టిలంజెమాటలు గలవే. ఉ. హరి. 1 - 70

ఇది నరకుఁడిచ్చిన సమాధానము. దేవేంద్రుడు నాకు ప్రబల విరోధి. నీవతని కొలువు మానిసివి. అట్టియెడ తగవుసెడి నేను నీకు కబురంపుట మగతనమా ? ఎచ్చటనైన నిట్టి లంజెమాటలు గలవా ? అనినాఁడు. ఇందు 'తగవుసెడి' యనుమాట ప్రత్యేక ముగాఁ జెప్పఁదగినది. పగవాని కొలువు మానిసిని రహస్యముగా రప్పించుట బల వంతుఁడయినవాఁడు చేయఁదగినపనికాదు. తనకుఁ జేతనయినచో దేవేంద్రుని జయించి ఆతని కొలువు సేయుచున్నవారిని తన కొలువులోనికి రప్పించు కొనవచ్చును అది

విరోచితమగు న్యాయమార్గము. ఊర్వశి చెప్పిన యూహ విరోచితము గాదనియు, నయ్యది పందయగువాఁడే చేయుననియు, నరకుఁడు ప్రత్యాఖ్యానము గావించినాఁడు. ఇంతవఱకు సంభాషణ బాగుగనే సాగినది. కాని తుదిని "ఇట్టి లంజెమాటలుగలవే" అని పలికి తన మొరటుతనమును వ్యక్తీకరించినాఁడు. దీనితో నరకుని యెడల విన యము చూపవలసిన బాధ్యత ఊర్వశికి తీరిపోయినది. ఆతని ప్రేమలో సౌకు మార్యములేదు. కామ ప్రవృత్తికి లోనైన నరకుని స్వభావమున మూర్ఖత మాత్రమే వ్యక్తమగుచున్నది. ఆతని యసభ్య ప్రవర్తనకుఁ గుపితయైన యూర్వశి తన కోపమును లోలోన నడఁచుకొని, మఱల నొక యెత్తెత్తినది. ముందు పల్కిన వాక్యములలో నరక ప్రశంస గన్పట్టుచున్నది. క్రింది పద్యములందు తన్ను తాను గొంచెపఱచుకొని; మాట లాడుచున్నది.

ఉ॥ లంజియ నౌదు నేను విను లావున నీ వమరేంద్రు గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదముచేసితిగాక చిత్త మె
ల్లం జెడి యుండ రిత్తయొడలం జవిచేరునె చిల్కవోయినం
బంజర మేమి సేయ? రసభంగము సంగతిలోన మెత్తురే.
ఉ. హరి. 1 - 72

ఉ॥ నవ్వులమాటలో నిజమొ నాకములోన ననేకకన్యకల్
మవ్వపుదీఁ గెలం దెగడు మానిను లుండఁగ నంత నెన్నఁడో
జవ్వన మమ్ముకొన్న గడసాని ననుం గవయం దలంచితే
పువ్వులువేడుకైనఁ గడివోయినవాళ్ ముడువంగ వచ్చునే.
ఉ. హరి. 1 - 73

'లంజియనౌదు' యీ వాక్యములో నామె క్రోధము నియతమయ్యు, వ్యక్తమగుచున్నది. తరువాతి వాక్యములలో మున్ను తానాడిన మాటలకు నరకుఁడిచ్చిన సమాధానమును ఖండించుచున్నది. నరకుని మాటలలో పగవాని కొలువు మానిసిని రహస్యముగ రప్పించుట పందతనమె యనుభావము వ్యక్తమగుచున్నది. ఆ మాటల నూర్వశియు నమ్మతించినది. కాని బలపరాక్రమములు మెఱయ నింద్రుని జయింపవచ్చును. ఊర్వశిని సభకు రప్పింపవచ్చును. కాని ప్రేమ వ్యాపారమునకును, బలప్రయోగము

నకును సంధి కుదురదు. కావుననే 'చిల్కవేయినం బంజరమేమి సేయు' అని ఊర్వశి సమాధానము. తన మనస్సతంయుఁ జెడియుండుసపుడు కేవల శరీరసంబంధమున నేమి యానందము కలదని భావము. ఈ మాటలలో నింద్రుని పరాజయమువలన దన మనస్సెంత వికలమయినదియు వ్యక్తము గావించినది. మఱియు నింద్రునియెడఁ దనకుఁగల సద్భావమును గూడ సూచించినది. కామ ప్రవృత్తియే తప్ప వలపు రుచి నెఱుగని నరకున కూర్వశి మాటలయందలి సూక్ష్మార్థములు వ్యక్తము కాలేదు. వ్యక్తము కావనియు నూర్వశి తెలిసికొన్నది. అట్టిలోతు లేనివానియెడల వ్యంగ్యముకంటె వాచ్యమే బాగుగా పనిచేయును. అందులకే ఊర్వశి వానినిట్లు ప్రతారించెను. వెంటనే మఱల నింకొకమాటచే తాననిన వ్యంగ్యార్థమును గప్పివైచెను. 'ఇవి నవ్వుల మాటలా? సత్య వాక్యములా? స్వర్గమున నందకత్తెలకు లోటులేదు. సంతలో నెన్నడో జవ్వన మమ్ము కొన్న గడసానిని నేను. అట్టి నన్ను నీవు గవయఁ దలంచుట నిజముగా నచ్చెరువుఁ గొల్పుచున్నది. పువ్వులువేడుక కావచ్చును కాని వాడిన పువ్వుల నెవ్వఁడు ధరించును?'' ఈ మాటలలో నొక విధమగు నాత్మతిరస్కారమున్నది. ఇట్టి తిరస్కారముచేత వానికిఁ దనయెడల నేవగింపుఁ గలిగింప నూర్వశి ప్రయత్నించినది. దీనికి నరకుఁడిచ్చిన సమాధానము మఱియు నాతని పశుత్వమును వ్యక్తీకరించుచున్నది.

క॥ అంజెదవుగాక నసుఁ జెం
తం జేరఁగనీక యెంతదఱిఁగిన మిరియా
లుం జొన్నల సరి పోవే
లంజెతనములందుఁ గొమిరెలన్ గెలువ వటే.

ఉ. హరి. 1 – 75

"మిరియాలుం జొన్నల సరిపోవే'' అను మాటలో నరకుని పశుత్వము సంపూర్ణముగా వ్యక్తమగుచున్నది. 'లంజెతనమునందు గొమిరెలం గెలువవటే'–అను మాటలో నాతని నీచవాంఛ వ్యక్తమగుచున్నది. కావుననే ఊర్వశి యీ క్రింది మాటలను బలికినది.

గీ॥ అనుడు నవ్వామలోచన యతనిఁ జూచి
చిఱుతనగవుల దెప్పల సిగ్గు దేర్చి
నీవు రాజవు! మాటలు నిన్నుఁ గడవ
నాడ నేర్తునె, విన్నప మవధరింపు. ఉ. హరి. 1 – 76

చ॥ శతముఖుఁ డోడె నీవతనిసంపద కంతకు రాజవైతి త
చ్చతురవిలాసినీగణము సంతతసేవ యొనర్చు నీమనో
హితముగ నింక నేననఁగ నెంతటిదాన మహిన్మహామునుల్
క్రతువులు సేయుచోటికధికారివిగాని కొఱంత యేటికిన్ ?
ఉ. హరి. 1 - 77

క॥ యాజకులు యజ్ఞభాగ
భ్రాజిష్ణునిఁ జేయ నిన్ను భావజసౌఖ్యా
వ్యాజపదరాజుఁ జేసెదఁ
దేజమునూ వలపు దెలుపుఁ దెఱవల కెందున్.
ఉ. హరి. 1 - 78

నరకునితోఁ గొంతసేపు మాటాడినంతనే యూర్వశి కాతని యానుపానులు తెలిసిపోయినవి. కేవల కామాంధుఁడును, మూర్ఖుఁడునగు నాతని తానెట్లాడించిన నట్లాడగలఁడని యామెకు వ్యక్తమయినది. కాని యది పులితో చెలగాటము. కావున నట్టియెడ జాగరూకత వహించుటయు నత్యావశ్యకము. వానియందు తనకుఁ బ్రేమయున్నట్లు నటింపవలయును. వానిని పొగడవలెను. కామాంధుఁడును, విజయ గర్వితుఁడును నగు నాతఁడు తన ప్రేమ వాగురలలో పడితీరును. అందులకే యామె 'చిఱుతనగవుల రెప్పల సిగ్గుతేర్చినది. ఒయ్యారముగ వానిని జూచినది, నవ్వినది.' నరకుఁడుబ్బిపోవుటకివి చాలును. వాచ్యముగా నిట్లు పలికినది. 'శతముఖుఁడోడె' ఇది మొదటి పొగడ్త. నూఱు యజ్ఞములు చేసినగాని యింద్రత్వము లభింపదు. అవియు సామాన్య యజ్ఞములుగావు; అశ్వమేధములు. అశ్వమేధము గావింపవలెనన్న తక్కుంగల రాజన్యు లందఱు నాతనికి వశము గావలయును. అట్టి యశ్వమేధములు నూఱు గావించినవాఁడే యింద్రత్వమున కర్హుఁడు. ఈ శతముఖశబ్దములో నింద్రుని బలపరాక్రమములు వ్యక్తమగుచున్నవి. మఱియు నాతని పవిత్రతయు స్ఫురించుచున్నది. అట్టి శతముఖుని జయించుటచే నరకుఁడు గూడ నవక్రబలపరాక్రమోపేతుఁడని చెప్పకయ చెప్పుచున్నది. అంతటి వానిని జయించిన మేటికి 'తచ్చతురవిలాసినీగణము సేవచేయుటొక వింతగాదు.' అట్టియెడ ఊర్వశిపొందు గూడ నొక గగనారవిందము గాదు. కాని శతముఖుని యందున్న ఒక్క ప్రజ్ఞ నరకునియందు లోపించియున్నది.

యాజకు లిప్పటికిని యజ్ఞభాగములను బూర్వపు శతమఖునికే యర్పించుచున్నారు. ఇంద్రత్వమునకు ముఖ్యచిహ్నము యజ్ఞభాగభాజిష్ణుతయే కాని స్వర్లోకాక్రమణము మాత్రమే కాదు. కావున నరకుఁడు గూడ యజ్ఞభాగభాజిష్ణుఁడగు నప్పుడ తనంతటఁ దానె ఆతనిని భావజసౌఖ్యావ్యాజపదరాజుఁ జేసెదనని యూర్వశి యుద్ఘాటించి పలికినది. ఆ మాటలు వినినంతనే నరకుఁడు మోసపోయినాఁడు ఆమెకుఁ దనయందు వలపు గలదని యెంచినాఁడు. ఆ చిఱునగవులు, ఆ సిగ్గుదొంతరలు, తన్నుఁజూచియే యని మురిసిపోయినాఁడు. మఱియు నామె కోరిన కోర్కెయు నాతనికిఁ గడుంగడు చిన్నదిగాఁ గన్పట్టినది. ఇంద్రాది దిక్పాలుర జయించిన తనకు బడుగు యాజకులనుండి యజ్ఞ భాగముల గైకొనుట యొకపనియా? ఊర్వశి కోరిన యీ చిన్న కోర్కెను దీర్పకుండుట తన రసికత్వమునకే లోపమని యెంచినాఁడా మూర్ఖుఁడు అందులకే వెంటనే యామె కోర్కెకు తా నంగీకరించుచు నిట్లు బలికినాఁడు.

చ॥ అవు నిదివోలువాసవుఁడు నంతకుఁడున్వరుణుండుఁబార్వతీ
ధవసఖుఁడుం బ్రతాపమునఁ దత్పద మేలెడి రంచు నిట్టినే
నవిహితయాగభాగము లహంకృతిమైఁ గొనకున్ననూర్వశీ
కవకవ నవ్వరే త్రిదశకాంతలు వింతలుసేయు నాపనిన్.

ఉ. హరి. 1-80

ఊర్వశీ నరకాసుర సంభాషణలో నాచన సోముఁడు చిత్రములగు రెండు మనః ప్రవృత్తులను మన సమ్ముఖమున నిల్పినాఁడు. విషమమగు నొక సన్నివేశము నుండి యూర్వశి తప్పించుకొన్నది. దుర్గమమగు నొక విజయమును సాధించిన నరకుఁడు, హఠాత్సంభవమగు నొక సన్నివేశమునకులోనై తన్నుదాను మఱచి, యొక స్వర్వేశ్య మాటకారి తనమునకు మోసపోయినాఁడు. తుదకు మృత్యువును గూడ నాహ్వానించి నాఁడు. విలక్షణ మనఃప్రవృత్తుల నాధారముగఁ గొని యిట్టి సంవిధానమును గల్పించుట మహాకవులకు మాత్రమే చెల్లును.

ఊర్వశీ నరకాసుర సంభాషణ మొక సంవిధానము. ఈ సన్నివేశమునందే మఱొక సన్నివేశము సూచింపఁబడినది. ఊర్వశి కోర్కెనంగీకరించి, నరకుఁడు స్వర్లోక మును వీడి మాహిష్మతీపురమునకు వచ్చినాఁడు. అమరావతీ పురమునఁగల కన్యకా

జనమునందు చక్కనివారి నేర్చి, తనతోఁ దెచ్చినాఁడు. నందనవన పాదపములను బెకలించి, తన పురమున నాటించినాఁడు. తిరువాత చతుర్దశి యను కన్యకను వివాహ మాడినాఁడు. అదియొక రాక్షస వివాహము. చతుర్దశి యను కన్య త్వష్టకు నుదాహరయందు జన్మించినది. గంధగజరూపమును ధరించి, యామెనెత్తుకొని వచ్చినాఁడు నరకుఁడు. మఱియు గంధర్వదేవమానుష కన్యకలను పదారు వేలమందిని చెఱవట్టినాఁడు. అగ్నికి వాయువు తోడైనట్లు మురుఁడను దైత్యుఁడు నరకునకుఁ దోడయి వర్తించినాఁడు. దేవమాత యగు నదితి కుండలముల నపహరించి, మురదైత్యుఁడు నరకున కవ్వానిని నూడిద యిచ్చినాఁడు. మురనరకాసురులిరువురును బెట్టు బాధలకు మునిగణము గూడ నంచలించినది. అంతవఱకు నరకుఁ డూర్వశి మాటనే మఱచినాఁడు. ఇది యాతని మదోన్మత్తమును వ్యక్తము సేయుచున్నది ఒక్కనాఁడూర్వశి యన్నమాట యాతనికి జ్ఞప్తికి వచ్చినది. వచ్చినంతనే నరకుఁడు ఋషులకడకేగి వారితో నిట్లు పలికినాఁడు.

మ॥ ఒకనాఁ డూర్వశిమాటపొందు నరకుండూహించి నాకాధినా
యకునిం దాపసముఖ్యులధ్వరము చేయం బూని రావించు చో
టికి దాఁ బోయి ధరామరావళులు రెంటింగొంటిమీ కెల్లనే
లికనై యుండెదయాగభాగములుపాలింపన్విభుండయ్యెదన్.
ఉ. హరి. 1 - 90

శా॥ పాళిం బాఱఁగఁ దోలి యంతకు దిశాపట్టంబు గావించి పూ
ర్వాశాధీశ్వరు వెన్నడిం జని ధనాధ్యక్షున్ విభాళించి కే
లీశస్త్రాస్త్రవిహారసార మెచటన్ లేకుండ నిర్మించితిన్
మీశాస్త్రుంబుల నింక నెవ్వరి కగున్ మేలైనయజ్ఞాంశముల్.
ఉ. హరి. 1 - 91

నరకుఁడు వారియొద్దకుఁబోయి బలవంతముగా యజ్ఞభాగముల నాహరింపలేదు; వారిని బ్రతిమాలను లేదు; బెదరించనులేదు; కాని బ్రతిమాలుటయు, బెదరించుటయు రెండు నీ మాటలయందుఁ గలవు. పైకి సాధువుగాఁ జెప్పినట్లే యున్నది. ఊర్వశీ మనస్కుఁడయిన నరకుఁడిట్లుచేయును. ఆమె ప్రేమ సాధుమార్గమున సాధింపఁ దగి

నది. కాని వానియందున్న సహజదైత్యలక్షణ మెచ్చటికిఁ బోవును? సహజమైన దౌష్ట్య మెచ్చటికిఁ బోవును? ఈ లక్షణమేకదా వెనుక నూర్వశిచేత నరకాసురుఁడు ప్రతారింపఁ బడునట్లు చేసినది. ఆ లక్షణమే యిచ్చటను బనిచేయుచున్నది.

నాచన సోమన్న నరకాసురుని పరాక్రమము, దైత్యత్వము, రసికత్వము, తాను వాదనిపుణుఁ డనుకొనుచున్న యొక లక్షణము-నీ నాల్గు భావములు కలిగిన జీవుఁడుగా సృష్టించినాఁడు. ఆయనది చాల సూక్ష్మమైన శిల్పము, సామాన్య కవులను జదివి నట్లుతనిని జదువరాదు.

అపుడు మును లిట్లనిరి. "అయ్యో యాగము లేలెడి వాఁడింద్రుఁడొక్కఁడే. బలముచేత నాధిక్యము వచ్చునా? న్యాయము విచారించకుండ నెందుకుఁ గూడని పనికిఁ జొచ్చెదవు?" అనిరి. అంతటితో నూరకుండిన నెట్లుండెడిదో? మఱియు నిట్ల నిరి. దానవులఁట, బలులఁట, మునులఁట, యజ్ఞములఁట, నమోవిశ్వసృజే, కొట్టుకొని పోయి యెవఁడింటికంబమును జేయునని. ఇందలి సొగసంతయు నమోవిశ్వసృజే యన్న మాటలో నున్నది. "కొట్టెవ్వఁడింటి కంబము సేసెన్"—మొదటి మాటలోని యాశ్చర్యము, రెండవ మాటలోని నింద రెండును నరకున కెంత గ్రుచ్చుకొనెనో! ఈ మాటలు విన్నతరువాత నరకుఁడింక కొంచెము బిగిసెను. అతఁడిట్లనెను. 'నేనే మఖాంశశ్రీలకేలికను, ఏల ననఁగా నేనే యిప్పుడు త్రిదివేశ్వరుఁడను. కనిపించని దైవము వరమిచ్చునా?

ఇంతటితో నతఁడు పోఁడని మునులు వానిని నిందించిరి. నీవు పాపాత్ముఁడవు, దానవుఁడవనిరి. దానితో నాతనికి మిక్కిలి కోపము వచ్చినది. తన పరివారమును బిలిచి, వారి యాశ్రమమును బాడుపెట్టుఁడని తాను తనవీటి కేగెను.

సోమనయొక్క సంవిధాన చక్రవర్తిత్వ మిక్కడ నున్నది. ఈ సంవిధానములో నున్న ప్రధాన విషయమేమి? దానిని బురస్కరించుకొని యందలి వ్యక్తుల ప్రవర్తన ముండును. సంవిధాన స్వరూప మేమనఁగా నరకునకు సహజముగా యాగభాగవాంఛ లేదు. దాని యంతట నది యతనికిఁ గోరవలసినదికాదు. దానిమీఁద నతనికిఁ గోరికలేనేలేదు. కాని యిది యన్య ప్రయోజనము కొఱకుఁ జేయఁదగినది. అది సమ కూడునేమో ప్రయత్నించును. సమకూడనిచో దానిని ధ్వంసము చేయును. ఆ ధ్వంసము చేయుట తన కోపమును నివారించునదేకాని, ప్రత్యక్షమయిన కోరిక భంగపఱుపఁ

బడగా వచ్చెడు తీవ్రకోపమునుగాదు. అట్టి కోపమయినచో నా ఋషివాటికఁ దానే పాడు చేయును. దాని పాడ్వడుట తాను గనులారఁ జూడవలయును. అప్పటికిఁ గాని కసి తీఱదు. ఇది యన్యార్థపతితమైన వ్యవహారము. అందుచేతఁ దన పరివారముతోఁ జెప్పి వెడలిపోయెను. ఈ మునులతోఁ దుదముట్ట వాదించనులేదు. వారు తన్ను నిందించుఁగాఁ బరివారముతోఁ జెప్పి వెడలిపోయెను.

ఆ నరకుని యొక్క రీతి, యతని ప్రభుత్వ లక్షణము, నాతనికి నూర్వశి యందుఁగల ప్రేమకూడ దీనివలన వ్యక్తీరింపఁ బడుచున్నది. వలసినచో తేపూర్వశితో నేనామునుల నేమియుఁ జేయలేదు; మా పరివారమేదో చేసినదని రాచఱికపు సమా ధానము చెప్పవచ్చును. అన్నియుఁ గలిపి యెనిమిది పద్యములు.

## విప్రకుమారరక్షణము :

ద్వితీయాశ్వాసమున నింకొకమనోజ్ఞమగు సన్నివేశము గలదు. అందు శ్రీకృష్ణుఁడు మృతులయిన విప్రకుమారులను రక్షించిన వృత్తాంతమున్నది. ఇది యమ్మహాత్ముని పరమపురుషత్వమును సూచించు నుదంతము. దివ్యాస్త్ర సంపద నెంతగాఁ గలిగి యున్నను మానవవీరులద్దానిని జేయఁజాలరు. ఈ కథలో నర్జున గర్వభంగముకూడ నిమిడియున్నది. అకాలముననేకైక ధనుర్ధరుఁడనని విఱ్ఱవీగు నర్జునుఁడు, విప్ర కుమారుల రక్షింపఁజాలక, తెల్లమొగము వైచును. ఈ కథా సంవిధాన ప్రారంభమిట్లు సేయఁబడినది.

క॥ ఒకనాఁడొక శాస్త్రములో
నొకక్రతువొకనాటి దీక్షకొ౯రిన గని ధా
ర్మికుఁడా హరి యదిగైకొని
యొకచో నుండంగ విప్రుఁడొకఁడేతెంచెన్. ఉ. హరి. 2-5

శరతల్పగతుఁడగు శాంతనవునాజ్ఞ నర్జునుఁడు, యుధిష్ఠురునకీ వృత్తాంతమును జెప్పుచున్నాఁడు. ఇందు శ్రీకృష్ణ మహాత్మ్యము వ్యక్తీకరింపఁ బడినది. ప్రారంభము ననే యర్జునుఁడు 'అరుదాదేవునియందుఁ గంటి నొకకృత్యం బెవ్వరుం జేయరున్'—అని చెప్పి యాకృత్య మనితర జనసాధ్యమని స్పష్టీకరించినాఁడు. 'ఎవ్వరున్' అను మాటలో మనుష్యులేకాక దేవదానవులు గూడ నిమిడియున్నారు. 'ఆ పురుషోత్తముని

గొలిచి యేనున్నయెడన్' అను వాక్యమునందలి పురుషోత్తమ శబ్దముకూడ సార్థకమే. తన పురుషోత్త మత్వస్థితిని గూర్చి, శ్రీకృష్ణ పరమాత్మయే యిట్లు చెప్పియున్నాఁడు.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః
అతోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః
యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః—[1]

లోకమున క్షరము, అక్షరమునను నిరువురు గలరు. సర్వభూతములును క్షరము లనఁబడును. కూటస్థుఁ డక్షరుఁడనఁబడు చున్నాఁడు. పరమాత్మ యనఁబడు నుత్తమ పురుషుఁడొకఁడు గలఁడు. అవ్యయుఁడు, నీశ్వరుఁడునగు నాతఁడు లోకత్ర యము నావరించియుండును. 'క్షరమునకతీతుఁడ నగుటచేతను, అక్షరమునకంటె నుత్తముఁడనగుటచేతను, లోకమందును, వేదమందును బురుషోత్తముఁడను పేర నేను ప్రసిద్ధుఁడను.' ఈ వాక్యములను బట్టి, పురుషోత్తమ పదమునకుఁగల ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది. క్షరాక్షరముల కతీతుఁడగు పరమపురుషుఁడే పురుషోత్తమ పద వాచ్యుఁడగును. అతఁడే అనన్యసాధారణ మగు మహాకార్యములను నిర్వహింప సమర్థుఁడు.

ఇఁక మొదట నుదాహరించిన పద్యమునందలి వైచిత్రిని గమనింతము. ఒక నాఁడొక శాస్త్రములో నను పద్యమున నిదమిత్థమని యెద్దియును జెప్పఁబడలేదు. అంతయు హరాత్సంభవమని యర్థము. "ఒకనాఁడు అని సామాన్యముగఁ జెప్పుటచే నా దినమునకుఁ బ్రత్యేకముగఁ జెప్పఁదగిన విశిష్టత యెద్దియు లేదనియు, నయ్యది యొక పర్వదినము వంటిది కాదనియు, వ్యక్తమగుచున్నది. ఒక శాస్త్రములో నను మాటయు నట్టిద. ఆ శాస్త్ర మిట్టిది అని చెప్పుట కర్జునుఁ డిష్టపడలేదు. కాని యది శాస్త్ర విహితమే యని మాత్రము చెప్పినాఁడు. 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితే"—అను గీతావాక్య మిట ననుసంధేయము. అందులకే ధార్మి

1. పురుషోత్తమ పదప్రాప్తి 16, 17, 18 - శ్లోకములు.

కుఁడగు హరి యని నొక్కి చెప్పినాఁడు. ధార్మికుఁడు కావుననే శాస్త్ర విహిత ధర్మాచరణమునకుఁ గడంగినాఁడు ఆ క్రతుదీక్ష యెచ్చట గైకొనఁబడినది? ఆ విషయమునఁ గూడ నర్జునుఁడు మూకీభావమునే వహించినాఁడు. అప్పుడు విప్రుఁడొకఁడేతెంచినాఁడట. ఇట్లు చెప్పుటచే నా విప్రుని యందెట్టి విశిష్టతయు లేదని వ్యక్తమగుచున్నది. అతఁడు మౌనిగాని, ఋషిగాని, బ్రహ్మర్షిగాని గాడు. సామాన్య విప్రుఁడు. ఆ విప్రుఁడు సామాన్యుఁడే యగుగాక, అతనికిఁ గల్గిన కష్టమపారమైనది. ఇట దేశకాలములతోఁ బనిలేదు; వ్యక్తులతోఁ బనిలేదు. సామాన్యుఁడగు నావిప్రునకు గలిగిన మహాకష్టము, తన్నివారణము—ఆ రెండే ముఖ్యవిషయములు ఆ విప్రుఁడేడ్చుచునే వచ్చినాఁడు. అతని పుత్త్రులు ముప్వురప్పటికి హరింపఁబడిరి. కలుగనున్నది నాల్గవకాన్పు. ఆ కాన్పు గూడ తనకుఁ దక్కదేమో యని యా విప్రుఁడు విహ్వలుఁడయి, ఆర్తత్రాణపరాయణుఁడును, అతిమానుషబలోపేతుఁడును నగు శ్రీకృష్ణుని కడ కేతెంచినాఁడు. అతని యార్తిని, యార్తితోడి యాతని రూపమును, సోమన యీ క్రింది పద్యములలో వర్ణించినాఁడు.

చ॥ అకట కుమారులార కడుపార మిముం గని పాలువైచు త
ల్లికి నటు నూచుతండ్రికి బలే తొలుబాముననే లేవునోములూ
రక ననుఁగన్నుఁ బ్రామి విధిరత్నపుబొమ్మల నాఁచికొన్న నా
మొకమున వ్రేలుచున్నయవి ముప్వురమూర్తులునంచునార్తుఁడై
ఉ. హరి. 2-6

క॥ వెడ పీడెడుదోవతియును
బెడతలచేతులు వడంకుపెదవులు తూఁగా
డెడువెండ్రుకలునుఁ బైపై
వెడలెడు కన్నీరుఁ గలుగువేషముతోడన్. ఉ. హరి. 2-7

ఈ రెండు పద్యములలో నా విప్రుని మనోధర్మమును మన కన్నులకుఁ గట్టినట్లు వ్యక్తీకరించినాఁడు సోమన. తరువాత శ్రీకృష్ణు నాతఁడు చేసిన స్తోత్రము మఱియు నన్వర్థము.

క॥ ముందటు నిలిచి మురాంతక
మందరధర భక్తలోకమందార దయా
కందళితహృదయ సురముని
వందితపాదారవింద వసుదేవసుతా. ఉ. హరి. 2-8

మొదట 'మురాంతక' యని సంబుద్ధి. తన పుత్త్రులను ముగ్గురను రాక్షసులెవ్వరైన నపహరించిరేమో యని విప్రుని యనుమానము కావలయు. మురదైత్యుఁడు భూలోక స్వర్లోకముల గాలించి, స్త్రీలను బట్టి నరకున కిచ్చినాఁడు. అట్టి మురాసురుని శ్రీకృష్ణుఁడు సంహరించినాఁడు. తన పుత్త్రులను గూడ నట్టి రాక్షసుఁడెవ్వఁడో యపహరించి యుండు ననియు, మురాసురుని సంహరించినట్లా దుష్టుని గూడ సంహరించి, తన పుత్త్రుని రక్షింప వలయుననియు విప్రుని ప్రార్థన. రెండవ సంబుద్ధి మందరధర, యని యున్నది. మందరపర్వతమును క్షీరసముద్ర మథనావసరమున భగవంతుఁడు వహించినాఁడు. తన్మూలమున నమృతము లభించినది. అమృతము సేవించిన దేవత లమరులయినారు. ఇట శిష్ట రక్షణము వ్యక్తీకరింపఁబడినది; మురాంతక పదమున దుష్టశిక్షణము వ్యక్తీకరింపఁబడినది. భక్తలోక మందార యను సంబుద్ధియందు తనకోరిక తప్పక సఫల మగునను దృఢనిశ్చయము వ్యక్తమగుచున్నది. 'దయాకందళితహృదయ' అను సంబుద్ధియందు తన యందున్న పాత్రతకంటె శ్రీకృష్ణునియందున్న దయాగుణమే తన కోర్కె సిద్ధించుటకు బలీయమగు హేతువని స్ఫుటము చేయుచున్నది. 'సురముని వందిత పాదారవింద యను సంబుద్ధి శ్రీకృష్ణుని యతిలోక మాహాత్మ్యము, సర్వలోక పూజ్యత్వము వ్యక్తమగుచున్నవి. ఇట్లు ప్రతిపదము నన్వర్థముగ రచించుశక్తి మహా కవులకు మాత్రమే కలదు.

విప్రునియార్తి భంగిఁ జూచినంతనే మురవైరియుఁ గొంత కలతఁ జెందినాఁడు. వారిరువురను జూచిన యర్జునునకుఁ గూడ కన్నీరాగలేదు. తొలుదొలుత శ్రీకృష్ణుఁడు కొంత తత్త్వబోధ గావించి, విప్రుని దుఃఖమున కుపశమనము గల్పింప యత్నించెను. కాని భూసురుఁడవ్వాసుదేవునికి తన కష్టముల నిట్లు విన్నవించుకొనెను.

క॥ ఓపురుషోత్తమ! యెట్లు ప్ర
లాపింపక యుండుదుం జలంబున విధి నా
పాపల ముగ్వురఁ దోడ్తోఁ
జూపోపక చంపెఁ దత్ప్రసూతిదినములన్. ఉ. హరి. 2-14

మ॥ అవి యెల్లం గడచన్న నేఁడు దుదగా నస్మత్కళత్రంబు గౌ
రవమున్ మోదముఖేదమున్ బెరయగర్భంబిమ్ములందాల్చినన్
నవమాసంబులు నిండె గుండెవగిలెన్నాకంతలోఁగొంత లో
కవినోదంబుల కీఫలంబు చవి దక్కంజేసి రక్షింపవే.

ఉ. హరి. 2-15

సీ॥ తడి యొత్తుచీరతో దాది కౌఁగిటఁ జేర్చి
చూపంగఁ గన్నారఁ జూడ నైతిఁ
దడవి యాడకమున్న తట్టాడు మని పట్టి
వడఁకంగ సెజ్జపై ప్రాల్పనైతి
నల్లంతదవ్వుల నప్పలప్ప లనంగ
నెదురుగాఁ బఱతేర నెత్త నైతి
వియ్యాలచే నిచ్చి వేడుక నను వారు
తిట్టింప విని దప్పి దేర నైతి
తే॥ నకట మిథ్యామనోరథుం డైతిఁ గాని
కొడుకులం గని దమవారు గొండ సేయ
నుండ లే దయ్యో సంపద లుబ్బె నేని
లేబరమ కాదె బిడ్డలు లేనిబ్రతుకు. ఉ. హరి. 2-16

క॥ ఈగర్భము రక్షించిన
నాగౌరవ మేమిఁ జెడకనారాయణ! నా
నాగుణసంపన్నులలో
సాగుదు నటు గాక యున్న సమయుదు వగలన్.

ఉ. హరి. 2-17

ఈ వాక్యములు వినినంతనే లేతనగవొకింత మాధవుని యానన పద్మము నలంకరించినదఁట. ఈ నవ్వునకుఁ గారణము లనేకములు గలవు. ఇది విప్రునిపై శ్రీకృష్ణునకుఁ

గల జాలిని వ్యక్తము సేయును. నశ్వరమగు నీ ప్రపంచము పయి మానవులకుఁ గల మమత్వమును జూచినంతనే క్షరాక్షరముల కతీతుఁడగు పురుషోత్తముని యెదలో జాలి గల్గినది. కాని యీ మమకారమును వీడుమని విప్రునకు బోధించుటవలన నప్పుడు ప్రయోజనములేదు. తానాకార్యమును సాధించి తీరవలయును. ఇదియు నొక మమత్వమే. పురుషోత్తమునకు జీవులపైఁ గల మమత్వము. ఈ విషమ పరిస్థితిని గమనించి నంతనే మాధవుని మోమున లేనవ్వు తొంగి చూచినది. కాని తాను యజ్ఞదీక్షితుఁడు. తానా దినమున నెచ్చటికిని బోవుటకు వీలులేదు. 'మన్ననఁ గృపసేయు నేఁడొక దినంబును దీక్షితుఁడైన నాకు; రాననువగు నెల్లి భూసురకులాగ్రణి! యన్ని విధంబులందు నీ తనయునిఁ గాతు'—అని భూసురాగ్రణిని వేడుకొనినాఁడు. సర్వజగద్రక్షకుఁడగు పురుషోత్తముఁడు అతని మమత్వమున కీసడింపలేదు; అతని దీనావస్థను నిరసింపలేదు. ఆసమయమున వచ్చినాఁడని విసువుకొనలేదు. కేవలమొక్క దినము గడువిమ్మని యధమర్ణుని వోలె శ్రీకృష్ణుఁడు వేడుకొనినాఁడు. ఇది చిత్రమగు నంతఃకరణ ప్రవృత్తి. రక్షకుఁడే రక్షితుని వేడుకొనుట యార్షసంప్రదాయముననే గన్పట్టును. "హ్రియాదేయంభియాదేయ"మ్మని చెప్పిన శ్రుతి వాక్యము లిట్టి సంప్రదాయమునే బోధించుచున్నవి; విధించుచున్నవి. శ్రుతిమూలుఁడగు జగన్నాథుఁడందులకే తన్నర్థింప వచ్చిన విప్రుని తానే యర్థించినాఁడు. కాని విప్రుని దీనావస్థ కడు విషమమయినది. అతని భార్య కప్పుడే ప్రసూతి వేదన లారంభమైనవి. ఆ యొక్క దినమును గడచినచో నింక శ్రీకృష్ణుఁడు మాత్రము వచ్చి చేయున దేమి గలదు? చేతులు కాలిన తరువాత నాకులు పట్టుకొన్న ప్రయోజనమేమి? అందులకే "యంత్రలో మాడిన నేమిసేసెదవు. మంత్రపు నీళులు సల్లవచ్చునే" అని విప్రుఁడాక్రోశించినాఁడు. ఈ వాక్యములనుబట్టి మనకు విప్రుని మనస్తత్త్వము వ్యక్తమగుచున్నది. అతనికి బుండరీకాక్షుని శక్తిసామర్థ్యములు సరిగా తెలియవు. శ్రీకృష్ణునిలో దివ్యములగు కొన్ని శక్తులు కలవనియు, సామాన్య వీరుల కలవి కాని కార్యముల నాతఁడు సాధింపఁగలఁడనియు విప్రుఁడెఱుంగును. కాని చర్మ చక్షుగోచరుఁడయి మానవరూపమునఁ గన్పట్టుచున్న ఆ యదువీరుఁడే జగన్నాటకసూత్రధారి యని యా విప్రునకుఁ దెలియదు. విప్రుని యా పట్టుదల నూచినంతనే వనజాక్షుఁడు కొంత చింతించినాఁడు. యజ్ఞదీక్ష విడనాడుటకు వీలులేదు; విప్రుఁడు తన పట్టుదల వీడునట్లు గానరాదు. కాని యిచ్చట నొక ప్రశ్న జనింపఁగలదు. ద్వారవతిలోనుండియే శ్రీకృష్ణుఁడు విప్రకుమారుని రక్షింపలేడా యను సందియము గలుగవచ్చును. నిజమే. ద్వారవతిలో నుండియు విప్రకుమారుని రక్షించుట విశ్వనియంత యగు నాతనికిఁ గష్టసాధ్యముకాదు. కాని యట్లు సేయుట

సరికాదు. ఆ విప్రకుమారుల నెవ్వ రపహరించు చున్నారో వారెక్కడనున్నారో, విశ్వాత్ముఁడగు శ్రీకృష్ణునకుఁ దెలియనిదికాదు. కూటస్థుఁడగు నప్పురుషుఁడు యదుకులమున నవతరించిన యా లీలామనుప విగ్రహుని జూడఁ గోరియే యికార్యమునకుఁ గడంగినాడు. విప్రకుమారుల వరుసగ నపహరించినాడు. వానికి తన దర్శన మీయక తప్పదు. విప్రకుమార రక్షణమును జరుగును. కాని యానాటి యజ్ఞదీక్షను వీడుటకు వీలులేదు. అందులకే శ్రీకృష్ణుఁడు కొంతవంతఁ జెందినాఁడు. ఆ సమయమున కచ్చటనే యున్న యర్జునుఁడు ముందుకు వచ్చినాఁడు. తానా కార్యమును నిర్వహింతుననియు, సందులకు తన కనుజ్ఞ నీయవలయు ననియు, శ్రీకృష్ణుని గోరినాఁడు. అర్జునుని యా ప్రగల్భ వాక్యములను విననంతనే విశ్వంభరునకు నవ్వువచ్చినది. ఇఁట విశ్వంభర శబ్ద ప్రయోగము గూడ సార్థకముగనే యున్నది. విశ్వంభరుఁ డొకఁడే నిర్వహింపఁగల యకార్యమును విచ్చుఁడు నిర్వహింప యత్నించు చున్నాఁడు. కావుననే విశ్వంభరునకు నవ్వువచ్చినది. ఆ నవ్వుకూడ జాలివలనఁ గలిగినదే. అందులకే కవి యిట శ్రీకృష్ణుని 'కరుణావిర్భూత చేతస్కుఁడ'ని చెప్పినాఁడు. అర్జునుని వాక్యములు విననంతనే శ్రీకృష్ణుఁడు విజయా యని యాతని నంబోధించినాఁడు. నిజమునకు భూలోకమునకు సంబంధించిన సర్వకార్యముల యందును నర్జునుఁడు విజయియే. కాని యిది భూలోక సంబంధి వ్యవహారముకాదు. అందులకే శ్రీకృష్ణుఁడు 'నాచేత నెబ్బంగి నేసనియైనను గడతేరుఁగాని యిది నీ పంతంబులం దీఱునే?' అని పలికినాఁడు. ఆవ్వాక్యముల నాలించినంతనే వినయలజ్జాయత్త చిత్తుఁడయి యర్జునుఁడు మోమువాల్చినాఁడు. ఇదియు నొక విషమ పరిస్థితియే అర్జునుఁడకార్యమును నిర్వహింపలేడని శ్రీకృష్ణుఁ డెఱుంగును. కాని తన ప్రాణము నకు ప్రాణమైన విజయుఁడు లజ్జాపరీతచేతస్కుఁడగుట తనకును ముదావహమగు విషయముకాదు. ఒకవంక విప్రుని పట్టుదల; వేఱొకవంక యర్జునుని యుత్సాహము; ఇంకొక వంక తనకుఁగల ధర్మదీక్ష - ఈ మూఁడును శ్రీకృష్ణుని మానసము నొక్కసారి యాక్రమించినవి. అతఁడొక స్థిర నిశ్చయమునకు వచ్చెను. ధరణీదేవ పుత్త్ర రక్షణార్థము యర్జునుఁడు బోవుట కనుమతి నొసంగెను. కాని యచ్చోటి కర్జునుఁ డొక్కఁడును బోరాదు. బలరామ ప్రద్యుమ్నులుదక్క తక్కిన యాదవసైన్యమంతయు సవ్యసాచి ననుసరింప వలయును.

మహాసంరంభముతో యదువృష్ణ్యంధక భోజ సైన్యములు వెంటరా నర్జునుఁడు భూసుర పుత్త్ర రక్షణార్థ మరిగెను. అప్పుడు ప్రకృతి యెంతటి భీభత్సరూపమును వహించియుండెనో కవి యీ క్రింది పద్యమున వ్యక్తీకరించినాఁడు.

క॥ ఎఱసంజ దాసనంబుల
తెఱఁ గయ్యెను, గూబ లెల్ల దెసలఁ జెలంగెన్,
వఱదు లఱచె, నుల్కలు వడె,
నెఱి చెడి సురగాలి విసరె నిలువక పెలుచన్.

ఉ. హరి. 2-24

అంతలోనే విప్రుని గృహమునుండి 'పట్టుడు పట్టుడు' అను కేకలు వినవచ్చినవి. వెనువెంటనే బ్రాహ్మణి విలాపరవమును వినవచ్చినది. శిశువు పుట్టుటయుఁ బోవుటయుఁ గూడ క్షణములోనై పోయినవి. ఇచ్చట నొక బ్రద్ధరలో నర్జునుఁడు గావించిన ప్రయత్నమునందలి పరిస్థతియు, తద్భంగమును గూడ సోమన వ్యక్తీకరించియున్నాఁడు తుదకు మిగిలిన పరిస్థితి యాక్రింది పద్యమున వ్యక్తమగుచున్నది.

గీ॥ పోయె బాలుండు యదువృష్ణిభోజబలముఁ
జిన్నవోయెను జూడ వచ్చినజనంబు
డించి పోయె మదీయగాండివము లజ్జ
వోయెఁ గొనిపోయె భూసురపుత్త్రి జముఁడు.

ఉ. హరి. 2 - 28

సహజముగా నలంకార ప్రియుఁడగు సోమన యీ పద్యమును నిరలంకృతముగ రచించుటలో గొప్ప యౌచిత్యము గన్పట్టుచున్నది. అంతయు నష్టమైనది. క్షణములో నష్టమైనది. విప్రబాలుఁడు పోయినాఁడు. యదువృష్ణిభోజబలము చిన్నవోయినది. చూడవచ్చిన జనముకూడ ఒకొక్కరే మగిడి చనినారు. అర్జునుని గాండివము గూడ చిన్నవోయినది. కాని విప్రుఁడూరకుండలేదు. గాండివమ్ము లావు వమ్మయి సంగ్రమ్ము నుమ్మలికంబున విన్ననైయున్న గాండీవిని జూచి, విప్రుఁడు అనరాని మాటలనినాఁడు. పాపమర్జునుఁడు గూడ విప్రునకు మారుపల్కు స్థితిలో లేఁడు. ఆతని మాటలకెల్ల తలవంచి, శ్రీకృష్ణుని కడకేగి ఖేదనమ్రుఁడయి నిల్చినాఁడు. అప్పటి శ్రీకృష్ణుని ప్రవర్తన మాతని విశ్వంభరత్వమునకు నిదర్శనముగ నున్నది. ఆతఁడర్జునుని గారవించెను; భూసురుని బుజ్జగించెను. 'నీ కుమారుల నే లోకంబునందున్నఁ దెత్తు! నీ కింతేల ధృతిగలంగ?' అని విప్రునితోఁ బ్రతినవట్టి పల్కెను. సర్వాయుధో

పేతమగు రథము నాయత్తము గావించి, యర్జునుఁడును, భూసురుఁడును దనవెంట నుండ రథమధిరోహించి, విప్రపుత్త్ర రక్షణార్థము బయలుదేరెను. ఇచ్చట మార్గ వర్ణనము కొంత గావింపఁబడినది. ఆ గమనము కూడ నతిలోక రమణీయముగ నడచినది. పారావారము శిలాసదృశమయి త్రోవయిచ్చినది. సప్తశైలములును గమన నిరోధము గావింపక వైదొలఁగినవి. గాఢాంధతిమిరమును జక్రప్రభలు మాయించినవి. తుదకు వారు గమ్యస్థానమును జేరిరి. అచ్చట రాకాచంద్రదివాకరానలశిఖారత్న ప్రభా జాల రేఖాకాంతిని లోకం బెల్ల నిండించుచు పురుషుం డొకండు గన్పట్టెను. భూసురుని, సవ్యసాచిని రథముపయి నట్టెయుంచి, జనార్దనుఁడా తేజములోఁ బ్రవేశించి, మగిడి వచ్చి నాఁడు. చచ్చిన విప్రసుతులను దెచ్చి, విప్రున కిచ్చినాఁడు. రూపమునఁగాని వయ సున గాని విప్రసుతుల యందొకించుకయును బేదము లేదు. అనంతరము ద్వారవతికి క్షణకాలమున వారందఱుఁ దిరిగి వచ్చినారు. ఇందు విచిత్రమొండు గలదు. పోవు నప్పుడు వారికి గమ్యస్థానమును చేరుటకుఁ గొంతకాలము పట్టినది. వచ్చునప్పుడు క్షణములోఁ దిరిగి వచ్చినారు. ఈ వ్యత్యాసమునకుఁ గారణ మొకటియే గన్పట్టు చున్నది. శ్రీకృష్ణ ప్రభావమునఁ బోవుటయు వచ్చుటయు క్షణములో జరుగవచ్చును. పోవునప్పుడు అర్జునకుఁ దన మాహాత్మ్యమును వ్యక్తీకరించెను. అందులకే కొంతకాలము పట్టినది. కాలప్రమాణమునఁగాని, మానవబుద్ధి విషయగ్రహణము గావింపలేదు కావుననే పోవుటకుఁ గొంతకాల మావశ్యకమాయెను. ఇంకొక విధమున నర్జునున కట్లు భాసించెనని చెప్పవచ్చును. తరువాత సభామండపమున నుచితకథావినోదంబులు సలుపుచున్న నారాయణునకుఁ బ్రణమిల్లి యర్జునుఁడిట్లు ప్రశ్నించినాఁడు.

తే॥ సాగరమునీరు పేరుట శైలకులము
తెరువు లిచ్చుట చీకటి నఱకువడుట
దివ్యతేజంబు దోఁచు టుద్దీప్తి నీవు
సొచ్చుట కుమారులం గొని వచ్చు టేమి? ఉ.హరి. 2-56

సీ॥ అపుఁడు తేజోమయం బైనరూపంబు మ
త్ప్రకృతి యందుఁ జరాచరంబు దోఁచు
షాడ్గుణ్య నప్పురుషుండు మద్దర్శనకుతూహ
లముగ నవ్విప్రబాలకుల మ్రింగె

వారు కారణముగా వత్తు నే నని యంధ
తమసంబు నేన భేదకుఁడ నేన
యచలంబు లేన రంధ్రాపాది నేన సా
గర మేన సంస్తంభకారి నేన

తే॥ పంచభూతాత్మకంబు ప్రపంచ మిందుఁ
గలిగినది లేనియది లేదు కల దనంగ
నున్న యదియె సర్వంబును నుచితగమ్య
మిది రహస్యంబు దెలిపితి నెఱుఁగు పార్థ. ఉ. హరి. 2-58

తే॥ అక్షరత్రయరూప మై యఖిలయోగ
మూల మగుప్రణవంబు నామూర్తి సుమ్ము
నీకుఁ జెప్పితి; నత్యంతనియతమతికిఁ
దప్ప నీమంత్ర మొరులకుఁ దగదు తెలుప. ఉ.హరి. 2-59

ఈ వాక్యములలో వాసుదేవాత్మకమగు నివిశ్వమును, తద్రహస్యమును జక్కఁగా వివరింపఁబడి యున్నవి. వేదశిఖావతంసపావనపదపల్లవుఁ డగు శ్రీకృష్ణుని మాహాత్మ్యమిందు సువ్యక్తమగుచున్నది. ఇందు నరనారాయణులకుఁ గల సాదృశ్యభేదములు సుస్పష్టము గావింపఁబడినవి.

## పౌండ్రక వాసుదేవుని వృత్తాంతము :

తృతీయాశ్వాసమున పౌండ్రక వాసుదేవ కథ కలదు. పౌండ్రక వాసుదేవుఁడొక విచిత్రవ్యక్తి. శ్రీకృష్ణునకు నందక సుదర్శన శార్ఙ్గచాదులను నాయుధములు గలవు. పౌండ్రక వాసుదేవుఁడు గూడనట్టి యాయుధములను ధరించినాఁడు. తన్ను వాసుదేవుఁడని బిలువనివారికిని, యాదవుఁడగు శ్రీకృష్ణుని వాసుదేవుఁడని పిలిచిన వారికిని శతబార సువర్ణము దండమని తన రాష్ట్రమంతటఁ జాటింపించినాఁడు. ఔద్ధత్యము మెఱయ నాతఁడిట్లు పల్కుచుండును.

క॥ ప్రాచేతిచక్ర మిందఱుఁ
జూచితిరో చూడరో విశుద్ధతరాయో
మేచకితసహస్రారం
బాచక్రముఁ దోలఁ జాలు నతిభర మగుటన్. ఉ.హరి 3-6

తే॥ నందకము గూల్చు యాదవునందకంబుఁ
బాంచజన్యంబుచేతఁ దత్పాంచజన్య
మడఁగు శార్ఙ్గంబుచేఁ జెడు నతని శార్ఙ్గ
మినుము సేయదె గద గోపుఁ డెత్తుగదను ఉ. హరి. 3-7

ఈ విపరీత చేష్టలకు బదులు సేయనేరక, ధాత్రీసురకోటి యూరకుండిరి. మతిమంతులగు మంత్రులు, 'యిస్సిరో, యీ వసుదేవసూను సరియా యితఁడంచు బొలంగి' చనిరి. లజ్జలు మాని ధూర్తసేవకులు మాత్ర మాతనిని గొల్చుచుండిరి. ఇట్లుండగా నొకనాఁడు దేవర్షియగు నారదుఁడు పౌండ్రక వాసుదేవునికడ కేతెంచెను. పౌండ్రకుఁడాతనితోఁ దనకు శ్రీకృష్ణుని పయిఁగల మచ్చరము వ్యక్తీకరించుచు "విక్రమాఢ్యులలో నేనును వాసుదేవుఁడ నతండును వాసుదేవుండటే" అని పలికెను. కలహభోజనుండా వాక్యములు వినినంతనే, మనమున నోకిలించి, మఱుమాటకుఁ గింకిరిపాటు తోడుగా నల్లన నవ్వెను. నవ్వుటయే కాక, పౌండ్రక వాసుదేవుని నిరసించి మాటలాడెను.

క॥ నీశంఖము నీచక్రము
నీశార్ఙ్గము నెఱుఁగమే యనిం గదిసినచోఁ
గేశవసాధనములు గళ
పాశంబులు నీకుఁ దొడరి బ్రతుకఁగ వశమే. ఉ. హరి. 3-15

క॥ ఏనుంగులాగు పందికి
మానిసిచందంబు నీరుమానిసికి నగుం
గాని గుణంబులు గలుగవు
పూనకు చక్రంబు చక్రి పూనఁగ నెదురన్. ఉ. హరి. 3-16

ఆ॥ త్రుళ్ళుచుఁ బోత నీవు తూలిపోఁ బలికిన
సార మేమి తలఁగుఁ జక్రమునకు
నిను కూడఁ బొదుగ నిది చక్రమా యెత్తు
వచ్చుఁ గాక నొరకు వచ్చు నెట్లు. ఉ. హరి. 3-17

నారదుని మాటలు వినినంతనే, పౌండ్రక వాసుదేవుఁడు చిన్నవోయెను. నారదుని యెడ నాతని కోప మప్రతి హతమయ్యె, శాపాస్త్రుఁడగు నారదుని కింకరుఁ జడిసి యూరకుండెను. యాదవులనెల్ల యాలమునఁ జంపి, నిన్ను మెప్పించెదనని మాత్రము నారదునకుఁ జెప్పెను. నారదుఁ డక్కడనుండి బదరి కాశ్రమమునకేగి, పౌండ్రక వాసుదేవుని దుశ్చేష్టలను వివరించెను.

తే॥ ప్రల్లదంబున నందకపాంచజన్య
శార్ఙ్గకౌమోదకీసుదర్శనము లనఁగ
నళినలోచన నీసాధనములసాటి
చేసె నతఁడు విశ్వామిత్రసృష్టి వోలె. ఉ. హరి. 3-21

ఇది నారదుని వాక్యముల సారాంశము దానికి శ్రీకృష్ణుఁడిచ్చిన సమాధానమిది. "మునినాయక! వేగపడకు, మూఢుని పౌండ్రావని విభుని నీవు చూడఁగఁ దునుముదు నేఁడెల్లిలోన దుత్తునియలుగాన్" పౌండ్రక వాసుదేవుఁ డన్నంత పనియును జేసెను. చతురంగ సైన్య సమేతుఁడయి ద్వారవతికేగి, నిశీథమునఁ దన్నగరమును ముట్టడించెను శ్రీకృష్ణుఁ డప్పుడు ద్వారకలో లేడు. పౌండ్రకుఁడు యదువంశము పయి పగబూని యుండెననియుఁ, దానుతప్ప నన్యులాతని సంహరింపనశక్తులనియు శ్రీకృష్ణుఁడెఱుంగును. కావుననే, తపశ్చర్య కేగుటకుఁ బూర్వము , బలరామసాత్యక్యాదుల నెల్లరఁ బిలిచి, తాను లేనప్పుడు నగరరక్షణము నెట్లు గావింపవలెనో వారి కుపదేశించెను ద్వారవతి యందు శ్రీకృష్ణుఁడు లేఁడను విషయము పౌండ్రక వాసుదేవునకుఁ గూడఁ దెలియును. అందులకే నాతఁ డర్ధరాత్రమున ద్వారవతిని ముట్టడించెను. కాని యసంత బలపరాక్రమములు గల బలరామ సాత్యక్యాది మహావీరులు పౌండ్రక వాసుదేవుని నిరోధించి, పోరు సాగించిరి సరిగా నా సమయమునకు పౌండ్రక వాసుదేవుని దుశ్చేష్టలను గూర్చి నారదుని వలన నెఱింగి. శ్రీకృష్ణుఁడు గరుడారూఢుఁడై బదరి కాశ్రమము నుండి ద్వారకకు వచ్చెను. పౌండ్రక వాసుదేవుఁడు శ్రీకృష్ణునితో నిట్లు పలికెను.

క॥ నాకును గద నీకును గద
నాకును నందకము నీకు నందక మహహా
నాకును జక్రము చక్రము
నీకును విలు నాకు విల్లు నీకుం దగునే ఉ. హరి 3 - 95

పౌండ్రకుని చక్రమును చిగురాకువలె చక్రిచేతఁ బట్టి, మగుడంగ ద్రిప్పి, యాతనిపయి వచ్చి పడునట్లు గొట్టెను తుదకు పౌండ్రక వాసుదేవుఁడు శ్రీకృష్ణుని చక్రముచే నిహతుఁడయ్యెను.

నాచన సోమనాథుఁడు, పౌండ్రక వాసుదేవుని దండయాత్రకు నవకాశము గల్పించుటకయి, శ్రీకృష్ణుని బదరికాశ్రమ గమనమను సన్నివేశమును ముందు వర్ణించెను. ద్వారకయందు శ్రీకృష్ణుఁడున్నప్పుడే పౌండ్రకుఁడు దండెత్తి వచ్చుట, శ్రీకృష్ణుని యతిలోక పరాక్రమ స్ఫూర్తికి లాఘవమును గల్పించుట. మఱియు, నిందలి నారద పాత్ర ప్రవేశముఁ గడుంగడు మనోజ్ఞము, నుచితమునయి యున్నది. నారదుఁడు అన్ను తిరస్కరించి, పలుకుట వలననే పౌండ్రక వాసుదేవుఁడు కుపితుఁడయి వెన్వెంటనే ద్వారకపయి దాడి వెడలినాఁడు. బదరి కాశ్రమమున నున్న శ్రీకృష్ణునకు పౌండ్రకుని యాగడములు నారదుని వలననే తెలిసినవి. అందు వలననే శ్రీకృష్ణుఁడు సమయమునకు ద్వారకకెతెంచి, పౌండ్రకుని సంహరింపఁ గలిగినాఁడు.

## హంసడిభకోపాఖ్యానము :

చతుర్థాశ్వాసమున హంసడిభకుల వృత్తాంతము వర్ణింపఁబడినది. హంసడిభకు లీశ్వరుని వరములుగాంచి, వీరాభిమానజృంభితులయి వేటకరిగిరి. వేట ముగిసిన పిమ్మట తిరిగి వచ్చుచు వారు కాశ్యపాశ్రమమునకేగి, యచ్చటి మునులను దమ తండ్రి చేయఁబోవు రాజసూయ యాగమునకు రమ్మని యాహ్వానించిరి. తరువాత వారు దుర్వాసుని యాశ్రమమున కరిగి, యాతఁడు సమాధి నిష్ఠుఁడయి యుండ విసివి, మిత్రుఁడయిన జనార్దనుని మాటలు లెక్కపెట్టక, యతనిని, అన్యమునీంద్రులను, బలు విధములుగ హింసించి, యవమానపఱచిరి. దుర్వాసుఁడు ముక్కోపి. అతని నేమైనఁ జేసి, శాపమునకుఁ గుఱికాకుండ దప్పించుకొన్న వారరుదు. అట్టి దుర్వాసుఁడు హంసడిభకులచే నవమానితుఁడయ్యెను, "చక్రధరుఁడు బారి సమర నున్నాఁడు మిమ్మింక వేఱె కోపమేల నాకు" "చెఱపనేపుడు శాపంబుచేత మిమ్ము నైన యతినైన

నాకేల యాగ్రహంబు''—అని పలికి కోపము సణచుకొని, శపింపక, శ్రీకృష్ణునితో మొఱ వెట్టుకొనుట కేగినాఁడు. ఈ సన్నివేశ మతివిచిత్రమయినది. శ్రీకృష్ణుఁడు సంహరింప నున్నాఁడు గద. వారు మున్నే దుర్వాసునిచే శప్తులయినచో శ్రీకృష్ణుని పరాక్రమము పెంపునకు తావు లేకపోయెడిది. అందుచే శాపాయుధుఁడయిన దుర్వాసుని గూడ కవి యీ సందర్భమున శాంతచిత్తుని గావించినాఁడు.

దుర్వాసుఁడు తోడిమునులతో ద్వారక కేగి, శ్రీకృష్ణునికి హంసడిభకులు తమ్ము భంగపఱచిన తెఱంగెఱింగించెను. శ్రీకృష్ణుఁడు వారినోదార్చి, జరాసంధుఁడు సేనలతో నరిగి, వారిని జేరకముందే హంసడిభకులను సంహరించెదనని పల్కి వారి నుచితరీతిని సత్కరించెను. ఇతర మునిసందోహమును, సంతోషించి, శ్రీకృష్ణుని వీడ్కొని యరిగిరి. దుర్వాసుఁడు మాత్రము ద్వారకయందుండి పోయెను. తాను చెంత నుండనిచో బహుకార్యవ్యగ్రుఁడయిన కృష్ణుఁడు హంసడిభక సంహారకార్యమున కించుక యాలస్యము చేయునేమో యని యాతఁ డనుమానించి యుండును. శ్రీకృష్ణుఁడు మునుల పాట్లు విస్పష్టముగ వినియుండియు, హంసడిభకుల వధించుటకై యుపాయ మాలోచించుచుండెను. ఆతఁడు వారిపయి దండెత్తుటకుఁ దగిన కారణమును వెదకుచుండెను. మునులకు వారొనరించిన యవమానమే తగిన కారణము. అది చాలును శ్రీకృష్ణుఁ డాదురాత్ములను సంహరింప నేగుటకు. అయ్యును, నతఁడు వేఱొక మిషకయి వేచియుండెను ఇంతలో నదియు లభించెను. హంసడిభకులు తమ తండ్రి రాజసూయమునకు ఉప్పు కప్పముగాఁ గొని తెండని జనార్దనుని ద్వారమున యాదవులకు రాయబారమంపిరి. జనార్దనుఁడు మహాభక్తుఁడు. ఇష్టము లేకయు నాతఁడా రాయబారము నెఱపక తప్పినది కాదు. సోమనాథుఁ డీ రాయబారము సందర్భమున నాతని భక్తిగరిమను జక్కఁగా వర్ణించినాఁడు. ఈ జనార్దనుని రాయబారము మూలమున కృష్ణుఁడు హంసడిభకుల పయి దండెత్తి పోవుటకుఁ జక్కని యవకాశము లభించినది. ఈ సన్నివేశ మిచ్చటి కథాగమనమున కెంతయొ తోడ్పడినది. లేనిచోఁ గృష్ణుఁడు దుర్వాసుని కోరిక నెఱవేర్చుటకింకను గొంత కాలము పట్టి యుండును.

## బాణాసుర వృత్తాంతము : ఉషానిరుద్ధుల సమాగమము :

ఐదారాశ్వాసములయందు ఉషానిరుద్ధుల చరిత్ర కలదు. ఇందలి వస్తువు సరిగా నొక మహాప్రబంధ రచనకుఁ దగియున్నది నిజమునకు సోమనాథుఁడు గూడ నిద్దాని నొక మహాప్రబంధముగనే తీర్చిదిద్దినాఁడు. ఇందు తొలుదొలుత బాణాసురుని వృత్తాం

తము కొంత చెప్పఁబడినది. బాణుఁడు బలితనూజుఁడు. బాణాసురుని మనః ప్రవృత్తియు నొక వింత మార్గమున నడచినది. కార్తికేయుని శూలి గారవించి, ముద్దాడుచుండగా, బాణుఁడు చూచినాఁడు. అతని మనము వెంటనే మోదఖేదములకు లోనయినది. తన తండ్రియే యున్నచోఁ దన్ను నిట్లు గారవించెడి వాఁడే కదా! అను నూహ వలన ఖేదమును, పరమేశ్వరునే తండ్రిగా భావించి, యాతని మెప్పు గొనవచ్చు నను నూహవలన మోదమును నాతని మనములోఁ బొడమినవి. వెంటనే బాణాసురుఁడు దృఢనిశ్చయుఁ డయి ఘోరతపం బాచరించి పశుపతిని మెప్పించినాఁడు. మెచ్చిన పశుపతి యాతఁడు కోరిన వరమిచ్చినాఁడు. బాణునకుఁ గార్తికేయుని తోడి సమాన గౌరవము సంప్రాప్తమైనది. శోణితపురము రాజధానిగ 'కార్తికేయ పర్వతకన్యాప్రాణులు పొత్తున మనఁగా' బాణుడు సకల దిగ్రాజభయంకరుఁడయి రాజ్యమేలు చుండెను. సాక్షాత్పరమేశ్వరుఁడే సంరక్షకుఁడయి యుండ, బాణునితోఁ బగఁగొనుట కెవ్వరు సాహసింతురు. సుఖ సంతోషములఁ దేలియాడుచు, బాణుఁడు కొంతకాలము రాజ్య మేలినాఁడు. కాని యా వేయిచేతుల జెగజెట్టికి కయ్యమునెడ వేడుకజనించినది. ఒక నాఁడు పరమేశ్వరుని కడకేఁగి, ప్రణామ మాచరించి, బాణుఁడీ క్రింది విధముగాఁ బలికినాఁడు.

సీ॥ ఖురఖలీనాఘాతకోలాహలంబుతో
  నేమినిర్ఘోషంబు నెఱప లేదు
నఖపుంఖరోచులు నారితో సంధించి
  కర్ణావతంసంబు గడప లేదు
మణికిరీటకరోటిమంజీరములు రాయ
  వీరమధ్యంబులు వ్రేయ లేదు
దంతిదంతావళదంతంబు లొరయ డా
  కినుల వాచవులఁ జొక్కింప లేదు

తే॥ లేదు ప్రతిభటబాహావలేపమహిమ
లేదు సంగ్రామభీమకేలీరవంబు
లేదు విక్రమక్రీడయు లేశమైన
లేదు రాజ్యంబు గలిగియు లేదు ఫలము. ఉ. హరి. 5–19

శా॥ దేవా కయ్యముతోడివేడుక మదిం దీండ్రింపమర్త్యుండు నే
త్రోవం జేతులతీఁట వుత్తు నని కోరున్ దానవుం డైన నా
కి వేచేతులు చేసి తీకసిమి రిం కెట్లోర్తు నోర్తున్ రిపు
గ్రీవాఖండనమండనస్ఫురదసిక్రేంకారముల్ గల్గినన్.

ఉ. హరి. 5-20

చిత్రమగు నీ మనస్తత్త్వమునకుఁ బరమేశ్వరుఁడు కూడ సవ్వక తప్పలేదు. కాని భక్తుని కోరిక తీర్చుటయే కదా పరమేశ్వరుని ధర్మము. బాణుని కోర్కె సఫలమగు సమయమును సృష్టికరించినాఁడు, పరమేశ్వరుఁడు. అకారణముగ నాతని మయూరకేతనము నేల గూలు నప్పుడే ఆతఁడు కోరిన యుద్ధము సంభవింపఁగలదని శంకరుఁడు బాణునకుఁ జెప్పెను. తరువాత నా ప్రకారమే సర్వమును జరిగినది. శోణపురమున దుర్నిమిత్తములు పొడగట్టినవి. ఆ దుర్నిమిత్తములను జూచి, బాణుని మంత్రియగు కుంభాండుఁడిట్లు విచారించెను.

ఆ॥ వేయిచేతు లిచ్చి వెట్టిఁ జేసినశూలి
బాణుఁ జెఱుపఁ దలఁచి భండనంబు
గలుగఁ జేసె నింక వెలుగు చేన్మేసినఁ
గాచువార లెందుఁ గలరె జగతి

ఉ. హరి. 5-40

బాణుఁడు మాత్ర మయ్యవసరమున దనుజసుందరీ సహితుఁడై మనసులోన గెలతి యాడుచు, మధుపాన కేళిఁ దేలి యాహవంబును గోరుచుండెను.

పార్వతీ పరమేశ్వరు లొకనాఁడు వనవిహారము గావింపఁ బయలుదేరిరి. వారిని వెంటనంటియే దైతేయేంద్ర కన్యాప్సరోగణములును బయలుదేరిరి. ఆయాదిదంపతుల వనకేళీ జలకేళీ మహోత్సవములను మనసార వర్ణించి తనివిఁ జెందినాఁడు సోమన. పార్వతీ పరమేశ్వరుల విహారమునకు సంబంధించిన యీ సన్నివేశము ప్రబలమగు వేఱొక సన్నివేశమున కాధారమగుచున్నది. పార్వతీ పరమేశ్వరుల విహారమును గన్నులార గన్న బాణాసురపుత్రి యుషాకన్య మనస్సులో నొక మెత్తని తీయని కోర్కె జనించినది. "ప్రథమ జన్మంబు నందెంత భాగ్యవతులో - మగలు మన్నింపఁ బెంపారు

మానవతులు" - ఈ యూహ యుషాకన్య మనసున మెదలినది. మెదలుటయే తడవుగ నది వాగ్రూపమున వెడలినది. తన చెలికత్తియల కామాటలనే యుషాకన్య చెప్పినది. అప్పలుకులను బార్వతి వినుటయు సంభవించెను. పుత్త్రతుల్యుఁడగు బాణుని కూతురు ఉష, పరమేశ్వరికి మనుమరాలగుచున్నది. తన మనమరాలి కోర్కెను దీర్చుట పరమేశ్వరి కొక ముచ్చటకదా! అందులకే ఆమె యుషాకన్యను వేడుక చూపుల గారవించి, యామె యభిమతం బొడ గూడెడునని యాశీర్వదించినది. "మనోభవుని పట్టము గట్టికొనంగఁ జాలు జాణని మగనిం గవుంగిట ననారతముం గొనియాడెదో చెలీ" అని మనసార దీవించినది. తనకా విధ మెన్నడబ్బునో చెప్పుమని పరమేశ్వరిని వేడికొన్నది యుషాకన్య. రామకుఁ గల వలరాచ వేగిరమునకు చెలంగి నవ్వుచు, సద్దేవి యిట్లు పలికినది.

గీ॥ కడఁగి వైశాఖశుక్లపక్షంబునందు
ద్వాదశి దినాంతవేళ సౌధంబుమీఁద
మదనకేళికిఁ గలలోనఁ గవెయు నిన్ను
నెవ్వఁ డాతండ మగఁడు నీ కిందువదన ఉ. హరి. ౫ 76

చిత్రమగు వరము. కలలన్ని కల్లలను మాట కల్ల యైనది. పరమేశ్వరి వాక్యము వృథా కాదుగదా! వైశాఖ శుక్ల ద్వాదశినాఁడు దినాంత వేళ సౌధోపరితలమున నుషాకన్య నిద్రింపనే నిద్రించినది. కలయు వచ్చినది; కలలో నొకసుందరుఁ డామెను మదన కేళిఁ దేలించి, మరుగైనాఁడు. తెలివి వచ్చినంతనే యా స్వప్నసుందరుని గూర్చిన వ్యథ ఆమెకు మిక్కుటమైనది. ఆమె చెలికత్తెయగు చిత్రరేఖ యా వృత్తాంత మెఱింగి ఆమెనోదార్చి, ముల్లోకమునందలి యువకుల మూర్తులను జిత్రపటమున వ్రాసితెచ్చి, యందామె వలపు కాఁడెవ్వఁడో చెప్పుమని యడిగినది. ఉష యనిరుద్ధుని జూపినది. చిత్రరేఖ యనిరుద్ధుని దెచ్చుటకయి ద్వారకకు బయలుదేరినది. దారిలో నామె యొక కమలాకరమున నకలుషయోగనిశ్చలుఁ డయి యుండిన నారదునిగాంచి, అతని కడ కేగి నమస్కరించెను. నారదుఁడామెను వచ్చిన కారణమేమి యని యడిగెను. జరిగిన వృత్తాంతమంతయుఁ జిత్రరేఖ యాతనికిఁ జెప్పి తా ననిరుద్ధుని గొనిపోయిన పిమ్మట నా వృత్తాంతమును గృష్ణాదుల కెఱింగింప నాతని బ్రార్థించెను. పిమ్మట నామె ద్వారవతికేగి, మాయాబలమున ననిరుద్ధుని గొనితెచ్చి యుషాకుమారి యంతఃపురమున

నుంచెను. పరస్పర ప్రేమ పాశబద్ధులగు నుషా నిరుద్ధులభిమత క్రీడలఁ దేలు చుండిరి. కాని యీ వార్త యెట్లో బాణునకుఁ దెలిసినది. బాణుఁ డనిరుద్ధునిఁ జెఱసాల యందుంచెను. ద్వారకా నగరమున ననిరుద్ధుఁడు కానరాక పోవుటచేఁ బెద్ద కలకలము బయలు దేరినది. అనిరుద్ధుని యునికి నన్వేషింప ననేకులు బయలుదేరిరి. కాని యాతని జాడ యెవ్వరికిని దెలియలేదు. కృష్ణాదులు గూడ నత్యంత చింతా క్రాంతులయి యుండగా నారదుఁ డరుదెంచి, అనిరుద్ధుని వృత్తాంత మంతయు శ్రీకృష్ణునకుఁ దెలిపెను. శ్రీకృష్ణుఁడు బలరామాదులతో బయలుదేరి శోణపురమునకేగి ముట్టడించెను.

ఈ కథయందు చిత్రమగు సన్నివేశము చిత్రరేఖ నారదుని కలిసికొనుట. ఇది యామె మున్నూహించినది కాదు. అనుపమ మాయాబల సమన్వితయగు చిత్రరేఖ, అనిరుద్ధు నెట్లయిన వంచించి శోణపురమునకు గొనిపో సంకల్పించి యుండెను. కాని మధ్యేమార్గమున నామెకు నారదుఁడు గన్పట్టెను. అప్పు డామెకొక యూహ తట్టినది. మాయాబలమున తా ననిరుద్ధుని గొనిపోవును. శోణపురమా దరిదాపుల నున్నది కాదు. మఱి యీ మాయాజాలమును భేదించి, యనిరుద్ధుని జాడ నెఱుంగ నెవ్వరికిని సాధ్యము కాదు. ఉషానిరుద్ధుల సమాగమము బాణునకు హితవు గాదని చిత్రరేఖ యెఱుంగును. అసురాంతకుని తోడి వియ్యమున కాయసురభర్త యియ్యకొనునా? ఒకనాడు గాకున్న మఱొక నాఁడయిన నుషానిరుద్ధుల ప్రేమ కలాపము వ్యక్తము కాకపోదు. అప్పుడు బాణుఁడు అనిరుద్ధుని తప్పక చెఱయందుంచును లేదా వారిరువురకును ఘోర యుద్ధము సంభవించును. అట్టి యెడ ననిరుద్ధునకు తనవారి సాహాయ్య మత్యావశ్యకము. చిత్రరేఖ మనఃఫలకమున నీ యూహ లన్నియుఁ దాండవించి యుండును. ఇట్లామె యూహించు చుండగనే నారదుఁడు గన్పట్టెను. నారదుని జూచినంతనే యామె మనసు కుదుటపడినది. విషయమంతయు నారదునకు వెల్లడించినది. అనిరుద్ధుని తాను గొనిపోయిన తరువాత మాత్రమే తద్వృత్తాంతమును శ్రీకృష్ణాదులకు నివేదింపుమని యాతనిఁ బ్రార్థించినది. నారదుఁడును నట్లే గావించినాఁడు. ఈ నారద ప్రసంగమే లేనిచో, శ్రీకృష్ణాదు లనిరుద్ధుని నెఱుంగఁ జాలరా? యోగీశ్వరేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁ డెఱుంగలేని విషయము లుండునా? యని కొందఱు సందేహింప వచ్చును. శ్రీకృష్ణుఁ డెఱుంగలేని విషయములు లేవనుమాట వాస్తవమే. కాని చీటికిని మాటికిని యోగదృష్టి నుపయోగించుట సహజముకాదు. మఱియు వాఙ్మయ దృష్టితోఁ జూచినను నయ్యది కథారామణీయకమును జెడఁగొట్టును. మఱొక విషయము. శోణపురమున నున్న చిత్రరేఖకు శ్రీకృష్ణుని బలపరాక్రమములు తెలిసిన తెలియవచ్చును

గాని, అతని దివ్య మాహాత్మ్యము తెలిసియుండుట కవకాశములేదు. కావున నామె దైవికముగ మధ్యేమార్గమునఁ దారసిల్లిన నారదుని బ్రార్థించుటయందే సహజత్వము గలదు. మఱొక్క విశేషము. ఎవ్వరికిని దెలియరాకుండ తన మనుమని వంచించి గొనిపోయిన చిత్రరేఖపయి శ్రీకృష్ణునకు కోపము గలుగవచ్చును. కృద్ధుఁడగు శ్రీకృష్ణుఁ డామెను శపింపనువచ్చును. చిత్రరేఖ అనిరుద్ధ వృత్తాంతమును శ్రీకృష్ణున కెఱింగింపు మని బ్రార్థించుటలో మీఁది యూహలు గూడ నుండుట కవకాశము గలదు.

ఉషా పరిణయగాథ యంతయు మనోజ్ఞసన్నివేశసంకలితమే. బాణాసురునకు కుమారునితో సమానమగు గారవమును బ్రసాదించినవాఁడు పరమేశ్వరుఁడు. రక్క సుని వేయిచేతుల తీటవో భంజనమును బ్రసాదించినవాఁడును పరమేశ్వరుఁడే. రెండును వరములే. ఒక దానివలన బాణుఁడున్నతి పదమున కేగినాఁడు. రెండవ దానివలన బాణుఁ డతఃపతితుఁ డయినాఁడు. పరమేశ్వరుఁడిచ్చిన రెండవవరమున కంకురార్పణ గావించినది పరమేశ్వరి. ఉషాకన్యకకు అనిరుద్ధుని వరునిగా ననుగ్రహించినది. అసుర కర్తయగు బాణుఁడు దానవాంతకుఁడని ప్రసిద్ధి వహించిన శ్రీకృష్ణుని మనుమనికిఁ దన కూఁతునీయ నంగీకరింపఁడు. అప్పుడు శ్రీకృష్ణునకును బాణునకును భంజనముతప్పదు. కాని యది నిజముగా హరిహరుల యుద్ధముగఁ బరిగణింపఁ బడఁగలదు. ఆ సన్ని వేశము నాధారముగాఁగొని హరిహరాభేదమును సువ్యక్తము గావింప నెంచినాఁడు కవి.

నాచన సోమనాథుఁడు తిక్కనవలె హరిహరనాథోపాసకుఁడు. అతఁడు గ్రహించిన కథలన్నియుఁ గృష్ణపారమ్య బోధకములే యైనను, ఎడనెడ నాతఁడు హరిహరాభేదమును బ్రతిపాదించుటకయి రమ్యములయిన సంవిధానములను సృజించినాఁడు. అతని సంవిధాన సంఘటనా చాతుర్యమనితర సాధారణమయినది. అది యాతని కథా కథన కౌశలమునకు జీవగఱ్ఱ. అందుచేతనే యాతఁడు తాను సంవిధాన చక్రవర్తినని సగర్వముగాఁ జెప్పుకొనఁ జాలినాఁడు. ఇది యొక్కటే యననేల? గద్యలో నాతఁడు వేసికొన్న విశేషణము లన్నియు నన్వర్థసుందరములయినవే.

# నాచన సోమనాథుని యాంధ్రీకరణ విధానము

ఆంధ్ర వాఙ్మయమునందు ప్రప్రథమముగ నావిర్భవించిన శ్రీమదాంధ్ర మహా భారత మాదికవియగు నన్నయ భట్టారకునిచే నాంధ్రీకరింపఁ బడినది. తదాదిగ భారతరామాయణ భాగవతములేగాక యనేకములగు పురాణములును నాంధ్రీకరింపఁ బడి, యాంధ్ర వాఙ్మయమున కలంకారము లయినవి. కవిత్రయము వారలు భారతాంధ్రీకరణమును గావించిరి. నన్నయ తిక్కనలకుఁ దరువాతి వాఁడగు నెఱ్ఱాప్రెగ్గడకు సమకాలికుఁడును, వేదవేదాంగ సమస్త పురాణ విజ్ఞుండునగు నాచన సోమనాథుఁడు, ఉత్తర హరివంశ మను బేరున హరివంశమును దెనిగించెను. ఈ రచన యొక ప్రౌఢ ప్రబంధముగను, రసవత్తర కావ్యముగను సంతరింపఁబడినది ఈ మహాకవి యాంధ్రీకరణమును బరికించుటకు ముందు, ప్రబంధ లక్షణములను; హరివంశము పురాణము గావునఁ బురాణ లక్షణములను గూర్చిన విషయమునుగూర్చి యొకింత ముచ్చటింప వలసి యున్నది.

మహాపురాణములు, ఉపపురాణములు నని పురాణములు రెండు విధములుగా జెప్పఁబడుచున్నవి సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము నను నైదు లక్షణములు గలది పురాణ మనఁబడును. ఈ యైదు లక్షణములకు స్థానము, పోషణము, ఊతి (వాసన), నిరోధము, ముక్తి యను మఱి యైదు లక్షణములును గలసినచో నది మహాపురాణమని బేర్కొనఁబడును. హరివంశము భారత రచనానంతరమున వ్యాసమహర్షిచే రచింపఁబడినది. కావుననే హరివంశము భారతమునకు ఖిలము. దీనియందు పయి లక్షణము లన్నియు నిమిడియున్నందున నిదియొక మహాపురాణ మగుచున్నది. అంతేగాక హరివంశము భారతమునకు ఖిల పురాణమనియుఁ బ్రసిద్ధిఁ గాంచినది. ఇందు శ్రీకృష్ణుని చరిత్రము వర్ణింపఁబడి యున్నది. ఈ కృష్ణ చరిత్ర మీదిగువ నుదాహరింపఁబడిన పురాణములయందును గాననగును.

**(1)** బ్రహ్మపురాణము (పూర్వభాగము) (2) విష్ణు పురాణము (పంచమాశ్వాసము) (3) వాయుపురాణము (4) భాగవతము (దశమ, ఏకాదశస్కంధములు) (5) బ్రహ్మవైవర్తపురాణము (తృతీయఖండము). ఇవిగాక పద్మ, వామన, కూర్మ పురాణములయందును శ్రీకృష్ణ చరిత్రము సంగ్రహముగాఁ గలదు. వ్యాస మహర్షి తన శిష్యులలోఁ బ్రఖ్యాతిగాంచిన లోమహర్షణ సూతునకుఁ బురాణ సంహితల నిచ్చి యున్నాఁడు. ఆ సూతుని వర్ణించియే శౌనకాది మహా మునులందఱు నీ పురాణములఁ దెలిసికొని యుండిరి. హరివంశమును శౌనకాది మహర్షుల ప్రార్థన నంగీకరించి సూతుఁడు, భారతకథను జెప్పిన తరువాత (వ్యాసప్రణీతంబయిన) హరివంశ కథను జెప్పినట్లు గలదు.

భారతము — హరివంశ పర్వ విభాగ విషయము :

సౌతి తన భారత గ్రంథమునకుఁ బదునెనిమిది పర్వముల నేర్పఱిచెను. ఈ పర్వ విభాగము క్రొత్తదియు, సూతుఁడే కావించినదియు నైయున్నది. మఱియు నితఁడు హరివంశమునకు 'ఖిలపర్వము' (తరువాతఁ గలుపఁబడినది) అని పేరు పెట్టి, పందొమ్మిదవ పర్వమును జేసెను. భారతము అనుక్రమణికాధ్యాయములోఁ జెప్పిన పదునెనిమిది పర్వముల తరువాత పందొమ్మిదవ పర్వముగా నీ హరివంశమున పండ్రెండు వేల శ్లోకములు గలవని చెప్పఁబడినది. అట్టి పర్వమున హరివంశపర్వము, భవిష్యత్పర్వములు మాత్రమే చెప్పఁబడినవి. కావున విష్ణు పర్వము ప్రక్షిప్తమనుట కవకాశము కలుగుచున్నది. ఏది యెటులున్నను ప్రకృతము మనకుఁ గానవచ్చు హరివంశము - హరివంశ, విష్ణు, భవిష్య పర్వములను మూఁడు పర్వములతోఁ గానవచ్చు చున్నది. వీని యందలి శ్లోక సంఖ్య సుమారు పదాఱువేలకు పైబడి యున్నవి.

హరివంశము - పవిత్రత :

హైందవులకు శ్రుతి స్మృతి పురాణేతిహాసములు పరమ ప్రమాణ గ్రంథములు బృహదారణ్య శ్రుతియందలి యీ క్రింది శ్రుతిని బట్టి వేదములకుఁ గల ప్రామాణ్యము పురాణేతిహాసములకును గలదని చెప్పవచ్చును.

శ్లో॥ "అస్యమహతోభూతస్య నిశ్వసితమే తతీ
యదృగ్వేదో యజుర్వేదః స్సామవేదోఽథ
ర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా
ఉపనిషదః శ్లోకాః సూత్రాణ్యను వ్యాఖ్యా
నానివ్యాఖ్యానాన్యస్యై వైతాని సర్వాణి నిశ్వసితాని"

కావుననే హరివంశ పర్వమునం జివఱను గల ఫలశ్రుతితో పాటు హరివంశ పురాణ మాహాత్మ్యమును జెప్పంబడినది. దీని నతి పవిత్రముగ నెంచి పారాయణము చేయు టయు ప్రసిద్ధమగు విషయము.

మఱియొక విషయము. హైందవ మత సంప్రదాయముల ననుసరించి, రామా యణమునకుం గల వైశిష్ట్య మీ హరివంశమునకును గలదనుట కొక నిదర్శనము గలదు. మహమ్మదీయుని తలపై వారి పవిత్ర గ్రంథమగు కొరాను నుంచునట్లు నేపాలు దేశము నందలి న్యాయస్థానములలో సాక్షులను విచారించుటకు ముందు హైందవుల విషయమున నీ హరివంశము నుపయోగించుట సంప్రదాయ మయి యున్నది. ఈ విషయమును భారత వాఙ్మయ చరిత్రలో వింటర్నిట్జ్ అను విదేశ పండితుఁడు వక్కాణించి యున్నాఁడు.[1]

## హరివంశము - భాషాంతరీకరణములు :

పదునాఱవ శతాబ్దము చివఱి పాదమున మొగలు సమ్రాట్టగు అక్బరు పాదుషా రామాయణ భారతములతో పాటు హరివంశమును గూడ పర్షియను భాషలోని కనువ దింప చేసినాఁడు.[2] 18 వ శతాబ్దమున నాంగ్లభాషలోనికి వంగదేశీయునిచే ననువదింపఁ బడినది.

## ఉత్తర హరివంశ రచనా ప్రణాళిక :

వ్యాస ప్రణీతంబయిన సంస్కృత హరివంశమును గవిత్రయము వారిలో నొకఁ డగు ఎఱ్ఱాప్రెగడ మహాకవి యాంధ్రీకరించి యున్నాఁడు ఆతనికి సమకాలికుఁడగు నాచన సోమనాథుఁడు హరివంశ ప్రాశస్త్యమును గ్రహించి, యా గ్రంథము ననువదింప సమకట్టినాఁడు. హరివంశము పురాణమగుట, నందలి నీరస సారసములగు పట్టముల నన్నింటిని యథాతథముగ ననువదించుట చర్విత చర్వణ మగునని, రసవద్ఘట్టములకు కొక ప్రత్యేక ప్రతిపత్తిని గల్పింపనెంచి సోముఁడు తన రచనమున కొక మహత్తరమగు

---

1. A history of Indian Literature Vol I
   A. Barth, Religions of India Page 156 Note.
2. Promotion of learning in India (During the Mohammadan rule by Mohammadans — by Nerendranath. Law Book No. 2 Ch III—Page 139

ప్రణాళిక నేర్పఱచి కొనెను. కావుననే హరివంశ పురాణమునందలి రసభరితములగు ఖండముల నేరికొని, యాకదల నాధారముగ సోమనాథుఁడు హరివంశమును షష్ఠాశ్వాస పరిమితమగు నొక ప్రౌఢ ప్రబంధముగా సంతరించినాఁడు. నాచన సోమనాథుఁడిట్లు తన కవితా ప్రాగల్భ్యమును బ్రదర్శించుట కనువుగా సమగ్రమగు రచనా ప్రణాళికను గూర్చికొని, తన గ్రంథమునకు 'ఉత్తర హరివంశ' మని పేరిడినాఁడు. సోముఁడు తన గ్రంథమున కీ రీతిని నామకరణము చేయుటకు గల హేతువులను వివరముగా స్థలాంతరమున జూడనగును.[1]

సంస్కృత హరివంశమున హరివంశ, విష్ణు, భవిష్యపర్వములుగా సుమారు పదాఱువేల శ్లోకములలో శ్రీకృష్ణుని చరిత్రము వర్ణింప బడినదని ముందు చెప్పియుంటిని. సోమనాథుఁడు మూలములోని హరివంశ పర్వ మామూలాగ్రము విడిచి పెట్టినాఁడు. విష్ణుపర్వమునందు నూట యిరువది యెనిమిది యధ్యాయములును, భవిష్యపర్వమున నూట ముప్పది యైదధ్యాయములును మూలమున గలవు. వీనిలో విష్ణు పర్వమునందు మొదటి 61 అధ్యాయములను విడిచినాఁడు. 62, 63 రెంశధ్యాయములలోఁ గల నరకాసుర వధ ఘట్టమును గ్రహించి, ఉత్తర హరివంశమున ప్రథమాశ్వాసముగ గూర్చినాఁడు. మఱియు 111-115 అధ్యాయములందలి శ్రీకృష్ణ మహాత్మ్యమును గొనియాడు విప్రబాలక రక్షణమును ద్వితీయాశ్వాసముగ వర్ణించి యద్దానికి భవిష్యపర్వము 73-90 అధ్యాయములలోఁ గల శ్రీకృష్ణుని తపశ్చర్య, హరిహరారాధనములఁ గలిపి యున్నాఁడు. ఇట్టి మార్పున కీ కథ యందును శ్రీకృష్ణ మహాత్మ్యముండుటయే హేతువు కావచ్చును. మఱియు భవిష్యపర్వము నందలి పౌండ్రక వాసుదేవుని విషయము చెప్పఁబడిన 91-102 అధ్యాయములను దృతీయాశ్వాసముగను, 103-132 అధ్యాయములలోని విషయమగు హంసడిభకోపాఖ్యానమును జతుర్థాశ్వాసముగ సంతరించెను. భవిష్య పర్వము నందలి మొదటి 72 అధ్యాయములను గ్రహింపనేలేదు మఱల విష్ణు పర్వము నందలి 116-127 అధ్యాయములలోని బాణాసుర కథను రెండు భాగములుగా విభజించి, యుషానిరుద్ధుల ప్రణయవృత్తాంతమును బంచమాశ్వాసముగను, బాణాసుర గర్వభంగమును షష్ఠాశ్వాసముగను రచించెను. భవిష్యపర్వమునఁ జివఱి యధ్యాయములను బరిహరించెను.

1. చూడు : పూర్వహరివంశము : వివాద పరిష్కారము అను శీర్షిక.

పయి విషయములను బట్టి విష్ణు, భవిష్యపర్వములలోఁ గల 262 అధ్యాయములనుండి 78 అధ్యాయముల యందు వర్ణింపఁబడిన యైదు గాథలను మాత్రము గ్రహించి, సోమనాథుఁడు తన యుత్తర హరివంశ గ్రంథము నొక ప్రౌఢ ప్రబంధముగ రూపొందింప జేసినాడనుట స్పష్టము. ఈ మహాకవి గ్రహించిన విషయము మూలమున సుమారు మూఁడువేల శ్లోకములకుఁ బైచిలుకున నున్నది ఆ విషయజాలము నాంధ్రీకరించుటలో సోముఁడు సుమారు పదునేనువందల పద్యములను రచించి, గ్రంథము నత్యంత సామర్థ్యముతో నిర్వహించెను

సోమనాథుఁడు గ్రహించిన సంస్కృత హరివంశ ప్రతియేదియో తెలియరాదు. ప్రకృతము మనకు లభించు సంస్కృత హరివంశ ప్రతుల విషయముతో పాటు ఉత్తర హరివంశ ప్రతుల విషయము గూడ చూపఁబడినది. (చూడుఁడు : అనుబంధము 1)

మూలాతిక్రమణములు :

సోమనాథ మహాకవి యాంధ్రీకరణమును గూర్చి పరిశీలింతము. సోమన హరివంశ పర్వమును బూర్తిగా విడిచినట్లు ముందే చెప్పి యుంటిని. ఇఁక విష్ణు పర్వము నందును శ్రీకృష్ణ జననము, బాల్యమున పూతనాది పలువురు రక్కసుల మడియించుట, కంసవధ. జరాసంధ పరాజయము, రుక్మిణీహరణము, రుక్మివధ, ప్రద్యుమ్నవివాహాది వివిధ విషయములు విడిచిపెట్టెను. ఈ విషయములు విష్ణు పర్వమునందు మొదటి యఱువది యొక్క యధ్యాయములందు గలవు. సోమన తన గ్రంథమును బలదేవు మాహాత్మ్యముతోఁ బ్రారంభించినాఁడు. ప్రప్రథమమున వైశంపాయనుండిట్లు ప్రశ్నించినట్లు గలదు.

క॥ హరివంశ ప్రథమ కథాం
తరమునఁ గల వింతలెల్లఁ దప్పకనుదిలోఁ
దిరమయ్యెఁగదా మీఁదట
నరవర! యేకథలొకో? వినం బ్రియమనుడున్. ఉ. హరి. 1-3

ఇందులకుఁ బ్రత్యుత్తరముగ జనమేజయుఁడు బలదేవ మాహాత్మ్యమును విన నిచ్చగించు చున్నట్లు పలుకుటయు, వైశంపాయనుఁడు బలరాముని వర్ణించుట కుపక్రమించినాఁడు. మూలమున నీ క్రింది శ్లోకముగలదు.

శ్లో॥ పురాణేనాగరాజోఽసౌ పఠ్యతేధరణీధరః
శేషస్తేజోనిధిః శ్రీమానకంప్యః పురుషోత్తమః వి. ప. 62–4

పయి శ్లోకమునందలి 'పురాణేనాగరాజోఽసౌ' అను దానిని మాత్రము గ్రహించి విపులీకరించినాఁడు. ఇందు బలరాముఁడు శంకరాంశమునఁ బుట్టినట్లు వర్ణించి, శంకరుని లక్షణముల కనువైన విశేషణములఁ గల్పించినాఁడు. మఱియుఁ గొన్ని వ్యతిరేక లక్షణము లున్నవని జెప్పియు, బలరాముఁ డీశ్వరునితో సమానుఁడని వివరించెను. ఇందు 'హాలాహలస్వీకృతిన్'' అచుటలో శ్లేషాలంకారమును జొనిపినాఁడు.

స్వర్లోక వైభవమును బొందనెంచి, దిగ్విజయ యాత్రకు నరకుఁడేగుట మూలమున లేదు. మూలమున, నరకాసురుని బ్రవేశ పెట్టినంతనే స్వర్లోక మాతని యాధీనమందుండినటులు కలదు. కావుననే చతుర్దశి విషయమును బ్రస్తావించి, పదాఱువేల నూఱుగు రప్సరోగణంబును జెఱపట్టి కొనిపోయినటులు చెప్పఁబడినది. సోమన స్వర్లోక దండయాత్రను గల్పించి, నరకుఁ డింద్రాదులను ఘోరయుద్ధమున నోడించు పట్టమును ముప్పదిరెండు పద్యములలో వర్ణించెను. మఱియు నసురులు దేవలోకమును గొల్లగొట్టుటయు, దేవతలను బాధించుటయు మిగుల వర్ణించినాఁడు. నరకుఁడు దేవేంద్రాది సర్వదేవతల నావఱకే నిర్జించి, స్వర్లోకము నాక్రమించుకొని నాఁడను భావము మాత్రమే మూలమునఁ గలదు. ఈ క్రింది శ్లోకములయందీ విషయమూ చెప్పఁబడినది.

శ్లో॥ విఘ్నం చాస్యాకరోత్ తత్రనరకోనామదానవః
త్రాసనః సర్వదేవానాం దేవరాజరిపుర్మహాన్
సబభౌమూర్తిలింగస్థః సర్వదేవాధిబాధితా
దేవతానామృషీణాంచ ప్రతీపమకరోత్తదా. వి. ప. 63-5, 6

కాని సోమన, నరకుఁడు స్వర్గమును జయించుటయు, నట్టి కోర్కె యాతనికిఁ గల్గుటకు హేతువును గూడఁ జూప నెంచినాఁడని తోచును. అందులకే యా విధముగా రచన సాగించినాఁడు.

మ॥ ధనదాంతఃపురతాపహారములు యాదఃపాలబాలాఘన
స్తన కాశ్మీరము ధర్మరాట్కులవధూ సంవ్యానకౌశేయమున్

దనుజేంద్రారి వరావరోధయితా ధమ్మిల్ల మాల్యాంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మీ నిత్యనైపథ్యమున్.

ఉ. హరి. 1 - 16

మఱియు నీతని దిగ్విజయ యాత్ర నీ విధముగా సమర్థింపవచ్చును. బ్రహ్మవర ప్రసాదమున గర్వితుఁడయి యున్నవాఁడు నరకుఁడు. ధూర్తత్వముతో పాటుగఁ దన బల పరాక్రమోన్నతుల వెలయింపఁ నెంచినాఁడు నరకుఁడు. దేవతల పాలింద్రోతి, అదితి కుండలములఁ గొని, చతుర్దశిని గంధగజరూపమునఁ దెచ్చి పెండ్లాడి, దేవలోక మునగల సర్వైశ్వర్యమును గొల్లగొట్టి నరకుఁడు తన పురంబున కేగుటను చిత్రించుటలో సోమన, యొక క్రమమును బాటించి నట్లగపడుచున్నది.

మూలమున నింద్రుఁడు శ్రీకృష్ణుని దర్శించుట కరుదెంచు నవసరమున ద్వారవతి పురమీరీతిగా వర్ణింపఁబడినది.

శ్లో॥ తస్యాథ పురుషేంద్రస్య లోకప్రథిత తేజసః
నివాసోద్వారకా దేవైరుపాయాదుపపాదితా
అతీవహిపురీరమ్యా ద్వారకా వాసవక్షయాత్
మహార్ణవపరిక్షిప్తా పంచపర్వత శోభితా
తస్యాం దేవపురాభాయాం సభాకాంచనతోరణా
సాదాశార్హీతి విఖ్యాతా యోజన యామవిస్తృతా.

వి. ప. 63 అధ్యా. 21 - 23

మహర్షుల యాగమనము మొదటి ఘట్టము. కావున నిట నీ వర్ణన ముంచుట యుచిత మని యనువాదమున నీ మార్పు గావించినాఁడు సోమన. ఈ వర్ణనము నంతను సంగ్రహించి, పయిలీతిని దేవతా విరచితమనుటలో నిమిడ్చి, యప్పుర పరిసరములను మాత్రము యథాతథముగ 'పంచపర్వతశోభితా' యిత్యాది శ్లోకముల ననువదించెను.

క్రింది శ్లోకమున నరకుఁడు స్వయముగ నదితిని గారించి, కుండలముల నపహరించి యుండెనని స్పష్టమగుచున్నది.

శ్లో॥ అదితి ర్ధర్షయామాస కుండలార్థే మహాసురః
ఉగ్రం మహీసుమవే దేవీ స్యప్రాగ్జ్యోతిషం పురమ్.

వి. ప. 63 అధ్యా. 17

అనువాదమున నీ విషయము మార్చఁబడినది. ఇంద్రాది దిక్పాలుర నోడించిన పిమ్మట, నరకుని సైన్యాధిపతియగు మురుఁడు అదితి కుండలముల హరించి, నరకునకు గానుకగా నిచ్చెను. ఈ చర్యకుఁ బ్రతిఫలముగ మురుని కుమారులు నరకుని యంగరక్షకులుగా నియమింపఁ బడినారు.

దేవేంద్రాదుల నెల్ల నిర్జించి, స్వర్లోకము నాక్రమించిన నరకుఁడు స్వయముగా నేగి, కుండలములఁ గొనుటలో నౌచిత్యము లేదని సోమన భావించి యుండును. అందుచే సేనాదిపతి యగు మురుని మూలమున నా కార్యము సాధింపఁ బడినట్లు మార్చి, తత్ప్రతిఫలమును గూడ మురుఁడు పొందినట్లు మార్చుట సమంజసము. ఈ మార్పు ననుసరింపియే మూలమున, దేవేంద్రుఁడు శ్రీకృష్ణునితో నరకుని దుండగములు నివేదింపఁ బోవు పట్టమున నీ కుండలముల ప్రసక్తి మాత్రము దెచ్చి, యూరకుండినాఁడు. ఈ విషయమును జెప్పుచు నింద్రుఁడు, జనని కుండలములు హరింపఁబడుటలో శ్రీకృష్ణునకును, దనతో సమానమగు వ్యథ కలదని చెప్పినాడు. సోమన దేవేంద్రునిచే నీ విషయములకు బదులు సభామర్యాదలను బాటించి, సురకోటి వ్యథను మాత్రమే వాసుదేవునితోఁ జెప్పినాఁడు. ఈ క్రింది పద్యమును జూడుఁడు.

చ॥ చొరవిబిలంబులున్, వెడలఁజూడనిక్రంతలుఁగాలురాపడం
దిరుగస్రోతవలున్ విడియుఁదీర్పని గొందులు నలుబిడ్డలే
కరయునిరేలుఁ జీమచిటుకన్నను విప్పనిమూకలుంబయిం
జిరుఁగని చీరలుం గలవె చేరిన యీ సురకోటి కచ్యుతా.

1 – 131

నరకాసురుఁడు స్వర్లోకము నాక్రమించి, దేవేంద్రుని సభామండపముఁ జొచ్చి, యూర్వశిని బిలువనంపి, సంభాషించుటాదిగాఁగల విషయములు మూలమున లేవు. ఈ విషయమును సోమన ముప్పది మూఁడు పద్యములలో నతిరమణీయముగ, నాటకీయముగఁ గూర్చినాఁడు. సభాభవనము నందెందఱో సామంత దండనాయకులు

పరివేష్టించి యుండఁగా, నరకుఁడూర్వశితో సంభాషించిన తీరు, యొకనాటకమునందు, రెండు పాత్రల సంభాషణముతోఁ గూడిన రసపూరితమగు నొక అంకమువలె భాసించును.

ఈ పట్టమున మహాకవి సోమనాథుఁ డలఁతి యలఁతి పదములతోడనే రచన సాగించుట మఱియొక విశేషము. మచ్చునకీ దిగువ రెండు పద్యములను జూడుఁడు.

క॥ పగవాఁడట దేవేంద్రుఁడు
సగినవా నీవతని కొలువుమాని సివటు న్
దగవుచెఱి పిలువఁబనుచుట
నగరానమే యిట్టి లంజెమాటలు గలవే. 1 – 70

ఉ॥ లంజెను గాదు నేను విను లావున నీవు సురేంద్రు గెల్చి
న్నుం జెఱవట్టి తెచ్చి మది వినోదము చేసితి గాక చిత్తమె
ల్లం జెడియుండ రిత్త యొడలం జవిచేరునె చిల్కవోయినం
బంజరమేమి సేయు? రసభంగము సంగతిలోన మెత్తురే.
1 – 72

మఱియు నరకుఁడధ్వరభాగంబులఁ గొన యొప్పువడి, యూర్వశిని బనిచినాఁడు. ఆ దైత్యుఁడు మునులను బాధించుటయు, నాతని యాగములను ఋషులు శ్రీకృష్ణునకు విన్నవించుటయు ననువాదమున మఱియొక ముప్పదిమూఁడు పద్యములలో రచించెను. ఈ విషయములు రెండును నూర్వశీ నరకుల సంభాషణమున కనుబంధముల వంటివి. ఈ పట్టముల వివరించుటయందు సోమన తన నేర్పు కలిమిని జూపె ననవచ్చును.

అయ్యసురనాథుఁడు తొలుత సామమున యజ్ఞాంశముల నర్థించి, మహర్షుల నిరసనమునకుఁ గోపించి, తనవారల నాయాశ్రమము నాశనముచేయ నాజ్ఞాపించినాఁడు. ఇట సోమన తన సాహిత్యరసపోషణ బిరుదమునకొక సోపానమును నిర్మించు కొనెను. ఊర్వశీ నరకుల ప్రణయ సంభాషణము పట్టున శృంగారరసమును, దైత్యులు మహర్షుల కొల్లగొట్టు నవసరమునఁ గరుణరసమును బోషించినాఁడు.

బదరి కాశ్రమ వాసులగు భరద్వాజ కాశ్యపాది మహర్షులు నరకుని దుండగములు శ్రీకృష్ణుని కెఱింగింప ద్వారవతి కరుదెంచు పట్టుల 'దేవతా విరచిత పంచశక్రార్థ రాంతస్థలంబున నొప్పారెడువీడు' అని సంగ్రహముగా వర్ణించినాడు సోముడు. మహర్షుల నధ్వరభాగంబుల కయి నరకుడు బాధించుట, వారు శ్రీకృష్ణునికడకేగి, యా పురుషోత్తముని నుతించుట, నాతనికి విన్నవించుట, తిరిగి తమనివాసములకు మరలుట—యిత్యాది సన్నివేశములు నంవిధాన చక్రవర్తియగు సోమన తన నేర్పు మెఱు గల్పించినవి తాపసులు విష్ణు స్వరూపుండగు శ్రీకృష్ణుని స్తుతించు నవసరము నందలి, యీ క్రింది సీసపద్యము మహాకవి సోమనాథుని కవితాప్రావీణ్యమునకు ధ్వజప్రాయమగు తార్కాణము.

సీ॥ పన్నగంబుల రాజు బగవాడు గూడి నీ
శయనంబు బయనంబు సంతరింప
దుగ్ధవారాశికూతురు నాలుగూడి నీ
శరణంబు జరణంబు నవదరింప
దామరపగవాడు దయితుండు గూడి నీ
బడిచూపు గుడిచూపు బరిఢవింప
జందురుచెలికాడు సయిదోడు గూడి నీ
యుల్లంబు మొల్లంబు నుపచరింప

తే॥ గంపమాన మనోధ్యానగతులు మాన
కేకతం బున్న మునులకు నేకతంబు
లేక పొడగాన వచ్చునీలీల గాన
నన్యులేనాటు ధన్యులే యంబుజాక్ష. ఉ. హరి. 1 - 119

సత్యభామా నరకాసురుల యుద్ధమంతయు సమూలకమే. మూలమున శ్రీకృష్ణుడు, నరకుని సంహరింతునని ప్రతిజ్ఞను గైకొని, సత్యభామాసమేతుడయి యుద్ధమునకు బయలువెడలినట్లు గలదు.

శ్లో॥ తతః సహైవ శక్రేణ శంఖచక్రగదాసిభృత్
ప్రతస్థేగరుడేనాథ సత్యభామాసహాయవాన్.

వి. ప. 63 అధ్యా. 39

పై శ్లోకము నాధారముగాఁ గొని, మహాకవి సోమనాథుఁడు నరకవధ ఘట్టము నతి మనోజ్ఞముగ నిర్మించినాఁడు. పురాణాంతర్గత విశేషముల స్మరణకుఁ దెచ్చుచు, సజీవ పాత్ర చిత్రణలతో నొప్పు నీ సన్నివేశములు సోమన కవిత కొక ప్రత్యేకత నాపాదించినవి.

నరకాసుర వధ ఘట్టమున సోమనాథుఁడు కొన్ని తావులయందలి వర్ణనాదుల విడిచియుఁ, గొన్నిటిని సంగ్రహించియు, యథోచితానువాదమును జేసియున్నాఁడు. ఇవి చాలవఱకు సహేతుకములనియే చెప్పవచ్చును. ఈ మార్పులయందు సోమన కవిత యందలి సందర్భశుద్ధియు, నౌచిత్యమును స్పష్టమగును.

హరివంశము పురాణము గావున మురాంతకుఁడు, నరకాసురుని వధింపఁ బ్రాగ్జ్యోతిష పురంబును సమీపించు నవసరమున, నవతారపురుషుఁడగు శ్రీకృష్ణుని వర్ణనము సేయఁబడినది.

శ్లో॥ గరుడస్యోపరి శ్రీమాన్ శంఖచక్రగదా ధరః
బిభ్రన్నీలాంబుదాకారం పీతవాసాశ్చతుర్భుజః
వనమాలాకులోరస్కః శ్రీవత్సాంకిత భూషణః
కిరీటమూర్ధ్నా సూర్యాభః సవిద్యుదివచంద్రమాః
జ్యాం వికూజన్మహాశబ్దః శ్రూయతేఽశని నిఃస్వనః
జ్ఞాత్వాచ దానవః సర్వం స్వయం విష్ణురిహాగతః,

వి. ప. 63 అధ్యా. 47—49

ప్రబంధ ఫక్కిని రచించు సోముఁడట్టి విషయములు అట్టి సమయములందుండుట అనుచితమని యెంచి యనువదింపలేదు. నరకాసురుని సేనాధిపతులలో నిశుంభుఁ డొకఁడు. వాసుదేవుని రాకను గమనించి, ముర, హయగ్రీవ, నిశుంభులు తొలుత నాతని నెదుర్కొనిరి. శ్రీకృష్ణుఁడు వారలతోఁ బోరాడి, వారలను గాలుని సదనమున

కంపినాఁడు. శ్రీకృష్ణునకును, నరకుని సేనాధిపతులగు మురహయగ్రీవ, నిశుంభ, పంచజనులకును జరిగిన యుద్ధము, మూలమున ముప్పదియైదు శ్లోకములలో సుదీర్ఘముగ వర్ణింపఁబడినది. (అధ్యా. 63 — 57 నుండి 70; 72 నుండి 85) శ్రీకృష్ణుఁడీ నలువురను గూల్చు విషయ మనువాదమున సంగ్రహింపఁబడి నాలుఁగు పద్యములలో సమగ్రముగ రచింపఁ బడినది. ఈ సందర్భమున సుమారు ముప్పది శ్లోకముల యుద్ధవర్ణనము పూర్తిగాఁ 'బరిహరింపఁబడినది.'[1] మూలమున రెండు శ్లోకములలోని భావము ననుసరించి, రణరంగవర్ణనమున కొక వచనమును సోమన స్వతంత్రముగా విరచించెను.

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు గాలువలు గట్టి గట్టిమెయిమఱువులు సించియుఁ, గాయంబులు నొంచియు, మర్మంబులు గీఱియు, మహీతలంబులు దూఱియుఁ, బ్రేవులు వెఱికియుఁ, బెనుమూఁకల కుఱికియు, సీసకంబులు వగిలించియు, శిరంబులు నొగలించియుఁ, గైదువులు గఱచియుం, గరవాలంబులు సఱచియు, నెత్తురులు సిమ్మియు, నెవళ్లు గ్రుమ్మియుఁ, జరణంబులు దొలిచియుఁ, జర్మంబు లొలిచియు, బాహుదండంబులు గత్తరించియు, బయళ్ళకు నొత్తరించియుఁ, బలుగండలు సెండియు, బరులురాసి మండియు, గుండెలు ద్రుంచియుఁ, గుత్తుకలు ద్రెంచియు, నురంబులు గాఁడియు, నరంబులు దోఁడియు, నుదరంబులు వ్రచ్చియు, నూరువులు గుదిగ్రుచ్చియు, మకుటంబులు విఱిచియు, మదంబులు చెఱిచియు, జంఘులు సెల(లి)సియు, జఘనంబుల బల(లి)సియుఁ, బాణులం బెనంగియుఁ, బ్రాణంబుల మ్రింగియుఁ, జట్టులు వాపియుఁ, జమత్కారంబులు మాపియుఁ, బై పయిం దోఁచిన నేచినదనుజబలంబు చలంబుకొని పోరి పోరిలోఁ దునక లయ్యెనుఁ దుమురయ్యెను నింతింత లయ్యెను నిసుమంత లయ్యెనుఁ జిఱునుగ్గయ్యెనుఁ జిదురుపలయ్యెను మంచయ్యెను మడిమంచయ్యెను రూపు

చెడి తిరుగుడువడి వాహినులు చిక్కువడి చిందఱవందఱై
మతిచెడి మల్లామడియై యేపుదెగిఁజు(యె?)పురుసవురై
యనువుదప్పి యదవదయై యంతంతవిచ్చి యరవరలై పాఱ
లేక పలపలనై వెఱఁగుపడి వెలవెల్లనై చిదుముడిపడి చెల్లా
చెదరై పొడవడంగి ప్రోవునకొక్కండై పోవిడిచినఁ బోయిన
పోకై పోయినంగని దనుజనాయకుండు తనమొన కభయ
దాయకుండై నిజరథ నిహితబహువిధసాయకుండై చాలుఁ
జాలుఁ బోకు పోకు నిలునిలు మని యదలించి కోదండంబు
ధరియించి గొనయంబుసారించి సారథికి రథవేగం బుప
దేశించుసమయంబున.

క. కమ్ములఁ దవిలెడు నేనిక
కొమ్ములు నెమ్ములును సుభటుకోటులయమ్ముల్
నెమ్మనమునూఁకు సెఱుపఁగ
నుమ్మలికపుఁగింకఁ గొంక కురవడి నేసెన్.

ఉ. హరి. 1 - 149

పై వచనమున యుద్ధరంగమునందలి భీభత్సమును గన్నులకుఁ గట్టునట్లుగా వేవిధ ముల వర్ణించియున్నాఁడు.

మఱియొక విషయము . మూలమున నిశుండుఁడని యుండగా ననువాదమున "నిశుంభు"డని మార్చఁబడినది. ఎఱ్ఱనయు 'నిశుంభుఁడ'నియే రచించినాడు. ఈ పదము మూలమున నన్ని స్థలములందును నీ విధముగనే గలదు. ఈ మార్పునకు హేతువు పాఠాంతరము గావచ్చును.

నరకాసురుఁడు తన బలములు మురారి ముందట నిలువఁజాలకుండెనను విష యమును దెలిసికొని తానే స్వయముగ యుద్ధమునకు బయలుదేరినాఁడు. అట నాలుఁగు శ్లోకములలో నీక్రింది విధముగా నరకుని రథవర్ణనము గలదు.

శ్లో॥ లోహచక్రాష్ట సంయుక్తం త్రినల్వప్రతిమం రథమ్
రత్నకాంచన చిత్రాఢ్యం వేదికాభోగవిస్తరమ్
వజ్రధ్వజేన మహతా కాంచనేన విరాజితమ్

హేమదండ పతాకాఢ్యం వైడూర్యమణికూబరమ్
యుక్తమశ్వసహస్రేణ రథం పరరథారుజమ్
లోహజాలైశ్చ సంఛన్నం చిత్రభక్తివిరాజితమ్
రథమధ్యగతోవీరః ససంధ్యాఇవ భాస్కరః
నానాప్రహరణాకీర్ణం రథం హేము పరిష్కృతమ్.

వి. ప. 63 అధ్యా. 92–95

ఈ రథవర్ణనము నంతయు విడిచి, సోమనాథుఁడు 'నానాప్రహరణాకీర్ణం రథం' అను దానిని గ్రహించి, "నిజరథనిహిత బహువిధసాయకుండై" అని యనువదించినాఁడు. మఱియు నా సందర్భమున నరకుఁడు కాలసన్నిభుని వోలె నేతెంచుచున్నట్టు లైదు శ్లోకములలో నాతని యుద్ధసన్నద్ధతయును, నాతని స్వరూపాదులును వర్ణింపఁబడినవి.

శ్లో॥ వజ్రం రథోరచ్ఛద మిందువర్ణం వ్యానద్ధముక్తానలతుల్యతేజాః
కిరీటు మూర్ధ్నార్క హుతాశనాభఃకర్ణౌతథాకుండలయోర్జ్వలంతౌ
ధూమ్రవర్ణా మహాకాయా రక్తాక్షా వికృతాననాః
నానాకవచినః సర్వే దైత్యదానవరాక్షసాః
ఖడ్గచర్మధరాః కేచిత్కేచిత్తూణధనుర్భృతః
శక్తిహస్తాస్తథా కేచిచ్ఛూల హస్తాస్తథా పరే
గజవాజి రథౌఘైశ్చ కాలయన్తశ్చ మేదినీమ్
నిర్యయుర్నగరాత్సర్వే సుసన్నద్ధాః ప్రహారిణః
వృతో దైత్యగణైః సార్ధం నరకః కాలసన్నిభః
భేరీ శంఖమృదంగానాంపణవానాం సహస్రశః.

వి. ప. 63 అధ్యా. 96–100

నరకుని కర్ణములందుఁ గల కుండలముల కాంతియు, వర్ణింపఁబడుటలో నదితి కుండలములను ధరించెననియు ధ్వనించు చున్నది.

దనుజుఁడేసిన సాయకంబులు చనుదెంచు వేగమును దెలుపుచు, నొక సీసమును

సోమనాథుఁడు రచించినాఁడు. ఆ వేగిరంపు బాణముల తళతళలు సత్యభామ మేనఁబ్రతిఫలించి, యామె సొబగు నినుమడింపఁ జేయుచుండెనఁట. ఆ పద్యము నీక్రింద నుదాహరించు చున్నాను.

సీ॥ క్రేఁగంటిచూపున గిటిగొన్నసన్నగే
 దంగఱేకుల కన్నదమ్ము లగుచు
జడగొప్పులోను నచ్చపుసజ్జకము లైన
 విరవాదులకు వింతవిందు లగుచు
బిగువుఁజన్నులమీఁదఁ బెనుపడం బైనచెం
 గలువక్రొవ్విరుల సంగడము లగుచు
గేలికి హరివైవఁ గేలఁ దాలిచిన సం
 పఁగిబంతికొనల జోపాప లగుచు
తే॥ వేగ నరకాసురుం డేయువేగిరంపు
బాణములఁ బ్రాణములు సత్యభామమేనఁ
గుసుమశృంగారముల కెల్లఁ గ్రొత్తసేయ
నెనిమిదిదెఱంగు లై సొబ గినుమడించె.

ఉ. హరి. 1 - 151

ఇట్టి సమయమున దనుజనాయకుండు జగన్నాథునిపయి యొకదివ్యశరము నేసినాఁడు అది హరి నిటల తటమున నాటి కంసవిరోధి మూర్ఛవోయెను. గరుడపక్షవాతానిలముల శ్రీకృష్ణుఁడు సేదదేఱి, సత్యభామను, యుద్ధముసేయ నియోగించెను. ఆమె యుద్ధము సేయుట కుపక్రమించినది. ఆమె శార్ఙ్గమును ధరించి, శరమును సంధానింపఁగా, నా చాపము, గుడుసైనది. అప్పుడామె మోము పరివేషము గల చంద్రుని రీతి భాసిల్లి నది. ఆమె యుద్ధ నైపుణ్యము నీ క్రింది విధముగ సోమన వర్ణించినాఁడు.

మ॥ గనయంబున్ గొనయంబు నెన్నడుముతోఁగర్ణావతంసంబుతో
జనుదోయింగనుదోయిసాయకముతో సంధానహస్తంబుతోఁ
జెనకం జేయుచు నేయు చుండె సతి లక్ష్మీభూతదైతేయత
ర్జనగర్జారవజర్జరాంగరుధిరాసారంబు దోరంబుగన్.

ఉ. హరి. 1 - 157

శా॥ సత్రాజిత్తనయాకరాంతర ధనుర్జ్యారావ మైరావతీ
సూత్రానర్గళనిర్గతస్తనిత మైసూత్రామచాపప్రభా
పాత్రభ్రూలతికావిలాసముల కొప్పం గప్పు శార్ఙ్గాంబుము
క్పత్రిక్రూరమహాశనుల్ దనుజరాడ్గాత్రంబుగోత్రంబుగన్.
ఉ. హరి. 1 - 160

ఇంతటి భయంకరమగు యుద్ధము చేయఁజాలిన సత్యాభామ తనూ విలాసముల సౌకుమార్యము నిటుల వర్ణించుచునే, యామె సంగ్రామ సీమను మొక్కలంపు గెలుపు గైకొనినదనుటలో, నామెయందు శృంగారముల వీరనేకముఖముగఁ జెప్పినాఁడుకవి. ఈ క్రింది పద్యమున నా విషయ మతిమనోహరముగ నున్నది.

సీ॥ తంత్రీవినోదంబు తడవు సైఁపనివ్రేళ్ల
గొనయంబుతెగలపైఁ గోరు కొనుట
యద్దంబుపిడి ముట్ట నలయుపాణితలంబు
లస్త్రకం బిటియించు లావుకలిమి
చెలికత్తె నొత్తిలి చీర లేనియెలుంగు
సింహనాదంబుచేఁ జెదర కునికి
ప్రమదనర్తనకేలిఁ బరిభవింపనిపదం
బైదుఠాణంబుల సలఁతఁ బడమి

తే॥ సోయగపుఁజిత్రరూపంబుఁ జూచుచోట
వేసరువిలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపుగెలుపు
గైకొనియె సత్యభామ సంగ్రామసీమ. ఉ. హరి. 1 - 161

ఇట్లు సత్యానరకుల యుద్ధమును బొడిగించి, తుదకామె నరకుని విరథునిఁజేసి నొంపించిన విధము నీ క్రింది రెండు పద్యములలో నతి సరళములగు పదముల ప్రయోగించి రచన సాగించినాఁడు సోమనాథుఁడు.

గీ॥ గొడుగుకామయు విల్లునుఁ బడగతోన
తుమురు సేసి రథ్యంబులఁ దునిమి వైచె
నతివ యతఁ డొండుకోదండ మందికొన్న
నఱకె వేఱె విల్లెత్తిన విఱుగ సేసె. ఉ. హరి. 1 - 166

క॥ గద విసరి వైచె నరకుఁడు
వదలక సతి దునిమె శక్తివైచెను దితిజుం
డది ముదిత దుమురు సేసెను
దుదిఁ బరిఘము వైచె నతఁడు దొయ్యలి విఱిచెన్.
ఉ. హరి. 1 - 167

సత్యాభామను వీరశృంగారముల మేలుకలయికగా వెలయించి, సోమనాథుఁడు, పదునేను పద్యములలో నామె యుద్ధ నైపుణ్యమును విపులముగ వర్ణించియున్నాఁడు. మూలమున సత్యభామా సహాయుఁడై శ్రీకృష్ణుఁడు వెడలెనను విషయము నాధారముగాఁ గ్రహించి, సోమన సత్యభామ పాత్రకు నింతటి ప్రాధాన్య మొసంగుటకుఁ గారణము లేక పోలేదు. నరకాసురుఁడు, వరాహ రూపముననున్న విష్ణుమూర్తి వలన భూదేవికిఁ బుట్టినవాఁడు. మూలమున లేని యీ విషయమును గూడ సోమనాథుఁ డీక్రింది పద్యమునఁ జెప్పినాఁడు.

ఉ॥ ఏను వసుంధరన్ దుదుకులేశ దయాకర సూకరాకృతిం
బూనిననాఁడు నీవు ననుఁ బొందినఁ బుట్టినవాఁడు వీఁడు నీ
చే నపరాద్ధుఁ డైన మఱి చెప్పెడి దెవ్వరి కింకఁ గింక లో
నూనఁగ నీక కుండలము లొప్పఁగ నొప్పన గొమ్ము క్రమ్మఱన్
ఉ. హరి. 1 - 189

శ్రీకృష్ణ నరకాసురుల యుద్ధమునందుఁ గూడ (శ్లో. 107 నుండి 120 వఱకు) పదునాలుఁగు శ్లోకములలో నీ దిగువ నుదాహరింపఁబడిన యొక్క శ్లోకమే గ్రహింపఁబడినది.

శ్లో॥ వ్యహానత్స రథం చాస్యశరైః కేణ జనార్దనః
సరథం సధ్వజం సాశ్వం జఘాన దశభిః శరైః.
వి. ప. 63 అధ్యా. 115

దీనికి క్రింది యనువాదము గలదు.

క. క్రమ్మఱ నేడుశరంబుల
నమ్మురరిపు నేసె విభుఁడు నద్దనుజునిచా
పమ్ముఁ దుమురు నేసెను ర
థ్యమ్ముల సారథిని నంపధారలఁ బొదివెన్.

ఉ. హరి. 1 – 172

మిగిలిన శ్లోకము లందలి విషయమును బరిహరించినాఁడు.

మాతృప్రేరేపణమునందక్క నితనికిఁ జావులేకుండునట్లు బ్రహ్మదేవునిచే వర మొసంగఁబడినది. శ్రీమన్నారాయణుని భార్యలగు శ్రీదేవి భూదేవులు శ్రీకృష్ణావ తారమున రుక్మిణీ సత్యభామలుగ నవతరించిరని పురాణములు సెప్పుచున్నవి. ఆ కారణముననే మూలమునఁ గూడ సత్యభామా సమేతుఁడు గానిదే, శ్రీకృష్ణుఁ డాదను జుని వధింపఁ జాలఁడను భావము గలదు కాని యట నిది ప్రమేయమగపడదు. అందులకే నరకుని సంహరించువాఁడు శ్రీమన్నారాయణాంశమును బొందిన శ్రీకృష్ణుఁడే యైనను, నయ్యసురునికిఁ గల వరబలమున కనువుగ సత్యభామ తోడ్పాటు కావలసి యున్నది. ఆ విషయము నిట క్రియారూపమునఁ జూపినఁగాని యౌచిత్యపోషణము నకు సంపూర్ణత్వము సమకూఱనేరదని భావించినాఁడు సోమన.

మఱియు, సత్యభామయుఁ గదనరంగమున కేఁగినప్పటి నుండియు, శ్రీకృష్ణు నకు సాహాయ్యముఁ జేయుచుండినటులు గానవగును. నిశుంభుని తోడఁ బోరు సల్పు నవసరమున, నా యసురుని గదాహతికి శ్రీకృష్ణుని మేనొకింత నొచ్చినది. తోడన నిశుంభుని పయి సత్యభామ గదను వెట్టుగ వైచినదఁట. ఆ దెబ్బ కాతఁడు తాళఁ జాలక రక్తమును గ్రక్కుకొనినాఁడు.

మఱియొక విశేషము. శ్రీకృష్ణ నరకాసురుల యుద్ధము విషయమునఁ గూడఁ బ్రత్యేకమగు దృష్టినిడి మూలముతోడి భిన్నత్వమును గూర్చినాఁడు. మాతృదేవతాభి నివేశము లేనిదే నరకుని వధించుట కవకాశము లేదని ముందే వివరించితినిగదా! కావుననే సోముని యనువాదమున సత్యానరకుల యుద్ధము పదేను పద్యముల యందును, శ్రీకృష్ణ నరకుల యుద్ధ మైదు పద్యములలోను వర్ణించినాఁడు. ఈ మార్పును

గావించుటచే బ్రహ్మవర ప్రసాదలబ్ధుఁడగు నరకాసుర వధ ఘట్టమున నౌచిత్య పోషణము సమకూరినదనుట నిశ్చయము.

నరకాసురుని సంహరించిన తోడనే కన్నతల్లి మనోవ్యథ గూడ మూలమున కానరాదు. మూలశ్లోక మీ విధముగా నున్నది.

శ్లో॥ దత్తస్త్వయైవగోవింద త్వయైవవినిపాతితః
యధేచ్ఛసి తథాక్రీడా బాలాఃక్రీడన తైరివ.

వి. ప. 63 అధ్యా. 126

ఇందు పుత్త్రశోక మతినీరసముగా నున్నది. మూలము నతిక్రమించి సోమన క్రింది పద్యమున పగపు చిత్తరువో, కళవళము కరువో, యనునట్లు వసుంధరను వర్ణించుచున్నారు.

సీ॥ మాఁగువాఱినచంద్రమండలంబునుఁబోలె
వదనారవిందంబు వన్నె దఱుఁగ
మకరందమున నిండుమధుకరంబులుఁ బోలె
నేత్రోత్పలంబులు నీటఁదేల
నెఱి దప్పి వ్రాలిన నీలిమేఘమువోలెఁ
గచభారబర్హ మగ్గలము వీడఁ
దొడఁగి చాలఁ జలించుతొండంపుఁగవవోలె
నూరురంభాస్తంభయుగము వడఁకఁ

తే॥ గడఁక లేని తనూవల్లి ఘర్మజలము
దళముగాఁ జిందఁ జెందనితాల్మితోడ
పగపుచిత్తరువో కళవళముకరువొ
యనఁగ నొకగాంత గానంగ నయ్యె నంత.

-ఉ. హరి. 1 - 178

ఇంతియకాక, భూదేవి శ్రీకృష్ణునితోఁ బల్కిన పలుకులును సమూలకములే. ఆమె, నరకాసురుని తనయునికిఁ బ్రాగ్జ్యోతిషంబు దయసేయుమని పతిని వేడినది.

సకల దానవుల నంతమొందించు విధముననే, మహర్షుల కోర్కెఁదీర్ప, నాత్మజుని గూడ సంహరించి, మిత్రత్వశత్రుత్వములయందు సమభావమును నెఱపినవాఁడవని పొగడినది. కాని కన్నమోహంబున నామె చింతనొంది యిట్లులనియెను.

క॥ అట్టేల జగము లన్నియుఁ
బుట్టింపం బెంపఁ ద్రుంపఁ బురుషులు ముగురై
పుట్టినవేలుపవటు నా
పట్టియెడం దగునె నడిమిపని మానుటకున్.

ఉ. హరి. 1 - 187

ఇట్లు లోకజ్ఞత యుట్టిపడ నమూలకముగ, ధారుణీదేవి దైన్యమును వర్ణించినాఁడు సోమనాథుఁడు.

## ద్వితీయాశ్వాసము

శ్రీకృష్ణ మాహాత్మ్యము బహుధా వర్ణింపఁబడిన ద్వితీయాశ్వాసమునందు గూడ గొన్నిచోట్ల మార్పులనుగావించి, మూలమునకు మెఱుగులు వెట్టినాఁడు సోమన. ఈ యాశ్వాసమునఁగల కథను బాండవమధ్యముండగు నర్జునుఁడు, భీష్ము నానతిని ధర్మ రాజాదుల సమక్షమునఁ జెప్పుచున్నట్లు గలదు.

ఒకనాటి దీక్ష కొనరిన క్రతువును జేపట్టియున్న శ్రీకృష్ణుని కడకొక విప్రుఁడేతెంచి, రక్షింపుమని ప్రార్థించినాఁడు. మూలమున నా ఘట్టమున ఆఱు శ్లోకములు గలవు. వానినిట పొందు పఱచుచున్నాఁడను.

శ్లో॥ తతో దీక్షితమాసీనమభిగమ్య ద్విజోత్తమః
కృష్ణం విజ్ఞాపయామాస త్రాహిత్రాహీతి చాబ్రవీత్.
రక్షాధికారో భవతః పరిత్రాయస్వ మాం విభో
చతుర్థాశం హిధర్మస్య రక్షితా లభతే ఫలమ్.
నభేతవ్యం ద్విజశ్రేష్ఠ రక్షామి త్వాం కుతోభయమ్.
బ్రూహి తత్వేన భద్రం తే యద్యపిస్యాత్సు దుష్కరమ్

జాతో జాతో మహాబాహో పుత్రోమే మ్రియతే నఘ
త్రయో హృతాశ్చతుర్థం త్వం కృష్ణరక్షతు మర్హసి.
బ్రాహ్మణ్యాః సూతికాలేద్య తత్ర రక్షా విధీయతామ్
యథా ధ్రియదపత్యం మే తథా కురు జనార్దనా.
తతోమామాహ గోవిందో దీక్షితోహం ఋతావితి
రక్షాచ బ్రాహ్మణే కర్యా సర్వావస్థాగతై రపి.
వి. ప. 111 అధ్యా. 8—13

ఈ విషయము నీ క్రింది విధముగా ననువదించుచు సోమన ఆమూలకముగ నాలు పద్యముల రచించెను. ఆ ఘట్టము నత్యంత రమ్యముగ చిత్రించుటతో నాటకీయతా ప్రాగల్భ్య ముట్టిపడ దీర్చి దిద్దినాఁడు.

చ॥ అకట కుమారులార కడుపార మిముం గని పాఱవైచు త
ల్లికినటు సూచుతండ్రికి బలే తొలుబామున లేవునోములూ
రక వనుఁగన్నుఁ బ్రామి విధి రత్నపుబొమ్మల నాఁచికొన్ననా
మొకమున వ్రేలుచున్న యవిమువ్వురమూర్తులునంచునార్తుఁడై

క॥ వెడ పీడెడుదోవతియును
బెడతలచేతులు వడంకుపెదవులు తూఁగా
డెడువెండ్రుకలునుఁ బైపై
వెడలెడు కన్నీరుఁ గలుగువేషముతోడన్.

క॥ ముందటు నిలిచి మురాంతక
మందరధర భక్తలోకమందార దయా
కందళితహృదయ సురముని
వందితపాదారవింద వసుదేవసుతా.

గీ॥ దేవదేవ రక్షింపవె దివ్యమూర్తి
యనుచుఁ బలుకునవ్విప్రునియార్తభంగి
చూచు మురవైరి శోకంబుఁ జూడలేక
వెడలె నాకునుఁ గన్నీరు వేయు నేల.

వ. అట్టియెడ దేవదేవుం డమ్మహీదేవున కిట్లనియె.

క॥ ఏ లయ్యా భూసురోత్తమ!
దూఱెదు నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ
దేలుదురే మముబోంట్లకుఁ
దాలిమి తేకున్నఁ దెలుపఁ దగువా రయ్యున్.

క॥ మేలుం గీడును వచ్చుం
గాలముతో రెంటిచేతఁ గలఁగరు ధీరుల్
తేలుచు మునుఁగుచు నితరులు
జాలిం బడుదురు వివేకసంగతి తేమిన్.

వ. అనుటయు నవ్వాసుదేవునకు భూసురోత్తముం డిట్లనియె.

క॥ ఓపురుషోత్తమ! యెట్లుః ప్ర
లాపింపక యుండుదుం జలంబున విధి నా
పాపల మువ్వురఁ దోడ్తోఁ
జూపోపక చంపెఁ దత్ప్రసూతిదినములన్.

మ॥ అవి యెల్లం గడచన్న నేఁడు దుదగా నస్మత్కళత్రంబు గా
రవమున్ మోదముఖేదమున్ బెరయగర్భంబిమ్ములందాల్చినన్
నవమాసంబులు నిండె గుండెవగిలెన్నాకంతలోఁగొంతలో
కవినోదంబుల కీఫలంబు చవి దక్కంజేసి రక్షింపవే.

సీ॥ తడి యొత్తుచీరతో దాది కౌఁగిటఁ జేర్చి
చూపంగఁ గన్నారఁ జూడనైతిఁ
దడవి యాడకమున్న తట్టాడు మని పట్టి
వడఁకంగ సెజ్జపై వ్రాల్పనైతి
నల్లంతదవ్వుల నవ్వలప్ప లనంగ
నెదురుగాఁ బఱతేర నెత్తనైతి

వియ్యాలచే నిచ్చి వేడుక నను వారు
తిట్టింప విని దప్పి దేర నైతి

తే॥ నకట మిథ్యామనోరథుండైతిఁ గాని
కొడుకులం గని దమవారు గొండ సేయ
నుండ లే దయ్యె సంపద లుబ్బె నేని
లేబరమ కాదె బిడ్డలు లేనిబ్రతుకు

క॥ ఈగర్భము రక్షించిన
నాగౌరవ మేమిఁ జెడక నారాయణ! నా
నాగుణసంపన్నులలో
సాగుదు నటు గాక యున్న సమయుదు నగలన్.

చ॥ అనుడు నొకింత లేఁతనగ వాననపద్మము గారవింప మ
న్ననఁగృప సేయు నేఁడొకదినంబునుదీక్షితుఁడై ననాకు; రా
నను నగు నెల్లి భూసురకులాగ్రణి! యెన్నివిధంబులందు నీ
తనయునిఁ గాతు నన్నహరిఁదప్పకచూచియతండు దీనుఁడై

ఉ॥ నేఁడు ప్రసూతికాలమున నీవు గదాధర! మద్గృహంబునన్
వాఁడిమితోడ నుండి జమువాకిలి గట్టి మదీయసంతతిం
బోఁడిమితోడఁ గాచి ననుఁబుణ్యునిఁ జేసినఁగాక యింతలో
మాఁడిన నేమిచేసెదవు మంత్రపునీళులు నల్లవచ్చునే.

ఉ. హరి. 2. 6-19

ఇందాఱేడు పద్యములందు విప్రునికి సంతతిఁ గలిగియు పూర్వజన్మదుష్కృతముచే నారత్నంపు బొమ్మలను విధి దోచికొని పోవుటయును, నాతని భయాందోళనాదికములును విపులముగ వర్ణింపఁబడినవి. విప్రుని పాత్రకు వన్నెబెట్టుటకుగాను, సోమన యాతని స్వరూపమును మన కన్నులకు కట్టునట్లు వర్ణించినాఁడు. మఱియు నిట నా విప్రుఁడు గావించిన శ్రీకృష్ణుని సంబోధనములలో నొక విశిష్టతయుఁ గాననగును. ఆ విషయము విపులముగ నాచన సోమనాథుని బిరుదములను గూర్చిన ప్రకరణమునఁ జూడనగును.

మూలమున నీ క్రింది శ్లోకమునకు సోమనాథుని యాంధ్రీకరణమునుబట్టి, యానాటి బ్రాహ్మణులకు సమాజమునఁ గల స్థానము తెలియనగును.

మూలము : శ్లో॥ నభేతవ్యం ద్విజశ్రేష్ఠ రక్షామిత్వాం కుతోభయమ్
బ్రూహితత్వేన భద్రం తేయద్యపిస్యాత్ సుదుష్కరమ్
వి. ప. 111 అధ్యా. 10

అనువాదము : క॥ ఏ లయ్య భూసురోత్తమ!
దూలెదు నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ
దేలుదురే మముబోంట్లకుఁ
దాలిమి లేకున్నఁ దెలుపఁ దగువా రయ్యున్.

క॥ మేలుం గీడును వచ్చుం
గాలముతో రెంటిచేతఁ గలఁగరు ధీరుల్
తేలుచు మునుఁగుచు నితరులు
జాలిం బడుదురు వివేకసంగతి లేమిన్.

ఉ. హరి. 2 - 11, 12

వీనియందు బ్రాహ్మణోత్తములలో నెంతటి తత్త్వసంపద యానాఁడు గలదో తెల్లమగుచున్నది. కాలవశమునఁగలుగు కర్మంబులకు వగవంబనిలేదని శ్రీకృష్ణుఁడు ప్రత్యుత్తరమిడినాఁడు. ఇట మూలమున లేని మఱి రెండు విషయములను గలిపినాఁడు. ఆ భూసురోత్తముని వంటివారు, సాక్షాన్నారాయణావతారమగు శ్రీకృష్ణుని వంటి వారికి సహితము హితబోధను చేయఁ దగిన వారనుటలో నా విప్రుని యుత్తమత్వము గోచరించుచున్నది. వివేక సంపన్నులగు వారలెట్టి యాపదలందును విగత ధైర్యులు గారనియెడు సూక్తిని చేర్చినాఁడు సోమన. ఈ యుపన్యాస వివరములను బట్టి సోమనాథుని సమసిద్ధాంతము తెలియనగును.

యథామూలకముగా ననువదించిన పట్టులందును నీకవి యొకింత మెఱుఁగు వెట్టుట కాననగును. మూలమునందలి క్రింది శ్లోకములం జూచునది.

శ్లో॥ జాతో జాతో మహాబాహో పుత్రమే హ్రియతేనఘ
త్రయో హృతాశ్చతుర్థం త్వం కృష్ణరక్షిత మర్హసి
బ్రాహ్మణ్యాః సూతికాలోద్య తత్రరక్షావిధాయతామ్
యథాద్రీయు దపత్యం మే తథాకురు జనార్దన.

వి. ప. 111 అధ్యా. 11, 12

అను శ్లోకముల కనువాదమున—

మ॥ అవి యెల్లం గడచన్న నేఁడు దుదగా నస్మత్కళత్రంబు గౌ
రవమున్ మోదముఖేదమున్ బెరయగర్భంబిమ్ములందాల్చినన్
నవమాసంబులు నిండె గుండెవగిలి లెన్నాకంతలోఁగొంతలో
కవినోదంబుల కీఫలంబు చవి దక్కంజేసి రక్షింపవే.

ఉ. హరి. 2 - 15

అను రచనమును జేసినాఁడు ఇందు మూలభావములకుఁ దగిన విషయమునిముడ్చు టయగాక, 'కొంత లోకవినోదంబులకీ ఫలంబు చవి దక్కంజేసి రక్షింపవే' అనుటలో ననపత్యుఁడు గాకుండ రక్షింపఁ బడవలయుననెడి కోర్కెయు, మానవజన్మ సహజమగు వాంఛాపూరితమనస్కతయుఁ గోచరించుచున్నది. అద్భుతమగు వాక్యరచనము గావించినాఁడీ కవిశేఖరుఁడు. మఱియు నీ వాక్యము ముందు రచింపఁబోవు పద్యమును సూచింపుచున్నది. సంతానమునుగూర్చి యావిప్రదంపతుల ప్రగాఢవాంఛను సోమ నాథుఁడు కరుణరస పూరితముగ నొక సీసమున రచించినాఁడు. ఇందు పుత్రుని అబాల్యవివాహాదికము తీరునట్టి ముద్దుమురిపెముల వర్ణించినాఁడు. ఇంతటితో నాగక శ్రీకృష్ణుని కార్యోన్ముఖునిఁ జేయుటకుగాను మఱియొకమాట పలికించినాఁడు. ఈ పర్యాయము తన సంతతి రక్షింపఁబడనిచో, నా విప్రుడు ప్రాణములను బోగొట్టుకొన నిశ్చయించుకొనినట్లు కల్పన చేయుటలో మూలముకంటె కథాభాగమున బిగువు చేకూరినది.

శ్రీకృష్ణుని యనుమతిని యర్జునుఁడు వృష్ణ్యంధక భోజసైన్యములతో నేతెంచియుఁ గార్యసాఫల్యమును జేయులేక పోయినాఁడు. విప్రసంతానము నష్టమయినది. ఈ పటుల మూలముతో సోమనాథుఁ డేకారణముచేతనో మూలాతిక్రమణముఁ జేసినాఁడు.

శ్లో॥ ముహూర్తాదేవ చాక్రోశం కృపణం రుదితస్వనమ్
తస్య విప్రస్యభవనే హ్రియ హ్రియతేతిచ
అథాకాశేపునర్వాచ మక్రోశం చాలకస్యవై
ఊన్నేతి హ్రియమాణస్య నచపశ్యామి రాక్షసమ్.

వి. ప. 112 అధ్యా. 9, 10

వీనిలో నొక రాక్షసుఁడు మాయాయోగమున నేతెంచి, విప్రబాలకు నపహరింపఁ బడుచుండగా, నాకాశమార్గమున నా బాలుని రోదనము వినిపించుటయు మూలమున గలదు. సోమన యీ క్రింది పద్యమున నబ్బాలకుఁడు మరణించినటులు మార్చినట్లు కాననగును.

ఉ॥ ఉండు నెడన్భయంబున మహోద్ధతిఁ గొందఱు వచ్చిపట్టుప
ట్టుం డిటు తెండుపోం డనికడున్ రభసంబున నాడుమాటలుం
బండియుఁ బొల్లవోయెనని బ్రాహ్మణిలోపల నేడ్చు నేడ్పు నోం
డొండ కడంగి తచ్ఛిశువు నుద్భవమున్మరణంబుఁ దెల్పెనన్.

ఉ. హరి. 2 – 26

ఎట్లయు హరివంశమునందు విప్రబాలకు నెత్తికొనిపోయినట్లు గలదు. ఈ మార్పునకు సమాధానము లభింపకున్నది. కాని యొక విషయము. సోమనాథునికి లభించిన మూలప్రతియందు 112 అధ్యా 9, 11 శ్లోకములలోని 'హ్రియతే', 'హృత' అను పదములకు మారుగ 'మృత', 'మ్రియతే' అను పదములు గలవేమో యను సందియమున కవకాశము గలదు. కాని మూలమున "మద్దర్శనార్థంతే బాలా హృతాస్తేన మహాత్మనా" అను శ్రీకృష్ణుని పలుకులందును విప్రబాలకు లపహరింపబడిరనియే గలదు.

విప్రుఁడు, దుఃఖాతిశయమున నర్జునుఁ దూఱునవసరమున గూడఁ గొంత పెంపు కానవచ్చును. ఈ క్రింది పద్యమునందీ కవి సందర్భమునకు సరిపడు సామెతలను గూర్చి కథ నడుపుటలో జూపిన నేర్పు గమనింపఁదగినది.

చ॥ పిలిచితి నన్న నిన్ను నతిభీతుఁడ విప్రుఁడ నమ్మినాఁడ నీ
పలు కసత్యముగాఁదగునె పాతెడుబండ్లకుఁ గాళ్లుపొంపఁగా
నలవడు నన్న పోటుమగఁడై యిటు చేసితి గాక యాసతో
నిలుతు మురారి నన్నుచట నీళుల ముంచినఁ బాలముంచినన్.
ఉ. హరి. 2 - 31

ఇందు కథాంశములగు సంభాషణములం దేకముగ సామాన్యముగ గన్పట్టు విషయములను గూర్చి ఈ వచన మొసంగినాఁడు. "పాతెడు బండ్లకుఁ గాళ్లు పొంపఁగా నలవడునన్న; పోటుమగఁడై యిటు చేసితిగాక; నీళులముంచినఁ బాల ముంచినన్". మూలమునందలి విషయముల కీకూర్పు సంఘటించుటలో సోమన నేర్పు గాననగును.

విప్రబాలక రక్షణమున శ్రీకృష్ణుని చెయిదములును. క్షణంబున ద్వారవతికిఁ జనుదెంచిన విషయమునందలి రహస్యమును దెలిసికొనగోరి, యర్జునుఁడు ప్రశ్నించుట, మూలమున మూఁడు శ్లోకములలోఁ గలదు. కాని యద్దానినొక తేటగీతియందను వదించుట సోమన సూక్ష్మీకరణపద్ధతిని వ్యక్తపఱచుచున్నది. ఆ శ్లోకములివి:-

శ్లో॥ కథం సముద్రః స్తబ్ధోదః కృతస్తు కమలేక్షణ
పర్వతానాంచ వివరం కృతం తత్కథ మచ్యుత.
తమస్తచ్చ కథం ఘోరం ఘనం చక్రేణ పాటితమ్
తచ్చయత్ పరమం తేజః ప్రవిష్టోస్మి కథంచ తత్.
కిమర్థం తేనతే బాలస్తదా చాపహృతాః ప్రభో
యచ్చతే దీర్ఘమధ్వానం సంక్షిప్తం తత్కథం పునః.
వి. ప. 111 అధ్యా. 4 - 7

వీనికి అనువాదమున గల పద్యము

తే॥ సాగరమునీరు పేరుట శైలకులము
తెరువు లిచ్చుట చీకటి నఱకుపడుట
దివ్యతేజంబు దోఁచు టుద్దీప్తి నీవు
పొచ్చుట కుమారులం గొని వచ్చు టేమి? ఉ. హరి. 2 - 56

పై శ్లోకములయందలి భావమేమియును విడువలేదు. ఈ పద్యము ఆంధ్రీకరణ మువలె కాక స్వతంత్ర రచన యనునట్లు తోఁచును. మఱియు సరళములగు అలతి పదముల నికూర్పు వ్యర్థపదరహితముగ నుండుట గమనింపదగినది. ఈ ఘట్టముననే శ్రీమన్నారాయణుఁడే సకల చరాచర భూతమయుఁడని నిరూపించు వివరము గలదు మూలమున

శ్లో॥ బ్రహ్మతేజోమయం దివ్యం మహద్ యద్దృష్టవానసి
అహం భరత శ్రేష్ఠ మత్తేజస్తత్ సనాతనమ్.
ప్రకృతిస్సాన మపరావ్యక్తి వ్యక్తానసాత్తనీ
యాం ప్రవిశ్య భవం తీహముక్తాయోగ విదుత్తమాః.
సా సాంఖ్యానాంగతిః పార్థయోగినాంచ తపస్వినాం
తత్పదం పరమంబ్రహ్మ సర్వం విభజతే జగత్.
మామేవతద్ఘనం తేజో జ్ఞాతుమర్హసి భారత
సముద్ర స్తన్బథతోయోహ మహం స్తంభయితా జలమ్.
అహంతేపర్వతాః సప్తయేదృష్టా వివిధా స్త్వయా
పంకభూతంహి తిమిరం దృష్టవానసి యద్ధితత్.
అహం తమో ఘనీభూత ఏహమ్మేవ చపాటవః
అహ్మంచ కాలో భూతానాం ధర్మశ్చాహం సనాతనః.
చంద్రాదిత్యౌమహాశైలాః సరితశ్చ పరాంసిచ
చరస్తథిశ్చదిశః సర్వామమై వాత్మాచతుర్విధః.
వి. ప. 114 అధ్యా 8 - 15

పై విషయమునంతటిని సీసపద్యపాదములందు రచించి, పంచభూతాత్మకంబు ప్రపంచమని యెత్తుగడతో నున్న ఎత్తుగీతి సోమన కల్పనము.

సీ॥ అపుడు తేజోమయం బైనరూపంబు మ
త్ప్రకృతి యందుఁ జరాచరంబు దోఁచు
నదుఁగు నప్పురుషుండు మద్దర్శనకుతూహ
లముగ నవ్విప్రబాలకుల ద్రిమింగె

వారు కారణము గా వత్తు నేనని యంధ
తమసంబు నేన భేదకుఁడ నేన
యచలంబు లేన రంధ్రాపాది నేన సా
గర మేన సంస్తంభకారి నేన

తే॥ పంచభూతాత్మకంబు ప్రపంచ మిందుఁ
గలిగినది లేనియది లేదు కల దనంగ
నున్న యదియె సర్వంబును నుచితగమ్య
మిది రహస్యంబు దెలిపితి నెఱుఁగు పార్థ. ఉ. హరి. 2 - 58

రుక్మిణీదేవి తనకుఁ బుత్రునను గ్రహింపుమని శ్రీకృష్ణుని వేఁడు పట్టమునఁగల శ్లోకముల నీ దిగువ నుదాహరించుచున్నాను—

శ్లో॥ అథోవాచ తదాదేవీ రుక్మిణీ రుక్మభూషణా
పుత్రమిచ్ఛామి దేవేశ త్వత్తో మాధవ నందనమ్.
బలినం రూపసంపన్నం త్వయైవ సదృశం ప్రభో
వృష్ణీనామపినేతారం వీర్యవంతం తపోనిధిమ్.
సర్వశాస్త్రార్థకుశలం రాజవిద్యాపురస్కృతమ్
ఏవమాదిగుణైర్యుక్తం దాతుమర్హసిసత్తమమ్.

భ. ప. 73 అధ్యా. 20, 22

పయి శ్లోకములందలి భావమును యథాతథముగా నాంధ్రీకరించియు, సోమన యొక గీతమునందలి మూఁడు పాదములలో నిమిడించుటచే సంగ్రహించినట్లు గాన నగుట విచిత్రము. ఆ యనువాదపద్యమును జూచునది

గీ॥ అఖిలలోకైకనాథ! నీయట్టిరూప
విక్రమౌదార్యశౌర్యవివేకనిలయు
నొకకుమారుని దయచేసి యుర్విలోనఁ
గడుపుచల్లని కాంతలఁ గలుపు నన్ను. ఉ. హరి. 2 - 75

ఈ గీతపద్యము సంపతి చివరి పాదమునగల విషయము మనోహరమైయున్నను భావము, మీఁది విషయముతో సన్వయము కుదిరినది. ఇట నొక విషయము– "కడుపు చల్లని కాంతలఁ గలుపునన్న" అనుటలో నామె కుంతికుఁ బూర్వము పుత్రులు లేరని తోఁచును. కాని యది సరిగాదు. పెక్కురి విషయమున పొరబడుట కానగును. శ్రీకృష్ణున కంతకుఁ బూర్వము ప్రద్యుమ్నుఁడను పుత్త్రుఁడు కలఁడు. అయినను రుక్మిణి యవ్విధముగా నడుగుటలో నాశ్చర్యము కానరాదు. లోకమున నెరికైన నొక్క పుత్త్రుఁ డుండినంత మాత్రమున సంతుష్టిపడరాదను భావము మానవసహజము. భారతము సంపతి యీ క్రింది పద్యములను గమనించినచో, నా విషయము తెల్లము కాఁగలదు.

శంతనమహారాజు భీష్ముని జేరబిలిచి స్వవిషయము నిట్లు బలికినాఁడు––

క॥ వినవయ్యా యేకపుత్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూపయని ధర్మవులన్
విని నీకుఁ దోవుపుత్రుల
ననఘా పడయంగనిష్టమైనది నాకున్.

భార. ఆది. చ. ఆ. 181

శంతనునకు, భీష్ముఁడు పుత్త్రుఁడు. అయినను ధర్మశాస్త్రములఁ బట్టి ననపత్యుఁడే యగుచున్నాఁడట.

మఱియొక పట్టున––

తే॥ వీఁడె కృపాహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందుఁ
వీఁడె యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన
వీఁడె భరతవంశం బెల్ల వెలుఁగఁ గుంతి
కడుపు చల్లగాఁ బుట్టిన ధనభుజుండు.

భార. ఆది. ష. ఆ. 19

కుంతీదేవి కష్టనుఁడు ప్రథమ సంతానము కాదుగదా! అయినను బాండవ మధ్యముఁడగు నర్జునిచేతనే యామె కడుపుచల్లనైనదని కుమారాస్త్రవిద్యా సందర్శన

మును పౌరులనికొనిన పల్కులే నిదర్శనము - కావున రుక్మిణీదేవి, మఱియొక పుత్రుసను గ్రహింపుమని కోరుకొనుటయే ఈ పట్టమున సూచింపబడిన విషయమనుట స్పష్టము.

మఱియు నామె కోర్కెను దీర్ప నుత్సహించు శ్రీకృష్ణుని పల్కులలో నియ్యది మఱింత స్ఫుటముగ గోచరించుచున్నది-

క॥ పుత్త్రులకలిమియె శుద్ధ క
ళత్రమునకు లక్షణంబు లక్షణవతులై
పుత్త్రవిహీనతఁ బొరసినఁ
బాత్రములే సతులు పతులు పాటించుటకున్. ఉ.హరి. 2-81

ఇందు ప్రయోగింపబడిన 'పుత్రులకలిమియె' యనుటలోగల బహువచనమును బట్టి, యంతకు ముందు పుత్రులుండుట స్పష్టమగుచున్నది. పుత్రుల కలిమికయి రుక్మిణి మఱియొక పుత్రు నడిగినదనుట నిశ్చయము.

ఘంటాకర్ణోపాఖ్యానమునందు సోమన, పిశాచముల వర్ణనము గావించుటలో నొక క్రొత్తపోకడ గానవగును. మూలమున నీ విషయమును దెలుపు శ్లోకము లాఱు గలవు. వీనినిట వ్రాయుచున్నాను.

శ్లో॥ తేషామను మహాఘోరౌ పిశాచౌ వికృతాననౌ
ప్రాంశూపింగలరోమాణౌ దీర్ఘజిహ్వామహాహనూ.
లంబకేశౌ విరూపాక్షౌ హీహీహాహేతివాదనౌ
ఖాదంతౌ మాంసపిటకం పిబంతౌ రుధిరం బహు.

అంత్రవేష్టితసర్వాంగౌ దీర్ఘైకృశాకుశోదరౌ
లంబమానమహాప్రాంతశూలప్రోతశిరోధరౌ.

కర్షంతౌ శవయూథాని బాహుభ్యాం బాహుభ్యాం తత్రతత్రహ
హసంతౌ వివిధం హాసం స్వజాతి సదృశం నృప.

వద తౌ బహురూపాణి వచాంసి ప్రాకృతానిచ
కంపనంతౌ మహావృషానూరూపాదప్రథ
సృక్కిణీ లేవి హంతౌచ దంతాంస్ఫుటకటాయినౌ
అర్థిస్నాయు సమాకీర్ణౌమమనీరజ్జు సంతతౌ.
వదంతౌ కృష్ణకృష్ణేతి మాఘదేవీచసంగతమ్.
భ. ప. 79 అధ్యా. 1 – 6

మీఁది శ్లోకములందలి విషయమును మాత్రము గ్రహించి, సోమన పద్యముల నల్లినాఁడు. స్థూలముగ భేదము కానరాని యా పిశాచద్వయ రూపము నొక సీసమున వర్ణించి, వారిరువుర చెయిదములఁ బ్రత్యేకముగ నొక్కొక్క పద్యమునందుఁ జూపుటయు ననువాదమున నొక విశిష్టతయే యనఁదగును. ఆకారములలో లేని యా పిశాచముల వికారపుఁజేష్టలలోని బిన్నత్వమును గోచరింపఁజేయుట, నా పాత్ర చిత్రణమున నీకవికిఁగల సూక్ష్మబుద్ధికానసగును ఆ పద్యములివి :

సీ॥ వికృతాననంబులు విరళదంతంబులు
  నడుపైన దౌడలు నిక్కుమెడలు
మండివడ్డబొమలును ముమ్మూలముక్కులుఁ
  బల్లవెంద్రుకలును బడికితలలు
బొక్కిబొమ్ములు లోఁతుఁబొట్టలు మిడిగ్రుడ్లు
  గూనివీపులు నిడుఁగ్రొంకిగ్రవేళ్లు
బూరకాళులు సీచఁబోయినచేతులుఁ
  గోలమూఁపులు గుదిగొన్నతొడలు

తే॥ నతిభయంకరగతి నూప నట్టహాస
కహకహారావములతోడఁ గాన నయ్యె
దావపావకఘనశిఖాదగ్ధతాల
సాలసంకాశ మగుపిశాచద్వయంబు. ఉ. హరి. 2 – 122

వ. అందునొక్కరుండు.

చ॥ పిరిగొనం దాల్చు నెట్టుఁగఁ బ్రేవులు చుట్టి, కపాలపాత్రలో,
విరియఁగలంచుఁ గ్రొమ్మెదడు, వెండ్రుకలేటి తొలంగవైచు, నె
త్తురుచవిచూచుఁ, గండలుతుథూయని క్రాయుఁ, ద్రిశూలధారలం,
జెరివిన ప్రేతనాలికలఁజిమ్ముఁ, బిశాచవిభుండు వేడుకన్.

ఉ. హరి. 2 - 123

వ. ఇంటియొక్కరుండు.

అచ్చతెనుఁగు

చ॥ కఱచినపీనుఁగు న్వెడఁదకప్పెరయు న్మోలఁ బచ్చితోళులున్
బుఱియలపేరులు న్మెదడుపూఁతయు రుఝుమ్మువిమూఁగనీఁగలుం
బెఱికినవాలు ఔఘమ్మపయిఁ బేరిన నెత్తురు త్రేవుడున్ గడున్
బిఱుములచూపులుం దఱచుబీఱవెంబులుఁ గల్గురూపునై.

ఉ. హరి. 2 - 126

పయి నుదాహరించిన వానిలో నాలుఁగవ శ్లోకమునందు "స్వజాతి సదృశముగా" నా పిశాచములు నవ్వినట్లు చెప్పఁబడి యుండఁగా, సోమన 'కహకహారావములతో' నట్టహాసముగావించి పనుట సొగసుగా నున్నది. ఇటఁగల 'కహకహ' యను పదము జాత్యమగు విశేషణమని తలంపవచ్చును

ఈ యధ్యాయమున నా పిశాచములు శ్రీకృష్ణునికయి వెనకు ప్రయత్నమును ఘంటాకర్ణ సోదరుల లోకజ్ఞతయు వివరముగ పదునేను శ్లోకములలో వర్ణింపఁబడి యున్నవి.

శ్లో॥ యుతాః స్మ ప్రాణినో హంతుం శ్వగణైః సహ సాంప్రతమ్
తథాహి ప్రాణినో లోకే బాల్యమాదౌ సమాస్థితాః.
అజ్ఞానావృతచిత్తస్య కృత్యాకృత్యం నజానతే
తథాయౌవనే భ్రాంతా విషయైర్బహులీకృతాః.
యతంతే శ్రేయసే నైవతతో విషయసంస్థితాః
విషయావిష్టచిత్తాహి మనుష్యాన విజానతే.

బాథాచ వృద్ధభావేతు వ్యాధిబిర్బహుభిర్వృతాః
జరాదిభిర్మహాఘోరైర్నానాదుఃఖ విధాయిభిః.
జ్ఞానాంతేనహివై శ్రేయోవినష్టేంద్రియగోచరాః
తతో మృతా గర్భవాసే వసంతి సతతం నరాః.
విణ్మూత్రకలిలేఘోరే దుఃఖైర్బహుభిరాచితాః
చ్యవ తేతు తతో ఘోరాద్ధర్మాత్సంసారమండలే.
పరస్పర విహింసంతః కుర్వంతః కర్మసంచయమ్
మహాత్యేవం సదాఘోరేసంసారే దుఃఖసంకులే.
పాపాని బహురూపాణి కుర్వత్యేనతస్తదా
సంసారస్త్యేష మహిమా విస్తృతః సర్వజంతుషు.
అచ్ఛేద్యః శస్త్రసంపాతైరుపాయైర్బహుభిః సదా
ఏతస్మాన్న నివర్తంతే మర్త్యాః ప్రాకృత బుద్ధయః.
ఇమం హత్వా మనుష్యేంద్రమిదమస్మాద్ధరామ్యహమ్
చోరయిత్వా ఘనమిదం హరిణ్యామ్యాదదామ్యహమ్.
నిర్భర్త్స్యనమిమం శాంతిం హరిష్యామిఘనం బలీ
ఇత్యాది వ్యాకులామూర్ఖాఃకుర్వంతే ప్రాణిపీడనమ్.
భ. ప. 79 అధ్యా. 17 - 27

మంటాకర్ణకాలాంతకులు ప్రకృతము శ్రీకృష్ణపరమాత్ముని యందు చోటికరుదెంచు చున్నారు. వారి ప్రకృత వైఖరి కాజ్ఞానసంపద్విషయ మనుగుణము గానిదని యీ వివరములను సోముడు విడిచెను.

మణిలయు

శ్లో॥ తతః సభగవాన్విష్ణుః పిశాచౌమాంసభక్షణౌ
దదర్శథ మహాఘోరౌ దీపికాధారిణౌహరిః. భ. ప. 80 - 1

అను శ్లోకమునందలి భావము విపులీకరించి యీ క్రింది 'యచ్చుతెనుగు' చంపక మాలావృత్తముగ రచించుటయు గమనింపదగిన విషయము.

చ॥ కఱదినపింఁగు న్వెడఁదకప్పెరయు న్మొలఁ బచ్చితోళులున్
బుఱికలపేరులున్మెదడుపూఁతయుఁ ఘుమ్మనిమూఁగునీఁగలుం
బెఱికినవాలు ఱొమ్ముపయిఁ బేరిననెత్తురు త్రేవుడున్ గడున్
బిఱుములచూపులుం దఱచుబీఱనరంబులుఁ గల్గురూపునై.
ఉ. హరి. 2 - 126

ఇట్లే 80వ యధ్యాయమున ఘంటాకర్ణ కాలాంతకుల చరిత్రము, వారలకు నవ్వాసుదేవునితోడి సంభాషణమును. హరివర్ణనమును, వివరింపఁబడినవి. మూలమునఁ గానఁబడిన నీలవర్ణుని శ్రీకృష్ణునిగా నెఱుఁగనేరక, స్వాభావికమగు మూఢభక్తి నయ్యర్ధరాత్రమున షోడశోపచారాదుల నర్చనఁ జేసి విష్ణుని స్తుతించి, సమాధిస్థితినొందిన విషయమా మూలాగ్రముగ వివరించినాఁడు. స్థూలముగ జూచినచో, ఘంటాకర్ణుఁడు తనకు మార్గమధ్యమున నెదురైన శ్రీకృష్ణునిగాంచి, యాతని విషయ మెఱుంగఁ గోరుట తప్ప, మిగిలిన విషయములు విడిచిపెట్టఁబడినవని చెప్పవచ్చును. మూలమున నా ఘంటాకర్ణ కాలాంతకులు కారణాంతరములచే నిరీతి నుండినట్లును, వారి పూర్వజన్మ సుకృతమున శివభక్తులయ్యును హరిభక్తులగుట, వారిజ్ఞానసంపత్తియు వర్ణింపఁబడిన విషయములను సంగ్రహించినాఁడు.

ఇట ఘంటాకర్ణ కాలాంతకులు శివభక్తులయి, శివుని సాక్షాత్కరించుకొనఁ గలిగిన వారగుట వారలకు శ్రీకృష్ణపరమాత్మ నెఱుంగుట సుకరమే యగునని సోముఁడు తలంచి, మూలవిషయముల నిరీతి మార్చినాఁడు. శ్రీకృష్ణావతారమున నున్న శ్రీకృష్ణుని విషయమును మున్ను వినియుండుటచే, నా బదరి కాశ్రమమున నవ్వాసుదేవుని పసిగట్టి యుండిరనుటయే సమంజసము. మూలమున శ్రీకృష్ణ, ఘంటాకర్ణుల సంభాషణము కలదు మఱియు "సర్వేషు కార్యేషు కర్తామహతిమన్యతి" అనుటలో సర్వకాల సర్వావస్థలయందు సర్వకార్యములకు తన్నే కర్తగా దలంచుచున్న ఘంటాకర్ణున కాత్మదర్శనము నొసంగినాఁడా శ్రీకృష్ణుఁడని గలదు. షోడశోపచారాది విధులచే నర్చించి, యేకాగ్రచిత్తమున ధ్యానించిన పిమ్మటనే జగన్నాథ స్వరూపము ఘంటాకర్ణునకు సాక్షాత్కరించినదని మూలమున నున్నది. కాని ఘంటాకర్ణుఁడు కర్మవశమునఁ బిశాచరూపమున నుండినవాఁడు మాత్రమే యనుట స్పష్టము కావున నిశ్చలచిత్తుఁడయి ధ్యానించినంతనే శ్రీకృష్ణుని శ్రీమహావిష్ణువుగా నెఱింగినట్లు సోముఁడు మార్చియున్నాఁడు.

శ్లో॥ సయేష భగవాన్విష్ణురద్యదృష్టో జనార్దనః
కృతకృత్యోస్మి సంజాతః సాయుజ్యం ప్రాప్తవానహమ్.
భ. పర్వ. 82 - 38

ఇందు మొదటి పాదమున జనార్దనుఁడు, సర్వేశ్వరుఁడగు విష్ణువని ఘంటాకర్ణుఁ డతనిఁ దెలిసెనని యుండఁగా, సోమనాథుఁడీ సందర్భమునఁ బయి మార్పు ననుసరించి యీ క్రింది పద్యమును రచించినాఁడు.

క॥ తలఁపునఁ జూచినరూపును
వెలిఁ జూచినరూపు నొక్కవిధమయి యున్నన్
నెలకొని ఘంటాకర్ణుఁడు
నలినాక్షుని నామకీర్తనం బొనరించెన్. ఉ. హరి. 2 - 142

ఈ పద్యమునందు నిజమునకు, మూలమునందలి పదిశ్లోకముల విషయమిమడ్చఁ బడి యున్నది. శ్రీకృష్ణావతార మెత్తెనని మొదలు మూలమునఁ గల విషయములను వివరించుటకు మారుగ, వెలిఁజూచిన రూపును, తలఁచిన రూపును ననుటలో సంగ్రహింపఁ బడి భావసముపేతము లయినవి.

పురుషోత్తముని కరుణాకటాక్ష వీక్షణములకుఁ బాత్రుఁడయినంతనే ఘంటాకర్ణుని పాపము పటాపంచలయినది కాని పిశాచ జన్మ మంతరించు వఱకు నా ప్రవృత్తి మారుట కవకాశములేదు. ఘంటాకర్ణుఁడొక విప్రుని మాంసమును శ్రీకృష్ణునకు భక్తిమెయి నర్పించినాఁడు. అతఁడద్దానిని 'విందు'గా జేకొనినాఁడు. అంతట సద్భక్త చింతామణియగు నా శ్రీకృష్ణ పరమాత్ముఁడు, ఘంటాకర్ణుని మేను నిమిరెను. ఇట మూలమున నైదు శ్లోకములలో ఘంటాకర్ణుఁడు తిరిగి గంధర్వరూపుఁడగుట వర్ణింపఁ బడినది. అప్పటి యాతని రూపు మన్మథుని సౌందర్యమును బోలియున్నదని మూలమునఁ గలదు. ఆ శ్లోకము లీ క్రింద నుదాహరింపఁబడినవి.

శ్లో॥ దీర్ఘకుంచితకేశాఢ్యో దీర్ఘబాహుః సులోచనః
సమాంగుళిః సమనఖః సమవక్త్రః సమున్నసః
పద్మాక్షః పద్మవర్ణాభః పద్మకేసరభూషణః
కేయూరీచాంగదీచైవ కౌశేయవసనస్తదా

జ్ఞానవాన్ సత్వసంపన్నః సాక్షాదింద్రఇవాపరః
గంధర్వఇవగాయంస్తు సిద్ధఃసిద్ధఇవస్వయమ్
సాక్షాత్‌స్పృష్టమ్ తదావిష్ణోః కరేణమృదుపూర్వకమ్
ననూనం తాదృశం రూపం అసత్కాలాంతరేష్వపి
అద్యాపినైవమునయోలభంతే తాదృశం వపుః
కృత్వాపుబహుసోఘోరం తపః పరమదారుణమ్
యచ్చలబ్ధం సదాతేన పిశాచేన నృపోత్తమా.

భ. వి. 83 అధ్యా. 12 - 21

పయి శ్లోకముల క్రింది విధముగ ననువాదము చేయఁబడినది.

క॥ తామరరేకులుఁ గన్నులు
సామజహస్తములుఁ దొడలు శశిమండలమున్
మోమును మెఱపును నొడలును
సొమింపఁగ దివ్యరూపసుందరుఁ డయ్యెన్. ఉ. హరి. 2-152

గంధర్వ రూపమును ధరించి, యింద్రసమానుఁడుగ శోభిల్లు ఘంటాకర్ణునకు ఇంద్ర పదము ననుగ్రహించినట్లు సోమన యనువాదమునఁ గలదు. కాని మూలమున ఇంద్రుఁడున్నంత వఱకు స్వర్లోక వాసము గలిగి, తదనంతరము సాయుజ్యమును బొందుమనియే యున్నది. శ్రీకృష్ణుని యాదేశము నీ విధముగ మార్చుటలో సోమన, శ్రీకృష్ణ పరమాత్ముని మాహాత్మ్యమున కొక వన్నె సంఘటించుటకని తెలియుచున్నది. ఇంద్ర పదవియందొకనిని నియమించుటకుగాని, యా పదవి యందుండు వానిని తొలఁగించుటకుగాని యధికారము గలవాఁడు శ్రీకృష్ణుఁడే యని సోమన తన యనువాదమున స్థిరీకరించి యున్నాఁడు. హరివంశము నాంధ్రీకరించిన యెఱ్ఱాప్రెగ్గడ, మూలాను సారముగ ఘంటాకర్ణు నింద్రుని మిత్రముగ నుండుమనియే చెప్పినట్లు రచించినాఁడు. కాని పరమాత్ముఁడగు శ్రీకృష్ణుని యధీనముననే సర్వమును గలవని జూపుటకును, అతని సర్వతంత్ర పరతంత్రతను నిరూపించుటకునై యీ మార్పును జేసియున్నాఁడనుటలో సందియములేదు. అందులకు హేతువు, యీ ప్రకరణమున శ్రీకృష్ణ మాహాత్మ్యము నుగ్గడించుటయే యనియుఁ జెప్పనగును.

ఈ ఘట్టమున సోమన రచించిన పద్యము నిక్రిందఁ జూపుచున్నాను.

చ॥ అనానికిఁ బ్రీతి నిట్లను మురారి బలారిపదంబు నీకు ని
చ్చితి నతఁడం దొలంగ విధి చేసినవాఁ డమరావతీపురీ
పతి వని నేఁడ నీనుదుటఁ బట్టము గట్టితిఁ గొంతకాల మి
ట్లతిశయభోగమొంది పరమాత్మునిఁగూడఁగ రమ్ము పిమ్మటన్.
ఉ. హరి. 2 – 154

పయి పద్యమునందు "బలారిపదంబు నినుదుటఁ బట్టము గట్టితి" యనుటలో శ్రీకృష్ణుని ఘంటాకర్ణున సామర్థ్యము వ్యక్తమగుచున్నది. మూలమున ఘంటాకర్ణుఁ డింద్రుని యతిథిగా నుండుమనియే శ్రీకృష్ణుని యనుమతి. మఱియు నిక్రింది శ్లోకములను జూచునది.

శ్లో॥ ఘంటాకర్ణోస్మినామ్నాహం పిశాచో ఘోరదర్శనః
మాంసాదో వికృతో ఘోరః సాక్షాన్మృత్యు రివాపరః
ధనదస్యానుగంతాహం సాక్షాద్రుద్రసఖశ్చచ
మమాయమనుజస్సాక్షాత్ అంతకస్యాంతకోనఘః.
భ. ప. 80 అధ్యా. 23-24

ఇందు ఘంటాకర్ణకాలాంతకులుగా తమ్ము శ్రీకృష్ణునకు పరిచయ మొనర్చుకొనినను, మూలమున శ్రీకృష్ణుఁడు ఘంటాకర్ణునకు ఇంద్ర పదవి నొసంగిన ఘట్టమున కాలాంతకుని విషయమును దడవలేదు. ఆ లోపమును బూరించుటకయి, సోమన తన యనువాదమున నొక యమూలమగు పద్యమును రచించినాఁడు. ఆ పద్యమిది :

క॥ నీతమ్ముఁడు నీరూపున
నీతోడన కూడ వచ్చి నిర్జరరాజ్య
స్వాతంత్ర్యముఁ గని పిమ్మట
నాతత్త్వముఁ గూడ వచ్చు నాకాధిపతీ. ఉ. హరి. 2–155

ఇందు రెండు విషయంబులు కాననగును. ఒకటి — రెండు పాత్రలను సృజించి, యా పాత్ర పోషణము సంపూర్ణముగా పాటింపఁబడమి; రెండవ విషయము. ఘంటాకర్ణ కాలాంతకులు శివభక్తులు. వీరి శివభక్తియు పరాకాష్ఠ నందినట్టిది. వీరికి శివసాక్షాత్కారము గూడ నైనది. శివుని యనుమతిని, సాయుజ్యము నొందఁగోరి విష్ణుని ధ్యానింపఁ దొడంగినారు. ఈశ్వరుని పరమభక్తులగు వీరలు గూడ తన భక్తులుగా నెంచి వారలఁ గరుణించుటను బట్టి శ్రీకృష్ణుఁడు పరోక్షముగా హరిహరాద్వైతము నంగీకరించినట్లగుచున్నది. సోమన యీ యాశ్వాసమున హరిహరాద్వైతమును ప్రతిపాదింప నెంచియున్నాఁడు. గావున నీ మార్పును జేసి యుండెననుట సమంజసము.

సంస్కృతమున హిమవన్నగ వర్ణనమెనిమిది శ్లోకములందు క్లుప్తముగ జెప్పబడినది. సోమనాథుఁడీ నగవర్ణనము నొక సుదీర్ఘమగు వచనము దీర్ఘసమాస భూయిష్ఠముగ రచించినాఁడు. ఈతఁడీ విపులీకరణమును ప్రబంధీకరణమున కనుగుణముగ జేసినాఁడనుటలో సందియములేదు.

శ్రీకృష్ణుఁ డొనరించిన ద్వాదశవర్షంబుల తపంబునకు మెచ్చి సదాశివుఁడు సాక్షాత్కరించుటకు ముందు నాకలోకాధిపతియగు నింద్రుఁడును దిక్పాలకులును నయ్యాశ్రమమున కేతెంచిరను విషయము మూలమున నెనిమిది శ్లోకములందు వర్ణింపఁబడినది. కాని యనువాదమున గంధర్వసిద్ధ విద్యాధరులును, నమరులును శ్రీకృష్ణుని దర్శింప నరుదెంచు సమయమునకు ద్వాదశవర్షతపోనియతి పరిపూర్తియగుటయు, నాతఁడు గను విచ్చి చూచుటయు నొకే పర్యాయము జరిగినవని మూలవిరుద్ధముగ ననువదింపఁబడినది.

వాసుదేవుని తపోనిష్ఠకు మెచ్చి యయ్యాది దేవుఁడు ప్రత్యక్షమయిన ఘట్టమునఁ గొంతభాగము పరిహరింపఁబడినది. మూలమున సదాశివుఁడు సపరివారముగాఁ బ్రత్యక్షమయినట్టులు పదునెనిమిది శ్లోకములలో వివరింపఁబడిన విషయము సంగ్రహించినాఁడు. ఈ ఘట్టమున ననఁగా శివసాక్షాత్కారవర్ణనమును రెండెరెండు పద్యములలో నిమిడ్చినాడు. ఇట మూలమునకు వన్నె బెట్టినట్లు కాననగును. మూలశ్లోకములను, సోమన యనువాదమును వాని తారతమ్య నిరూపణమున కనువగునని దిగువ వ్రాయుచున్నాను.

శ్లో॥ తస్యాగ్రే సముపద్యంత భూతసంఘాః సహస్రశః
ఘంటాకర్ణా విరూపాక్షః కుండధారః కుముద్వహాః.
దీర్ఘరోమా దీర్ఘభుజో దీర్ఘబాహురుగ్నిరంజనః
ఉరునేత్రః శతముఖః శతగ్రీవః శతోదరః.
కుండోదరో మహాగ్రీవః స్థూలజిహ్వో ద్విబాహుకః
పార్శ్వవక్త్రః సింహముఖ ఉన్నతాంసో మహాహనుః.
త్రిబాహుః పంచబాహుశ్చ వ్యాఘ్రవక్త్రః సితాననః
ఏతేచాన్యే చ బహవో దీర్ఘాస్యా దీర్ఘలోచనాః.
నృత్యంతః ప్రహసంతశ్చ స్ఫోటయంతః పరస్పరమ్
తథాన్యే ఘోరరూపశ్చ తథాన్యే వికృతాననః.
ప్రేతభక్షాః ప్రేతవాహా మాంసశోణిత భోజనాః
శవానిసుబహున్యాశు భక్షయం తస్థతస్థతః.
పిబంతోరుధిరం ఘోరం ఖండయంతః శవాన్బహూన్
కరాళ వితతా దీఘా ధమనిప్నాయు సంతతాః.
నానావిధాః సువీరాశ్చ శూలాగ్రప్రోతమానుషాః
శిలామాలావృతాః కేచిదాంత్రపాశావపాశితాః.
డిండిమైరట్టహాసైశ్చనాదయుఁతో వసుంధరామ్
కపాలినో భైరవశ్చ జటిలా ముండినస్తథా.
ఏవం బహువిధాఘోరాః పిశాచవికృతాననాః
తథాన్యే మునివీరశ్చధ్యాయంతః పరమేశ్వరమ్.
పఠంతో వేదవాక్యాని సాంగాని వివిధానిచ
కుండికాస్థకారాః కేచిత్కేచిత్కుశా విచారిణః.
కౌపీన వసనాః కేచిత్కేచిత్కార్పాస సంవృతాః
స్తువంతః శంకరం భక్త్యాస్తోత్రైర్మాహేశ్వరైస్తథా.
ఏకత్రతే మునిగణా అపరత్ర గణాస్తథా
అన్యత్ర సిద్ధగంధర్వాః ప్రియాభిః సహసంగతాః.

నృత్యంతి నృత్యకుశలా గాయంతి స్మ చ కన్యకాః
విద్యాధరాస్తథాన్యత్ర స్తువంతః శంకరం శివమ్.
ననృతుస్తస్య పురతో గచ్ఛంతోపస్తరసాంగణాః
ఏవమేతైర్మహాఘోరైః పిశాచౌర్భూతకిన్నరైః.
మునిభిశ్చైవ ప్రముఖైః సమం శర్వః సమాయయౌ
యత్ర విశ్వేశ్వరో విష్ణుస్తపస్తేపే సుదారుణమ్.
తత్ర తే లోకపాలాశ్చ తిష్ఠంతి స్మ దిదృక్షయా
ఉమయాలోకభావిన్యా గంగయా చంద్రశేఖరః.
స సర్వలోకప్రభవోభవో విభు
ర్జటీచ సాక్షాత్ప్రణవాత్మకః కృతీ
ద్రష్టుం హరిం విష్ణుముదారవిక్రమో
యయౌ సుఖేష్టం పిశితాశనైర్వృతః.

భ. ప. 86 అధ్యా 1 – 18

అచ్చతెలుఁగు

సీ॥ తొలుకారు మెఱుఁగుల తోఁటలో నాడెడు
రాయంచ కొదమతో రాయఁజాలి
యిరులబండారంపు టింటికిఁ బెట్టిన
బొందు మల్లెలకోటుఁ బోరగెలిచి
బలుమంచుఁ గంబాల బలసి రాఁ జుట్టిన
క్రొత్త మంజిడిబాగుఁ గొఱఁత చేసి
పాలపెన్నురువు గుబ్బలి మీఁద నెలకొన్న
నిండువెన్నెల ముగ్గు నిగ్గు చెఱిచి

తే॥ జడలఁ గొన్నెల మెడఁ బాఁపసరిగఁ దొడలఁ
బొడలతో లేన వెలిమిడిపూఁత మించఁ
బొడమి వేఱేని మందటుఁ బొడవు సూపెఁ
బొడువులందెల్లఁ బొడువైన బోఁటువేల్పు.

ఉ. హరి. 2 – 171

అచ్చతెలుఁగు

ఉ॥ ఏనికతోలు పచ్చడము, నెఱ్ఱుల గబ్బసరంబు, నంపపూఁ
దేనియ తియ్యవిల్లుఁ గొని ద్రెంచినబొట్టుఁ బలుంగు నెట్టెము
స్వీనుల చూపు పెండెముఁ దవిల్చిన మంచము కోటికైదువుం
బూనిన ప్రాఁతవేల్పుఁగని, పోకులఁబోయిన వెన్నుఁడిట్లనున్.
ఉ. హరి. 2 – 172

పయి నుదాహరించిన వానిలో మూలమునందు శివాగమము వర్ణించిన రీతిని జూచినచోఁ బురాణశైలి ననుసరించియున్నట్లు దోఁచును. శివసాక్షాత్కార సమయమునఁ, బరమేశ్వర పరివారాగమనమును, నద్దాని వర్ణనమును, సోమనాథుఁ డనవసరమని విడిచియుండును. మఱియును శ్రీకృష్ణసంతతికై వాని తపోఫలముగఁ బ్రత్యక్షమగు నా దేవదేవుని యాధిక్యమును దెలుపు, స్వరూప స్వభావములఁ దెలుపు వర్ణనమున కిట యత్యంత ప్రాధాన్యము గలదనుటలో విప్రతిపత్తి యుండదు. అట్టిచో నా సదాశివుని సొబగు వర్ణనమును మాత్రమే గావించి, శివసాక్షాత్కారమును జెప్పుట యుక్తమని భావించియుండును. కావుననే నిట నాంధ్రీకర్త రెండు యచ్చతెనుఁగు పద్యములలో శివుని వర్ణించి, శివ సాక్షాత్కారవర్ణనము గావించి యున్నాడు.

సదాశివుఁడు సాక్షాత్కరింపఁగనే, మహర్షులును, వాసుదేవుఁడును శివుని స్తుతించిరి. మూలమునందిరువది యైదు శ్లోకములలో శ్రీకృష్ణుని శివస్తుతిగలదు. ఈ ఘట్టమును మూలమునతిక్రమించి, నాలుఁగు సీసపద్యముల నత్యంత రమణీయముగ రచించినాఁడు సోమన. మూలమున శివుని లీలావిలాసముల నుగ్గడించియుండ, నందులకు భిన్నముగఁ బ్రబంధోచితముగను, నాలంకారిక రచనా వైశిష్ట్యము మెఱయుగను నా పరమయోగి సార్వభౌముని రూపలావణ్యము కన్నులకుఁ గట్టినట్లు వర్ణించి యున్నాఁడు సోమనాథుఁడు. ఈ సందర్భమున నితని స్వతంత్రములగు పద్యముల నిట నుదాహరించుచున్నాను

సీ॥ కల్హార మకరంద కలిత మందాకినీ
లహరీపరీత కోలాహలంబు
బాలేందు చంద్రికాపరభాగశోభా ప
రాగ సంభావితారగ్వధంబు

సేవాసమాసన్న సిద్ధసీమంతినీ
తాలవృంతోత్తాలతాండవంబు
కాత్యాయనీదత్త కర్ణావతంసక
ర్పూరఖండామోదపూరితంబు

తే॥ మారుతంబు నామీఁదటు మలసియాడ
గలుగునొకో నాకు నొకనాడు కన్నులార
శివుని జూచుపుణ్యం బనుచింత నెఱయ
మొదలివేలుపుఁ బొడఁగంటి మ్రొక్కఁగంటి
ఉ. హరి. 2 - 173

సీ॥ తరుణపల్లవరాగతామ్రమవిద్యుల్లతా
భాసురం బగుజటాభార మెటిఁగి
నిబిడసంతమసాతినీలబాలతమాల
పరిపంథి యగుకంఠభాగ మెటిఁగి
తారముక్తాహారధవళశారదనీర
దాకార మగునిర్మలాంగ మెటిఁగి
ద్రవశాతకుంభగౌరకుసుంభకుసుమఖం
డనశీల మగు ఫాలనయన మెటిఁగి

తే॥ యెటిఁగికొన వచ్చు నటమీఁద హృదయకమల
కర్ణికాభద్రపీఠంబుఁ గదియఁ జేర్చి
పరసుధాభిషేకంబునఁ బరమయోగి
సార్వభౌముండ వగునిన్నుఁ జంద్రమౌళి. ఉ. హరి. 2-174

సీ॥ లలితవిద్రుమలతాలావణ్య మగుజటా
జూటంబుఁ జిగురాకు జొంప మైన
సాంద్రతారకవిలాసం బగుపుఱుహబాత
పురపుదంష్ట్రధుల సేన పూవు లైన

విశదకాదంబినీవిభ్రమం బగు విషు
త్సింధుతోయము పూవుఁదేనె యైనఁ
దరుణభానుసమంచితం బగునుష్ణీష
ఫణిఫణామణికోటి ఫలము లైన

తే॥ నైనపారిజాతంబు మూలాలవాల
జాత మగు నైన నభిలాషజాత మెల్లఁ
జేతిలోనికి వచ్చు నిచ్చిత్రమిచటు
నాత్మలోఁ గంటిఁ గన్నార నంటికొంటి. ఉ. హరి. 2-175

సీ॥ కుజము కుంజరముచేఁ గూలునో కూలదో
కూలుకుంజరము నీకుజము గూల్చె
బ్రమాను పేరేటిచే మడుఁగునో మడుఁగదో
మడుఁగు పేరేటి నీబ్రమాను మడిఁచెఁ
గాలునో యొకనిచేఁ గాలదో సాలంబు
గాలునీసాలంబు గాల్చె నొకని
దునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు
తునియునీవృక్షంబు తునిమెఁ బరశు

తే॥ వనుచుఁ దమలోనఁ జర్చించు నమరవరుల
కభిమతార్థఫలార్థ మై యంద వచ్చు
పారిజాతంబు నాబ్రమోలఁ బండియుండ
నందఁ గంటి నాకోర్కుల నందఁ గంటి. ఉ. హరి. 2-176

పయి నాలుగు సీసములందును శివుని వర్ణనము నాలంకారిక రచనా విధానము ననుసరించియే యున్నది. ఇందు మొదటి దానియందు సుదీర్ఘములగు సంస్కృత సమాసములఁ బొదిగించి శంకరుని వైభవప్రాగల్భ్యమును వ్యక్తపఱపఁబడినది. రెండవ సీసమున నా పరమయోగి సార్వభౌముని గనినంతనే, పరమేశ్వరికి మాత్రమే ప్రత్యేక ముగ భాసించు జటాభారఫాల నయనాదుల ప్రభలు హృదయమునకు హత్తుకొని పోవు

నట్లు వర్ణింపఁబడినవి. తరువాత పారిజాత వృక్షముతో నుపమింపఁ జేసి, శంకరుని తనూలావణ్యమును నతిసుకుమారములగు చిగురాకులు, పూవులు, తేనె, ఫలములుగా జెప్పుటలో సోమనాథుని రచనా వైశిష్ట్యము స్పష్టమగుచున్నది. చివరి పద్యము నభూతో నభవిష్యతి యనఁదగు శైలిని రచింపఁ బడినది. అందు గజాసురాదుల గూర్చిన కథాకథనములు వివరింపఁ బడినవి. మఱియు నీ సీసపద్య రచనమున నొక విశేషము కలదు. ఇందు ప్రతిపాదమునను దొలుత సందేహమును దెలిపి, లఘుత్తరార్ధమున నుదాహరణ పూర్వకముగ నా సందేహమును దీర్చుట కాననగును. ఇట్లు స్వీయ కవితా ప్రాగల్భ్యమును వ్యక్తీకరించు రచనమును జేయఁ దలంచియే సోమనాథుఁడు మూలాను గుణ్యముగ నీ శివస్తుతిని యనువదింపలేదని తెలియుచున్నది.

మఱియు నీ పుట్టముసనే మహర్షులు చేసిన శివస్తుతియు నమూలకమే. సర్వజ్ఞుండును యోగీంద్ర వాఙ్మనసాగమ్యుఁడు నగు నా సదాశివుఁడు, శ్రీకృష్ణుని సాదరముగ కౌగలించుకొనినాఁడు. ఆ సమయమున మహర్షులకా సన్నివేశము హరిహరాభేదముగ గానవచ్చినదట. ఈ క్రింది పద్యములలో నా విషయము స్పష్టమగు చున్నది.

సీ॥ అభ్రంకషంబైన యాలపోతు నితండు
  త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధు సమ్మతముగా సామజంబు నితండు
  గాచినాఁ డీతండు ద్రోచినాఁడు
బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
  దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
  మెట్టినాఁ డీతండు చుట్టినాఁడు

తే॥ నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడుసంయమిజనుల కొదవె
రజతగిరిమీఁద హరిహరారాధనంబు. ఉ. హరి. 2-180

సీ॥ సారసంబున లేవ నారసంబునఁ జావఁ
బద్మాసనుండు వీరిపాలఁ గనియె
రూపు గంటఁ జెలంగఁ జూపు మంట బడంగఁ
బంచబాణుఁడు వీరిపాలఁ గనియె
వరములు వడయంగ శిరములు గెడయంగఁ
బంక్తికంఠుఁడు వీరిపాలఁ గనియె
గేహరక్ష నటింప దేహశిక్ష ఘటింప
బాణాసురుఁడు వీరిపాలఁ గనియెఁ

తే॥ గనియెఁ జిత్రంబులకు వీరు గలసియుండి
మనుపఁ జెఱుపంగఁ జెఱుపంగ మనుపనేర్తు
రెల్లలోకంబులకు దైవ మేక మగుట
హరిహరాత్మక మెఱిఁగితి మనిరి మునులు. ఉ.హరి.2-181

దుష్టశిక్షణమును శిష్టరక్షణమును జేయుటలో నీ యిరువురు దైవతములును సమానులను విషయమును బ్రబోధించుటయే గాక నీ యద్వైతమున మహర్షులు హరిహరాత్మకమును గూడఁ బ్రస్తుతించి యున్నారు. ఈ యాశ్వాసమున హరిహరాద్వైతమును గూడ వర్ణింపఁ దలఁచి యున్నందున సోముఁడీ యమూలకమగు రచనము గావించి యున్నాఁడు. మఱియు నీ మహాకవి హరివంశమును బ్రబంధీకరించుటయు నిట స్పష్టముగ గోచరించుచున్నది. మఱొక విషయము. శివకేశవుల లీలలలో సమానేతి వృత్తములగు కథలను గైకొని విచిత్రమగు నొక మార్గము ననుసరించినాఁడు.

సర్వాంతర్యాములగు వారి యభిప్రాయము లొండొరులకుఁ దెలిసి యుండు ననుట స్పష్టము. కావుననే శ్రీకృష్ణుని తపమునకు హేతుభూతమగు విషయమును సోమనాథుఁడు తడవి యుండలేదు. మూలమున శంకరుఁ డీరీతిని శ్రీకృష్ణుని బ్రశ్నించి నట్లు గలదు.

శ్లో॥ కిమిదం దేవదేవేశ చక్రపాణే జనార్దన
తపశ్చరసి కిమర్థం తే ప్రాగసౌ తవ కారణో

స్వయం విష్ణుర్భవాన్నిత్యస్తపస్త్వాం తపసాం హరే
పుత్రార్థం యదితే దేవ తపశ్చర్యా జనార్దనా
పుత్రోదత్తే మ యా దేవపూర్వమేవ జగత్ప్రతే
శ్రుణుత్రాపి భగవన్ కారణ కారణాత్మక.

88 అధ్యా. శ్లో. 3 - 5

ఈ రీతిని గల్పప్రస్తావనమునకు మూరుగ, నిక్రింది విషముగు ననువాదమును సోమనాథుఁడు చేసి యున్నాఁడు తెనిగించుటలోఁ గానవగు మార్పు మూలమునకుఁ గొంత విశిష్టత నాపాదించుచున్నది

మ॥ యదువంశాంబుధిచంద్ర! నీమదిఁగుమారాపేక్షవాలో నెఱుం
గందు సాక్షిచనఁవీఁ దలంచియు తపోఘోరక్రియ స్వేచ్ఛఁగాఁ
జిదవం జెప్పెడివాఁడ వై తగుఁ దిదున్ బృందారకశ్రేణికిన్
హృదయాహ్లాదముగా మదీరుమాటలం జెక్కన్ భవత్పాదముల్.

ఉ. హరి. 2 - 183

క॥ నీకొడుకు నీకు నిచ్చితిఁ
గైకొనుము విరించిచిట్టకాలకు లోనై
నాకుఁ బగ యగుట నంగము
లే కున్నాఁ డతఁడు కొఱఁత లే దతనిపయిన్.

ఉ. హరి. 2 - 184

అనంతరము కుమార సంభవ కథాకథనము మూలమున సంగ్రహముగా నాఱు శ్లోకములలో సూచింపఁబడినది ఈ విషయమును దెనిగించుటలో సోమన పదేను పద్యములను రచించినాఁడు దీనిని విపులీకరించుటలో సోమనాథుఁడాశించిన విషయ మొకటి కలదు త్రిమూర్తులలో మధ్యముఁడగు శ్రీమహావిష్ణుదేవుని పుత్రుఁడగు మన్మ థుని శివుఁడు తన కంటిమంటచేఁ గాల్చినాఁడు. తామిరువురును లోకకళ్యాణార్థము నిర్వర్తించు కార్యకలాపములలో భేదభావము పొడసూపఁ బడియుండుట సమంజసము కాదు. కాని జరిగినదానికి హేతుభూతంబగు పరిస్థితులను వివరించి యుండవలసిన

బాధ్యత శివునకు గలదను యంశమును గుర్తించినాఁడు సోముఁడు. పాత్రచిత్రణము సంపౌచిత్య పోషణముపయి దృష్టినిడి యుండుటచే నాంధ్రీకరణమున నీ పెంపవసరమయిన దనవచ్చును. మఱియు పురాణాంతర్గత విషయమును బ్రబంధీకరించి వ్రాయుటలో నీ మార్పున హేతుకమే. సకారణమును, గంభీరమును, సందర్భోచితమును నగు నీ క్రింది వచనము వలన నీ విషయము స్పష్టమగుచున్నది. ఇది సోముని రచనా ప్రాగల్భ్యమున కొక చక్కని యుదాహరణము.

వ. తొదనంతరంబ రంభాదిరంభోరుకరకిసలయవికీర్ణ కల్పతరు కుసుమకేసరవిసరద్ద్విరేఫ దంభధూమధూసర శిరోరుహంబుల వలనను జంభాసురవిస్రంభనపరిరంభరాగనిర్భరనయన సహస్రప్రభాపటుల కపటకీలాకలాపపరీత దేహప్రభావిహారంబుల వలనను రతివిరచిత మంగళాచరణ గోరోచనా రుచిరదక్షిణభుజానిక్షేపణలక్షణలక్షిత మౌక్తికాక్షతకైతవస్ఫులింగ సంగరసమయోచిత వైకక్ష్యంబుల వలనను వాతాయనవివరవితీర్ణదితిసుతారాతినగరచతురయువతి ముకుళితకరకర్పూరపూరవ్యాజనిచిత భసితవితానవిస్తారితపతాకాపటుపల్లవంబుల వలనను పరితః ప్రతిపదముఖరబృందారకబృంద జయజయారావ పరిపూరితవీరరసావేశవేల్లితభుజాస్ఫాలనకోలాహలచ్ఛద్మగద్గదశబ్దప్రతిరవ విభావితగోపురప్రదేశంబుల వలనను మొదలన వాదీయలోచనానలంబునకు నాహుతి యగుటఁ దెలుపుచు నమరావతీపురంబు వెడలె నచ్చందంబునం బచ్చవిల్తుండు నన్నుం గలంచుటకు నమకట్టి తానును నమయుట వీరిందఱు నెఱుంగుదు రిది పిదప నేఁ దెలిసి యపరాధంబు గాకుండుటకు నామనంబున ననుతాపంబు వొడమిన.

ఉ. హరి. 2—199

తుదకుఁ దనచే దహింపఁ బడిన మన్మథుఁడే, ప్రద్యుమ్నకుమారుఁడను బేరఁ బరగు చున్నాఁడను విషయమును యథామూలకముగా నాంధ్రీకరించి యున్నాఁడు. ఇంతటి సుదీర్ఘమగు కథాకథనముఁ గావించి, పాత్రపోషణము నౌచిత్యపోషణములను గావించుటలో సోమన కృతకృత్యుఁడయినాఁడనిచెప్పవచ్చును. అనంతరము శివుఁడు,

శ్రీకృష్ణుని కొనియాడు విషయములను యథాతథముగా ననువదించియు నెడనెడ గొన్ని విషయములఁ జేర్చియున్నాఁడు ఈ పట్టమునందు వివరింపఁబడిన సాంఖ్య మతతత్త్వాదుల భావముల నవగాహనము చేసికొని యాంధ్రీకరణములు స్వాతంత్ర్య ములఁగు రచనమువలె భాసించుచున్నవి. మచ్చునకు గొన్ని పద్యముల నుదాహరింతును.

సీ॥ ప్రకృతిసంజ్ఞికము గారణము ద్రిధాభూత
మది ప్రధానమునకు నాత్మ యయ్యె
సత్త్వరజస్తమోజాతమై జగదండ
మంతకుఁ గారణం బనఘ నీవ
ప్రకృతియందు మహత్తు ప్రభవించె నం దహం
కారంబు వొడమెఁ దత్కల్పితములు
పంచభూతములు శబ్దస్పర్శగంధరూ
పరసంబులును బాదపాణిపాయు

తే॥ వాగుపస్థములుఁ దదీయవర్తనములు
మనసు గలయఁగ నివి సాంఖ్యమతమునందుఁ
దత్త్వములు వీని కంతకుఁ దాఁప వీవు
పనులు వీనికిఁ దగుభంగిఁ బనుప నేర్తు. ఉ. హరి. 2-202

గీ॥ బ్రహ్మయై రాజసమున నుత్పత్తిఁ గూర్చి
విష్ణుఁడై సాత్వికమ్మున వృద్ధిఁ గూర్చి
రుద్రుఁడై తామసంబున రూపు మాపి
చూపుదు చరాచరంబుఁ గౌస్తుభవిభూష. ఉ. హరి. 2-203

క॥ ఇంద్రియములగోచరముల
కుం ద్రోవలు చేసి భక్తకోటులలో నె
ల్లం ద్రిమ్మరునాత్మవు రవి
చంద్రవిలోచన వివేకచైతన్యనిధీ. ఉ. హరి. 2-204

గీ॥ బ్రాహ్మణులు మోము రాజులు బాహుయుగము
వైశ్యు లూరులు తక్కినవారు పదము
లుదయపథములు సేయ నీయెడలు మెఱయు
నీవు విశ్వేశ్వరుండవు నీలవర్ణ. ఉ. హరి. 2-205

క. రవిచంద్రశిఖిమరుద్వా
నవదిగ్వియదంతరిక్షసర్వంసహలున్
భవదక్షిహృద్దోర్జోఘ్రా
ణవదనకర్ణోత్తమాంగనాభిపదోత్థల్ ఉ. హరి. 2-206

పయి పద్యములకు మూలమున నిరువదియైదు శ్లోకములు గలవు వానిలోఁ గల భావము నీ పద్యములలో నిమిడించుటలో సోమన నేర్పు ప్రశంసనీయము వ్యర్థపద రాహిత్యముగను, భావమును స్పష్టముగ నలతి పదములలోఁ గూర్చి రచించుటలోఁ గొంత సంగ్రహించి యుండుట కాననగును సోమనాథుని వేదాంత జ్ఞాన సంపదను గూర్చియు, వైరాగ్య ప్రవృత్తిని గూర్చియు శ్రీ పనప్పాకము వేంకటాచార్యులవారు వ్రాసిన వాక్యములు సార్థకములనిపించును. ఇంతటి విజ్ఞానఖని యగుటనే వేదాంత పరములగు ఘట్టములను రచించుటలో నీ మహాకవి కవన మలవోకగా సాగిపోయినది.

నమూలకమే యయ్యు కొన్ని ప్రౌఢప్రయోగములను గావించి, సంగ్రహించి రచించు పట్టుల కొక యుదాహరణము నీ దిగువ నిచ్చుచున్నాను

సీ॥ ప్రణుతింతు నోన్నమో భగవతే వాసుదే
వాయ నమో భక్తవత్సలాయ
సూర్యాత్మనే నమః సోమాత్మనే, నమః
ప్రణవాత్మనే నమో బ్రహ్మణే న
మో రుద్రనామ్నే నమో విష్ణవే నమో
మూలప్రకృతయే నమో మహదహంకా
రాదిభూతగణానుహారిభాసే నమో
మాయామయాయతే నమ స్సహస్ర

తే. బాహునేత్ర శిరఃపాదవస్త్రయే న
మో వషట్స్వధాస్వాహాత్మమూర్తయే న
మః స్వభావశుద్ధాయ నమః ప్రహరణ
ధారిణే నమో యనుచు నుదాహరింతు. 2_218

గీ. ఆద్యబీజాయ విశ్వకర్త్రే౽ క్షరాయ
నిర్గుణాయ గుణాత్మనే నిర్మలాయ
హరిహరాత్మనే ప్రవరదివ్యాయ యజ్ఞ
సూకరాయ నమో యనుచు న్నుతింతు. 2_219

పయివానిలో రెండవది యగు గీతపద్యమున క్రిందిపదుమూఁడు శ్లోకములు మూలమునఁ గలవు. అందలి విషయమును గ్రహించి సోమన యద్దానిని యథామూలముగా ననువదింపక, విషయ పరిహరణమును జేయక, సముచితరీతిని సంగ్రహించుటలో నేర్పుఁజూపినాఁడు.

శ్లో. నమస్తుభ్యం జగన్నాథ మాయినేఽమాయ దాయినే
నమ ఆద్యాయ బీజాయ నిర్గుణాయ గుణాత్మనే
అచింత్యాయ సుచింత్యాయ తస్మై చింత్యాత్మనే నమః
హరాయ హరిరూపాయ బ్రహ్మణే బ్రహ్మదాయినే
నమో బ్రహ్మవిదే తుభ్యం బ్రహ్మబ్రహ్మాత్మనే నమః
నమః సహస్రశిరసే సహస్రకిరణాయ చ
నమః సహస్రవక్త్రాయ సహస్రనయనాయ చ
విశ్వాయ విశ్వరూపాయ విశ్వకర్త్రే నమోనమః
విశ్వవక్త్రే నమో నిత్యం భూతావాస నమోనమః
ఇంద్రియాయేంద్ర రూపాయ విషయాయ సదాహరే
నమోఽశ్వశిరసే తుభ్యం వేదాభరణ రూపిణే
అగ్నయేఽగ్నిపతే తుభ్యం జ్యోతిషాం పతయే నమః

సూర్యాయ సూర్యపుత్రాయ తేజసాం పతయే నమః
నమః సోమాయ సౌమ్యాయ నమః స్థితాత్మనే హరే
నమో వషట్కృతే తుభ్యం స్వాహాస్వాధా స్వరూపిణే
నమో యజ్ఞాయ ఇజ్యాయ హవిషే హవ్యసంస్కృతే
నమః సుత్రాయ పాత్రాయ యజ్ఞాంగాయ పరాయచ
నమః ప్రణవదేహాయ క్షరాయాప్యక్షరాయచ
దేవాయ వేదరూపాయ శస్త్రిణే శస్త్రరూపిణే
గదినే ఖడ్గినే తుభ్యం శంఖినే చక్రిణే నమః
శూలినే చర్మిణే నిత్యం వరదాయ నమో నమః
బుద్ధిప్రియాయ బుద్ధాయ ప్రబుద్ధాయ సుఖాయుచ
హరయే విష్ణవే తుభ్యం నమః సర్వాత్మనే గురో.
నమస్తే సర్వలోకేశ సర్వకర్త్రే నమోనమః
నమః స్వభావశుద్ధాయ నమస్తేయజ్ఞసూకర.

అధ్యా. 90 - శ్లో 15-28.

## తృ తీ యా శ్వా స ము

ఉత్తరహరివంశమునఁ దృతీయాశ్వాసము నందు పౌండ్రక వాసు దేవుని వృత్తాంతము గలదు. సోమనాథుఁ డీయాశ్వాస మంతయు యథామూలకముగా ననువదించె ననఁజెల్లును. ఇందును నెడనెడ నమూలకములగు పద్యములును, గించిద్విషయభేదమును గన్పట్టును. పౌండ్రక వాసుదేవుని వృత్తాంతము మూలమునఁ బండ్రెండధ్యాయములలో వర్ణితము.

భవిష్యపర్వము తొంబదియొకటవ యధ్యాయమునందు పౌండ్రక వాసుదేవుఁడు, శ్రీకృష్ణుని యాయుధములగు నందక సుదర్శన శార్ఙ్గ

గదాదులకుఁ బ్రతిగ నాయానామములుగల యాయుధములను గల్పించి కొనినాఁడు. సృష్టికిఁ బ్రతిసృష్టివోలె భాసించు నాయాయుధముల ప్రశస్తిని మంత్రి సామంతాదులకుఁ దెలిపి నందనందనుని వాసుదేవ నామమునఁ బిలిచిన వారలకు "శతభారసువర్ణము దండ" మని ప్రకటించెను. కాని నందకసుదర్శనాదులను దాను గలిగియుండి వాసుదేవ నామమునఁ (బ్రశస్తినంద గోరి) దన్ను బిలువవలయు ననియు, నందగోపు నా నామమున వ్యవహరింపరాదనియు శాసించినట్లు మార్చినాడు. మఱియు ననువాదమున నీశాసనవిషయము తన యాయుధముల ప్రశస్తిని జెప్పుటకు ముందే గలదు. తొలుత వాసుదేవ నామసామ్య మాయుధముల ధరించుటచేత ననియేయనుట సమంజసము.

పౌండ్రకవాసుదేవునికొరకు నారదు డరుదెంచిన పట్టులందు పౌండ్రుఁడు తన యౌద్ధత్యమును జెప్పికొనిన విషయము మూలమునఁ బదాఱు శ్లోకములలో గలదు. ఆంధ్రీకరణమునం దావిషయము సంగ్రహింపబడినది. పౌండ్రుఁడు తన యాయుధముల విషయము, సైన్య బలాదుల విషయము నారదునితోఁ జెప్పుట పునరుక్తమగుట సోమన విడిచినాఁడు. మఱియుఁ బౌండ్రుని బలాతిశయవర్ణనముగూడ నప్రస్తుతమని విడిచియుండును. ఆ శ్లోకము లివి :

శ్లో. భవాన్ సర్వత్ర కుశలః సర్వకార్యేషు పండితః
ప్రథితో దేవసిద్ధేషు గంధర్వేషు మహాత్మసు
సర్వత్రగో నిరాబాధో గత్వా సర్వత్ర సర్వదా
అగమ్యం తవ విప్రేంద్ర బ్రహ్మాండే న హి కించన
నారదేదం వద త్వం హి యత్ర యత్ర గతో భవాన్
తత్ర తత్ర తపస్సిద్ధో లోకే ప్రథిత వీర్యవాన్
పౌండ్ర ఏవ చ విఖ్యాతో వాసుదేవేతి శబ్దితః

శంఖీ చక్రీ గదీ శార్ఙ్గీ ఖడ్గీ తూణీ తనుత్రవాన్
విజేతా రాజసింహానాం దాతా సర్వస్య సర్వదా
భోక్తా రాజ్యస్య సర్వస్య శాస్తా రాజా బలాద్బలీ
అజేయః శత్రుసైన్యానాం రక్షితా స్వజనస్య చ
యోఽద్య గోపక నామాఽసౌ వాసుదేవేతి శబ్దితః
తస్య వీర్యబలే న స్తో నామ్నోఽస్య మమ ధారణే
స హి గోపో వృథా బాల్యాద్వారయత్యేవ నామ మే
ఇదం నిశ్చిను విప్రేంద్ర ఏక ఏవ భవామ్యహమ్
వాసుదేవో జగత్యస్మి న్నిర్జిత్య బలినం యదుమ్.
వృష్ణీన్సర్వాన్బలా త్క్షిప్త్వా నిహనిష్యే చ తాం పురీమ్
ద్వారకాం విష్ణునిలయాం యోద్ధా చాహం మహామతే
ఏతే చ బలినః సర్వే నృపా మమ సమాగతాః
అశ్వాశ్చ వేగినః సన్తి రథా వాయుజవా మమ
నో నామన్త్రాః సహస్రం చ గజా నియుత మేవచ
ఏతేనాహం బలేనాజౌ హనిష్యే కేశవం రణే
తస్మాదేవం సదా విప్ర వద బ్రహ్మపురే మమ
ఇంద్రస్యాపి సదా విప్ర వద నారద సాంప్రతమ్
ప్రార్థనైషా మమ విభో నమస్తే త్వాం తపోధన.

భ. ప. 92 అధ్యా. 5 - 16.

పయి శ్లోకములలోఁగల భావమును గ్రహించి, సోమన రెండు వృత్తములలో నావిషయమును ముగించెను. మఱియు నా రెండవ పద్యమున సమూలకము.గ కృష్ణపరమాత్మ నీసడించుటయు గూర్పఁబడినది.

మ. మునినాథా! నిఖిలంబు నీకు హృదయాంభోజాతగంధంబు దోఁ
పని యర్థంబులు లేవు నాకు సరిచూపం జాలుదే యాదవుం
డనుమానింపక వాసుదేవుఁ డని మిథ్యాగర్వ రథ్యా విడం
బనుఁడై నన్ విసిపింతుఁగా కతని కీ పంతంబుఁ జెల్లింతునే.

మ. కలరే రాజులలో మదీయ కర చక్రక్రీడ సైరింపఁ బె
ద్దల భీష్మాదుల ధిక్కరింపఁ దగ దెంతం జాల రీకైవడిన్ వో
రలు వోనాడకు గోపవీడు నొరు పేరం బరుమీ విక్రమా
ఢ్యులలో నేనును వాసుదేవుఁడ నతండున్ వాసుదేవుండటే.

ఉ. హరి. 3 ఆ. 11, 12

నారదమహర్షి ప్రత్యుత్తరము ననువదించుటలోను మూలవిషయమును గుదించినాఁడు సోమన. మూలశ్లోకములను, ననువదించిన నాలుగు పద్యములను నిటఁ జూపుచున్నాను.

శ్లో. సర్వత్రగః సదా చాస్మి యావద్బ్రహ్మాండ సంస్థితిః
ఆచార్యాః సర్వకార్యేషు గమనే కేనచిన్నృప
కిన్ను వక్తుం తథా రాజన్నుత్సహే నృపసత్తమ
మహీం శాసతి దేవేశ చక్రపాణౌ జనార్దనే
విష్ణౌ సర్వత్రగే దేవే దుష్టాన్ హత్వా సబాంధవాన్
వాసుదేవేతి కో నామ తిష్ఠత్యస్మిన్ధరావితి
కో నామ వక్తుమేవేదం కృష్ణే శాసతి గోమతీ
అజ్ఞానాద్వక్తుమేవం చ సమర్థాః ప్రాకృతా జనాః
హరిః సర్వత్రగో విష్ణుర్దర్పం తే వ్యపనేష్యతి
అచింత్యవిభవో విష్ణుః శార్ఙ్గధన్వా గదాధరః
ఆదిదేవః పురాణాత్మా దర్పం తే వ్యపనేష్యతి

హాస్యమేతన్మహారాజ యచ్చ వై తత్ర సంస్థితమ్
శార్ఙ్గం ఖడ్గం తథా రాజన్మహాఘోరం న దాప్యతే
అతీవ హాసకాలోఽయం తవ సంప్రతి వర్తతే.

భ. ప. 92 అధ్యా. 17–23

చ. మనమున నోకిలించి మఱుమాటకుఁ గింకిరిపాటు తోఁడుగా
మునిపతి యల్ల నవ్వి విను మూర్ఖ మురాంతకుఁ బుండరీక లో
చనుఁ ద్రిజగన్నుతున్ సుగుణసాగరుఁ జేరవు గాక శార్ఙ్గితోఁ
బెనఁగుట మంటలో మిడుత బీరము సూపుట గాదె దుర్మతీ.

క. నీ శంఖము నీ చక్రము
నీ శార్ఙ్గము నెఱుఁగమే యనిం గదిసినచోఁ
గేశవసాధనములు గళ
పాశంబులు నీకుఁ దోడరి బ్రతుకఁగ వశమే.

క. ఏనుంగులాగు పందికి
మానిసి చందంబు నీరుమానిసికి నగుం
గాని గుణంబులు గలుగవు
పూనకు చక్రంబు చక్రి పూనఁగ నెదురన్.

ఆ. త్రుళ్ళుఁబోఁత నీవు తూలిపోఁ బలికిన
సారమేమి తఱుఁగుఁ జక్రమునకు
నినుము కూడఁ బొదుగ నిది చక్రమా యెత్తు
వచ్చుఁగాక నోరకు వచ్చునెట్లు.

ఉ. హరి. 3 ఆ. 14–17

పయిఁ జూపఁబడిన యనువాదము నందు మూలమున కంటెఁ గొంతవట్టు విపులీకరణమును, గొంత మెఱుఁగులిడిన ఛాయలును గాన వచ్చును. మొదటి పద్యమునం దొక లోకోక్తి నిమిడ్చి తెనుఁగుదనమును గల్పించినాఁడు. మఱియు మూలము నందలి భావము ననువదించుటయ గాక నమూలకముగఁ జివరి రెండు పద్యములను స్వతంత్రముగ (విష యాధిక్యమును) గూర్చినాఁడు. వీనియందుఁ బౌండ్రుని మూర్ఖత్వము నకుఁ దగినట్టి ఏనుంగులాగు పందికి, మానిసి చందంబు నీరుమానిసికి, నను రెండుపమానముల నిచ్చినాఁడు సోమన. వీని వలనఁ బౌండ్రుని (పాత్ర) శీలము స్పష్టముగ వ్యక్తమగుచున్నది. పౌండ్రక వాసుదేవుని వాచాలతయు, సుదర్శన చక్రప్రభావమును సూచింపఁబడినవి.

పౌండ్రక వాసుదేవుఁడు ద్వారవతిని ముట్టడించుటను, తనసేన లకు యుద్ధనీతిని గఱపుటను సోముఁ డనువదింపలేదు. (భ. ప. 93 అధ్యా. 13–20). ఇట్లే ద్వారకాపురమునందు జరిగిన యుద్ధసన్నాహ మును గూర్చిన వర్ణనమును విడువఁబడినది. (భ. ప. 94 అధ్యా 1–8) పౌండ్రుని దండయాత్రా సంరంభము హఠాత్సంభవమనుట సత్యము. ఆ ముట్టడిని తక్షణమ యాదవసైన్య మెదుర్కొనినది. ఇట్టి ప్రమాద మును శ్రీకృష్ణుఁడు బదరికాశ్రమమున కేగునపుడే యూహించి నటులు స్పష్టముగఁ జెప్పఁబడినది. కావున నీ విషయము లిట ననావశ్యకము లని సోమన పరిహరించియుండును. ఈ వివరములకు మారుగ, సోమన యొక సీసము నమూలకముగ రచించెను. అద్దాని మూలమునఁ బౌండ్ర భూపాలుని సైన్యవర్ణనము గావింపఁబడినది.

సీ. గర్జితానేకపోత్కటదానధారలు
జలరాశి రాణివాసముల గెలువ
వల్గదాజానేయ వదనఫేనము లంటి
నేల చుక్కలతోడి నింగిఁ దెగడ

సన్నద్ధ పాదాత శస్త్ర ప్రభాపంక్తి
కరదీప రాజిపైఁ గాలుద్రవ్వ
రథ్యా ప్రతీకోత్థ రవముచే గిరికోటి
పిడుగుల నెఱవిడిఁ బెదరుకొనఁగ

తే. నంధతమసంబు శ్వేతపింఛాతపత్ర
దీధితులు గ్రమ్మఁగ వైజయంతీ వితాన
మెఱుఁగులకు నెడమూక మీఁ దెడగుకొనఁగఁ
బరఁగి నడతెంచెఁ బౌండ్ర భూపాలుసేన.

ఉ. హరి. ఆ 3_24.

పౌండ్రునికి సహాయముగా నేతెంచిన నేకలవ్యుని విజయపరంపరలకు సంతసించి, యాతఁ డాత్మీయ సేనల కుత్సాహమును గలిగించినాఁడు. ఈ సందర్భమున మూలమున నీ రెండు శ్లోకములు గలవు.

శ్లో. భిద్యంతాం ప్రాకారచయాః ప్రాసాదాశ్చ సమంతతః
గృహ్యంతాం కన్యకాః సర్వా దాస్యశ్చైవ సమంతతః
గృహ్యంతాం వసుముఖ్యాని ధనాని సుబహూన్యథ
తే తథేతి మహాత్మానో రాజానః సర్వ ఏవతు॥

భ. వ 95 అధ్యా. 5, 6

వీనియందు "గృహ్యంతాం" అనుపదము ప్రయోగింపఁబడినది. ఈ పదము "పట్టుకొనుఁడు"; దోచుకొనుఁడు" అను నర్థమున మూలమునఁ బ్రయోగించినట్లు భాసించుచుండఁగా, ననువాదమున తానే వాని నొసఁగినట్లు వాడఁబడినది. ఈ క్రిందిపద్యమునం దాపద ప్రయోగమును గమనింపనగును.

శా. ఈ చందంబున నేకలవ్య విజయం బింతంత గాకున్న వీ
రాచారంబు నుతించి పౌండ్రకవిభుం డాత్మీయులం జూచి చే
వీచెం ద్రవ్వఁడు కోటమేడలు పడ ద్రోయుండు డాయుండు లెం
డే చూ తెవ్వఁడు గొన్న నిత్తునని లావెక్కించె సంరంభియై.

ఉ. హరి. ఆ. 3-32.

ఇట్టి యుత్సాహ పూరితములగు వాక్యములచే నా పౌండ్రక భూపాలుఁ డాత్మీయసేనలఁ బురికొల్పుటవలని ప్రయోజనమును సోమనాథుఁ డీ క్రింది రీతిని వర్ణించినాఁడు.

సీ. వంకదారకుఁ జేరి వాకిటి దద్దడం
బులు సెర్చి కొమ్మల ప్రోఁకువైచి
ప్రాఁకి లోపలఁ జొచ్చి పలుగాఁడిఁ దెఱచిన
పంతగార్లకు మున్న బద్దపరుల
తోన నిచ్చెనలెక్కి లోని కొత్తళములోఁ
బురణించి చొచ్చిన పోటుమగల
వాఁడి మెచ్చుక యాళువరిమీఁదఁ బాళెల
వారిఁ దాకించిన వాసి బిరుదు

తే. గీ. లచ్చెరువు నొంద మేడలు సొచ్చి యార్చు
దొడ్డకార్ల చేఁ బఱివోయెఁ దూర్పుదిక్కు
జాల వాటుల నేటుల అంతు మిగిలి
తఱిమి రచ్చటి బలముఁ గొందఱు గడంగి.

ఉ. సామజవాజి ముఖ్య బలసంతతి పేఁగిన వృష్ణివీరు లే
మేమనఁ జేవలేక దమయిండులలోనఁ జొరంగ మందిర

స్తోమము గోపురంబుఁ బడఁద్రోవఁగఁ జప్పుడు మిన్నుముట్టినన్
దామరపాకు నీరువలెఁ దల్లడమందిరి పౌరు లందఱున్.

ఉ. హరి. ఆ. 3_34, 35.

పయి నుదాహరించినవానిలో మొదటి సీసపద్య మమూలకముగా సోమన కల్పించినాఁడు. పౌండ్రసేనావాహిని, ద్వారకాపురము తూర్పు దిక్కునఁగల గోపురద్వారమును బగులగొట్టి లోనఁబ్రవేశించు సన్నాహము గన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినది. సర్వసేనాధిపతి ప్రోత్సాహమునకుఁ దగిన కార్యలాభమునుగూడ జూపుటయు సమంజసమే. మూలమున నీక్రింది రెండుశ్లోకములలోగల విషయమునుగూడ యథామూలకముగ గ్రహించి, పయిఁజూపిన వృత్తమునందు విపులీకరించి యున్నాఁడు :

శ్లో. కుఠారైః సర్వతశ్చైవ చిచ్ఛిదుః పౌండ్రకాజ్ఞయా
ప్రాకారాంశ్చైవ సర్వత్ర ప్రాసాదా న్నరసంచయాన్ ॥
అథ తత్ర మహాశబ్దః ప్రాదురాసీ త్సమంతతః
టంకేషు పాత్యమానేషు ప్రాకారేషు మహాబలైః ॥

భ. ప. 95 అధ్యా. 7, 8.

కావున నీ ఘట్టమున సోమనాథుని యనువాదము మూలమునకంటెఁ గొంత విస్తృతియు, స్పష్టతయుఁ, గలిగి యున్నదనుట సత్యము. మఱియు తెనుఁగుదన ముట్టిపడునటులు "తామరపాకు నీరువలెఁ దల్లడమందిరి పౌరులందరున్" అని చెప్పుట శ్రేష్ఠతరమగు తెనుఁగుసేత.

తూర్పుద్వారమును భేదించిన విషయమును దెలిసి, క్రోధఘూర్ణమానసుఁడగు సాత్యకి రిపుసేనలం దాకిన ఘట్టమున మూలమున పౌండ్రసాత్యకుల నడుమ నడచిన సంభాషణమును, నుభయుసైనికుల

మధ్య నొనఁగూడిన మాటలును సంగ్రహింపఁబడినవి. అవి మూలమున పదేనుశ్లోకములకుఁ బైపడియుండ, సోమనాథుఁడు సంగ్రహించినాఁడు. రణరంగమునం దుభయపక్షభటుల సంవాదమును విడిచెను. సాత్యకి పౌండ్రులలో నెవరిని విజయలక్ష్మి వరించు నను విషయమునుగూర్చి యుద్ధరంగమునఁ జర్చించుట యుక్తము కాదని సోమనాథుఁడు తలంచి యుండును. సాత్యకి పౌండ్రు లొకరినొకరు యధిక్షేపించుకొనుటలోఁ గూడ మూలాతిక్రమణము గానవగును. మూలానుసరణముగ రచించుటయగాక నీ ఘట్టమున నీ క్రిందిపద్యములను స్వతంత్రముగ రచించి యున్నాఁడు.

క. చక్రి పౌండ్రమంగఁ బార్థివస్థానమ్యై
నోరి మీ వంశమందుఁ దాఁ గోర్వఁజాలు
వారిఁ జూపుము కుమ్మరావమున రాగి
మంత లేరంగఁ గలవె నీ కింతయేల.

వ. అనుటయు సాత్యకి కోపించి.

క. క్రేలకు జీలుగు వెరిఁగిన
మాలెకుఁ గంబంబుగాదు మాటలు మిగులన్
నాలుక గఱచిన యంతనె
చాలునొ మగతనముజూప సాత్యకి యెదురన్.

ఉ. హరి. ఆ. 3-48, 49, 50.

పయి సంభాషణమునందు పౌండ్ర సాత్యకుల యభిప్రాయములు స్పష్టముగ వ్యక్తీకరింపఁబడినవి. తేటతెనుఁగు పదములతోడి రచనయుఁ సామెతలమూలమున భావస్ఫూర్తియుఁ గలిగించి, మూలమునకు వన్నె వెట్టినాఁడు సోమన.

మఱొక విషయము - మూలమున పౌండ్ర సాత్యకులయుద్ధము రెండధ్యాయములందు (భ. ప. 96, 97 అధ్యా) వర్ణింపబడినది. ఆరెండు చోట్లను వారలసంభాషణము లుండుట పునరుక్తమని యెంచి సంగ్రహించుట యుక్తముగనే యున్నదనవచ్చును.

పౌండ్ర సాత్యకుల గదాయుద్ధ మీదిగువ నుదాహరించిన శ్లోకములలో సంగ్రహముగా వర్ణింపఁబడియున్నది.

శ్లో. దక్షిణం వాసుదేవస్తు తం జఘాన స్తనాంతరే
యుయుధానోఽథ వీరస్తు బాహ్వోర్మధ్య మతాడయత్॥
దృఢం స తాడితో వీరో జానుభ్యా మపతద్భువి
తత ఉత్థాయ వీరస్తు లలాటేఽభ్యహనద్గదామ్॥
విషణ్ణం కించిదాస్థాయ తత ఉత్థాయ సత్వరమ్
గదయాభ్యాహనద్వీరః సాత్యకిః పౌండ్రసత్తమమ్॥
వాసుదేవో బలిర్వీరః సాక్షాన్మృత్యు రివాపరః
జఘాన గదయా వృష్ణిం నిర్దహన్నివ చక్షుషా॥
స తయా తాడితో వృష్ణి ర్గదయా బాహుముక్తయా
ఆలంబ్య భూమిం సహసా మృత్యోరంకగతో యథా॥
సంజ్ఞాం పునః సమాలంబ్య పాణిభ్యాం దృఢమేవ చ
గదాం తస్య మహారాజ గృహీత్వా ప్రగ్రహేణ హ॥

వీనియందలి భావమును గ్రహించి, సోమన యొక వచనమున నీ గదాయుద్ధమును వర్ణించినాఁడు. ఇందా వీరవరు లొండొరులఁ గదిసి యెదుర్కొనిన పద్ధతుల నతివివరముగఁ జెప్పుటయేకాక సోమన తన వచనరచనా వైశిష్ట్యమును గూడఁ జూపినాఁ డనుట స్పష్టము.

వ. మఱియు వివిధంబులగు విన్నాణంబుల నొడిచియు నెమ్మొలునలియఁ బొడిచియు మండె దాఁకించియు గిదలు సోఁకించియుఁ దలఁ దల

నాగించియు భుజంబులు భుజంబులతో ద్రస్గించియుఁ గక్షంబు కక్షం బుతో ఘట్టించియు వక్షంబు వక్షంబుతో ఢట్టించియుఁ గరంబులు కరంబులతో నప్పళించియుఁ బిక్కలు పిక్కలతో నుప్పళించియుఁ జరణంబులు చరణంబులతోఁ దాఁచియు నడుము లాగించివైచియు లులాయంబులు మలయుమార్కిఁ బులుఁగు దలపడ్డపోలికఁ గరులు పోరాడుకయివడి సింగంబులు పెనంగుభంగి నుపతాయితో నఖ వాయి నిరువురుం జదిసియుఁ గుదిసియు నచ్చలంబునం జముదుచల్లిన మంటలకయివడి బ్రత్తిదాల్చినవడువున నిమ్మపండు నలంచినపగిదిఁ బాదరసంబు మర్దించు పంతంబునఁ జోళంబు విఱుచుదెఱంగున మన సునం బలిమిలేక విసువక పరస్పరజయకాంక్షలం బరాక్రమించు నవసరంబున.

ఉ. హరి. ఆ. 3_70

ఈ విధమునసే మూలమున నాలుశ్లోకములలో వర్ణింపఁబడిన బలరామ యేకలవ్యుల యుద్ధమును విపులీకరించి సోమనాథుఁడొక సుదీ ర్ఘమగు వచనమును రచించినాఁడు. (ఉ. హరి. ఆ. 3_80)

పౌండ్రభూపాలుఁ డర్ధరాత్రమున వచ్చి ద్వారవతిని ముట్ట డించెను. పౌండ్రాధీశ్వరుఁ డేకలవ్యనృపుని సాహాయ్యంబుతోఁ జతు రంగబలసమేతుఁడయి దండెత్తినాఁడు. యాదవసైన్యమును సద్దానికిఁ దీసిపోవునదికాదు. కావున నాబలము లొండొరులకు లొఁగక పోరు నవసరంబున నారాత్రి గడిచి తెల్లవారినది. ఈ ప్రభాత కాలసూచనము మూలమున నొక్కమాటలో నీ క్రిందివిధముగఁ జెప్పఁబడినది.

శ్లో. తతః ప్రభాతే విమలే భగవాన్ దేవకీసుతః
గంతుమైచ్ఛ జ్జగన్నాథః పురం బదరికాశ్రమాత్॥

భ, ప. 10ం అధ్యా. 1

సోమనాథుఁ డీ సందర్భమున సూర్యోదయవర్ణనమును జేసినాడు. ఆ పద్యము నిట నుదాహరించి, సందర్భోచితమగు నీవర్ణనావిధానమును బరిశీలింతము.

సీ. కుంకుమ హత్తించి కొనగోరఁ దీర్చిన
 పుడమికాంతు నిల్లాలి బొట్టనంగఁ
జక్రవాకములకుఁ జల్లఁగా మందు ద్రా
 గించిన చెంద్రపుగిన్నె యనఁగఁ
బార్వతీపతికిఁ బ్రభాత భూపతి గొన్న
 యలరు గెందమ్మి కోహళి యనంగఁ
దొలిదిక్కు తొయ్యలి చెలులపైఁ జల్లంగ
 నిండ ముంచిన పైఁడికుండ యనఁగ

తే. గీ. మేరు ధరణీధరంబుతో మేల మాడ
 నుదయగిరి రాజు దలయెత్తె నో యనంగఁ
గ్రమముతో నించుకించుకఁ గాన నగుచు
 భానుబింబంబు గన్నుల పండువయ్యె. ఉ. హరి. ఆ. 3-86

పౌండ్రభూపతి యర్ధరాత్రమున ద్వారకాపురిని ముట్టడించుటయు, శ్రీకృష్ణపరమాత్ముఁ డుదయముననే బదరికాశ్రమమునుండి ద్వారవతి కేతెంచుటయుఁ జెప్పఁబడినవి. ఆత డరుదెంచువర కీ పోరుసాగుట హేతువుగా నామధ్యకాలమునందలి ప్రభాతకాలమున నీ సూర్యోదయ వర్ణనము సందర్భోచితము. మఱియు సోమన హరివంశపురాణము నొక ప్రబంధముగ సంతరింపఁ బూనియుండుటలో నీ సూర్యోదయవర్ణన మావశ్యకముగూడనగు యున్నది. విశేషించి సోమనాథుని స్వకపోల కల్పనములగు నుపమల నీ పద్యమునందుఁ జూడనగును. మఱొక విషయము. ముందుపద్యమునఁ దెలతెలవాఱె నని చెప్పి, తదనంతరము

క్రమముగ నించుకించుక గానవగుచు భానుబింబము గన్నులపండువయ్యె ననుటలో నీమహాకవి నిశితమగు దృష్టియు గోచరించుచు. కావున నీ ఘట్టమును రచించుటలో ననువాదము మూలముకన్న మిన్నయని చెప్పనగును.

శ్రీకృష్ణ పౌండ్రకవాసుదేవుల సంవాదమునందు దీ శ్లోకములు కూడకలవు. అనువాదయోగ్యములయ్యు వానిని సోముడు పరిహరించి నాడు.

శ్లో. కామం వద నృప త్వంహి పాతకస్యసి సదా నృప
గోఘాత బాలఘాతీ చ స్త్రీహంతా సర్వదా నృప
చక్రీ భవ గదీ రాజచ్ఛార్జీ చ సతతం భవ
నామధేయం వృథా మహ్యాం వాసుదేవేతి చ ప్రభో
శార్ఙ్గీ చక్రీ గదీ శంఖీ త్వేవమాది వృథా మమ
కిం తు వక్ష్యామి కించిత్తు శృణుష్వ యది మన్యసే॥
క్షత్రియా బలినో యే తు స్థితే మయి జగత్పతౌ
తథాఽనుబ్రువతే త్వాం హి జీవత్యేవ మయి ప్రభో
యత్తే చక్రం మహాఘోరం తదసురాంతకం మహత్॥
తత్తుల్యం మమ చక్రం తు బుద్ధితో నతు వీర్యతః
ఆయుధేష్వథ సర్వత్ర శబ్దసాదృశ్య మస్తి తే॥
గోపోఽహం సర్వదా రాజన్ప్రాణినాం ప్రాణదః సదా
గోప్తా సర్వేషు లోకేషు శాస్తా దుష్టస్య సర్వదా॥
కర్తారం సర్వకార్యం హి జిత్వా శగూ న్నృపాధమ
అజిత్వా కిం భవాన్ బ్రూతే స్థితే మయా చ శత్రిణి॥
హత్వా మాం బ్రూహి రాజేంద్ర యది శక్తోఽసి పౌండ్రక
స్థితోఽహం చక్రమాశ్రిత్య రథీ చాపీ గదాసిమాన్॥

రథ మారుహ్య యుద్ధాయ సన్నద్ధో భవ మానద
ఇత్యుక్త్వా భగవాన్విష్ణుః సింహనాదం వ్యనీనదత్॥
భ. ప. 100 అధ్యా. 36-44

పౌండ్రకవాసుదేవుఁడు శ్రీకృష్ణుని స్త్రీ బాలకాదులను జంపినట్టి మేటివీరుఁడని పరిహాసించినందులకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పుచు శ్రీకృష్ణుఁ డాడిన పలుకులివి. పౌండ్రకభూపాలుఁడు, వాసుదేవనామమును ధరించి, శంఖచక్రగదాదుల నేర్పఱచికొనినాఁడు గదా! ఆతనికిఁగల ద్వేషమంతయు శ్రీకృష్ణుని పైనను, నాతని ప్రసిద్ధములగు నాయుధములపైనను గలదని తొలుత నారద పౌండ్రకుల సంభాషణమునుబట్టి స్పష్టమగు చున్నది. కావున శ్రీకృష్ణు నాయుధముల నిర్వీర్యము గావించి, శ్రీకృష్ణు నొంచుటయే యాతని యభిమతమగుట సహజము. కావున నా సందర్భమున వానిప్రసక్తియే యవసరముగాని, శ్రీకృష్ణునికి సంబంధించిన పూర్వవిషయము నుద్ఘాటించు టనవసరమని సోమన తలంచియుండును. ఇట్టివిషయము పరిహరించుటయు కథాకథనమున కౌచిత్యము నాపాదించుచున్నది.

ఇఁక శ్రీకృష్ణ పౌండ్రకవాసుదేవుల యుద్ధఘట్టమునం దొకింత భాగమును సంగ్రహించియు, నొకానొకచో మార్పుగావించియు నౌచిత్యమును బోషించినాఁడు సోమనాథుఁడు. పౌండ్రుఁడు తన బహులోహ భారదృఢమగు చక్రమును శ్రీకృష్ణునిపయి విసరినాఁడు. ఈ విషయము మూలమున నాలు శ్లోకములలోఁ గలదు. ఆశ్లోకము లివి :

శ్లో. తదిత్థం జగతాం నాదశ్చకార యదునందనః
తతశ్చక్రం మహాఘోరం సహస్రారం మహాప్రభమ్॥
త్రిశద్వార సమాయుక్త మాయసాస్య మమిత్రహా
ఆదాయాథ మహారాజ కేశవం వాక్యమబ్రవీత్

పశ్యేదం నిశితం ఘోరం తవచక్ర వినాశనమ్
అనేన తవ గోవింద సర్వం దర్పవతాం వర॥
అపనేష్యామి వార్ష్ణేయ సర్వ క్షత్రస్య పశ్యతః
త్వా ముద్దిశ్య మహాఘోరం కృత మస్యద్దురాసదమ్॥
యది శక్తో హరే కృష్ణ దారయేదం మహాస్పదమ్
ఇత్యుక్త్వా తద్భుతగుణం భ్రామయిత్వా మహాబలః
చిక్షేపాథ మహావీర్యః పౌండ్రకో నృపసత్తమః
అవప్లుత్య తతో దేశాత్తముత్సృజ్య మహాబలః ॥
భ. ప. 101 : 11-16

ఈ భాగము ననువదించుటలో సోమన తననేర్పుమేర సంగ్రహించెను. పౌండ్రుని వాక్యములు నన్నిటిని గ్రహింపక, వాని భావము మాత్రము గైకొని యీక్రింది పద్యమును రచించెను.

చ. అతఁడొక శక్తివైచిన మురాంతకుఁ డంతన రెండు సేసె న
క్షతమదలీల వాఁడు పరిఘంబున వైచినఁ ద్రుంచెఁ బౌండ్ర భూ
పతి బహులోహ భారదృఢ భారదృఢార కఠోరచక్ర ము
ద్ధతిఁ గొని నీతలంబె యిది దాఁకిన నోర్వఁగ నంచు నేసినన్.
ఉ. హరి. 3 ఆ - 101

ఇందు "నీ తలంబె యిది దాఁకిన నోర్వఁగ నంచు నేసినన్" అనుదానిలో పయి శ్లోకముల భావ మిముడ్చ బడినది. అనావశ్యకములగు విషయముల పరిహారణముకూడ ననువాదమునకుఁ గొంత పటిష్ఠత చేకూర్చిన దనవచ్చును.

మఱియు మూలమునఁ బౌండ్రుని చక్ర ప్రయోగమునకుఁ బ్రతిగ శ్రీకృష్ణుఁడేమి చర్యగైకొన్నదియు వివరింపఁబడలేదు. ఔచిత్యపోషణ

మునకయు యాలోపమును బూరించుటకొక మార్పు నిట గావించి నాఁడు. పౌండ్రకుని చక్రమునుబట్టి తిరిగి వానిపయిఁ బడునట్లు విసరివైచె నని గల్పించినాఁడు. ఆ పద్యమును, నద్దానికి మూలమగు శ్లోకమును నిటఁ జూపుచున్నాఁడను. ఈ విషయమునుబట్టి యీతని యాంధ్రీకరణ వైశిష్ట్యము వ్యక్తమగుచున్నది.

శ్లో. అహో వీర్య మహో ధైర్య మస్య పౌండ్రస్య దుస్సహమ్
ఇతి మత్వా జగన్నాథ ఉత్థితశ్చ రథోత్తమాత్.

భ. ప. 101 అ. _ 18

క. గగనమున వచ్చు చక్రముఁ
జిగురాకుం బోలెఁ జక్రి చేఁబట్టి వడిన్
మగుడంగఁ ద్రిప్పి వైచిన
బెగడక మై మఱసి వాఁడు పెల్లుగ నార్చెన్.

ఉ. హరి. 3 ఆ _ 102

సుదర్శన చక్రప్రభావ వర్ణనము మూలమునఁ బ్రత్యేకముగ మూఁడు శ్లోకములలోఁ జెప్పఁబడినది. ఈ శ్లోకము లనువాద యోగ్యము లేయయ్యు సోమన విడిచినాఁడు. ఆమూఁడు శ్లోకములలోని భావమును విడువక "దైతేయ చక్ర విదార క్రకచ క్రమంబయిన చక్రము" అనుభావము నుపలక్షించెను. పౌండ్రుని చక్రము వృథయగుటయు, సుదర్శన చక్రమాతనిని వధింపగల్గుటయు నాచక్ర ప్రభావ ప్రాభవమును జెప్పకయే చెప్పుచున్నది.

మ కవిషయము. శ్రీకృష్ణుఁడు ప్రయోగించిన చక్రము పౌండ్రక భూపాలుని వధించి, తిరిగివచ్చి చేరినది. ఈ సందర్భమున నీక్రింది శ్లోకములో శ్రీకృష్ణుఁడు ద్వారకాపుర ప్రవేశము చేసెనని కలదు,

ఆ విషయమును విడువఁబడి. ఉ. హ. యుద్ధరంగమునుండి బలరాముఁడు వచ్చు సమయమున నీవిషయము పరోక్షముగఁ జెప్పఁబడినది.

శ్లో. తతః స పౌండ్రకో రాజా గతాసుః ప్రాపతద్భువి
నిహత్య భగవాన్ విష్ణుర్దుర్విజ్ఞేయగతిః ప్రభుః
ప్రతిపేదే సుధర్మాం తు యాదవైః పూజితో హరిః॥
భ. ప. 101. – 25

శ్రీకృష్ణపరమాత్ముఁ డీరీతిని దన విజయమునందుఁ గల దుష్టశిక్షణమునకు సంతసించు నవసరంబున, సోమనాథుఁడు మఱొక విషయము నీ యాశ్వాసమునఁ జేర్చినాఁడు. మూలమున నీ సన్నివేశము పౌండ్రకవాసుదేవ వృత్తాంతముతోఁ బరిసమాప్త మయినది. ఉత్తర హరివంశము ద్వితీయాశ్వాసమునఁగల కైలాసయాత్రా ప్రసంగమును, ఘంటాకర్ణ కాలాంతకుల వృత్తాంతమును, వరలాభమును, హరిహరాభేద భావ నిరూపణాదులను వరుసగ యాదవముఖ్యు లెల్లరకు వాసుదేవుఁడు వినిపించినాఁడు. కైలాసయాత్రా పరిసమాప్తి గావించు నాఁటికే పౌండ్రుని దండయాత్ర జరిగినందున నీ విషయముల నెఱుక పఱుచుటకు సమయమిదియ. ఇట్టి సంతోష సమయమున దేవేరులగు సత్యభామా రుక్మిణీదేవులతో సరససల్లాపంబులాడుచు శ్రీకృష్ణ పరమాత్ముఁడు కొంతకాలము క్రీడింపనెంచి నెత్తమాడ గడంగినాఁడు. ఈ విషయము నిట ప్రస్తావించుటయు, నా ద్యూత క్రీడావిషయ వర్ణనము గావించుటయు సోమన తన రచనా వైశిష్ట్యము మెఱయ నిఱువది యొక్క పద్యములందు రచించినాఁడు. (ఉ. హరి. 3. ఆ. 109 – 130)

ఇందు సత్యా కృష్ణుల సంభాషణమున, సత్యభామకు శ్రీకృష్ణుని యెడఁగల చనవును, నామెశీలమును చక్కగ వర్ణించినాఁడు. (ఉ. హరి 3 ఆ. 112 – 117.)

మఱియు సోముఁడు ద్యూతక్రీడావర్ణనమును గావించుటలోఁ దనకుఁగల నేర్పును సూచించుటకుగాను రచించిన పద్యముల వలన నాఁడు వ్యవహారమునందున్న పడిజాలముకూడ వ్యక్తమగుచున్నది. (ఉ. హరి. 3 ఆ. 122, 124, 128.)

ఈ యాశ్వాసమున మఱియొక విషయముగూడ సోమన కలిపినాఁడు. పౌండ్రునకు సహాయుఁడగు కాశీపతి శ్రీకృష్ణుని పయి ప్రతీకారముఁ గొన నిశ్చయించినాఁడు. అందులకయి తపంబొనరించి, హరునిచే సందీపని కృత్యను బడసినాఁడు. పావకకుండమధ్య కీలాపరిశోభితంబగు నాకృత్యను గాశీపతి, ద్వారవతిపై బ్రయోగించినాఁడు. దానిని గాంచి సాత్యక్యాదులు వెఱఁగంది జగన్నాథునితోఁ జెప్పిన విషయమునుబట్టి యాకృత్య భయంకరస్వరూపము తెలియుచున్నది.

క. ఆకొన్న మృత్యువో వెలిఁ
బ్రాఁకిన లయకాల రుద్ర ఫాలానలమో
యూఁకొనఁ దడ వయ్యెడు నది
సోఁకిన చోట్లెల్లఁ గాలుఁ జూర నిచ్చెదవే.

ఉ. హరి. 3. అ. 133.

ఇట్టి భీకరాకారమగు కృత్య విషయమును విని "మతినొక్కింతయు సంచలింపక" అనుటలో శ్రీకృష్ణుని సర్వేశ్వరత్వము నిరూపింపఁబడుచున్నది. మఱియు నిట సుదర్శనచక్ర గాంభీర్యము నీ క్రిందివిధముగ వర్ణింపబడినది.

మ. మతినొక్కింతయు సంచలింపక నిలింపత్రాణ పారీణుఁ డ
చ్యుతుఁ డాకృత్య కకృత్య కారిణికి మృత్యుప్రాప్తిగాఁ బంచె ని
ర్గత బాష్పోదక దానధార రిపురాట్కాసార విస్తార సం
తత పూరస్థిరమాన మీన హరణాంతర్నక్రముం జక్రమున్.

వ. అదియును శతకోటి శతకోటి సన్నిభంబై చిత్రభాను చిత్రభాను భావంబై సహస్రకిరణ సహస్రకిరణ నిపుణంబై సహస్రారుణమండల మధ్య దేవతా వివిధాయుధ విహరణ విద్యుల్లతికా విలాసంబై జపాకుసుమ నిక్షిప్తరక్షా లక్షణంబై మంటలు మింట నంటి వెడలి కడలి వెడలిన బడబానల కీలాకలాపంబు చందంబునం గాలకూట విషవహ్ని జ్వాలామాలికాభీలంబై నీలకంఠ నిటలతట నయన శిఖి శిఖా సహాయంబైన తెఱంగున......

ఉ. హరి. 3 ఆ. 143, 144

ఇక నీ సుదర్శన చక్ర ప్రభావము నిటఁజొప్పించినాఁడు సోమన. కాశికాపురనివాసియగు నా పరమేశ్వరుఁడు సైతము మానక్రధాటి కట నిలువక "శతయోజనంబులం బాపసయోగ్యమై పరగుతాల వనంబున" కేగినాఁడట. మఱియు నిట కాశీపురనామ సంఘటనమును గూర్చియుఁ జెప్పఁబడినది. సుదర్శనచక్ర మా కృత్యనోడించి నీఱుగావించి, యానగరమును సైతము గాల్చినది. ఆ నగర దహనక్రియాకలాపము నీ విధముగ వర్ణించినాఁడు.

గీ. ఆఱు యోజనముల లోఁతు నందులో స
గంబు నలుసదరముఁ గాలి కాశి గాసి
యయ్యె ముప్పదియేండ్లు నిచ్చాఱు దింద్రు
చేత నవిముక్తమయి చెల్లెఁ జతి యనంగ.

ఉ. హరి. ఆ. 3–155.

అనంతరము చక్ర ప్రభావమును దలంచిన గలుగు ఫలితమును గూడ చేర్చి ముగించినాఁడు సోమన. అట వైశంపాయనుని పలుకులివి–
వ. "ఈచక్ర ప్రభావంబు భావంబునం దలంచిన యతనికిం గార్యసిద్ధియు శరీరరక్షయుం జేకుఱు నిది నీకుఁ జెప్పితి సావధానుండవై యెప్పుడుం దలంచునది......"

## చ తు ర్థా శ్వా స ము

ఇఁక నుత్తర హరివంశము చతుర్థాశ్వాసమునందు వర్ణింపఁబడిన హంసడిభకోపాఖ్యానము నందలి మార్పులను గూర్చి బరిశీలింతము. ఇక్కథ సంస్కృత హరివంశమునందు భవిష్యపర్వము 103 వ అధ్యాయమునఁ బ్రారంభింపఁబడి, 129 వ అధ్యాయమునఁ బరిసమాప్తి మైనది. కాని కథాప్రారంభమునఁ గల పద్యమునందలి విషయము సంస్కృతమునఁ బూర్వపు టధ్యాయమునందు గలదు. అందలి ప్రధానములగు రెండు పదములు మాత్రము గ్రహింపఁబడినవి.

శ్లో. తస్మి న్వాసతి దేవేశే రాజ్యం నిష్కంటకం ప్రభో
సుఖమేవఁ ప్రజాస్సర్వా జీవంతి బ్రాహ్మణాదయః॥
అధ్యా. 102 - 24. శ్లో.

దీనికి సోమన తెనిగింపును జూచునది -

గీ. హంసడిభకులు లోనుగాఁ నఖిలధరణిఁ
బెరుగు కంటకకోటిచేఁ బేదలైన
నరపతుల కీర్తి పటములు సిరుగకుండ
వెరవుతో నుద్ధరించిన వేల్పు శౌరి. ఉ. హరి. 4 ఆ. 2.

"బ్రాహ్మణాదయః" యను పదమును వివరించుటలో రాజకీయ పుటాచ్ఛాదనమునుగూర్చి, నరపతుల కీర్తిపటములు సిరుగకుండ వెరవుతో నుద్ధరించిన వేల్పు శౌరి యని రచనము గావించినాఁడు. నిష్కంటకమను పొడిమాటకంటె "కంటకకోటిచే కీర్తిపటములు సిరుగకుండ" అను కల్పన రమణీయముగనున్నది. సాల్వదేశ ప్రభువగు బ్రహ్మదత్తుని వర్ణించు పట్టుల మూలమున "సతాభ్యాం ముముదే రాజా శచ్యా శక్ర ఇవాంబరే" (అధ్యా, 104 - 4 శ్లో.) అని గలదు. ఇంద్రునకు శచీదేవి యొక్కతెయే భార్య. కాని యిట బ్రహ్మదత్తునకు భార్యాద్వయము

గలదు. ఇరువురు భార్యలు గల వాని నుపమానముగ గ్రహించు టుత్తమముగదా ! భార్యాద్వయమునకుగల మైత్యమును భాసింపఁజేయఁ జూచుట సంభావ్యమే యగును. కాని యిట్టి యుపమానము కావ్యదృష్టిని బరిహరణీయము. ఇట మూలమున రాజేంద్ర సచివోత్తముల విషయము 104 అధ్యా. 4 - 12 శ్లోకములందు సంకీర్ణమయి యున్నది. విషయస్ఫూర్తికయి, బ్రహ్మదత్త, మిత్రసహులనుగూర్చి నాలుఁగు పద్దెములను వేర్వేఱ రచించుట మూలమునగల విషయమునకు వన్నెబెట్టుటయే యనందగును. ఆ పద్యముల నీ దిగువఁ జూపుచున్నాను.

సీ. సాల్వదేశంబున జనియించె బ్రహ్మద
త్తాభిధానుండు మూర్ధాభిషిక్తుఁ
డఖిల ధర్మవిధిజ్ఞుఁ డాత్మభార్యాద్వయం
బునకు బిడ్డలు లేమిఁ బొల్లవోయె
సంసారమనుచు నీశాను నారాధించె
బదియేఁడు లొండు సంభ్రమము లేక
బరమేశుఁ డతని సద్భక్తికి మదిమెచ్చి
కలలోన నొకనాఁడు గదిసి వరము

తే. వేఁడికొనుమన్న నిరువుర వేఁడె సుతుల
శివుఁడు నిచ్చితి నంచు విచ్చేసె నంత
నతని దేవు లిద్దఱును గర్భాభిరామ
మూర్తులయి రన్నరేంద్రుండు ముద్దుసేయ.

ఉ. ఆ సమయంబునంద మహితాత్ముఁడు మిత్రసహుండు నాఁగ ధా
త్రీసురుఁ డొక్కరుండు జగతీపతికిన్ సఖుఁడై సుతోదయో
ల్లాసము లేక శ్రీపతిఁ దలంచుచుఁ దప్పక పంచవర్షముల్
చేసిన పూజకున్ హరియుఁ జిత్తములోఁ బొఱసూపి విప్రుతోన్.

ఉ. మెచ్చితి వేఁడి కొమ్మనుడు మిత్రసహుండు కుమారుఁ గోరె నీ
కిచ్చితినంచు నచ్యుతుఁడు నేఁగె ధరాపురుఁ డాత్మకాంతకుం
జెచ్చెరఁ గోఁచు వేవిళులు చెప్పఁగఁ బల్లలు వచ్చు బోఁటితో
ముచ్చట మానె నల్ల చనుముక్కులు వెల్వెలఁ బాఱు చెక్కులున్.

క. ఈ పగిదిమున గర్భిణులగు
మూఫురలో రాజసతులు మునుమును సుతులన్
శైవాత్ములఁ గని రిద్దఱు
నా విప్రవధూటి వైష్ణవాత్మునిఁ గనియెన్.

ఉ. హరి. 4 ఆ. 7, 8, 9, 10.

తొలుత బ్రహ్మదత్తుని తపస్సు, పరమేశ్వర వరప్రసాదము, పుత్రద్వయోదయముల వర్ణించి, పిమ్మట మిత్రసహుని ప్రసంగమును జేయుట యుచితముగ నున్నది.

ఇటనొక విశేషము కలదు. అది జగన్నాథ శబ్దమునకు సంబంధించినది. ఆ శ్లోకమును వివరించి, తద్విషయము ననంతరము ప్రసంగింతును.

శ్లో. అథ రాజా జగన్నాథ మువా చేదం స్మయన్నివ
పుత్రౌ మమ భవేతాం హి తథేత్యుక్త్వా వృషధ్వజః॥

భ. ప. 104 – 9.

బ్రహ్మదత్తుఁ డీశ్వరభక్తుఁడు. స్వప్నమున శంకరుఁడు ప్రత్యక్షమయిన సందర్భమున నా దేవదేవుని "జగన్నాథ" అని సంబోధించినాఁడు బ్రహ్మదత్తుఁడు. సర్వసామాన్యముగ విష్ణునేగాని శివునిట్లు సంబోధించుట గానరాదు. జగన్నాథ శబ్దమును విశ్వనాథుఁడను నర్థమున శివునిగూర్చి ప్రయోగించుట విశేషము.

బ్రహ్మదత్త మిత్రసహులు క్రమముగా రుద్రాంశలఁ వైష్ణవాంశ, బుత్రులను బడసియున్నారు. మూలమునఁ బుత్రోదయ ఘట్టమున నీ క్రింది శ్లోకము కలదు.

శ్లో. పుత్రమేకం దదౌ తస్మై స్వాత్మనా సదృశం హరిః
తే భార్యే గర్భ మాధత్తాం తేజసా శంకరస్య హ॥
భ. ప. 104 _ 12

ఇందలి "గర్భమాధత్తాం" అను పదమును ప్రయోగించుటతో మూలమున పుత్రోదయ విషయము ముగిసినది. కాని యనువాదమున సోమనాథుఁడు ప్రబంధోచితముగ గర్భధారణాది వివిధ ప్రక్రియల నామూలాగ్రముగ వర్ణించినాఁడు. ఈ విషయము పయి నుదాహరింపఁ బడిన 3 ఆ _ 9 వ పద్యమునఁ గలదు. ఈ విపులీకరణ మంతయు సోముని స్వకపోల కల్పనమే. ఇక నా బాలుర జాతకర్మాదికముల విషయ మిూ క్రింది శ్లోకములలో గలదు.

శ్లో. అనూమేతాం మహీపాల క్రమేణైవ నృపస్య హ
స తయోశ్చ మహారాజ నామ కర్మాదికాః క్రియాః ॥
చకార విధివత్సర్వా విప్రేభ్యోఽదాన్మహద్ధనమ్
స చ విప్రో వినీతాత్మా పుత్రమేకం హి లబ్ధవాన్ ॥
సాక్షాదివ జగన్నాథం స్థితం పుత్రాత్మనా నృప
జాతకర్మాదికం సర్వం బ్రాహ్మణః స చకార హ ॥
భ. ప. 104 : 14 _ 16

రాజోచిత మర్యాదలతో బ్రహ్మదత్తుఁడు పుత్రోదయ సందర్భమున భూరి దక్షిణాదుల నొసంగినదియు, మిత్రసహుఁడు తన కులాచారము ననుసరించి జాతకర్మాదుల నిర్వర్తించినదియు ననావశ్యకములగు విషయములని యాంధ్రీకరణమునఁ బరిహరింపఁ బడినవి.

హంసడిభకులు విద్యాభ్యాసాదులను బూర్తిచేసి, గౌరీపతిఁగూర్చి ఘోరతప మాచరింప హిమవత్పర్వత పార్శ్వములకుఁ జనిరి. మూల

మున నీ సందర్భమునఁ గల యైదుశ్లోకములలో (105 అధ్యా. 3 - 7) గల శివస్తుతిని, వార లా తపశ్చర్యకుఁ గడంగిన హేతువులను సోముఁడు విడిచినాఁడు. వీర లాశించు కోరికలను శివుఁడు వరమొసంగువేళ నుద్ఘాటింపఁబడినవేగాన నిట మాని యుండును.

హంస డిభకులకు శివ సాక్షాత్కార మయినపట్టుల నీ క్రింది శ్లోకములు గలవు.

తతః ప్రీతో ఉభవ చ్ఛర్వస్తాభ్యాం సంయమనేన చ
స దదౌ దర్శనం నైజం వ్యాఘ్రచర్మాంబరో హరః
త్రియక్షః శంకరః శర్వః శూలపాణి రుమాపతిః
అగ్రతః సంస్థితం శర్వం చంద్రార్ధకృత శేఖరమ్
తౌ దృష్ట్వా ప్రీతమనసౌ నమశ్చక్రతురంజసా

శ్రీ భగవానువాచ -

వరం వరయ భద్రం వాం యథేచ్ఛా వాం తథాస్తు వై
తావూచతు స్తదా రాజన్నృతి స్త్వం భగవన్ యది
దేవాసురచమూముఖ్యై ర్యక్ష గంధర్వ దానవైః
ఆవామజయ్యౌ సర్వాత్మన్నేష నౌ ప్రథమో వరః
ద్వితీయో నౌ విరూపాక్ష రౌద్రాస్త్రాణాం చ సంగ్రహః
మాహేశ్వరం తథా రౌద్రమస్త్రం బ్రహ్మశిరో మహత్
అభేద్యం కవచం దివ్యమచ్ఛేద్యం చాపి కార్ముకం
పరశుం చ తథా శర్వ సదా రక్షార్థమేవ చ
సహాయౌ ద్వౌ మహాదేవ భూతౌ యుద్ధే హి గచ్ఛతామ్.
ఏవమస్త్వితి దేవేశ ఆహ భృంగిరిటీ హరః
కుండోదరం విరూపాక్షం సర్వప్రాణి హితే రతమ్
యువామథ చ భూతేశౌ సహాయౌ సతతం రణే

సంగ్రామం గచ్ఛతాం ఘ ం మీతయో ర్బలశాలినోః
ఇత్యుక్త్వా భగవాం ఛర్వ స్తత్రై వాన్తర ధీయత.

భ. ప. 105 అధ్యా. 9 – 17.

పయి శ్లోకములలో శివుఁడు ప్రత్యక్షమగుటాదిగాఁగల విషయముల ననువదించు పట్టుల నీ క్రింది రెండుపద్యములు కలవు.

క. సన్నిధిఁ బన్నగహారుఁడు
పెన్నిధిఁ గని పొంగుచున్న పేదలక్రియ ల
య్యన్నాదమ్ములఁ గని మీ
కెన్నఁగ నేవరము లిచ్చ యిచ్చెర వానిన్.

సీ. అనుడు వారిరువురు నైకమత్యముతోడ
నమరాసురాది సైన్యాధిపతుల
కోడకుండంగ మాకొక వర మీశాన
రౌద్ర మహేశ్వర బ్రహ్మశిరము
లను నస్త్రములు నభేద్యకవచములు దివ్య
చాపములును బరశ్వధవిశేష
ములుఁ గయ్యముల కేము పోవుచోఁ గావుగాఁ
బ్రమథద్వయంబు మత్పార్శ్వములను

తే. వచ్చుటయు నీగి రెండవవరము నాఁగ
హరుఁడు వారికి నడిగినయట్లు యిచ్చి
భృంగిరిటిని గుండోదరుఁ బిలిచి వీరి
సమరములఁ గావుఁడని పంచి చనియె నంత.

ఉ. హరి. 4 ఆ – 15, 16.

ఈ ఘట్టమునకు సహజత్వ మబ్బుటకుగాను, నాచనసోముఁడు మూఁడుమునకు వన్నె బెట్టినాఁడు. హంస డిభకులు శివసాక్షాత్కారము

నకు బొందిన యానందమును జెప్పుటలో "పెన్నిధిఁగని పొంగుచున్న పేదలక్రియ" అను జాతీయమును కూర్చుట యొకటి. హంస డిభకుల వరములను జేర్చి కూర్చి చెప్పుటలో మూలముకంటె మే_ల్తరమని చెప్పనగును.

"శౌద్రాస్త్రాణాం చ సంగ్రహః" అను దానిని గ్రహింపకుండుటే యుచితము. ఇట "సంగ్రహః" అనఁగా సంచయమని యర్థము. వరము లన్నియుఁ బేర్కొ_నఁబడవలసినవే గాని, నామూహికముగా నడుగను, నీయను వలనుపడదు. మూలమున నీ యధ్యాయముననే మైదాఱుశ్లోక ములలో నీశానవరముల కలిమిని సంప్రాప్తమయిన తేజముచే భాసించు హంస డిభకుల వర్ణనము పునరుక్తియగుట పరిహరింపఁ బడినది. కాని వారల భక్త్యభినివేశాదులను మాత్రము సంగ్రహముగా నీ క్రింది పద్యమునందుఁ జెప్పినాఁడు.

క. కవచ ధనురస్త్ర నికరము
సవిరళ రుద్రాక్షమాలికా భరణములున్
ధవళవిభూతియు హర హర
శివ శివ శబ్దములు గలిగి చెలువయి యున్నన్. ఉ. హరి. 4-18

జనార్దనుని విషయము భ. ప. 105 వ అధ్యాయములో మొదట మూఁడుశ్లోకములలోఁ దడవి యుండలేదు. అనంతరము రెండుశ్లోకము లలో నాతని విద్యాపారంగత్వము, విష్ణోపాసనలు వర్ణింపఁబడినవి. అను వాదమున హంసడిభకులు తపంబున కుపక్రమించిరనునపుడు జనార్దనుని విషయమునుగూడ ప్రస్తావించి "విద్యావివేకనిధి మురారి నారాధించె నిజగృహమున" (3 ఆ-13) అని చెప్పఁబడినది. ఈతని విషయమునఁ దపముచేయుట గాని, వరములఁ బడయుటగాని లేకుంట, నా విషయ మును ప్రత్యేకించి, చెప్పు టనావశ్యకమని సంగ్రహించినాఁడు, సోమన.

రాకుమారులగు హంస డిభకులు వేటకుఁ బయనమగు ఘట్టమున సోమనాథుని యాంధ్రీకరణము మూలము నతిక్రమించి నడచినది. వేట సన్నాహ మీ క్రిందివిధముగ నొకశ్లోకమునఁ జెప్పఁబడినది.

శ్లో, తతః కదాచితౌ వీరౌ మృగయామటతుః కిల
జనార్దనేన సహితౌ రథై రశ్వై ర్గజై రపి ॥ భ. ప. 106_1.

అనువాదమున నీ విషయము వివరముగాఁ జెప్పఁబడినది. మూలము ననుసరించుటయు జరిగినది. ఇట రెండు పద్యములలో వేట సంరంభము నతినేర్పున విపులీకరించినాఁడు సోమన. ఆ పద్యము లివి:

క. కరి తురగ రథ పదాతులు
పరివేష్టింపంగఁ గొలువుఁ ప్రజ ముందఱిగా
సరస జనార్దనుఁడుం జన
నరిగిరి వేటాడ ధరణి యల్లల నాడన్.

క. వెలివాఱును గాలరులును
వలలుఁ దెరలు దీమములును వడిఁదీరిన కు
క్కలు నారెగోలలును మం
డల క్రోవులు వేటకారడంబుఁ బెనుపఁగన్.

ఉ. హరి. 4 ఆ.21, 22.

హంసడిభకులు వారి వెంటఁ గొనిపోయిన వేట పరికరములను, దమవైభవము మెఱయఁ బరివారికాగణ మనుసరించిన విషయమును వర్ణించుట ప్రకరణోచితమే యగును.

మూలమున నా రాకుమారుల వేటవర్ణన మేఁడు శ్లోకములలో సంగ్రహముగాఁ గలదు. వా, నిట నుదాహరించుచున్నాను.

శ్లో. వనం గత్వా తు తౌ వీరౌ సింహవ్యాఘ్రాంశ్చ జఘ్నతుః
శితై ర్బాణై ర్మహారాజ వరాహానథ సర్వశః ॥
వ్యాలానన్యాన్మృగాన్ హింస్రాంశ్చ పక్షిభిశ్చ సహితౌ నృప
ఏష ఆయాతి విపులో వరాహో దీర్ఘలోచనః ॥
ఏనం బాణేన సంభింధి యాతి చాయం మృగాధిపః
అయమన్యోఽథ మహిషః శృంగ ప్రోత సరీసృపః॥
ఏతే ఖలు మృగాః సార్ధం శ్వావై ర్బాధంతి సర్వశః
ఏ తద్భ్రమతి సర్వత్ర భీతం శశకులం మహత్ ॥
శావం స్తనం పిబత్సాధు న హంతవ్యమిదం శుభమ్
గ్రహీతవ్య మిదం సర్వం నిరుధ్య శ్వగణౌరిహ ॥
ఇత్యాది శబ్దః సుమహాన్మృగయాం కుర్వతాం నృప
క్షత్రియాణాం నృపశ్రేష్ఠ వ్యాధానాం చైవ ధావతామ్ ॥
హత్వా మృగాన్ సుబహుశో వ్యాఘ్రాన్ సింహాన్నృపోత్తమా
శ్రమం చ జగ్మతుర్వీరౌ మధ్యం యాతే దివాకరే ॥

భ. ప. 106 : 2 – 8

అనువాదమున సింహవ్యాఘ్రాది మృగసంతతిని వేఁటాడు టాదిగాఁగల వివరమును, వేఁటగాఁరుల మాటలును విడువఁబడినవి. మహారాజులు సర్వసామాన్యముగ వేఁటాడుటలోఁ గానవగు విషయములను వర్ణించుటకు మారుగ, సోమన మూలమున లేని వరాహకులము వేఁటాడుటను సంఘటింపఁ జేసినాఁడు. ఈ మృగయావిలాసమును సోమన మైదు పద్యములలోను, నొక దీర్ఘమగు వచనమునందును వర్ణించినాఁడు. ఈ ఘట్టమున హంసడిభకులకు వనమునందుఁ గానవగు వరాహకులము నీ క్రిందివిధముగాఁ జూపినాఁడు.

సీ. ప్రబల దంష్ట్రాగ్ర పర్యస్త ముస్తాస్తంబ
జంబాల శబల వేశంత పంక్తి
ఘనఘనా ఘనసీల ఘనపవన ప్రతిఘాత
ఘన ఘుర్ఘురావ భగ్న గ్రామంబు
ఘురఘురారవఘోర ఘోణాగ్ర ప్రఘాణ వి
ద్రాణచ్ఛ దాచ్ఛన్న తాంతలతము
ఖననఘుళాత్కారి ఖార ఖురోత్తాపితత్రి
హల్య ధాత్రీ ధ్వస్త యవసరాజి

తే. ఖేట భట ఘోషణోద్భటాఖేటకకుల
కటిల కటుకటాక్షేపణ క్షోభ బధిర
మతిరభస భాసమాన మానాభిమాన
రౌమ విక్రియాకులము వరాహకులము.

గీ. నల్ల సేనపు గుండులు నడచినట్లు
మంపుగొని మే మెఱుంగక మలసి మలసి
నెనరు వారికి నుఱుకంగ నొక్క మన్నుఁ
బోతు లెడచొచ్చె దాఁకొను పొదలువోలె.

ఉ. హరి. 4 ఆ – 24, 26

ఆ మన్నుఁబోతులను వీరు వేఁటాడుటయు, నా వరాహములు ెల్లాచెదరగుటయును నీ క్రింది వచనమున నతి రమ్యముగా వర్ణింపఁ డినది.

. ఇవ్విధంబున నెగసినయిట్టి నాలుగుకాళ్ళనుం ద్రెవ్వ నొక్కమ్మన నేసి చనునెడ మఱియు నప్పటప్పటికిం జొప్పరులవలన నుప్పతిల్లిన చప్పుళ్ళకుఁ దెప్పరం బైనతెప్పలం దూఱుదుప్పులును (నిడువేఁట

కార్లు) (పేఁటకుం) గడంగిన నడికి నడికి కడవారికి వెడగాక తొడిగిన యమ్ములనవడి పొరలుపిసుల విడువక చిడిముడి పడుకడఁతులును నీఁటెలకుఁ బో టబ్బక నూటిమెయి దాఁటియు నేట్లచే విటతాటం బైనలేటి కదుపులును బిఱుఁద రొప్ప నొాటిగాఱకుఁగాక వెఱచఱచి పఱచునెడఁ దెరపి నులికిన తొలుద్రొక్కునం గుక్కలచేఁ బటిపటి యైన యఱములును గొండఱు గొండఱు ముందటం గొందలం బంది యందంద సందడిం గ్రిందు మీఁదుగా వైచినం జిందఱ వందఱ లుగా బ్రామఁదిన కుందేళ్లను నేదెసఁ దొలంగినను నూదిపిఱింది త్రాడై యాదిగొని పాదులవారిచే యాదులకాదులచే మూదలించిన సీదరం బులతోఁ బాదుకొనిన యేదులును నివ్వలవ్వలనుండి యెడద్రెవ్వ కుండఁ ద్రవ్విన యోదంబులంబడి క్రొవ్వఱక మవ్వంబు నివ్వటిల్లం బట్టువడిన చివ్వంగులునుం గలిగినం గనుంగొనుచు వెండియుఁ గ్రీఁగాలి నోలిం జాలుకొలిపిన కాలువలకుం బాలువడి లోలోపలం గళవళించియు దోడ్తోడ జోడెంపువలలకు లేటివేడెంబు చేసినం గూడఁబడియును మున్ను పన్నిన కన్నెవలల సన్నసన్నం బోవక యున్నునం గన్ను దిరిగిపడి సన్నసున్నంబుగా దన్నికొనియును నడ్డ గించి నించిన యొడ్డువలలకు నడ్డించి వెడ్డునంబడక గడ్డఱికియు మృగంబు లనేకంబులు వొలియుటయు ను వేఁటచాలించి హంసడిభ కులు నడవులందిరిగి పరిశ్రాంతులై సేనాసమేతంబుగా మగుడం దలంచి మధ్యాహ్న సమయంబున.

ఉ. హరి. 4 ఆ - 29

ఈ విధమున వేఁటయం దలసిన హంసడిభకు లొక తటాకము నొద్దకు చేరిరి. ఈ విషయము ననువదించుటలో "అడవులం దిరిగి పరి శ్రాంతులై" అని కవివాక్యముగా మార్చఁబడినది. వార లిట విశ్రాంతి గైకొనిన సందర్భమునం దీక్రింది శ్లోకములు గలవు.

శ్లో. అలం హి మృగయాస్మాకం శ్రమః సముపజాయతే
ఇత్యూచతుర్మహారాజం పుష్కరం జగ్మతుః సరః ॥
సరస్సమీప మాగమ్య మునిసిద్ధ నిషేవితమ్
వీజన్మారుత సానూప శ్రమా త్తత్ర సుఖా స్థితౌ॥
తతో జనాః సరః సర్వే విగాహ్యాశ్రమ కర్షితాః
బిసాన్ ప్రవాళాన్ పద్మానాం భక్షయామాసు రార్తవత్॥
భ. ప. 106 అధ్యా. 9, 10, 11.

పయి శ్లోకములలో పుష్కర మను నొక్క పదమును గ్రహించి, సోమన యొక సుదీర్ఘ మగు సమాసమునఁ దటాకవర్ణనమును గావించినాఁడు. ఇం దీతటాకముయొక్క సొబగును, గాంభీర్యమును, చిత్తరువు పగిది సువ్యక్త మగుచున్నవి. మఱియు నితరవిషయములను సంగ్రహించి, యీ క్రింది పద్యమున, హంసడిభకు లాసరోవర స్వచ్ఛజలములఁ ద్రావి విశ్రమించిరని యనువదింపఁబడినది.

క. కని యా పద్మాకరమునఁ
దను వారెడు నీరు ద్రావి తమసేనలుఁ దా
రును విశ్రమించి రాసే
చనకములగు తరుల నీడ సైకతములపై.
ఉ. హరి. 4 ఆ - 31

ఆ ప్రదేశమున కనతిదూరమున మున్యాశ్రమ మున్నటు లచటికి వినవచ్చిన మాధ్యందిన సవనధ్వనులవలనఁ బసిగట్టి, హంసడిభకులు జనార్దనసమేతంబుగా నేఁగి, కాశ్యప మున్యాశ్రమంబును జేరిరి. అట వారలకుఁ జేయఁబడిన యతిథిసత్కారాదుల వర్ణనము పురాణపక్కి నుండి సోమన విడిచినాఁడు. ఆ మునీశ్వరులతో సంభాషించు పట్టుల నీ క్రింది శ్లోకము గలదు.

తతో హంసో భాషతే తాన్మునీ న్సంయుతవాక్ నృప
పితా హి నో మునిశ్రేష్ఠా యష్టుమైచ్ఛత్స సాధనమ్॥
భ. ప. 107 – 4.

ఇందు హంసునకు "సంయుతవాక్" అనునొక విశేషణము వాడబడినది. కశ్యపమహామునితో సంభాషించునప్పటి హంసుని శీలమును బరిశీలించుచో, దరువాతి ఘట్టమున వీరు దుర్వాసునితో నాడినపల్కులును, నచటి ప్రవర్తనమును వింతగ దోఁచును. ఈ విషయము నట ప్రస్తావింతును.

ఈ క్రింది శ్లోకము నందలి విషయమునకు సోమన యనువాదమున మెఱుగు వెట్టఁబడినది.

యది స్యాత్తత్ర గచ్ఛామో వయం శిష్యై ర్నృపోత్తమ
ఆస్మహే వాన్యథా రాజన్ నిత్యాచమః ఖిలః తాపసాః.
భ. ప. 107 – 10.

అనువాదము :

క. అనుటయు వారందఱు హం
సునితో నిట్లనిరి రాజసూయమునకు మీ
జనకుఁడు దొడఁగినఁ జాలును
మునుముట్టన వత్తు మిందు మోసము గలదే.
ఉ. హరి. 4 ఆ. 40.

మూలమున మీజనకుఁడు యజ్ఞము చేసినచో వత్తుమనియుండగా ననువాదమున "రాజసూయమునకు మీ జనకుఁడు దొడఁగినఁ జాలు" అనుటలో గొంత నేర్పు కాననగును. ఈ రీతిని మృదువుగఁ బల్కుటచే హంసాదులట మాఱుమాటాడక వెడలుట కవకాశమును గల్గుచున్నది. దుర్వాసుని ఆశ్రమమును వర్ణించుట మొదలైనవి మూలమున సుదీర్ఘముగఁ జేర్పఁబడినవి.

ఆ వివరముల నిట పొందుపఱుచుచున్నాడను.

శ్లో. యతయో నియతా భూత్వా మంత్రబ్రహ్మ నిషేవిణః
బ్రహ్మసూత్రపదే సక్తా స్తదర్థాలోక తత్పరాః
నిర్మమా నిరహంకారాః కౌపీనాచ్ఛాదన వ్రతాః
తమాత్మానం జగద్యోనిం విష్ణుం విశ్వేశ్వరం విభుమ్
బ్రహ్మరూపం శుభం శాంతమక్షరం సర్వతోముఖమ్
వేదాంతమూర్తి మవ్యక్త మనంతం శాశ్వతం శివం
నిత్యయుక్తం విరూపాక్షం భూతాధార మనామయమ్
ధ్యాయంతః సర్వదా దేవం మనసా సర్వతోముఖమ్
దుర్వాససా సదోపాస్యం వేదాంతైకరసం గురుమ్
తర్కనిశ్చిత తత్త్వార్థా జ్ఞాననిర్మల చేతసః
హంసాః పరమహంసాశ్చ శిష్యా దుర్వాససః ప్రభో
గత్వా తత్ర మహాత్మానౌ తౌ దృష్ట్వా తూర్ధ్వరేతసమ్
దుర్వాససం మహాబుద్ధిం విదిన్వానం పరం పదమ్
క్రుద్ధో యది స దుర్వాసా దగ్ధుం లోకానిమాన్ క్షమః
దేవా అపి చ యం ద్రష్టుం క్రుద్ధం వై న క్షమాః సదా
రోషమూర్తిః సదా యస్తు రుద్రాత్మా విశ్వరూపధృక్.
భ. ప. 107 అధ్యా. 12 – 19.

ఇందు వర్ణింపఁబడిన దుర్వాసునాశ్రమమును, నందలి వారల వైష్ణవమయమగు వేషధారణములను వర్ణించుటను సోమన విడిచెను. పరమపద చింతనుఁడనియు, లోకములదహించు తీరునఁ గానఁబడెడు వాఁడని దుర్వాసునిగూర్చిన వర్ణనమును సోమన పరిహరించినాఁడు. ఈ విషయముల ననువదించుటలో సోమనాథుని పోకడ వేఱుగానున్నది. మహాతపశ్శాలియగు దుర్వాసుని చిత్రించుటలో నీ భయంకరాకృతి నే విధమగు వివరణములను దడవలేదు.

జనార్దనసహితముగ నా హంసడిభకులు దుర్వాసు నాశ్రమము నకుఁ జనుటయు, నట నాతని గాంచుటయు నీ క్రిందివిధముగఁ యను వదింపఁ బడినది.

మ. అనినం దమ్మునితో జనార్దనునితో హంసుండు సంతోష మొం
 ది నిజేచ్ఛం జనుచోటఁ బుష్కర సరస్తీర్థోత్త రారణ్య పా
 వన భూమిం బరమోపదేశమున దుర్వాసో మునీంద్రుండు శి
 ష్యనికాయంబుఁ బ్రబోధవీథిఁ జనజేయన్ సాయమై తోఁచినన్.

ఉ. హరి. 4 ఆ _ 41.

ఇందు దుర్వాసు నాశ్రమము పరమపావన మైనదనియు, శిష్య వర్గము నుద్ధరించుటకయి మానవరూపమును దాల్చిన పరమోపదేశ మని కాననగును.

ఇట్లే తరువాతి శ్లోకమునందలి కౌండోకపదమును గూడను బరి హరించుట గమనింపఁదగినది. సోమన యిట నా దుర్వాసుని స్వరూప వర్ణనము నమూలకముగఁ జేసినాఁడు. ఆ శ్లోకమును, సోముని యను వాదమును నీ దిగువ పొందుపఱుచుచున్నాఁడను.

శ్లో. రక్త కౌపీన వసనో హంసః పరమ యేవ చ
 దృష్ట్వైనం చ తయోరేవం బుద్ధి రాసీన్మహామతే.

భ. ప. 107. _ 20.

ఆ. కావిచీర ముసుఁగు కచ్చడంబును జూచి
 బోడతలయు నిడుద బొట్టుఁజూచి
 గోఁచితోడి వెదురుఁ గోలయుఁ జిక్కంబుఁ
 గట్టియున్న బుఱ్ఱకాయఁ జూచి. ఉ. హరి. 4 ఆ – 42

పై శ్లోకమునందలి రక్తకౌపీన మనుదాని ననువదింపలేదు. జాతీ యతఁ యుట్టిపడునట్లు "కావిచీర" అనుపదమును జొప్పించుటయగాక, నిందలి విశేషణములన్నియు నమూలకములే.

సమాధియందు నిశ్చల ధ్యానుండయియున్న దుర్వాసోమహా ముని ముంగల హంసడిభకులు తమలోదాము గృహస్థాశ్రమ ధర్మములఁ గూర్చి చర్చించుకొనిరి. ఆ విషయము మూలమున నెనిమిది శ్లోకము లలో గలదు. అవి :

శ్లో. కో నామాఽసౌ మహాభాగః కాపాయీ వర్ణవిత్తమః
కశ్చాయ మాశ్రమో నామ విహాయచ గృహాశ్రమమ్॥
గృహస్థ ఏవ ధర్మాత్మా గృహస్థో ధర్మవిత్తమః
గృహస్థో ధర్మరూపస్తు గృహస్థో వర్గ ఏవ చ॥
గృహస్థశ్చ సదా మాతా ప్రాణినాం జీవనం సదా
తం వినాఽన్యేన రూపేణ వర్తతే యోఽతి మూర్ఖవత్ ॥
ఉన్మత్తోఽయం విరూపోయమథవా మూర్ఖ ఏవ చ
ధ్యాయన్నివ సదా చాయమాస్తే వంచయితాఽపివా॥
కిమేతే ప్రాకృత జ్ఞానా ధ్యాయంత ఇతి కించన
వయమేతాన్ దురారోహా నాశ్రమాంతరకల్పకాన్ ॥
స్థాపయిష్యామహే సర్వాన్ మందబుద్ధీ నిమాన్గృహే
బలాదేవ ద్విజానేతాన్ మూఢవిజ్ఞాన తత్పరాన్ ॥
అసద్గ్రాహా గృహీతాంశ్చ బాలిశాన్ దుర్మతీనిమాన్
ఏషాం శాస్తా చ కోమూఢో న విప్రో వయమత్ర హ ॥
ధర్మ్యేవ వర్త్మని సంస్థాప్య పునర్యాస్యావ నిర్వృతౌ.

భ. ప. 107 : 21 – 28

వీనిలో హంసడిభకులకు గృహస్థాశ్రమ ధర్మములందుఁ గల యభినివేశమును వ్యక్తపఱుచుకొనిరి. అంతియగాక నీ యాశ్రమవాసుల నీ యాపదనుండి రక్షింప నిశ్చయించుటయు విదితమగుచున్నది. హంస డిభకులు, దుర్వాసోమహాముని మున్నెన్నఁ డెఱుఁగరని మొదటి శ్లోకమువలనఁ దెలియుచున్నది. సోమనాథుఁడు పయి శ్లోకములలోఁగల

సన్న్యాసినింద, గృహస్థ ధర్మాదులలోని భావమును గ్రహించి, యీక్రింది మూఁడుపద్యములను స్వతంత్రముగ రచించినాఁడు.

చ. తిరిసిన కూడు దెచ్చి నలుదిక్కుల బోడలు తిండిపెట్టఁగాఁ
బెరిగిన పొట్టతోడ నొక పీటపయిం దొరవోలె నెవ్వరిన్
సరకుగొనండు పట్టుకొని చాఁ గఱగొన్న బలే యెఱుంగుఁ డ
క్కరి బలుమోపు మోచు నయగారితనంబది యుట్టిగట్టినన్.

తే. బాంధవులఁ బాసి తమయిల్లుపట్టు విడిచి
తల్లిదండ్రులు వగవఁ గైతవముతోడ
బోడతలలుగాఁ బడసిరి పోడువలెల్ల
వీనిమాటలచేఁ గదా వెఱ్ఱులైరి.

చ. ఎఱుఁగరుగాక లోకమున నెవ్వరికైనను మేలుసేయఁగా
నొఱపగు నాశ్రమంబున సమున్నతమైన గృహస్థ ధర్మముం
బఱగడవైచి గోఁచిగొని పాఱెడు వొల్లకు ముక్తిగల్గునే
పఱిగల నేఱినం గొలుచు పాఁతటికిం గలదే తలంపఁగన్.

ఉ. హరి. 4 ఆ - 46, 47, 48.

పయి పద్యములలో స్వతంత్రమగు ననువాదమును, మూలభిన్నమగు రచనమును గానగును.

హంసడిభకులు, దుర్వాసుని నిందించుటతో నాఁగక, జీవితేచ్ఛ గలదేని గృహస్థధర్మమును స్వీకరింపు మనినారు. జనార్దనుఁడు వారిసంభాషణముల కడ్డువడు నవసరమున, మూలమున "మందతేజసౌ" అను ప్రయోగము "తేజస్కరములగునె మూన్యావస్కందశ్రుతికఠోర వచనము" లని నేర్పుగా ననువదించినాఁడు.

జనార్దనుని శీలమును నిరూపించుటలో సోమన మూలమునకుఁ గొంతమెఱుఁగు వెట్టినాఁడనవచ్చును. జనార్దనునిక్రిందిపలుకుల జూచునది,

అశ్రావ్య మీదృశం ఘోరం మయా ప్రాణభృతా నృప
కిం కరిష్యామి మందాత్మన్ మిత్రత్వాద్ భవతో నృప॥
భ. ప. 108 అధ్యా. 16.

తేటతెల్లమగు తీయని పలుకుల హంసడిభకుల దుష్టత్వమును, జనార్దనుని శీలమును వెలిబుచ్చురీతి నాశ్లోకమునకీ క్రిందిపద్యముకలదు.

గీ. చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము
దానఁ గీడెంతవుట్టినఁ దగిలె నాకు
ననుభవింపక పోవునే యక్కటకట !
వరుగుతో డాఁగరయు నెండవలసినట్లు. ఉ. హరి. 4 ఆ-54

ఇందలి "వరుగుతో డాఁగరయు నెండవలసినట్లు" అను జాతీయమును గూర్చుటలో మూలవిషయమునకు స్పష్టతయు, వన్నెయు ననువాదమునఁ బెరిగినవి.

ఇట్లే దుర్వాసోమహాముని ప్రత్యుత్తరము ననువదించుటలోనను సోమన తన రచనా నైపుణ్యమును జూపినాఁడు. ఈ క్రింది దుర్వాసుని పలుకులకు సోముని యనువాద పాటవమును గమనించిన నావిషయము వ్యక్తమగును. మూలము :

తతః క్రుద్ధోఽథ దుర్వాసా దహన్నివ తయోరసూన్
ఏకేనాక్ష్ణాథ దుర్వాసా రౌద్రేణాగ్నియుజా సదా॥
పశ్యంస్తౌ చ దురాత్మానౌ రోషవ్యాకులితేంద్రియః
కుర్వన్నివ తదా లోకాన్ భస్మభూతానిమాన్ నృప॥
బ్రాహ్మణం చక్షుషాపశ్యన్ సౌమ్యేనాన్యేన కేవలమ్
ఉవాచ వచనం రాజన్ ధ్వంసత ధ్వంసతే తరాన్॥
భ. ప. 109 అధ్యా : 1 - 3

అనువాదము :

క. కరుణయుఁ గోపముఁ గనుఁగవ
నొరయఁగ నొకచంటఁ బాలు నొక చంటను నె
త్తురుఁ గురియు గతి జనార్దను
ధరణీశసుతద్వయంబుఁ దప్పక చూచెన్.

ఉ. హరి. 4 ఆ 59.

మూల శ్లోకములందలి "రౌద్రేణ, సౌమ్యేన" అనుపదములకు రౌద్ర, సౌమ్య దృష్టులను "కరుణయుఁ గోపము" గా ననువదించుట సమంజసముగా నున్నది. రాజులనందఱను దహింపఁగల సమర్థుఁడ ననియుఁ దనకోపము నణచుకొనుచున్నాననియు దుర్వాసుఁ డనినట్లు మూలమునఁ గలదు. సోమన దుర్వాసుని మాహాత్మ్యమును, గోపానల జ్వాలాధిక్యముల నీ విధముగ వర్ణించినాఁడు.

గీ. చూచి యిట్లను భూపాల సుతులఁతోడ
నన్నుఁ గనలించి బ్రదుకఁ గన్నారు లేరు
పొలిసితిరి పొలిసితిరి వే పొందు తొలఁగి
మిమ్ము దరికొను కోపంబు మ్రింగికొంటి. ఉ. హరి. 4 ఆ._60

దుర్వాసుని పలుకులలో క్రింది శ్లోకమును (భ. ప. 109_13) సోమన విడిచెను.

లోకేతస్మిన్ యదుశ్రేష్ఠే రక్షత్యేవం జగత్పతౌ
యువయోః సర్వథా జీవః సజ్జీవ ఇతి మే మతిః ॥

తన్నంతగా నవమానించిన హంసడిభకులను శపింపక విడచుట దుర్వాసుని ప్రకృతికి సహజలక్షణముకాదు. మఱియు నాదుర్వాసుఁడు శ్రీకృష్ణునిచేఁ జంపఁబడుట శుభమని యా మునీశ్వరుఁడు పలుకుటలో నౌచిత్యము లేదని పరిహరించియుండను సోమన. ఇందీతని యుచితజ్ఞతయుఁ గన్పట్టును.

"ఇత్యుక్త్వా గచ్ఛగచ్ఛేతి హంసం ప్రాహ పునః పునః" (భ. ప. 109 అ - 17) అను శ్లోక యుత్తరార్ధమునఁ గల "గచ్ఛగచ్ఛేతి" యను దానిని "పో పొమ్మని" అనువదించుటలో దెనుఁగుతన ముట్టిపడు చుండుట స్పష్టము.

హంసడిభకుల ననుసరించి వెడలిపోవుచు జనార్దనుఁడు పలికిన పలుకుల ననువదించుటలో సోముని యాంధ్రీకరణ వైశిష్ట్యము వ్యక్తమగుచున్నది. "నష్టావిమావితి తదా స మేనే దుఃఖితః పరం" (భ.ప.110 అధ్యా. శ్లో. 4) అను దాని ననువదించుపట్టుల నీ క్రింది పద్యమును రచించినాఁడు సోమన -

క. వారి వెనుక నంతంతం
జేరి జనార్దనుఁడు పోయెఁ జెడి రకటకటా !
వీ రనుచు విధి వినోదము
వారింపఁగ మనుజకోటి వశమే యనుచున్. ఉ. హరి. 4 ఆ-72.

హంసుఁడు గావించిన దుష్కృతమును విధికృతమని జనార్దనుఁడు తలపోసినాఁడు. ఇది రాబోవు కథను సూచించుచే యనవచ్చును.

హంస డిభకులు దుర్వాసునాశ్రమమును విడిచిన యనంతరము యతిప్రవరులు వెంటరా నచ్యుతుని జూడ బయలువెడలినాఁ డా యతీశ్వరుఁడు. ఈ సందర్భమున నీ క్రిందిశ్లోకములు మూలమున గలవు.

పలాయన పరాన్ సర్వానిదం ప్రాహ యతీశ్వరాన్
ఇతో దేశాద్వినిర్గత్య పుష్కరాత్పుణ్యసంయుతాత్ ॥
మందం మందం సమాశ్వస్య విశ్రమ్య చ తతస్తతః
ప్రవిశ్య ద్వారకాం దేవం శంఖ చక్ర గదాధరమ్ ॥
దృష్ట్వా చ తస్మై ప్రభవే వక్ష్యామో యతిసత్తమాః
స హి రక్షజ్జగదిదం ధర్మవర్త్మని సంస్థితః ॥

ఆద్యో లోకగురు ర్విష్ణుర్యతాత్మా తత్త్వవిత్ప్రియః
ఉద్ధృత్య కంటకా న్సర్వాంఛశాస పృథివీమిమామ్ ॥
స చ పాపాన్ మహాఘోరాన్ సర్వాన్ పాపకృతాన్ ప్రభుః
రక్షేన్నః సకలాన్ సర్వాన్ జ్ఞానేషు నియతాత్మనః ॥
ఇదమద్య క్షమం విప్ర యానామద్య విధీయతామ్
సాహసం యత్కృతం తాభ్యాం పాత్రభేదాది సత్తమాః ॥

భ. ప. 110 అధ్యా. : 5 - 10.

పయి శ్లోకములలో దుర్వాసాదులు పుష్కరప్రదేశమును విడుచుట, త్రోవనటనట విశ్రమించి ద్వారకాపురము ప్రవేశించుట, శ్రీకృష్ణ ప్రశంస, యాతని లోకరక్షకత్వములకు సంబంధించిన పివరము లనావశ్యకములని సోమన పరిహరించినాఁడు. ఈ విషయజాల మంతటిని యీ పద్యమున నిమిడ్చినాఁడు.

శా. దుర్వారోద్గమ రోమపోషణము లై ధూర్తప్రలాపంబు లం
తర్విద్యామహిమం గలంప యతు లంతం జేర నేతేర నీ
నిర్వేదం బుడిగింప నచ్యుతుఁడ పో నిర్వాహకుం డంచు నా
దుర్వాసోమునిపుంగవుండు గదలెన్ దుఃఖాకులస్వాంతుఁడై.

క. మండఁగ మండఁగ నార్చిన
ఖండితబిదలములుఁ ద్రుటితకౌపీనములున్
దండముల తుండములును గ
మండలుశకలములుఁ జూచి మఱకువ దోఁపన్.

ఉ. హరి. 4 - 74, 75

పయి నుదాహరించిన వానిలో మొదటి పద్యమునందలి "అచ్యుతుఁడ పో నిర్వాహకుఁడు" అను వాక్యమున మీఁదిశ్లోకము లందలి భావమును సంగ్రహించి యున్నాఁడు. ఖండితపరికరముల వర్ణించుటలో

వ్యర్థపదప్రయోగరాహిత్యమును నిరూపించుచేయు నూహతో వాని నన్నిటి నొకే కంఠముగ నిమిడ్చినట్లు గన్పట్టును.

దుర్వాసముని ననుసరించిన యతిసత్తముల సంఖ్యను గ్రహించుటలోఁ గొంత మూలభిన్నత్వము గలదు. ఆశ్లోక మిది.

"పంచ చైవ సహస్రాణి పురస్కృత్య మహామునిమ్
దుర్వాససం తపోయోని మీశ్వర స్యాత్మ సంభవమ్.
భ. ప. 110 అధ్యా - 114.

ఈ విషయము ననువదించు పట్టులగల నీక్రింది పద్యభాగము (4. ఆ - 76) చూపట్టును.

గీ. మురవిరోధి ముందట నిట్ట మోపుగట్టి
తేరఁ బంచి సహస్రయతిప్రవరులు.........

ఈ పద్యము రెండవపాదమునఁగల "పంచి" యను పదమును "పంచ" అని సవరించినచో మూలానుసరణ మగును. కాని తేరఁ బంచి యనుటలోఁ గల విస్పష్టార్థము "మోపుగట్టితేర" అనుటలో లేదనియే చెప్పవలయును. మోపుగట్టి తే నియమించి యనుటలోనే పద్యమున కన్వయము కుదురును.

కాని "తే తేరులు తెచ్చున కగు" (బాల : క్రియ - 93) అను సూత్రమును బట్టి "తేర" అను పదమునకు "తీసికొనిరాగా" అనియర్థము చెప్పినచో, పంచి యనుచోట "పంచ" అని సవరించుట కవకాశము కలదు.

శ్రీకృష్ణుఁడు, యతిప్రవరులను గాంచినప్పటి దుర్వాసమహాముని భీషణాకృతి మూలమున నీక్రిందివిధముగ కలదు.

శ్లో. పృష్ఠతోఽప్యను గచ్ఛంతి దిధక్షంతం జగత్త్రియమ్
అర్ధకౌపీనవసనం స్మరంతం కమపి ద్విజమ్॥

అంతస్తాపసమాయుక్తం ఛిన్నదండధరం యతిమ్
అంతర్జ్వలంతం రోషేణ హంసాసాదిత కల్మషమ్.
భ.వ 111అధ్యా: 15, 16.

వీని యందలి భావమును గ్రహించి, సోమన దీర్ఘసమాసము లతో నీ క్రింది వృత్తమును రచించినాడు.

మ. వసుదేవాత్మజుడుం గనుంగొనియె దుర్వాసఃపరివ్రాడ్విభున్
రసనారూపకిలాప శాపవచన ప్రారంభ సంభావితున్
వ్యసన వ్యాప్తరిరంస హంసడిభకవ్యాళవ్యథా వ్యాకులో
ల్లసనున్ వేష విశేష రోష విషయోల్లాసాద్భుతభ్రూకుటిన్.
ఉ. హరి. 4ఆ. 82

మూలమునఁ గల "స్మరంతం కిమపి" "హంసాసాదిత కల్మషమ్" అను వానిని విపులీకరించినాడు సోమన. ఎవని గురించియో తలపోయు చున్న బ్రాహ్మణుఁడని మూలమున నుండగా నా దుర్వాసయతిని వర్ణించుటలో, దీర్ఘసమాసరచన మాపాత్రచిత్రణమున కొక విశిష్టతను గూర్చినది.

శ్రీకృష్ణుఁడు యతిప్రవరుల నర్హమగు రీతి నుపచరించుట మూలమున వివరముగ వర్ణింపఁబడినది. కాని సోమన సకల యతి ప్రతతికిని యథోచితోపచారంబు (4_84) లాచరించి అనిసంగ్రహించి, రచించెను.

ఈ ఘట్టముననే శ్రీకృష్ణపరమాత్ముఁడు యతీశ్వరుల రాకకు కారణ మరసినాడు. ఈ విషయమును వాచ్యమొనరించు సందర్భమున మూలాతిక్రమణము గావించి, సోమన మూఁడు వృత్తములను రచించి నాడు. మూలమున నీవిషయ మైదు శ్లోకములలో వర్ణింపఁబడినది. ఆ శ్లోకములను, సోముని యాంధ్రీకారణమును నీటగువఁ జూపు చున్నాను.

ఆహ భూయో హృషీకేశో యతిం దుర్వాససం ప్రభుమ్
కిమర్థం బ్రూహి విప్రేంద్ర అస్మిన్ ప్రత్యాగమో హి వః
దృష్టం వా హ్యథవా కించిత్కారణం చాస్తి వో మహత్
సన్యాసినో ద్విజశ్రేష్ఠా యూయం విగతకల్మషాః
నిస్పృహాశ్చ సదా యూయమస్మత్తో ద్విజపుంగవాః
ప్రార్థ్యం నామ న చైవాస్తి స్పృహా నైవాస్తి వో యతః
స్పృహాప్రేరితకర్మాణః క్షత్రియాన్ యాన్తి సువ్రతాః
నిరూప్యమాణ మస్మాభిర్విప్ర కించిన్న దృశ్యతే
న జానే కారణం బ్రహ్మన్ యుష్మదాగమనం ప్రతి
ఏతావతా చానుమేయం కించిత్కారణ మస్తి వై.

భ. ప. 111 అధ్యా. 23_27.

శా. ఈరూపంబున సంస్కృతిం దొఱఁగి మీరేచింతలం జెంతలం
జేరంగోరక యూరకున్న నిటువిచ్చేయంగఁ జేయం గతం
బారం బేదినవంతయుం గలిగనే బాలార్కబింబంబులో
నారంగూరిన యంధకారమున నాహా సాహసం బెట్టిదో.

ఉ. ఆసలఁ ద్రుంపివెట్టి హృదయంబను కాఁగున యోగవాసనా
భ్యాసపునీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి యా
యాసవిహార మత్కుణ గణైహిక శయ్యకుఁ దజ్జలంబుపైఁ
బోసిన నీ శరీర మది పొందియుఁ బొందనియట్ల యూఱకున్.

చ. మఱకువఁ గత్తిరించి మదమానములం జుఱపుచ్చి మెచ్చుఁ జాఁ
గఱగొని క్రోధకామముల గండడఁగించి పరోపకారమున్
జఱఁబడఁద్రోచి వాచవుల చట్టలు వాపి తొలంగి చిత్తముం
జఱపడి యున్ననీకు నొకచక్కటి నెక్కటి వేడఁగల్గెనే.

ఉ. హరి 4 ఆ. 85, 86, 87.

మీఁద నుదాహరించిన శ్లోకములలోఁగల నైస్పృహ్యమును గ్రహించి విపులీకరించినాఁడు. 'ప్రార్థ్యం నాస్తి', 'స్పృహానాస్తి' అను వాని నాధారముగాఁగొని యాలంకారికముగను, హృదయంగమము గను రచించి యాంధ్రీకరణమున కొక విశిష్టతను జేకూర్చినాఁడు సోమన. ఈవిషయములను భంగ్యంతరముగా చెప్పియున్నాఁడు. ప్రబంధోచితమగు రచనమును సాగించుటయు నిందు గన్పట్టును. మొదటి పద్యమునఁ గల యలంకారము రమ్యమైనది. రెండవ దాని యందలి యుపమాలంకార మతిమనోహరముగఁ జిత్రించుటలో కృతకృత్యుఁడయినాఁడు. తుదకు మూలమునందలి భావము నొకగీతమున వ్యక్తమొనర్చినాఁడు. ఆ వాసుదేవుని పల్కు లీవిధముగ నున్నవి.

గీ. కలుగుటకు మీరు విచ్చేయు కారణమున
సందియములేమి మీయట్టి సంయములకు
నేమికార్యంబు గలిగెనో యెఱుఁగరాదు
తెలుపవే నాకు నిర్మలధీనిదాన. ఉ. హరి. 4 ఆ 88.

ఈ విధముగనె శ్రీకృష్ణదేవుఁ డాడినమాటలకు దుర్వాసుఁడొకింత వంతఁజెంది ప్రత్యుత్తరము నిచ్చిన సందర్భమునందును, సోమన మూలములోఁగల భావము ననువదించి సంతృప్తిఁ జెందలేదు.

ఈఘట్టమున మూలమునందలి యేడుశ్లోకము (భ.ప. 111 అధ్యా 31-37) లలోని విషయమును సంగ్రహించినను, భావమునుమాత్రము యథాతథముగాఁ గొనినాఁ డనవచ్చును. మఱియు నొకపురాణగాథను దడవి యనువాదపద్యమునొకయలంకారముతోఁ ముగించెను. ఆపద్యమిది.

శా. ఏఁ గాదే నడతు జతుప్సుఖునితో నింద్రాదిదిక్పాలకుల్
మూఁగంబాఱిభవ త్పదాబ్జములకున్ మ్రొక్కంగ లేకున్నచో
నాఁగ న్వచ్చియు నేఁగ జాలనిప్రతీహారున్విడంబించుచున్
దాఁగం బోయి హరివాని నెదురన్ దాఁగఁగ నీ కేటికిన్.
ఉ. హరి. 4 ఆ. 92

దీని దుర్వాసునకు శ్రీమహావిష్ణువుకడ నెంతచనవుండినది వ్యక్తమగుచున్నది. "దాంబికోయి తలాంవాని వెంబునన్ దాగంగ నీకేటికిన్" అనుటలో నా మునీశ్వరునకుంగల యార్జవ్యముగూడ గన్పట్టుచున్నది.

ఈసందర్భమున శ్రీమహావిష్ణుని తేజోవర్ణనము పదునేను శ్లోకములలో (భ. ప. 111 అధ్యా-38 - 54) వర్ణింపబడియున్నది. ఇందు చివరి తొమ్మిది శ్లోకములలోని విషయము సంగ్రహించి యొక సీసపద్యము రచింపబడినది (ఉ. హరి. 4. ఆ-97)

ఆపద్యము దా. శాస్త్రిగారియందు ప్రయోగించిరి. "పంచభూతసుధాకర భాస్కరాత్మరూపములగు నీ రూపు" అను సమాసమున భావమునంతను నత్యంతనైపుణ్యము మెఱయ నిమిడ్చినాడు. భావలోపము రానీయలేదు. ఈపద్యమును దెనిగించుటలో సోముని నేర్పుకూర్పు లద్వితీయము నసామాన్యము ననవచ్చును.

హంసడిభకుల దుర్నయములను శ్రీకృష్ణపరమాత్మున కెఱింగించు నవసరమున దుర్వాసమునీశ్వరుని పలుకులలో నొక చమత్కారమును జోడించినాఁడు సోమనాథుఁడు. అమూలకముగా రచించిన యా పద్యము నిట నుదాహరించుచున్నాను.

ఆ. హంస పరమహంసలగు నీ యతీంద్రుల
వేరు సైఁపలేక వెచ్చ వేగి
హంసుఁ డాత్మనామ హరులని కానోపుఁ
బట్టి మమ్ముఁ జాల భంగపఱచె. ఉ. హరి 4 ఆ. 98.

ఇందాత్మనామ హరులనుటలో సోముని కవితాచమత్కృతి కానవగును. యోగులకును, నుత్తమపదమునొందిన సన్న్యాసులకు హంస, పరమహంస లనుపదములఁ బ్రయోగింప నగును హంస పరమహంసల

వంటి యతులు తామగుటయు, దమ కగ్గొనరించినవాఁడును హంసుఁ డగుటయు నీచమత్కారరచనమున కవకాశము గలిగించె. దుష్టుఁడగు నాహంసుని పేరు తాము హరించితిమని తలఁచి యా హంసుఁడు తమ కపకారము గావించియుండునని దుర్వాసుని చెప్పికోలు.

దుష్టులగు నా హంసడిభకులను వధింతునని ప్రతినపట్టు సందర్భమున శ్రీకృష్ణపరమాత్ముఁడు జరాసంధునిగూర్చి యిట్లని నట్లు మూలముననఁగలదు.

శ్లో. ప్రాణానాపి తయో రాజా దాస్యత్యేవ న సంశయః
జరాసంధో న భూపాలో వినా తౌ జయతే మహీమ్॥

భ. వ. 112 అధ్యా. 8

పయిశ్లోకమునకు తెనుఁగుసేత యీ క్రిందివిధముగాఁ గలదు.

క. కలఁడు జరాసంధుఁడు వా
రలకుం జెలికాఁడు నిష్ఠురభుజాపరిఘుం
డలఘుబలుఁడు సేనలతోఁ
గలియకమును వారిఁ జంపఁగలవాఁడఁ జుమీ.

ఉ. హరి. 4 ఆ 108.

అనువాదమున శ్రీకృష్ణుని యభిప్రాయము స్పష్టముగఁ గలదు. ఇంతకుమున్నే శ్రీకృష్ణజరాసంధులకు వైరము గలదు. హంసడిభకులు జరాసంధునకు మిత్రులు. ఆ కారణమున వీరి కాతఁడు సాహాయ్యము చేయువచ్చుననియు, నట్టిచో నాముప్పురితోఁ దలపడుట సాధ్యము కాదనియు తెలియుచున్నది. ఈ విషయము మూలమున వేఱొకవిధముగా గలదు. జరాసంధుఁ డొక్కఁడే భూలోకమునంతను జయింపఁగల సమర్థుఁడని చెప్పఁబడినది. కావున నిట నాంధ్రీకరణమునందు మూలము కంటె విషయస్పష్టత గలదు.

ఈ క్రింది శ్లోకములలోని భావము నాంధ్రీకరించుటలో మార్పు గావింపఁ బడినది.

స్వస్త్యస్తు భవతే కృష్ణ జగతాం స్వస్తి కుర్వతే
కిం ను నామ జగన్నాథ దుస్సాధ్యం తవ కేశవ॥
త్రిలోకేశ త్రిధామాసి సర్వసంహారకారకః
దేవానామపి దేవేశః సర్వత్ర సమదర్శనః॥
విష్ణో దేవ హరే కృష్ణ నమస్తే చక్రపాణయే
నమః స్వభావశుద్ధాయ శుద్ధాయ నియతాయ చ॥
శబ్దగోచర దేవేశ నమస్తే భక్తవత్సల
అజ్ఞానాదథవా జ్ఞానాద్ యన్మయోక్తం క్షమస్వ తత్.

భ. ప. 112 అధ్యా. 12 - 15

సోమన యాంధ్రీకరించిన పద్యము నిట నుదాహరించుచున్నాను.

చ. అనిన మునీంద్రుఁ డెంతయుఁ బ్రియంబున నచ్యుత పుండరీకలో
చన కమలాసనాది సురసంఘశరణ్య పదాంబుజా జనా
ర్దన దనుజాంతకా కొలిచెదం బ్రణమిల్లెద సంస్తుతించెదన్
నిను ననిశంబు నన్నుఁ గృపనెక్కొని కావుము దేవ నావుడున్.

ఉ. హరి. 4 ఆ. 110

పయి శ్లోకములలోఁగల "అజ్ఞానాదథవా జ్ఞానాత్ యన్మయోక్తం క్షమస్వ తత్" అని మూలమున దుర్వాసుని పలుకులలోఁ గలదు. కాని తెనిగింపున సోముఁడు మహర్షులకు ఘనత నాపాదింపనెంచి క్షమింపుమను పదమును ప్రయోగింపలేదు.

ఈ క్రిందిశ్లోకము పరిహరింపఁబడినది.

శ్లో. త్వమేవాహం జగన్నాథ నావయోరంతరం పృథక్
అతః క్షమస్వ భగవాన్ క్షమాసారా హి సాధవః॥

భ. ప. 112 అధ్యా. 16

మహార్షులు క్షమార్హు లనుటయు నద్వైతసిద్ధాంతమును దుర్వాసుఁడు శ్రీకృష్ణునకు బోధించుటయు సమంజసము కాదని సోమన తలంచి యుండును.

హంసడిభకులు రాజసూయమును జేయ నిర్ణయించు పట్టుల మిత్రుఁడగు జనార్దనుఁడు పలికినవిషయము మూలమునఁ బంద్రెండు (భ. ప. 113 అధ్యా 7-18) శ్లోకములలోఁ గలదు. రాజసూయావసరమున దిగ్విజయయాత్ర సలుపుటలోఁ దా మెదుర్కొనవలసిన రాజులను గూర్చి ప్రస్తావించినాఁడు.

ఈవిషయము నైదుపద్యములలో సోమన తెలిగించినాఁడు. ఆ పద్యములలో సాత్యకి యుద్ధప్రావీణ్యమును గణించుటలో నొక సొగసును జూపినాఁడు. శత్రుసైన్యములందుఁగల చతురంగబలముల నెదుర్కొనుటకుఁ జతుర్విధబలాతిశయములఁ గలిగియున్నాఁడని వర్ణించుటలో సోముని రచనాచమత్కృతి తెలియనగును. ఆపద్యము నిట నుదాహరించు చున్నాఁడను.

మ. వికల వ్యూహవిధావిహస్తభటమై విధ్వస్త మాతంగమై
శకలీభూత శతాంగమై శరఘటాశల్యాయ మానాశ్వమై
సికతాసేతువు నిమ్నగారయముచేఁ జిందైనచందాన సా
త్యకి చేతంబడు శత్రుసంఘము దశాదైన్యంబు సైన్యంబునన్.

ఉ. హరి. 4 ఆ. 126.

మూలమున కురుపాండవులందు భీష్ముఁ డొక్కనినే పేర్కొనఁబడియుండుటలో తదితర ప్రముఖు లేరును హంసునికి సాటిరారను ధ్వని గలదు. కాని కురువీరుల విషయమును జెప్పు నవసరమున, సోమన బాహ్లీక, భీమసేనులను గూడ మూలాతిక్రమణముగఁ బేర్కొని నట్లీ క్రిందిపద్యముఁనుబట్టి వ్యక్తమగుచున్నది.

మ. కురువీరాగ్రణి బాహ్లికుం డలిగెఁ గోదండపాండిత్య మె
వ్వరుఁ జూపంగ వలంతులే పవనజున్ వైరిక్షమాపాలభీ
కరు భీముం గదలించువారుఁ గలరే కంసారితోఁ బోఁటిలోఁ
సరివాఁడై యరి మీకుఁబెట్టుట జరాసంధుండు సైరించునే.

ఉ. హరి. 4 ఆ. 123.

మఱియొక విషయము. కురువీరులలో భీష్ముని, యాదవవీరు లలో శ్రీకృష్ణబలరామసాత్యకులను వేర్వేర వర్ణించుట గన్పట్టును. ఆయావీరుల పరాక్రమాతిశయముల నొక్కొక వృత్తమునందు వివరించుటయు, నందును బ్రముఖుఁడగు శ్రీకృష్ణుని నొక సీసమునఁ జెప్పుటయు సమంజసముగా నున్నది. ప్రబంధఫక్కి ననుసరించి, ప్రతివీరుల మహాత్వమును వర్ణించి, హంసుని యల్పత్వము వ్యక్తపఱుపఁబడినది. శ్రీకృష్ణుని పరాక్రమవర్ణనము నీక్రింది విధముగాఁ జెప్పుచు, "మద్దులు మునింగి పాఱ వెంపళ్ళు తమ కెంతబంటి యనుట" అను నొక సామెతను సంఘటించినాఁడు సోమన. ఈ తారతమ్య నిరూపణము గూడ హంసుని బలహీనతను వ్యక్తపఱచుచున్నది.

సీ. నరకాసురప్రాణనాళోత్తరణకేళి
రణకేళి వలకేళి రమణఁ జూపెఁ
గంసదానవశిరఃకమల కృత్తన మేలు
తనమేలుచేయి పెద్దలకు నొసఁగెఁ
జాణూరముష్టికక్షతజకీలాలంబు
నాలంబులోఁ నెల్ల నలవు వఱపె
మురహయగ్రీవాంత్రమూలఫేనావలి
నావలిదలఁగఁ జీకాకు పఱచె

తే. వీరరససార కాసారవిరహణంబు
విష్ణునకు నొప్పు నతనితో విగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి
పాఱ వెంపళ్ళు తమ కెంతబంటి యనుట.

ఉ. హరి. 4 ఆ. 124.

హంసుఁడు, తన తండ్రియగు బ్రహ్మదత్తునిచే రాజసూయ యాగమును జేయింప నిశ్చయించి, మిత్రుఁడగు జనార్దనుని, శ్రీకృష్ణుని కడకు రాయబారిగా నియమించెను. ఆసందర్భమున హంసునిపలుకులివి.

క. చని యా జనార్దనునిచే
ఘనమగు లవణంబు మనకుఁ గప్పమడుగు మే
ధనములును సరకుగా విట
చను దెమ్మను మతని యజ్ఞసమయంబునకున్.

ఉ. హరి. 4 ఆ. 134

శ్రీకృష్ణుని వద్దనుండి కప్పముగా లవణము నడిగి తెమ్మనుట ప్రకృతవిషయము. దీనికి మూలమునఁగల శ్లోకభాగము లీ క్రిందివిధముగా నున్నవి.

శ్లో. లవణాని బహూన్యద్య గృహ్య కేశవ మా చిరమ్॥
శ్లో. ఆగచ్ఛ త్వరితం కృష్ణ న తే కార్యం విలంబనమ్।

భ. ప. 113 – 22, 23.

ఇందు లవణశబ్దము యథార్థముగాఁ గ్రహింపఁబడినది. సుందరములును, విలువైనవియునగు, సొమ్ములను గప్పముగాఁ గొననగును. ఆ యర్థమున నిట గప్పముగా నీయనగున వనియే జెప్పనొప్పును. కాని యనువాదమునఁగల "ఘనమగు లవణంబు" అనుటలో నుప్పనియే స్పష్టమగుచున్నది. మఱియు దూతయగు జనార్దన, వాసుదేవుల నుడు

లలోఁగూడ నీయర్థమే స్ఫురించుచున్నది. ఆ పద్యముల నీ దిగువ నుదాహరించుచున్నాను :

గీ. అప్పుడా హంసడిభకు లిట్లనిరి మనకు
లవణ మెంతేని నడుగు యాదవులచేత
వేగ రమ్మను శౌరి నియ్యాగమునకు
నావుడుం బని పూనితి దేవదేవ.

ఆ. రాజసూయకర్త బ్రహ్మదత్తుం డట్టి
రభసమెసఁగ హంసడిభకు లట్టి
చేయుఁబంచువారు చెల్లఁబోఁ లవణంబు
మోచువాఁడె కాక మురవిరోధి.

ఉ. హరి. 4 ఆ. 152, 154.

శ్రీకృష్ణుని కడకు రాయబారమును నెఱపుటకు నియమింపఁబడిన జనార్దనుని ద్వారవతీప్రయాణోద్యోగము మూలమున నొకయధ్యాయమున విపులముగ వర్ణింపఁబడినది. ఇందలి నలుబదినాలుగు శ్లోకములలో జనార్దనుని స్వగతభావవ్యక్తీకరణము కలదు. జగన్నాథుఁడగు నా శ్రీకృష్ణుని స్వరూప స్వభావాదులను దలపోయుటయు, నా దేవదేవుని దర్శించుటవలనఁ దాను కృతార్థుఁడ నగుదు ననియు స్వకీయమయిన యార్తి వర్ణింపఁబడినది. పరమభక్తుఁడగు నా జనార్దనుని స్వగతాభిప్రాయములను దెలుపుటకు బదులుగ సోమనాథుఁడు, ప్రాబంధికధోరణి ననుసరించి, తన కవితావైశిష్ట్యము మెఱయ మణిపూసలవంటి సీసపద్యద్వయము నిట సంఘటించినాఁడు. ఆ పద్యము లివి.

సీ. యదుకులాంబుధిచంద్రు నానందమునఁ జూచు
రామాదిహితచకోరములలోన
దనుజారిపారిజాతముఁ జేరి పొదిగొన్న
రాజన్యరాజకీరములలోన

వసుదేవసుత సరోవరములో నోలాడు
సనకాది దివ్యహంసములలోన
గోపాలనవపుష్పగుచ్ఛంబు మూఁగిన
పరిచారికా ద్విరేఫములలోనఁ

తే. గలయఁ దొలుబాముసోములు గలవు గాన
సెలవు లేక జన్మంబులు చెడియె నాకు
మీఁద జన్మంబు గలుగ నిర్మించె నేని
కమలజునిపేర దాపటికాలబొమ్మ.

సీ. వెలిదమ్మిలో లేఁతవెన్నెలో యమృతమో
కన్నులో చిఱునవ్వొ కనికరంబొ
గగనమో చుక్కలో గ్రహరాజబింబమో
వక్షంబొ మౌక్తికావలియొ మణియొ
తరఁగలో ఫేనమో తరణిమండలమొ హ
స్తములో శంఖంబొ సుదర్శనంబొ
తలిరులో కరికరంబులో కుంకుమప్రభయొ
పదములో యూరులో పచ్చఁబట్టొ

ఆ. యనుచుఁ గన్నులార నా జగన్నాథునిఁ
గనుగొనంగ నేఁడు గలుగుఁ గాన
తలపులోన మున్ను దలఁచిన రూపంబు
పట్టువడుట జన్మఫలము గాదె. ఉ. హరి. 4 ఆ. 137, 138.

పయివానిలో మొదటిపద్యమున శ్రీకృష్ణుని వైభవమును వర్ణించుటలో నపూర్వములును, నతిరమ్యములును నగు నుపమలను గ్రహించి, చమత్కారమును వెలయించినాఁడు. రెండవ సీసపద్యమున శ్రీకృష్ణపరమాత్ముని సుందరరూపమును బ్రసిద్ధములగు కవిసమయము

లచే వివరించినాఁడు. బిల్వాణీయమునం దిట్టివర్ణనకుఁ గల శ్లోకము కలదు. దానినిజూచి యట్టి విచిత్రమగు గల్పనము చిత్రించి యుండును. ఇందు ప్రథమభాగమున సందేహాస్పదముగా విషయమును జెప్పి, ద్వితీయార్ధమున నా వాసుదేవుని దివ్యసుందరరూపమును వర్ణించినాఁడు.

ఇంతటితో నాఁగక, సకలసామంత దండనాథాది ప్రముఖులచే నిండియున్న పేరోలగంబు మధ్యమున సింహాసనారూఢుఁడయి వెలుగొందు నా దేవదేవుని, జనార్దనుఁడు కాంచినాఁడని యమూలకముగ వేఱొకపద్యమును రచించినాఁడు. ఇందు నాటకీయత యుట్టిపడ శ్రీకృష్ణుని చలద్రూపమునుగూడ కన్నులకు గట్టినట్లు వర్ణించినాఁడు. సోమనాథుఁ డీ విధముగ నిట శ్రీకృష్ణమహాత్మ్యవిశేషములఁ జాటింప నెంచినాడనుటయు సమంజసము. మూలాతిక్రమణమున నిదియొక జాతి రత్నము. ఆపద్యము నిటఁ జూపుచున్నాను.

మ. కనియెం గౌస్తుభరత్నభూషణు వలత్కర్పూరహారావళీ
వనితాచాలితతాళవృంతపవనవ్యాధూత చేలాంచలున్
మనుజాధీశకిరీటకోటిపరిషన్మధ్యస్థసింహాసనాం
కునిఁ దేజఃప్రసరప్రభాతతరణిన్ గోపాలచూడామణిన్.

ఉ. హరి. 4 ఆ. 149

జనార్దనుఁడు సభామండపమును జొచ్చిన సందర్భమున నీ క్రింది శ్లోకములలో తన్నెఱింగించుకొని నమస్కరించినట్లు గలదు.

శ్లో. నామ్నా జనార్దనోఽస్మీతి ననామ చరణౌ హరేః
బలభద్రం తతో దేవం వవందే శిరసా ద్విజః॥
దూతోఽస్మి దేవదేవేశ హంసస్య డింభకస్య చ
ఇతి బ్రువాణం విప్రేంద్ర మిదమాహ స మాధవః॥

భ. ప. 115 అధ్యా. 6, 7

అనువాదమునఁ దనపేరుచెప్పి నమస్కరించి, యథోచిత స్థానం బున గూర్చుండినట్లు చెప్పబడినది. జనార్దనుఁడు, హంసడిభకు లంపిన దూతగాఁ దా నేతెంచినట్లు మూలమున వాకొనియుండ నా విషయము పరిహరింపఁబడినది. కాని యాతఁడు శ్రీకృష్ణుని సభాంతికమును బ్రవే శింపకమున్నే తా నెవ్వరైనదియు, దఃరాకకు హేతుభూతమగు విషయ మేమైనదియు వివరముగ దెలిపి దీయుండునుట నిశ్చయము. మఱియు హంసడిభకులతోఁ దన యాశ్రమమున కేతెంచిన జనార్దనుని విష యము దుర్వాసుఁడు శ్రీకృష్ణునకుఁ జెప్పియుండుననుటయు సమంజసము. నమస్కారము చేయునపుడు గోత్రప్రవరలను జెప్పుట యాచారము గానఁ దన పేరుమాత్రము జనార్దనుఁడు చెప్పి యూరకుండెననుటయు సహేతుకమే.

శ్రీకృష్ణుఁడు కుశలప్రశ్నానంతరము జనార్దనుని రాయబార విషయము నెఱింగింపు మనినాఁడు. ఆసందర్భమున జనార్దనుఁడు శ్రీమహా విష్ణువును బ్రశంసించిన విషయమును, కృష్ణస్తుత్యాదులును మూలమున నెనిమిది శ్లోకములు గలవు అనువాదమున సోమన యా విషయసార స్యము నొక్క కందమున నిమిడ్చెను. పరమేశ్వర పరతత్త్వము నతి మృదులములగు నలతి పదముల నతి గంభీరముగఁ జిత్రించుటలో సోమ నాథుని సామర్థ్యము కానఁనగును. ఆమూలమును, ననువాదమును నీ దిగువ నీయఁబడినవి.

శ్లో. కేశవేనైవ ముక్తస్తు ప్రోవాచ స జనార్దనః
అజానన్నివ కిం బ్రూషే సర్వం ప్రత్యక్ష దర్శివాన్ ॥
న చాస్తి తే పరోక్షం తు జగద్ వృత్తాంత మచ్యుత
సర్వం హి మనసా పశ్యన్ కిం త్వమాత్థ వదేతి మామ్ ॥
విద్వద్భి ర్గీయసే విష్ణు స్త్వమేవ జగతీపతే
ఇచ్ఛయా సర్వమాప్నోషి దృష్టాదృష్ట వివేచనమ్ ॥

త్వమే వేదం జగత్సర్వం జగచ్చ త్వయి తిష్ఠతి
న త్వయా రహితో హ్యేకః పదార్థః సచరాచరః ॥
నాస్తి కించి దవేద్యం తే సర్వగోఽసి జగత్పతే
త్వమింద్రః సర్వభూతానాం రుద్రః సంహారకర్మకృత్ ॥
రక్షితాసి సదా విష్ణుః సర్వలోకస్య మాధవ
సంసారస్య భవాన్ స్రష్టా కిం త్వ మాత్థ వదేతి మామ్ ॥
విద్వద్భిర్గీయసే నిత్యం జ్ఞానాత్మేతి చ మాధవ
ప్రాణం ప్రాణవిదః ప్రాహుస్త్వామేవ పురుషోత్తమ ॥
శబ్దం శబ్దవిదః ప్రాహుస్త్వామేవ పురుషోత్తమ
తథా సతి హృషీకేశ కిం త్వమాత్థ వదేతిమామ్ ॥

భ. ప. 115 అధ్యా. 16_23

క. అందఱకుం గుశలము, మా
కుం దగుమన్ననల, ప్రజలకుం బరిణామం
బిం దే వచ్చినపని గో
విందా యెఱింగింప కెఱుఁగవే విశ్వపతీ.

క. లోపల వెలుపల వెలుపల
లోపలఁ గానుండు నఖిలలోకంబులకున్
నీ పరతత్త్వము చిత్రము
రూపమునై నీవు లేని రూపము గలదే. ఉ.హరి.4ఆ.146, 147

ఈ సందర్భమున జనార్దనుని పాత్రచిత్రణమునకు వన్నెబెట్టఁ దలఁచి, సోమన యీక్రింది పద్యము నమూలకము రచించినాఁడు.

ఉ. ఉండుట తప్పు వారికడ నుండమి తప్పిట రాక తప్పు, రా
కుండుట తప్పు, తప్పులకు నొప్పులకున్ గతి నీవ దేవ! యే
నొండొకరుండ నే, పలుక కూరక నేరక యుండఁజేయు నీ
జెండితనంబుచేత నిసిజెంతలు వాఱెడిఁ జిత్త మిప్పుడున్.

ఉ. హరి. 4 ఆ. 148

ఇందు జనార్దనుని యశక్తతయు, శిష్టరక్షణపరాయణత్వము నాశించుటయుఁ జెప్పఁబడినవి. ఈమాటలకు గోపాలచూడామణి ప్రత్యుత్తరమునందు, "చల్లకు వచ్చి ముంత దాఁచిన గతి నింత మాటువడఁ జేసినఁ గార్యము గానవచ్చునే" అని యొకసామెతను గూర్చి యను వాదమునకుఁ దెనుఁగుతన మబ్బఁజేసినాఁడు. మఱియుఁ బాముకాటు సీర దుడిచినఁ బోదనుటలో, హంసడిభకుల ధూర్తప్రలాపముయొక్క ప్రభావము జనార్దనునిచేఁ దఱుగదనియు బలికినాఁడు.

లవణమును గప్పమడుగుట కారణముగా, సోమన "ఉప్పనబట్టె" అను బాలక్రీడావిశేషమునుగూడ నీసందర్భమున బ్రస్తావించి సమకాలీన సంఘికాచార విషయములను దడవినాఁడు. (ఉ. హరి. 4 ఆ. 155)

ఈక్రింది శ్లోకము ననువదించుపట్టుల సోమన గావించిన విపులీకరణముతో పాటు స్వతంత్రరచనావిధానమును గానగును. "ఇద మశ్రుతపూర్వం మే మత్తో యస్తు కరగ్రహః" (భ.ప.115అధ్యా. 32) అను శ్లోకపూర్వార్ధమున కీక్రింది యనువాదము చేయఁబడినది.

మ. కలరా యింతకుమున్న యాదవులచేఁ గప్పంబు దెప్పింపఁగాఁ
గలరా రాజులు గాజులుం దొడవుగాఁ గల్పించిరా కాకులం
గలకంఠంబులఁ జేసెనా కటకటా గారీశ్వరుం డేమిగాఁ
గలవారో యిటమీఁద హంసడిభకుల్ గర్వాంధకారంబునన్.

ఉ. హరి. 4 ఆ. 157.

ఇందు మొదటిపాదము మాత్రమే సమూలకము. కాకులను గోకిలలుగా జేయుట, గాజులం దొడవులుగా గల్పించుటలను సంఘటించి, సరళములగు పదప్రయోగమున హంసడిభకులను బరిహాసించుట గన్పట్టును.

శ్రీకృష్ణుఁడు తన నిశ్చితాభిప్రాయము నీవిధముగాఁ దెలియఁ జేసినట్లు మూలమునఁ గలదు.

శ్లో. ఇత్యుక్త్వావతి దేవేశే బలభద్ర పురోగమాః
యాదవాః సర్వ ఏవైతే హాసాయ సమవస్థితాః
కరదః కృష్ణ ఇత్యేవం బ్రువంతః సర్వసాత్వతాః
హాసం ముముచురత్యర్థం తలం దత్వా పరస్పరమ్॥
తలశబ్దో హాసశబ్దో రోదసీపర్య పూరయత్
స చ విప్రో నృపశ్రేష్ఠ నందయన్ మిత్రమాత్మనః ॥
అహోకష్ట మహోకష్టం దాత్యం యత్కృతవాహనమ్
ఇతి లజ్జాసమావిష్ట స్తూష్ణీమాసీ దవాంగముఖః ॥

భ. ప. 115 అధ్యా. 36, 39.

అనువాదమున నీ క్రింది పద్యములు గలవు.

తే. అనుచు నొండొరుఁ జెయిచేసి యుపహాసింప
హరియుఁ గలకల నవ్వి జనార్దనుండు
వినఁగ నిట్లను నొండేల వీరవరుల
నలుఁగు మొనఁగాక కప్పంబు లడుగ నగునె.

క. అరిఁ గరమున నేఁ దాల్చిన
నరిగరము నగేంద్రధీరుఁ డయినం జెడఁడే
యరిఁ దిరమై నన్నడుగుట
యరిది రమైకాభిలాషులగు నృపతులకున్.

మ. వెదకంబోయిన తీవ కాలఁ దవిలెన్ వేయేల దుర్వాసుచే
మొదలన్ సంచకరంబు హంసడిభకోన్మూల క్రియాకేళికిం
గుదురై యున్నది పాటిగాక యిట మత్కోదండ కాండోదర
ప్రదర ప్రావరణాంబుద ప్రకటశంపా కంప శౌత్కారముల్.

ఉ. హరి. 4 ఆ 161, 162, 163.

పయి పద్యములలోని "వెదకంబోయిన తీవ కాలఁ దవిలెన్" అను సామెత శ్రీకృష్ణుని యభిప్రాయమును జక్కఁగ స్ఫురింపఁ జేయుచున్నది. శ్రీకృష్ణ పరాక్రమము నొక దీర్ఘసమాసమునందు వ్యక్తము చేయుటయగాక, దుర్వాసునెడ హంసడిభకు లొనరించిన యాగడము లీవిషయమున సంచితమయి యుండుటయును స్పష్టముగ వివరింపఁ బడినది. వాసుదేవుఁడు తన యభీష్టమును నెఱవేర్చుకొను యదనుకై వేచియుండుటయు, నయ్యది తన కీమార్గమున సంప్రాప్తమగుటయు సత్యము. ఇట సోమన కూర్చిన సామెత యీ భావస్పష్టీకరణమున కెంతయుఁ దోడ్పడుచున్నది.

మఱియొక విశేషము. ఈ పద్యమునందలి "మత్కోదండ కాండోదర ప్రదర ప్రావరణాంబుద ప్రకట శంపాకంప శాత్కారముల్" అను సమాసమునకు మూల మీక్రింది శ్లోకమునందలి యుత్తరార్థము.

తా విత్థం హంసడింభకా బ్రూహి త్వరిత విక్రమః
బాణైర్దాస్యామి నిశితైః శార్ఙ్గముక్తైః శిలాశితైః॥

భ. వ. 116 అధ్యా. 2.

ఇందు నల్లనయ్యయగు శ్రీకృష్ణుని యమ్ములపొదినుండి గ్రహింపఁబడిన శరములను వర్షాకాల మేఘములచే నేర్పడిన మెఱుపుల తోడను, నా శరసంధానమున గలుగుధ్వని (మెఱుపుల యనంతరము. వినవచ్చు) నురుములతోడను నుపమింపఁ జేసియున్నాఁడు సోమన. ఇట్టి పద్యరచనావైశిష్ట్యము భావస్ఫూర్తికి దోహద మిచ్చుచున్నది.

మఱియు నిట "ప్రావరణాంబుద" అనుదానిని "ప్రావృషికాంబుద" అని సవరింపవలసి యుండును.

శ్లో. శిరోవా ఛేత్స్యతే చక్రం మత్కరప్రహితం బలిమ్ (భ. వ 116 అధ్యా. 3 ఉత్తరార్థము.) అనుదానిని తెనిగించుటలోఁగూడ

ననుప్రాసయుతముగ నైన నుదాహరించినవానిలో రెండవ పద్యమును రచించినాఁడు. దీన సోముని రచనము మూలముకన్న మిన్నయని చెప్పనొప్పును.

శ్రీకృష్ణుని ప్రతి సందేశముసందీ దిగువ నుదాహరించిన శ్లోకములు గలవు.

యో వరం దత్తవాన్ రుద్రో యువ యోర్ధార్ష్టర్య కారణమ్
స యేవ రక్షితా వాం స్యాత్ తం జిత్వావాం నిహన్మ్యహమ్॥
దేశో ఽ యం సంవిధాతవ్యో యత్రనః సంగతిర్భవేత్
తత్ర గంతా తథా చాస్మి సబలః సహవాహనః॥
భవంతౌ నిర్భయౌ భూత్వా గచ్ఛేతాం సబలౌ నృపౌ
పుష్కరే వా ప్రయాగే వా మధురాయా మథాపి వా॥
తత్రాహం సబలో యాతా నాత్ర కార్యా విచారణా
అథవా మిత్రభావాచ్ఛ వక్తుమేవం న తే క్షమమ్॥
న శక్యం యత్ త్వయా వక్తుం తచ్ఛ వక్ష్యతి సాత్యకిః
త్వయా సహాతతో గత్వా సాక్షిభూతో భవద్విజ ॥

భ. ప. 116 అధ్యా. 4 - 8

పయి శ్లోకములలోని భావమును గ్రహించి, లలితములగు పదముల నాంధ్రీకరించియున్నాఁడు. దూతముఖమునఁ గటువుగఁ బలికినను రాయబార ప్రత్యుత్తరము నంపుటలో నతి మృదుత్వమును జూపుట రాజనీతి. ఆ నైదు పద్యముల నిట బొందుపఱుచుచున్నాఁడను.

ఆ. ఈశు వరముచేత నెవ్వఁడే నిప్పాట
శూరుఁడైన దువ్వఁజూచి నక్క
రీొడలు గాల్చికొన్న వడువున మీరింత
లావుమాటలాడ లజ్జగాదె.

ఆ. హరిగదా విహారమల్లంతఁ దోఁచిన
వరము మిమ్ముఁగావ వలఁతియగునె
వెఱ్ఱివార పిడుగు వ్రేసినఁ దలటొప్పి
యాగునే వివేకమైన వలదె.

క. అగునో కాదో వరములు
డిగ విడువఁగ రాదు హంసడిభకులు నన్నున్
మొగరించిన హరు నయినను
జగ మెఱుఁగఁగఁ దోలి తమ్ము జంపెద ననుమీ.

క. పర పగు మోహర మేర్పను
వెర వగుచో నెల్లి నేఁడు విడిసెద మధురా
పురమునఁ బ్రయాగమునఁ బు
ష్కరమునఁ దా రేర్చికొన్న కల నగు మాకున్.

మ. మొగమాటంబున నీవు వారియెదుటన్ ముఖ్యంబు యుద్ధంబ కాఁ
దెగనాడన్ వెఱతేని సాత్యకి సమిద్ధీరుండు నీతోన యోఁ
గి గుణగ్రాహులు గాని తద్ధరణీ భృత్కూటాంతరంగంబులం
బగులన్ వ్రేచుఁ గఠోరవీరవచనప్రాస ప్రసారోద్ధతిన్.

ఉ. హరి. 4 ఆ. 165 – 169.

పయి పద్యములలో సోమన గావించిన మార్పు గమనింపఁ దగినది. మూలమునందలి విషయమును విపులీకరించి శ్రీకృష్ణుని యభిప్రాయములను దెలుపు నవసరమున సామెతలను, జాతీయములనుగూడ సంఘటింపజేసినాఁడు సోమన. మూలమున శివుని వరములవిషయము ప్రస్తావింపఁబడినను నా[illegible]యముల బలమునఁ దనతో హంసడిభకులు పోరుటను, పులినిజూచి న[illegible] వాతలను బెట్టుకొన్నట్టులే యనినాఁడు. మఱియుఁ దనపరాక్ర[illegible]మును బిడుగునను, హంసడిభకులు శివుని వరము

లనెడు శిరస్త్రాణమును ధరించి నంతమాత్రమున ధరింపలేరను విషయము స్పష్టీకరించినాఁడు.

శ్లో. అస్థే సుఖం యదా విప్రః శైనేయేన సమన్వితః
అథ తం హార్దిక్యో దృష్ట్వా యాదవాస సాత్యకిమ్॥
దూతోఽయం సాత్యకిః ప్రాప్తః సవ్యసాచీ యం హరేః
తస్య తద్వచనం శ్రుత్వా హంసః ప్రాహ వచస్తదా॥
శ్రుతః సమాగమః పూర్వమస్య దృష్టో మయా త్వసౌ
ధనుర్వేదే చ వేదే చ శాస్త్రే శస్త్రే తథైవ చ॥
నిపుణోఽయం సదాధీర ఇత్యేవ మనుశుశ్రుమ
అధో దృష్టిమిదం ప్రాప్తః ప్రీతిం నో విదధాత్యసౌ॥

భ. ప. 117 అధ్యా 8 - 11

పయి శ్లోకములలోని విషయమును తెలిగించు పట్టులనుగూడ సోమన తన రచనాప్రౌఢిమను వ్యక్తము చేసినాఁడు. సాత్యకినిగూర్చి జనార్దనుఁడు, హంసునితో వివరించి చెప్పినట్లు గలదు. కాని జనార్దన సహితుఁడయి సాత్యకి వచ్చుటతోడనే హంసుఁ డాతనిఁగాంచి యిట్లని నాఁడు.

మ. ఇతఁడే సాత్యకి యిమ్మహాభుజబలం బెల్లప్పుడుం జెప్పఁగా
శ్రుతిపర్వం బగు నేఁడు గంటిమిగదా శూరుండు ధీరుండు సు
వ్రతుఁ డౌదార్య సమన్వితుం డఖిలశాస్త్రజ్ఞుండు శస్త్రక్రమా
శ్రితసారుం డనుమాటలన్నియుఁ దగుం జిత్తం బుదాత్తంబగున్.

క. హరిదక్షిణభుజము సమి
ద్ధురంధరుఁడు నయవిహారదోహలి హరికిం
బరమాప్తుఁడు సకలకళా
పరిణతుఁ డీతం డలంతిపని వచ్చునె టే.

ఉ. హరి. 4 ఆ 172, 175.

ఇఁట హంసుని పాత్రపోషణమునందు సోముఁడు కొంత విపులీకరించి యున్నాఁడు. సకలకళాపరిణతుం డిత్యాదిపదముల నా సాత్యకిని మెచ్చుకొనుటయగాక, హరికి దక్షిణభుజమనుటను యథామూలకముగా ననువదించెను.

హంసడిభకులు రాయబారమునుగూర్చిన విషయమును జెప్పుమనఁగా జనార్దనుఁ డా దేవకీసుతుని వర్ణించి, యాతనిని స్తుతించినాఁడు. మూలమున నీస్తుతి (భ. ప. 11 అధ్యా. 2-10) తొమ్మిది శ్లోకములలో నుండ సోమన సంగ్రహించినాఁడు.

శంఖుచక్రగదాదులను ధరించిన నా శ్రీకృష్ణపరమాత్ముని యంగాంగవర్ణనము మూలమునఁ జేయఁబడినది. ఆ దేవదేవుని బ్రభాభాసుర రూపునిగను, సర్వదేవతలచేతను యాదవులచేతను స్తుతింపఁబడు వానిగను జెప్పఁబడి యున్నది. ఈ ఘట్టమునంతను సోమన మార్చి ప్రబంధోచితమగు వర్ణనము నిట సంఘటింపఁ జేసినాఁడు. ఈ క్రిందిపద్యములను బట్టి యా విషయమును నిర్ధారింప నగును.

చ. అవిరళరత్నమూత్నకనకాసనపూర్వమహీధరంబుపై
నవవికచారవిందరుచి నవ్వెడు కన్నులచాయ చుక్కలన్
దివియలమాయఁ జేయ నలుదిక్కుల మ్రొక్కులపేరమోడ్పు యా
దవకరకైరవంబుల కతఁబునఁ గంటి మురారిభాస్కరున్.

సీ. ఉరము కౌస్తుభరత్న ముదయాద్రితటమునఁ
బొడతెంచు కలువల బోటుబోటు
శిరము కిరీటంబు సురగిరి నెత్తాన
రాజిల్లు పగలింటి రాజురాజు
కటిపచ్చఁబట్టు దిగ్దంతి కుంభస్థలిఁ
జూపట్టు రేయెండ జోడుజోడు
చేతిశంఖంబు గర్జితగజేంద్రము కేలఁ
బరగు వెన్నెలపూవు బంతిబంతి

తే. నైమె కొలువులోనఁ దేజోమయుంబు సేయ
మౌక్తికవితానమయ సభామండపమున
సత్యభామాసఖీకటాక్షముల గములఁ
జూఱ గొనుచున్న దేవకీసుతునిఁ గంటి.

ఉ. హరి. 4 ఆ. 180, 181.

వీనికంటె ముందున్న పద్యములో నుత్తరార్ధమున "దయానిధిన్, గుణనిధిన్, కారుణ్యపాథోనిధిన్" కంటినని జనార్దనుని మాటలుగ జెప్పఁబడి యున్నది. మూలమునందలి విషయము ననువదించుటతోఁ దృప్తినొందక, రూపకాలంకారయుతముగ నొక వృత్తపద్యమును, లాటానుప్రాసమును, యమకముతోడి యొకసీసపద్యమును రచించి నాఁడు సోమన. మూలమున నిది దైవస్తుతిగా భాసించియుండ, నాలంకారికమును, వర్ణనాయుతమును నగు ప్రాబంధికధోరణి కనువుగ సోమన తన చతురకవితను వెలయించినాఁడు.

మురారిని ప్రస్తుతించు జనార్దనుపయి గినిసి హంసుఁ డాతనిని నిందించుట పండ్రెండుశ్లోకములలో మూలమున చెప్పబడినది. అనువాదమున నైదుపద్యము లీసుట్టమున గలవు. అం దీ క్రింది శ్లోకముల నాంధ్రీకరించుటలోఁగల విశేషముల బరికింతము.

శ్లో. అరె బ్రాహ్మణదాయాద కా నామ తవ వాగియమ్
ఆవయోః పురతో వక్తుం త్రైలోక్యం జేతుమిచ్ఛతోః॥
మాయయా త్వాం భ్రామయతి కృష్ణో లీలావిధానవిత్
తం దృష్ట్వా భ్రమ ఏవైష తవ సంజాయతే మహాన్॥
శంఖ చక్ర గదా శార్ఙ్గ వనమాలావిభూషితమ్.
వృష్ణివీరం సమావేశ్య సముచ్ఛ్రిత యశోధరమ్॥
సూతమాగధ సంస్తావ ప్రకట ద్బాహువీర్యకమ్

అత్యద్భుత యశోరాశిం విక్రమాల్లోక మండనమ్॥
చతుర్భుజం బలాక్రాంతం వృష్ణి యాదవ సంతతమ్
అహోఽద్య భ్రమ ఏవైష దర్శనాత్తస్య చక్రిణః॥
ఇదానీం చ మహారాజ భ్రమయత్యేవ దుర్మతిః
త్వామేవ విప్ర మందాత్మన్నింద్రజాలికతా హి యా।
చాపల్య మిదమేవైతత్ తవ విప్ర భ్రమోద్భవమ్
అహో హి ఖలు సాదృశం వక్తవ్యం భవతా మమ॥

భ. ప. 118 అధ్యా18 - 24.

పయిశ్లోకములలో శంఖ చక్ర గదా శార్ఙ్గాదులను ధరించిన శ్రీకృష్ణునజూచి జనార్దనుఁడు భ్రమఁ జెందియుండెనని మూలమునందుండ, నీక్రిందిపద్యమున నదేభావమును మలిచి యనువదించుట కానవగును.

మ. నిను రప్పింపక మున్న వేగపడి పూనెన్ శార్ఙ్గకౌమోదకీ
వనమాలాంబుజచక్రభూమికలు గైవారంబు చేయించె నే
లిననాగారులచేత యాదవుల నోలిం గొల్చి కూర్చుండఁగాఁ
బనిచెం గేశవుఁ డైంద్రజాలికుగతిం భ్రాంతయ్యె నీకంతటన్.

ఉ. హరి. 4 ఆ. 188.

శ్రీకృష్ణుని జూచిజనార్దనుఁడు భ్రమఁజెందుటకు మాఱుగ, జనార్దనుని రాకకుఁ బూర్వము శ్రీకృష్ణుఁడే త్వరితగతిని శంఖచక్రాదులను బూనినట్లును ప్రత్యేకముగ నీసమయమునఁ గైవారఁబును జేయించి కొనినట్లును మార్చినాడు.

మఱియు జనార్దనుఁడు చపలుఁ డయినాఁడను మూలవిషయమునకు సోముని విపులీకరణ మీ క్రింది యనువాదమును బరికించినచోఁ దెలియఁగలదు.

చ. పిఱికివి గాక నీవు నొకరెగ్గడఁచే పథ లుండు భంగి ము
న్నెఱుఁగని వాఁడవై బ్రమసి యెవ్వరిముందర నేమిమాటలో
యఱచితి వారి జంకెనల కచ్చుటఁ ద్రోపడి వచ్చి తిచ్చటం
గఱవఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్.

ఉ. హరి. 4 ఆ. 189.

మఱియు నిట భావస్ఫూర్తికయి, చివరిపాదమున నొకసామెతను గూర్చినాఁడు సోమన. జనార్దనునకు తాము సర్వథా రక్షకులయి యుండి తమకొలువున నాతని కొక గౌరవప్రదమయిన స్థానము నీయ జూచినను జనార్దనుని స్వభావసిద్ధమైన వెలికితనమును బోగొట్టుకొన లేదని హంసడిభకులు నిందించిరి.

బ్రహ్మదత్తుని సభయందు హంసుఁడు, జనార్దనుని నిందించి, నగరబహిష్కార మాతనికి విధించెను. అనంతరము సాత్యకి నుద్దేశించి కృష్ణుఁడు తనకు కప్పమీయని హేతువునుగూర్చి ప్రశ్నించెను. అందుల కాతని ప్రత్యుత్తరమున నీక్రింది రెండుపద్యములు గలవు. సోమనాథుఁడు వీని నమూలకములుగ రచించెను.

శా. ఆలోకించెదు శార్ఙ్గముక్తపటుబాణౌఘంబుచే నీమొనల్
నేలం గూలఁ గపాలపాలికలలో నిండారురక్తంబులం
గ్రోలం గేలఁ బిశాచబాలికలు గైకొన్న న్మణిశ్రేణితోఁ
గ్రాలం బట్టినవెండికోరలగతిం గప్పంబు లొప్పంబుగాన్.

ఉ. తెచ్చెద రెల్లి నేఁడు మముఁ దెం డని పంచిన యుప్పుడాకినుల్
మచ్చరికంబునం జవు లమర్చుటకై డిభకుండు నీవునుం
జొచ్చినచోటు సొచ్చి రణశూరుఁడు శౌరి కరాసిధారచేఁ
బచ్చడి చేయఁగా జముని బానసముం బురుడించు చోటికిన్.

ఉ. హరి. 4 ఆ. 195, 196.

వీరశిఖామణి యగు సాత్యకిచేఁ గవి పలికించిన వ్యాక్యము లివి. శ్రీకృష్ణుని పరాక్రమాతిశయముల నగ్గడించుటయగాక, కప్పమును గూర్చి ప్రస్తావించిన కారణమున నావిషయముగూడ స్పష్టముగ హంసు నకు దెలియఁజేసినాఁడు సాత్యకి. ఇంతియగాక నీక్రింది శ్లోకములలోని భావము ననువదించు పట్టులను గూడ విపులీకరించి స్వతంత్రమగు భావములను వ్యక్తపఱచినాఁడు సోమన.

శ్లో. తస్యైవ కరసంక్షేపో జిహ్వాచ్ఛేదో నరాధమ
తస్య శార్ఙ్గరవం శ్రుత్వా శంఖస్య చ హరేః పునః॥
కోనామ జీవితం కాంక్షేత్త్వేదానీం త్వమద్య వై
గిరీశవరదర్పేణ కో బ్రూయాదీదృశం వచః॥
సహాయావయమేవైతే బలభద్రపురోగమాః

భ. వ. 118 అధ్యా. 34, 35, 36

అనువాదమున-

శా. ఆ కంసాసురభంజనుం గినియఁ జేయఁజాలు నీజిహ్వ హం
సా! కోపుంగలవాఁడ సిత్తు నది హస్తప్రాప్తిగా భూవరా
నీకంబెల్లఁ గనుంగొనంగ నిచటన్ నీసొమ్ము నీకిచ్చెదం
గా కే నంతటవాఁడనే తలఁచినం గప్పంబుఁ దెప్పింపఁగాన్.

ఉ. నేఁడప్పడి రాజ్యగర్వమున మీఁదు తలంపవుగాక చిచ్చునుం
గాడ్పును గూడినట్టు మురఘస్మరుచేతుల శంఖశార్ఙ్గముల్
వీడ్వడి మ్రోయ డాయఁ బదివేవురుజోదుల సింహనాదముల్
దోడ్పడ వే రసాతలము దూఱిన మిన్నులమీఁదఁ బాఱినన్.

ఉ. హరి. 4 ఆ. 197, 198.

మూలమున హంసుని జిహ్వాచ్ఛేదనము మాత్రమే చెప్పఁబడినది. కాని నాలుకను గోయుటయగాక నద్దాని నతనిచేతియం దుంతునని యుఁగలిపినాఁడు. అది హంసుని సామ్యము నాతని కిచ్చుట యగునట. మఱియు వాసుదేవుని నుండి హంసుఁ డడిగిన కప్పమును దేలేకున్నను సాత్యకి దన సామర్థ్యమును జూపి ఛేదించిన నాలుకను మాత్రము తప్పక యిచ్చునట. తరువాతి పద్యమున నగ్నికి వాయువు తోడుపడునట్లు మురారి శంఖశార్ఙ్గముల మ్రోఁతతోఁ బదివేవురు యోధాగ్రేసరుల సింహనాదములతోడయి హంసడిభకు లేలోకము నందున్నను వెన్నాడి తీరునని పలికినాఁడు. "సహాయావయమేవైతే బలభద్రపురోగమాః" అను దానిని తెనిగించుటలోఁ బదివేవురు జోదులనుట యథార్థవిషయ వివరణ మగుచున్నది. నారాయణ గోపాలురు పదివేవురని ప్రసిద్ధము. భారతమునందును నట్లే గలదు. మేమందరమును గృష్ణునకు సహాయులమై యున్నామని భంగ్యంతరముగాఁ జెప్పుట విశేషము. వేఱొకచో నీయఁబడిన సంఖ్యామాత్ర బలమును గ్రహించుటలో నావిషయమునకు బ్రామాణికత యేర్పడుచున్నది. ఇందుగల యుపమానము చక్కగా కుదిరినది. ఈఘట్టమున స్వాతంత్ర్యము, సమూలకము నగు విషయములు సంఘటింపబడి యాంధ్రీకరణము చక్కని పోకడల సంతరించుకొన్నది.

ఈ క్రింది శ్లోకచతుర్థ మనువాదమునకుఁ దేఁబడలేదు.

శ్లో. తావేవ వాం క్షమౌ యుద్ధే హంతుం బలమదాన్వితౌ
యోగిరీశో గిరాం దేవ వరం దత్త్వా స తిష్ఠతి॥
యువాం హి కింబలౌ యుద్ధే తిష్ఠతః సశరం ధనుః
గృహీత్వా శత్రుభిః సార్థం యుద్ధం కర్తుం సముద్యతౌ॥
ఈదృశేష్వథ భృత్యేషు యుద్ధం కుర్వత్సు శత్రుభిః
త్రైలోక్యం రక్షతస్తస్మాత్కారమిచ్ఛాన్వ్రజేత కః॥

హానిష్యత్యేవ వాం యుద్ధే త్రైలోక్యం యో హి రక్షతి
శరేణ నిశితేనాజౌ శార్ఙ్గముక్తేన కేవలమ్॥ భ. ప. 116-41, 44

ఈవిషయ మింతకుముందు చెప్పఁబడినట్టిదే. ఇంతకుఁ బూర్వము చెప్పఁబడిన దశసహస్రయోధవరులతోఁ గూడిన శ్రీకృష్ణపరమాత్ముని బలమును బలువిధములఁ బ్రస్తుతించి, యాలోకరక్షకుని గప్ప మనుగుట కెవ్వరికశక్య మను విషయమే యగుటఁ బునరుక్తి యని పరిహరింపఁబడినది.

శంఖచక్రగదాధరుఁడగు శ్రీకృష్ణు నెదిరించి, రాజసూయమును జేయుటెట్లు సమకూడు ననువిషయమును దెలుపు నీక్రింది శ్లోకత్రయమునందలి భావమును సంగ్రహించినాఁడు సోమన. వాని నిటఁ జూపుచున్నాఁడను.

శ్లో. శంఖచక్రధరే దేవే జగత్పాలన తత్పరే
రాజసూయం మహాయజ్ఞం
వదన్ వా స్వస్తిమాన్ మర్త్యస్త్వాం వినా కో వ్రజేత్సుఖం॥
ఇదమిచ్ఛసి చేన్ మూఢ హాస్యతాం యాసి భూతలే
ఇత్యుక్త్వా సాత్యకిర్వీరో హసన్నివ భువి స్థితః॥
భ. ప. 118 అధ్యా 46 - 48

పయి శ్లోకము లందలి విషయమును సంగ్రహించి, యీక్రింది పద్యము చతుర్థపాదమున నిమిడ్చినాఁడు.

క. హరితనయు లిరువురును మీ
యిరువురకును ముందుకప్ప మెవ్వని కెవ్వం
డరువఁ గలవాఁడు వెఱ్ఱీ
సురపతిపతిఁ జాసి రాజసూయము గలదే.

ఉ. హరి. 4 ఆ - 201.

సాత్యకి పలుకు వుఁ గినిసిన హంసడిభకులు కోపాతిరేకంబునఁ బలికిన వాక్యములు వ ాలమున (భ. ప. 119 అధ్యా. 4 - 14) పదు

నొకండు శ్లోకములలోఁ గలవు. అందలి ముఖ్యవిషయమును గ్రహించి మూఁడువృత్తములను రచించినాఁడు సోమన.

ఆ శ్లోకములలో ద్వివచనము నుపయోగించి యుంట హంస డిభకు లిరువురును సాత్యకి పలుకులకు బదులిడినట్లున్నది. కాని సోమన యీక్రింది వానిలో హంసుని వాక్యములుగ మొదటి రెండుపద్యములను రచించి, మూఁడవపద్యమున డిభకుని మాటలను జెప్పెను. ఆపద్యముల నిట నుదాహరించు చున్నాఁడను.

ఉ. ఓరిదురాత్మ నీకుఁ దెగ నొల్లక యుండుట నీ పరాక్రమం
బారసి కాదురా వెఱవ కాఁడుము దూతఁ డవధ్యుఁ డెందు నీ
వీరుల నిన్నుఁ జమ్మెటనె వ్రేయుదు డాయుగఁ బోరశౌరికిన్
సీరికి బాహుసార మెడసేయుదుఁ జేయుదు రాజసూయమున్.

మ. వినురా సాత్యకి మాట లేమిటికిరా వేదండకోదండకే
తనసంకేతన రేంద్రనూతనబలోదగ్రంబుగా మాహరిం
ప నవశ్యంబును వత్తుఁ బుష్కరసరః పార్శ్వంబునం దెల్లి గో
ల్లైనలెత్తింతు విరోధు లంబునిధి వెల్లిం డొల్లఁ జల్లింపఁగన్.

వ. అనుటయు డిభకుండు

చ. విడు విడు మంచు నామొనల వీరులు పోరులు గోపమున్న వా
రెడపడకుండ మిక్కిలిచట నెన్నితి క్రొందఱు సిగ్గు గాదటే
గొడగులు దప్పఁబట్టినను గోటగ నేనిక చెట్టువెట్టినన్
బడుగులు మీఁదు చూడ హరిపాపటపై నసిదంబు వెట్టుదున్.

ఉ. హరి. 4 ఆ. 205 – 208

మూలమున వలె నిరువురు సోదరులు నొక్కని కొకేపర్యాయము ప్రత్యుత్తరము సెప్పుట కంటెఁ నాయిరువుర వేర్వేఱ సంభాషింపఁ జేయుట యుచితము.

సాత్యకి, హంసడిభకులతో నాడినమాట లనువాదమున సంగ్రహింపఁ బడినవి. భ. ప. 119 అధ్యాయమున (15 – 21) శ్లోకములలోని భావ మంతయు నొకే వృత్తమున కుదింపఁబడినది. మూలమునందలి శ్రీకృష్ణ పరమాత్ముని పరాక్రమవర్ణనమును విడిచి, సాత్యకి స్వవిషయమునే చెప్పినట్లు మార్చఁబడినది. దౌత్యము నెఱపఁ బూను టను విషయమును మాత్రముచెప్పి, మిగిలిన దంతయు స్వతంత్రముగా కల్పనము చేసెను. మురారివిరోధులను తానే పూవుతోడిముండ్లను వేరుచేసినట్లు ద్రుంపగల నని పలికించుటలో సాత్యకి స్వభుజబలపరాక్రమాతిశయములు వ్యక్త మగుచున్నవి. ఇందు సోమన, సాత్యకిపాత్ర కొకవిశిష్టతఁ జేకూర్ప నెంచినట్లు స్పష్టము.

శ్రీకృష్ణుఁడు పుష్కరసరోవర తీరమును జేరి యుద్ధసంరంభ మును గావించుట మూలమునఁ (భ. ప. 120 అధ్యా) బదేనుశ్లోకము లలో వర్ణింపఁబడినది. సోమన యొక సుదీర్ఘమగు వచనమున నాభావము ననువదించినాఁడు. ఈ సందర్భమున శ్రీకృష్ణుఁడు పూరించిన పాంచ జన్యరవ మీక్రింది శ్లోకములందు వర్ణింపఁబడినది.

శ్లో. పాంచజన్యం ముఖే న్యస్య సర్వప్రాణేన కేశవః
దధ్మౌ మహారవం కుర్వంశ్చత్రూణాం భయవర్ధనమ్॥
ఆధ్మాతస్తేన హరిణా స చక్రే శంఖ రాట్ ధ్రువమ్
రవః స రోదసీ రాజన్ పూరయామాస సర్వతః॥
తస్మింఛంఖేత ధాఽఽధ్మాతే దధ్ముః శంఖాన్ సహస్రశః
భేర్యశ్చాపి సమాధ్మాతా మృదంగా బహవో నృప॥

భ. ప. 120 అధ్యా. 12 – 14

భూనభోంతరాళములను దద్దరిల్లఁజేయు నా పాంచజన్యరవమును వర్ణించు మూలశ్లోకములలోని భావమును గ్రహించి, సోమన సాలంకా రికముగ నీక్రింది పద్యమును రచించినాఁడు.

సీ. వడఁకు పన్నగరాజు పడగలమీఁద స
ర్వంసహాకాంత పేరణము సూప
నుయ్యూఁత లూఁగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాట మాడఁ
దెర లెత్తి సప్తసాగరములుఁ బొరలంగ
వసుఘుండు గొండిలి పరిఢవింప
మొకములచాయ వేళాకచందముగనిల్పి
కమలసంభవుఁడు ప్రేంఖణ మొనర్ప

తే. మంగలములోని ప్రేలాలమాడ్కిఁ జుక్క
లిక్కడక్కడ వడ దిక్కు లెనిమిదియును
బగులఁ బాతాళతలము గుబ్బటిలఁ జెలఁగె
శౌరి పూరింప నప్పాంచజన్యరవము.

ఉ. హరి. 4 ఆ. 216

పయి బద్యమునందలి వర్ణనమంతయు నమూలకమే. ఇందలి భావ మపురూపము. భీకరంబగు నా పాంచజన్యరవము భూమ్యాకాశాదులఁ దల్లడిలఁజేసిన కారణమున, సోమనయు నాభావమునకే రూపకల్పనము గావించి, సొగసుగ తీర్చిదిద్దినాఁడు. సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడును, బాతాళలోకమును గలఁగినట్లు జూపుటలో శ్రీకృష్ణుని పాంచజన్యరవప్రభావము మూలమునకన్న నధికతరముగ వ్యక్తీకరింపఁబడినది.

ఈ విధముగనే సోమనాథుఁడు హంసడిభకుల సేనావాహినిని వర్ణించుటలోఁ గూడ నొక విచిత్రమగు రచనమును జేసినాఁడు. పది యక్షౌహిణుల మేరకుఁగల యా చతురంగబలము నొకసంవత్సరముతోఁ బోల్చి చూపినాఁడు. సంవత్సరమునందు గలుగు ఋతువు

లారింటిని జేర్కొని, వానిని రథ గజ తురగ పదాతులతోడను ధ్వజ ములు, ఖడ్గములతోఁ బోల్చి చూపుట విశేషము. ఆపద్యము నిట నుదాహరించుచున్నాను.

సీ. కరటిఘటాకోటికటసిగ్గళన్మదా
సారంబు దొలుకారుఁ జేరఁ బిలువ
రథనేమి నిర్భిన్న పృథివీపరాగంబు
సీహారసమయంబు నేర్పుఁ దెగడ
సుభటభుజోద్భటక్షురికాప్రభాభంగి
మండువేసవితోడ మాట లాడఁ
దురగఘట్టఖలీనధుతఫేనతారకా
వళి శరత్కాలంబు వరుసఁ జూపఁ
తే. బవనచంచలధ్వజపటపల్లవములు
నవవసంతంబుఁ దెలుప సన్నాహతరళ
ఖడ్గలతికలు శిశిరంపుఁగడఁక నెఱప
హంసడిభకులసేన వేఁడనఁగ నడిచె. ఉ. హరి. 4 ఆ. 223

ఇందు వర్ష, హేమంత, గ్రీష్మ, శరత్తు, వసంత, శిశిరములు వరుసను జెప్పఁబడినవి. ఇందు ఋతువుల నొకక్రమములో వర్ణింపలేదు. కాని వివిధములగు బలముల కాఋతువుల నేఱికొనుటలో సోమన యుచితజ్ఞత కానగును.

హంసడిభకులు యాదవులపై దండెత్తి వెడలినను జరాసంధుఁడు వారికి సాహాయ్యముగ నరుదేరలేదు. ఈ సందర్భమున మూలమున నీ క్రింది విధముగ గలదు.

శ్లో. తతః శ్రుత్వా జరాసంధో విగ్రహం యదుభిస్సః
నాకరోన్నృప సాహాయ్యం పాపం మే భవితేతి హ॥
భ. ప. 121- అధ్యా. 16

యాదవులపయి హంసడిభకు లన్యాయముగ దండెత్తిరను ధర్మ భయమువలన జరాసంధుఁడు యుద్ధమున సాహాయ్యము చేయలేదనుట యసంగతము. అంతకుఁ బూర్వము జరాసంధుఁడు పదునెనిమిది పర్యాయములు మధురపయి దండెత్తినాఁడు. శ్రీకృష్ణుఁడును వానికి జడిసి, మధురనుండి ద్వారకకుఁ దన నివాసమును మార్చెను. కావున సోమన యౌచితీనిర్వహణార్థము నీవిషయము నీక్రిందివిధముగ మార్చినాఁడు.

క. బాంధవము చూడక జరా
సంధుఁడు దిగ విడిచె వారి సైరణ చెడి క్రో
ధాంధుఁడు దుర్వాసుం డను
సంధించుం దనకుఁ దగనిశాపం బనుచున్. ఉ. హరి. 4 ఆ. 225.

మూలమున పాపభయమువలన కంటె, దుర్వాసు శాపభయము వలన హంసునకుఁ దోడ్పడలేదనుటయే యుచితము. హంస జరాసంధు లకు బాంధవ్యమును మిత్రత్వమును గలవు. హంసుఁడును నింతకుఁ బూర్వము జనార్దనునితో నిట్లు చెప్పి యున్నాఁడు.

క. మనకు జరాసంధునకును
మనసులు గలసినవి ధర్మమయుఁ డాతం డీ
పని గాదనఁ డింక జనా
ర్దన యాదవనగరమునకుఁ దడయక చనుమీ.

ఉ. హరి. 4 ఆ. 133.

జరాసంధునకు దుర్వాసునెడ భయము, భక్తి కలదనుటకుఁ దార్కాణముగ నీదిగువ నుదాహరించిన దుర్వాసుని పల్కులవలనఁ దెలియుచున్నది.

మ. సకలోద్యోగకృతానుబంధుండు జరాసంధుండు బంధుండు మీ
కకలంకుం డతఁ డాశ్రమస్థులను నౌదాసీన్యముం జేయఁ డూ
రక పాయంగలవాఁడు నేఁడు మిము దుర్వ్యాపారులంజూచి కొం
కక మీకింకిరికిం జెలంగినఁ దొలంగం బాయుఁ దద్ధర్మముల్.

ఉ. హరి. 4 ఆ.68.

ఇక శ్రీకృష్ణాదులతో హంసడిభకుల యుద్ధవర్ణనము మూలమున నిరువదియైదు శ్లోకములోఁ గలదు. అం దాయుధవిశేషముల వర్ణనమును గలదు. సంకులసమరమున సైనికులు స్వపరబల తారతమ్యమును గానలేకుండిరనియు, నా సమరము దేవాసురయుద్ధమువలె నున్న దనియుఁ జెప్పఁబడినది. సోముని యుద్ధవర్ణన మొక ప్రత్యేకధోరణిని నడచినది. మఱియు నిది స్వతంత్రమగు రచనము. ఆవచనము నిటఁ జూపుచున్నాఁడను.

వ. ఇట్లు తలపడి సాయకనికరంబులఁ గరంబుల మనికట్లపట్లకుఁ దునిమిన మునుకొని కరవాలంబులు వదనంబులం గఱచికొని కదనంబునకుం బఱచువారలనుం గణఁగి గద ప్రేసిశం గిసిసినట్లు దునిసిన చరణంబులతో మరగాళ్ళం దిరుగువెరవకులకై వడిం దిరిగి యుడిదంబులం బొడిపొడిగా నడుచు నడజోదుభటులును దండతండంబు లగు వేదండంబులతొండంబులు దంషెలం దగిలినం గదలనేరని తురంగంబుల పై మలంగి దంతంబులకొలందికిం దయవలికత్తులం దుత్తుమురుగా మెత్తి విడిపించురవుతులు దేరులగముల చేరువల సారువలు గట్టు వారువంబులపక్కెరల పై నెక్కుడఁ జూచినం గ్రిక్కిఱియ నాటిననెఱనారసంబులు వెఱికి పిఱుందు ముండఱగా నేసిన విలుకాఱచేతం జీకాకుపడిన రథికులును గడుపులు గాఁడంబొడిచి యెత్తిన గడలకడలం బ్రేవులు చుట్టి పట్టి దిగం బడక వెఱబొమ్మలం గట్టినట్లు వ్రేలియును వ్రేల్మిడి మొలలకఠారమ్ములు వెఱికి గడలు తెగనఱికి దిగ నుఱికి పగఱం జిఱ్ఱుమఱ్ఱాడు సహజసాహసులును డొంకెనలం బొడిచినఁ గత్యాలు గడచి తాళులు విఱిచి సంధులు గాఁడి ప్రక్కలు వ్రక్కలు చేసినం జలింపక బంకింపక జంకించి లవుడి [illegible] బొమిడికంబులతొడవ మొమ్ములు నలిగులి యైనఁ దలలు [illegible]లం బొదివి కట్టి మెట్టికొని నిల్చిన యుసెధాయులును గసిమసంగిన

మారి పిసికి పిండలివండు చేసిన చందంబున గొండ లైనకండలలోఁ గలసి పేరినరుధిరంబునఁ దరంబు సవి మెట్టి గుట్టట్టు గదల నేరక యూరక యున్నగజంబులపై గజిబిజింపక భుజబలంబు సూపుజోదులును నురవడించిన యరదంబులకడనొగలు దాఁకి తలలు పగిలి హయంబులు గూలకయున్న లవణిగలిగి లంఘించి కిరవాలంబులు విసరిన మ్రొగ్గతిలినయుగ్యంబులును దలలు దునిసిన సారథులునుం గడిఖండంబు లైనకోదండంబులునుం గలిగి రథులతోఁ బలుగాఁడిపై జిరాణంబుల బారి సమరి కరిం బడినయాశ్వికులును బలకలవారిపై బుఱుఁగోడక పురికొల్పినకంఘటల కడ్డంబు చొచ్చి మచ్చరికంబునం బచ్చడికి సఱకినట్లు కొమ్ములు విఱిచియు నెమ్ములు త్రుమ్ములు చేసియు శుండాదండంబులు చిదిమియుం గుంభంబులు వగుల నేసియుం బ్రక్కలు సెక్కలు వాపియుం బెక్కువిధంబులం జిక్కువరచు పంతగాఱును మఱియును గిరిగొన రాలినమణిభూషణంబులుం జిద్రుప లైనమకుటంబులునుం జిందఱవందఱ లైనజోళ్ళునుం జిక్కువడినచామరంబులును నొఱగినపడగలును దఱిగినమస్తకంబులునుం బొరలెడియట్టలును దెరలెడితిట్టలును గట్టలుకొన్నకైదువులును బొడి యైనరథాంగంబులును సలిసిన యంగంబులునుం దెలిసిన మొగంబులునుం గ్రాలం గీలాలజలప్రవాహంబులం దేలియాడు వెలిగొడుగులును బుట్టల మీఁదం గాలూఁది యున్న బేతాళబాలికలు పుండరీకంబుల మూఁగినయళికులంబు విడంబింప నిశిత భల్లంబులం బెల్లగిల్లి డొల్లినసమౌక్తికగజకుంభపాలికలు గరంబులం బూనిన డాకినులు సురనారీపరస్వయంవరసమయంబున సకుంకుమాక్షతవ్రాతపాత్రహస్తలై సుప్రశంబు చెప్ప వచ్చిన సతులం దలంపింపఁ బ్రహారమూర్ఛాపరవశు లగువీరుల బొంగుగలు ప్రచ్చి పెఱికి తిగిచినం బ్రేగులు లంకున్న ముక్కుల నూఁది పట్టి వెనుకకు

నిక్కి తెక్కలు విడ్రుచు కంకణగృధ్రంబులచేతం జలిగాలి సోఁడమి నం దెలిసి సచేతనంబు లగుకళేబరంబులునుం గలిగి మఱియు నొం డొరుల మెచ్చక నీసున వ్రేసిన యసిధారలు మండగండుమిగిలి మెదడునం బ్రుంగి మజ్జంబులు దలమునుకలుగ సందడిం దడఁబడ కుండ ముందలపట్లు వట్టికొని పోట్లాడువారును మొనకయిదువుల పయిఁడటిసి నుఱికి సరకు సేయక వీఁపునం జెంగలువరేకులు వెడ లినయట్లు వెడలఁ గెడయువారును వీరు వా రనక వీరావేశంబునం జేతులకసి వోవం జెలరేఁగి సింహనాదంబులు సేయుచు మోఁదు వారునుం దిరుగుడు వడక తవియక బీరంబు సెడక బీఱువోక యొద్ద గిల యొదుఁగక వేసఱక విఱుగక విబుధలోకంబునకు వెక్కసం బును వేడుకయునుం గదుర నసమ సమరంబు సేయ మధ్యాహ్న సమయం బయ్యె నయ్యవసరంబున.

ఉ. హరి. 4 ఆ. 229

మూలమునఁగల గ్రద్దలు, రాబందులు వచ్చి చేరినవను సందర్భ మునఁగల జుగుప్సావహములగు వర్ణనములను, మరణించినవారి సం ఖ్యాది విషయములను సోమన విడిచినాఁడు. భేతాళ బాలికలును, డాకినులును సువ్రతంబు చెప్పవచ్చినట్లున్నదని రూపకమును గల్పించి యుద్ధరంగవర్ణన మొనరించుటలో నీతని కీతఁడే సాటి యనిపించునట్లు సోమన పై వచనమును రచించినాఁడు.

శ్రీకృష్ణుఁడు, నిచక్రుని సంహరించు ఘట్టమున సోమన యను వాదసరణియు చక్కగ నున్నది. మూలమున నీవిధముగా గలదు.

శ్లో. తం గృహ్య సాహసా కృష్ణో హతో௨సీతి వదన్ హరిః
ఖండశః కారయామాస ఖడ్గేన నిశితేన హ॥

భ. ప. 123 అధ్యా. 17.

ఇందలి "హంతో౽పి" (చచ్చితివిపో) అను భావమును దెనిగించుట నీక్రింది పద్యమునందు గన్పట్టుచున్నది.

క. అనుచుం బరిఘము వైచిన
దనుజాంతకుఁ డొడిసిపట్టి తన ఘనహేతిం
దునుకలుగ నటికి నీపాం
గినపుడిసెకుఁ బోయె నను మ గేలి యొనర్చెన్.

ఉ. హరి. 4 ఆ. 237.

ఇందు "హంతో౽సి"అనుదానికి "సిపాంగిన పుడిసెకుఁ బోయె" ననుట మూలానుసరణమయ్యును, స్వతంత్రమును సలక్షణమును నగు భావమును స్ఫురింపఁజేసినాఁడు సోమన.

మూలమును యథాతథముగా ననువదించియుఁ బ్రసిద్ధమగు నొకనూతన విషయమునుగూడ జేర్చి, భావస్ఫూర్తిని జేకూర్చుటయు సోమన రచనయందు గన్పట్టును.

శ్లో. హతశిష్టాస్తతో దైత్యాః పలాయంతో దిశో దశా
అద్యాపి న నివర్తంతే గచ్ఛంతో వై మహోదధిమ్॥

భ. వ. 123 అధ్యా 22

శ్రీకృష్ణుఁ డాగ్నేయాస్త్రమున విచక్రుని సంహరించినంతనే, యాతని సేన యందున్న దైత్యు లందఱును పలుదిక్కులకుఁ జెదరి, సాగరమునఁ బడి యణఁగి యుండిరి. ఈవిషయమును దెనిఁగించు పట్టుల నారక్కసులు "నీళ్ళలోని ముళ్ళైరి" అని స్వతంత్రముగఁ గలిపినాఁడు. వారికంటకలు నీళ్ళయందుందురని ప్రతీతి కలదు. దాని నిట సోమన యుగ్గడించినాఁడు.

## పంచమాశ్వాసము

బాణాసురుఁడు బాలేందుశేఖరుని భక్తులలో నగ్రగణ్యుఁడు. ఆతఁడా దేవదేవునిఁ దండ్రిగా బడయకున్న తనజన్మము సార్థకము

గాదని ఘోరతపమున శివుని మెప్పించి, యట్టి వరమును బొందెను. మూలమున నీఘట్టమున నీక్రింది శ్లోకములు గలవు.

శ్లో. తతోఽగ్లపయ దాత్మానాం తపసా శ్లాఘతే చ సః
దేవశ్చ పరం తోషం జగామ చ సహోమయా ॥
నీలకంఠః పరంప్రీతిం గత్వా చాసుర మబ్రవీత్
వరం వరయ భద్రం తే యత్తే మనసి వర్తతే ॥
అథ బాణోఽబ్రవీద్వాక్యం దేవదేవం మహేశ్వరం
దేవ్యాః పుత్రత్వ మిచ్ఛామి త్వయా దత్తం త్రిలోచన ॥

వి. ప. 116 అధ్యా 14, 15, 16.

వీనిలో బాణాసురుని తపమునకు శివుఁడు ప్రత్యక్షమయి వరము గోరుకొమ్మనుటయు, బాణుఁడు తనకోర్కెను వెల్లడించుటయు గలవు. కాని యనువాదమున శివుఁడు సాక్షాత్కరింపఁగనే నాయసురరాజు తన భక్తిమెయిఁ జేసిన శివస్తుతి మూఁడు వృత్తములలోఁ గలదు. ఆ మూఁడు వృత్తముల నిటఁ జూపుచున్నాఁడను.

ఉ. కొలువఁగ నేర నిన్ను శతకోటి విభాకరతేజు డగ్గఱం
బిలువఁగ నేర నిన్ను మునిబృందవివేక విమర్శదూరునిన్
విలువఁగనేర నిన్నుఁ బృథివీవియదంతరభిన్ను నేమిటన్
నిలువఁ గదయ్య నాహృదయనీరజకర్ణికపై మహేశ్వరా.

చ. కలఁగని వారు నిన్ను మదిఁ గొఁగిట నెత్తెడువారు ముక్తికిం
దొలఁగనివారుగాఁ దెలియుదుం దలపోయుదు లోన నాసలున్
నలఁగవు హృత్పయోజసదనంబునకు నిన్నుఁ దెచ్చునంతకున్
మలఁగఁగ దే త్రికోణమణిమండపదీపికపై మహేశ్వరా.

చ. ఒరసిరి నిన్నుఁ దర్కనికపోపల ధారల వన్నెఁ గానరె
త్తరసిరి విశ్వముం గపిలమైనను నీదెస ముల్లుసూపఁగా
బెరసిరి బ్రహ్మముఖ్యులగు పెద్దలు బచ్చులు వోలెనెల్లచో
నెరసిగాని నిన్నెఱుఁగ నేరరు నావశమే మహేశ్వరా.

ఉ. హ. 5 ఆ 9,10,12.

పై పద్యములందుఁ జివరను "మహేశ్వరా" అను మకుటము కలదు. పరమ మాహేశ్వర భక్తుఁడగుట నీ సందర్భమున నిట్టిస్తుతి యావశ్యకమే. ఈతని స్తుతియుఁ దదనుగుణముగా నున్నది. మఱియు సోముని కవనమున కూడ నొక విశిష్టత గన్పట్టుచున్నది. మఱియొకవిషయము. పయివానిలో రెండవపద్యము కందుకూరి వీరేశలింగము పంతులుగారిచే బరిష్కృతమయిన ప్రతిలో లేదు. (క్రీ. శ. 1897 వ సంవత్సరమున ప్రప్రథమముగా పంతులుగారిచే ప్రచురింపఁబడినది.)

సహస్రబాహుఁడగు బాణాసురుఁడు తన చేతుల తీటవోవ కయ్యము శివుని యర్థించు పట్టుల నమూలకముగా నీక్రింది పద్యము రచింపఁబడినది.

సీ. ఖురఖలీనాఘాత కోలాహలంబుతో
నేమిసంక్షోభంబు నెఱప లేదు
నఖపుంఖరోచులు నారితో సంధించి
కర్ణావతంసంబు గడప లేదు
మణికిరీటకరోటిమంజీరములు రాయ
వీర మధ్యంబులు వ్రేయ లేదు
దంతిదంతావళదంతంబు లొరయ డా
కినుల వాచవులఁ జొక్కింప లేదు
తే. లేదు ప్రతిభటబాహావలేపమహిమ
లేదు సంగ్రామభీమకేళీరవంబు
లేదు విక్రమక్రీడయు లేశ మైన
లేదు రాజ్యంబు గలిగియు లేదు ఫలము.

ఉ. హరి. 5 ఆ. 19

దేవదేవుని కయ్యము దయసేయు మనుటలో బాణాసురునకుఁ గల సంగ్రామకేళిడోత్సాహము స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

33

మఱియు నంతటి ఘోరసంగ్రామమునఁగాని తనచేతుల తీట పోవదనియు వ్యక్తపఱుపఁబడినది. కావున నిట నీయుద్ధవర్ణనమును గావించుట యౌచిత్యపోషణమే యనఁదగును.

ఈదిగువ నుదాహరించిన శ్లోకములలో శివబాణాసురుల సంభాషణము కలదు. శివుఁడు వరమును గోరుకొమ్మనుటయు, నడిగినదాని నాతఁ డనుగ్రహిఁచుటయుగాక దక్కినసంభాషణ మనావశ్యకమని సోముఁ డావిషయము ననువదింపలేదు.

శ్లో. ప్రసన్నవదనో భూత్వా పాదయోః పతితోఽబ్రవీత్॥
దిష్ట్యా బాహుసహస్రస్య న వృథా ధారిణం మమ
దిష్ట్యా సహస్రాక్షమహం విజేతా పునరాహవే॥
ఆనందేనాశ్రుపూర్ణాభ్యాం నేత్రాభ్యా మరిమర్దనః
పంచాంజలి శతైర్దేవం పూజయ న్పతితో భువి.॥

ఈశ్వర ఉవాచ:

ఉత్తిష్ఠోత్తిష్ఠ బాహూనామాత్మనః స్వకులస్య తు
సదృశం ప్రాప్స్యసే వీర యుద్ధమప్రతిమం మహత్॥

వైశంపాయన ఉవాచ:

ఏవముక్తస్తతో బాణస్త్ర్యంబకేణ మహాత్మనా
హర్షేణా త్యుచ్ఛ్రితం శీఘ్రం ననామ వృషభధ్వజమ్॥
శితికంఠవిసృష్టస్తు బాణః పరపురంజయః
యయౌ స్వభవనం తత్ర యత్ర ధ్వజగృహం మహత్.

వి. ప. 116 అధ్యా. 32-36.

బాణుఁడు తన యభీష్టప్రాప్తిని మంత్రిసత్తముఁడగు కుంభాండునితో వివరించుపట్టుల నీక్రిందిపద్య మమూలకముగా వ్రాయఁబడినది.

ఉ. నెయ్యము లేనిసంగతియు నిక్కము లేనివచోవిలాసమున్
వియ్యము లేనివైభవము విందులసందడి లేనిముంగిలిం
దియ్యము లేనిచాగమును ధీరత లేనియమాత్యకృత్యముం
గయ్యము లేనిశూరతయుఁ గైకొని యారక మెచ్చవచ్చునే.
ఉ. హరి. 5 ఆ. 31

కయ్యములేని తనయొక్క శూరత్వము నిష్ప్రయోజనమని బాణుఁ డూహించినాఁడు. ఆ విషయ మింతకుముందే వివరింపఁ బడినది. కాని సోమన సమర్థుఁడగుట సమానార్థకములగు మఱికొన్ని విషయములనుచేర్చి చిత్రముగ సంఘటించినాఁడు. ఇందు పేర్కొనఁబడిన విషయము లన్నియు సత్యములే. స్నేహములేని చెలిమి, సత్యదూరమగు వాఙ్నైపుణ్యము, వైవాహికసంబంధములేని వైభవము, విందులచే నలంకరింపఁబడని గృహమధ్యభాగము, నేర్పరితనములేని త్యాగము, ప్రాగల్భ్యములేని మంత్రిత్వము వన్నె కెక్కవనుట నిక్కవముగదా! వీనిలో తొలుతచెప్పఁబడిన విషయములు లోపించినచో రెండవవిషయము లప్రధానములై కళావిహీన మగును. కొండొకచో వ్యర్థములే యగును. భావస్ఫూర్తికయి సమాన ప్రతిపత్తిని గలిగియుండు విషయముల నన్నిటి నొకచోఁజేర్చి కవనమల్లుట సోమన ప్రతిభావిశేషమునకు లోకజ్ఞతకుఁ దార్కాణ మనవచ్చును.

హరుని వరప్రసాదబలమున నెమలిపడగ బల్లున విరిగి పడినది. తోడనే శోణితపురమున నుత్పాతములు పొడసూపినవి. బాణుఁ డీవిషయములను బట్టించుకొనలేదు. మంత్రివర్యుఁడగు కుంభాండుఁడు మాత్ర మీయరిష్టసూచనలకు వగఁజెందినాఁడని మూలమునఁ గలదు. ఈ సందర్భమునఁ జెప్పఁబడిన పది (వి. ప. 116 అధ్యా. 74-83) శ్లోకములను సోమన పరిహరించినాఁడు.

ఆశ్లోకములలో కుంభాండుని యాలోచన, యుత్పాతముల నిరసించుట, యుత్పాతములు మిథ్యయైనచో ఫలితములును మిథ్యయే

యగునని తలంచుట యిత్యాది విషయవర్ణనము కలదు. సూక్ష్మపరిశీలనమును జేయ నీవిషయముల ననువదించు టనావశ్యక మనిపించును. సోమన పయిభావముల పిండితార్థముగ నీక్రింది పద్యమును రచించి నాఁడు.

క. తమచేసిన దుష్కృతములు
  తముఁ జెరచుంగాక వేఱ తడవంగలదే
  తమచేసిన సుకృతంబులు
  తముఁ గాచును రెండునేల దైవంబునకున్.

ఉ. హరి. 5 ఆ. 46.

ఇందుధరోపాఖ్యానమున ప్రకృతి నాధారముగఁ జేసికొని యేడు పద్యములలో వనకేళిని, పదిపద్యములలో జలకేళిని సోమన మూలమున లేని వర్ణనలను జేసినాఁడు. ఇందులకే ముందుపద్యమున నొకమార్పును గావించినాఁడు. పార్వతీపరమేశ్వరులు విహారార్థము నదీతీరమునకు వెడలినారని మూలమునఁ గలదు. అనువాదమున సోమన లీలోద్యాన కేళీసరిన్నికటానేక విహారదేశములకుఁ బోయినట్లు మార్చినాఁడు. నిత్యము పరమేశ్వరుఁడు సతీసమేతుఁడయి గాచియుండు నా బాణాసురుని పట్టణపరిసరప్రాంతములందు మనోహరములగు నుద్యానవన భూములుండుటలో నాశ్చర్యములేదు. ప్రాబంధికవర్ణనము లగు నీ వన కేళి జలకేళి వర్ణనముల గావించుటలోఁగూడ సోమన తన రచనాచమత్కృతిని వెలయించినాఁడు. వనకేళీ విహారమును వర్ణింపుచు నాలంకారికమగు రచనావిన్యాసమున కీ దిగువ నాపద్యముల నుదాహరించుచున్నాను.

సీ. కిసలయంబులతోడఁ గెంగేలు దడఁ బెట్టి
      విరులపై నఖకాంతి విజ్జరాల్చి
  లేఁదీఁగలకుఁ దనూలీలఁ గానుక యిచ్చి
      గుత్తులు బాలిండ్లు గొలిచి చూచి

చలిగాలి నిశ్వాససౌరభంబుల నాఁగి
యళిపంక్తిఁ గురులతో నలుక దీర్చి
పుష్పాళ్ళ సెలగందములు పయ్య మందించి
పూఁదేనెఁ జెమటల బుజ్జగించి
తే. తొడలు నరఁటి కంబములు మెడలు బోఁక
బోదెలు నెలుఁగులును బరపుష్టరుతులు
మాటలును గీరభాషలు మక్కళించి
చిగురుబోఁడులు వనకేళి జేయఁ జేయ.

మ. ఒక రామాతిలకంబు రత్నరుచితో నొప్పారు మందారకో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్ రాఁగాలతాసక్తచూ
చుకచేలాంచలయై మలంగి విడుమంచుం గేలుసాచెన్ ననా
యకమౌర్వ్యందెగఁగొన్న మన్మథుని ప్రత్యాలీఢపాదంబునన్.

సీ. నుడిగొన్న చిగురాకుజొంపంబు గెంపారు
తలమీఁద మల్లికాదామ మడఁచి
నిడుదతామరతూఁడు నెట్టెంబు సుట్టి పైఁ
బటికంపుఁగడియంపుభాగ మదిమి
తోన యాకేళివఁ జెందొవఱేకు హత్తించి
మెడచక్కిఁ గస్తూరి మెదిచి పూసి
పాయ గొమ్మల నల్లఁబట్టు దగిల్చి య
క్కొనయాకుపై వెండికోర వెట్టి
తే. ధవళకేతకీధూళి గాత్రమునఁ జెరివి
మోకమామిడి కొకకాంత మ్రొక్కి నిలిచి
యొడలిలోఁ జక్కనగము నా కొసఁగు మనుఁడు
నద్రికన్యక తలవాంచె హరుఁడు నవ్వె.

ఉ. హరి. 5 ఆ. 50, 53, 56.

ఇఁక సోమనాథుని జలకేళీవిహారవర్ణనము నుండి యాతనిరచనా వైశిష్ట్యమును జూపుపద్యముల నిట నుదాహరింతును.

చ. తలిరుల( జోఁకెనో దొనల( దాఁకెనో తొండపుఁ బిండు ప్రాఁకెనో
పులినము లెక్కెనో కనకపుంగలశంబులు ద్రొక్కెనో మెఱుం
గులగమిఁ జిక్కెనో యనఁ దగుం దలఁపంగఁ దరంగమాలికల్
మెలఁతల యంగసంగతులమీఁదికి మీఁదికి నాస చేయుచున్.

సీ. అరుణారవిందంబు లని ప్రొక్కెనో కాని
చిగురుటాకుల నింత సేర రావు
పులినంబు లని చాల బుజ్జగించెనొ కాని
మరుచక్రముల నింత మరిగి రావు
చక్రవాకము లని సవరించెనో కాని
కరికుంభముల నింత గదియ రావు
గంభుమీ లని చాల గారవించెనొ కాని
పూవుఁదూఁపుల నింత వొంది రావు

తే. తరఁగ లాత్మీయధనములదాయ లైన
చరణములు నితంబములును జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృంగారజలధి
తరఁగ లింతులు పైకొన్నఁ దలఁకినట్లు.

చ. అలఁతితరంగలుం దఱులు నంబురుహంబు మొగంబు షట్పదం
బులు నలకంబులున్ సుడియుఁ బొక్కిలి నెక్కుడు వేడ్క సేయఁగాఁ
నెలఁతుకసంగడిం గమలి నింగిని జుట్టెమునున్న సీరిపై
గాలిచి భవాని చెచ్చెఁ జనుగుబ్బలజోడుగ జోడుజక్కవల్.

ఉ. హరి. 5 ఆ. 65, 66, 67

ఈక్రింది శ్లోకః తెప్పయ మాంధ్రీకరణమున బరిహరింపఁబడినది.

శ్లో. భవస్య పార్షదా దివ్యా నానారూపా మహౌజసః
దేవ్యా హ్యనుజ్ఞయా సర్వే క్రీడంతే తత్ర తత్ర హ ॥
అథ తే పార్షదాస్తత్ర రహస్యే సువిపశ్చితః
మహాదేవస్య రూపేణ తచ్ఛిష్యాం రూపమాస్థితాః ॥
తతో దేవ్యాః సురూపేణ లీలయా వదనేన చ
దేవీ ప్రహాసం ముముచే తాంశ్చైవాప్సరసస్తదా॥
తతః కిలకిలా శబ్దః ప్రాదుర్భూతః సమంతతః
ప్రహర్షమతులం లేభే భవః ప్రీతమనాస్తదా।

వి. ప. 117 అధ్యా. 8-11

వీనియందు అప్సరసలు, ప్రమథులు శివపార్వతుల రూపమున క్రీడించుటయుఁ దత్క్రీడావిలాసములకు శివపార్వతులు సంతసించుటయు విషువఁబడినది. పార్వతీపరమేశ్వరుల విహారమును గన్నులారఁ జూచిన యుషాకన్యకుఁ గలిగిభావమును మూలమున నిట్లు చెప్పఁబడినది.

శ్లో. ధన్యా హి భర్తృసహితా రమత్యేవం సమాగతా
మనసా త్వథ సంకల్పముషయా భాషితం తథా॥

వి. ప. 117 అధ్యా. 14.

పయి శ్లోకమునందలి విషయమును గ్రహించి, యనువాదమున సోమన విపులీకరించినాఁడు. ఉషాకన్యభావముల వివరముగఁ జెప్పుటలో నొకప్రయోజనమును గలదు. తానుజూచిన విషయ మామె మనమున నేరీతిని హత్తుకొనినదియుఁ దెలియుట కవకాశము కలదు. ఈ విషయములను వివరించు పద్యము నిట నుదాహరించుచున్నాను.

సీ. సల్లాపనవసుధాసారంబు చెవిఁ గ్రోల్వఁ
జెలికత్తెఁ బుచ్చి మెచ్చించువారు
నానందమకరంద మందంద పైఁ జిందఁ
గడకంటిచూపులఁ గప్పువారు

పురం ప్రవివిశ్రుః హృష్టాః కాశ్చిదాకాశమాస్థితాః
తతః ప్రభృతి సా దేవీ కామమోహం గతా విభో॥
వి. ప. 117 అధ్యా. 26, 27, 28.

మూలమునఁ బార్వతి యుపకృశ్యగాఁగా ననువాదమున శివపార్వతులు శోణితపురమున కరుదెంచినట్లు చూపఁబడినది. మూలమున శివుని జాడ యేమైనదియుఁ దెలుపలేదు. ఈ లోపములఁ బూరించుటకయి సోమన యీక్రింది పద్యము నిట్లు వ్రాసినాఁడు.

క. దివసావసానమున భవ
భవానులుం జెలులుఁ దురగభద్రేభరథా
ది వివిధయానములు లమరం
దివిఁ గొందఱు నరుగ నరుగుదెంచిరి పురికిన్.ఉ. హరి. 5 ఆ. 82

అనంతర ముషాకన్య విరహవేదనాదులు మూలమున ముప్పదియేడు శ్లోకములలో వివరింపఁబడినవి. అందు చెలు లామె నోదార్చుట, బాణాసురపత్ని యుష యస్వస్థతను విని వైద్యులతో నరుదెంచుట, జలక్రీడావిశేషతను జ్వరపీడితయైన దనుట, దృష్టిపాతమని భ్రమించుట మొదలగు విషయము లనావశ్యకములని సోమన విడిచెను. మఱియు నీక్రిందిశ్లోకములలోఁ గల యశ్లీలపదప్రయోగమును గ్రహింపకుండుటయు విశేషము.

శ్లో. సా స్వప్నే రమితా తేన స్త్రీభావం చాపి లంభితా॥
శోణితాక్తా ప్రరుదతీ సహసైవోత్థితా నిశి
తాం తథా రుదతీం దృష్ట్వా సఖీ భవసమన్వితా॥
చిత్రలేఖా వచః స్నిగ్ధముఖాచ పరమాద్భుతమ్
వి. ప. 118 అధ్యా. 3, 4, 5.

బాణాసురకన్య స్వప్నమును గని పరితపించుపట్టుల మూలమునందలి వివరణమును విడిచి యనువాదమున నౌచిత్యమును బోషించెను.

శా. ఆద్రై తేయుతనూజు నింగి వసునాహార్మ్యంబుపై నొక్కనాఁ
డేదిక్కుం జెలిపిండు మెండుకొనఁగా నేకాంతనిద్రారతిన్
మోదింపం గలలోఁ గుమారుఁ డొకఁడేమోచేసినం దాల్మిపెం
పేదన్ దిగ్గన మేలుకాంచి నయనోద్దీర్ణాశ్రుసిక్తాస్యయై.

ఉ. హరి. 5 ఆ. 84.

శోణితాక్త, రమితా మొదలగు పదముల ప్రయోగము జుగుప్సాకరము, అశ్లీలాయుతము నని పరిహరించి, "ఏమోచేసె" నని రచించుట యుక్తముగ నున్నది.

మూలమునందుగల యొక చిన్న భావమును మాత్రము గ్రహించి పెంచిన భాగము నీదిగువ నుదాహరింతును.

శ్లో. ఏవం సంఘర్షితా సాధ్వీ కథం జీవితుముత్సహే
పితరం కిం ను వక్ష్యామి దేవశత్రుమరిందమమ్॥
ఏవం సందూషణకరీ వంశస్యాస్య మహాత్మనః
శ్రేయో హి మరణం మహ్యం న మే శ్రేయోఽద్య జీవితమ్॥
ఈప్సితో వా యథా కోఽపి పురుషోఽధిగతో హి మే
జాగ్రతీవ యథా చాహమవస్థైవం కృతా మమ
నిశాయాం జాగ్రతీవాహం సీతా కేన దశామిమాం
కథమేవం కృతా నామ కన్యా జీవితుముత్సహే॥
కులోపక్రోశనకారీ కులాంగారీ నిరాశ్రయా
జీవితుం న స్పృహేనారీ సాధ్వీనామగ్రతః స్థితా॥
ఇత్యేవం బాష్పపూర్ణాక్షీ సఖీజనావృతా తదా
విలలాప చిరం కాలముషా కమలలోచనా॥

వి. ప. 118 అధ్యా 11–16.

పయి శ్లోకములలో "కులోపక్రోశనకారీ," "కులాంగారీ" అను పదముల నాధారముగఁ జేసికొని, యీక్రింది పద్యము చెప్పఁబడినది.

సీ. మా తండ్రి కొలువులో మసిసీలకంబ
రమ్మను నాపేరు వమ్ముసేయ
నా తోడినీడలై నను బిన్న పెద్దగా
నపరించు మీచూపు జాఱువాఱ
బ్రతి దేవతలు నన్ను బయలనెత్తిన దివ్వె
యఱచేతి మానికమనుట దప్పె
నల్లపో ల్లెఱుఁగని నాకులంబను మంచి
మడుఁగు జీరకుఁ జాలమైలసోఁకె

తే. నింకమెచ్చని వారు మోమెత్తిచూడఁ
గూడు చవిగాఁగఁ గుడుచుట గూడునమ్మ
నమ్మకిట మీఁద నేను బ్రాణానఁగలిమి
చెలిమి మఱువక తలఁపుమీ చిగురుఁబోఁడి.

ఉ. హరి. 5 ఆ. 92.

ఇందు కులప్రసక్తి యొక్క పాదమునఁ గలదు. మిగిలిన పద్య మంతయు నమూలకమే యనవచ్చును. ప్రబంధోచితమగు రచనము చేయఁబడినది. ఉషాకన్య విషాదవర్ణనయు యుక్తముగాఁ చేయఁబడినది.

బాణాసురపుత్రి చెలికత్తెయగు చిత్రరేఖతోఁ దన స్వప్నగత పురుషుని ప్రశంసించి, యాతనిం గూర్పుమని వేఁడినది. ఆ పురుషుని రూపవిశేషాదులను మాత్రము చెప్పనేరననినది. అప్పుడు చిత్రరేఖ పలుకు లీక్రిందివిధముగా నున్నవి.

గీ. ఆలజాలంబు నీరిలో నాడు జాడ
గాలిపడగ యాకసమునఁ గ్రాలుత్రోవ
నిదురలోపలఁ గలఁ దోఁచు నీడవిధము
గానవచ్చునె యప్పుడ కన్నఁ గాక.       ఉ. హరి: 5 ఆ. 110

అమూలకముగ సోమన రచించిన పద్యమిది. స్వప్నగతపురుషుని విషయమై వివరములఁ జెప్పనేరమికి వగచు నవసరమునఁ జెలికత్తె యూరడింపు వాక్యము లిందు గన్పట్టును. ఇందేరికైనను శక్యముకాని విషయముల నేరి యొకచో గూర్చుటలో సోమన నేర్పు గమనింపఁ దగినది.

ఈసందర్భమున నుషాకన్య, చిత్రరేఖలపాత్రణచిత్రణముల కొక వన్నెను గూర్చినాఁడు సోమన. పైవాక్యములను విని నంతనే యుష కంపించినది. ఇట నుష విరహావస్థయు చిత్రింపఁబడినది. చిత్రరేఖ, చిత్రలేఖనానైపుణ్యమును బ్రదర్శించు ప్రయత్నమును నిట యుక్తము. ఈ క్రింది పద్యముల ందా విషయము గలదు.

చ. వెలిచిన కన్నునీరుజడి వెచ్చనిచన్నుల మీఁది వేఁడియుం
దొలకరి ఘర్మతోయములతోఁగల సెన్నొయిబ్రమానుపాటుతో
నెలుఁగున రాలుపాటొదవె నెక్కు విపర్ణతితోన లోపలం
గలగొనెనారటంపుఁ బులకంబులతోఁ బొడతెంచెఁ గంపమున్.

వ. ఇవ్విధంబున మవ్వంబు గందినపువ్వునుం బోలె నవ్వనిత నివ్వటిల్లిన యాయల్లకంబు మల్లడిఁ గొలుప నిలుపోప కున్న విన్న నగు నచ్చెలులు మెచ్చ నచ్చిత్రరేఖ చిత్రలేఖననైపుణ్యంబు మెఱయ నిదియ తఱి యని విచారించి యచ్చపునెయ్యంబున నచ్చపలలోచన కిట్లనియె.                ఉ. హరి. 5 ఆ 112, 113.

మఱియు నిట చిత్రరేఖ యేడుదినములలో ప్రఖ్యాత రాకుమారుల పటములవ్రాసి దెత్తుననినది. ఈవిషయ మీరీతిని గలదు.

క. ఏడు దినంబులలో నీ
రేడు జగంబులను వ్రాసి యిత్తుఁ బటము నీ
వేడుకకుఁ దగినవానిం
జూడు మతనిఁ దెత్తు నన్నుఁ జూడు లతాంగీ.

ఉ. హరి. 5 ఆ-115.

ఇట్లు కాలమును నిర్ణయించుటతోపాటు యుషాకన్యా విరహ వేదనా వర్ణనముగూడ యమూలకముగాఁ జేయఁబడినది. ఇట సోమన పదునెనిమిది పద్యము లను రచించినాఁడు. అందు చమత్కారావహము లును, రచనావైశిష్ట్యమును జూపు పద్యముల నిట నుదాహరింతును.

సీ. చెలుల బొమ్మలపెండ్లి చేయుచో లజ్జింతు
మగనికై యే నేల మరులుకొంటిఁ
గలలోన నొకనిఁ జక్కనివానిఁ బొడగని
వెలిఁ జూడ కే నేల వెఱ్ఱినైతిఁ
దగువరుం డని తార తడవి కూర్పక మున్న
బంధుల కే నేల పలుచ నైతి
గతి మాలి బిగియారుకౌఁగిలి లేనియా
అడికూర్మి కే నేల అట్టు వడితిఁ

తే. గదిసి పాసినచవి చూపఁ గలిగెఁ గాని
పాసి కదిసినచవి చూడ బాగు గాదు
తలఁపునకు జక్క నుండెడితలఁపు లేదు
లజ్జఁ బోఁద్రోవ లజ్జకు లజ్జ లేదు.

ఉ. శూలివిలోకనానలముసోఁకు రతీశుఁ డెఱుంగుఁ గాన యు
బ్బాలమనంబులో విరహపావకదాహము నోర్చె నన్న న
ల్లీల పొసంగు దేహము దహించిన యంతటితో మనోజుఁడై
గాలియుచిక్కెఁగానచెడ గాలఁడువో యెటువంటిమంటలన్.

చ. కిసలయపత్త్రికన్ మకరకేతన నూతన వార్త లన్నియుం
బొసఁగ లిఖించి యందు దలపూవులుఁ దమ్మియు నాసచేయు నా
కొసరు తెఱంగెఱింగి కుచకుంభములం బతిఁ దాల్చు నన్ను నం
తసమున వ్రాసియిచ్చినఁ గదా చెలికత్తెల కేను మ్రొక్కుదున్.

తే. ఎసఁగుసంతాపభరమున నిట్టునట్టుఁ
బొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి
తివురువిరహానలంబున దివ్వె లెత్తఁ
జిత్తజాతుండు వత్తిఁ దాల్చినవిధమున.

ఉ. హరి. 5 ఆ. 117. 123. 125. 129.

చిత్రరేఖ పటమునందు వివిధదేశాధీశులఁ జిత్రించి కొనివచ్చి, యుషాకన్య కాయాపటముల వివరించు పట్టుల నొక విచిత్రమగు సీస పద్యమును రచించినాఁడు సోమన. ఛప్పన్న దేశములపేర్లను వ్యర్థపదరాహిత్యముగనే కాక, యొక్క యక్కరమైనను నడుమ జొప్పింపక కేవలము దేశముల పేర్లను ఛంధోబద్ధ మొనరించుట విశేషము. ఆ పద్యము నిటఁ జూపుచున్నాను.

సీ. పాంచాల పాండ్య బర్బర కిరా తాభీర
కురు విదేహ విదర్భ కుకుర గౌళ
గాంధార మగధ కొంకణ కళింద పుళింద
సింధు సౌవీ రాంధ్ర చేర చోళ
సాముద్ర సాల్వ కోసల కళింగ కుళింగ
వత్స సౌరా ష్ట్రాంగ వంగ మత్స్య
సూరసేన సుధేష్ణ సుహ్మా కాశ కరూశ
లాట కర్ణాట మాళవ వరాట

తే. కుంత లావంతి ఘూర్జర కుహ్మక త్రి
గర్త బహుధా యవన టెంకణ దశార్ణ
పుండ్ర బాహ్లిః ద్రవిడ కాంభోజ హూణ
కేకయ వసాతి కాశ్మీర కేరళములు.

ఉ. హరి. 5 ఆ_144.

మఱియొక విశేషము. ఈక్రింది పద్యమునం దమూలకముగ భౌగోళిక సూచనమును గావించినాఁడు.

క. తదనంతరంబ చూపుల
కొదవె మహారాష్ట్రపశ్చిమోత్తరభూమిన్
యదుకులనాయకు నగరము
సుదతికి నచ్చిత్రరేఖ చూపెను బోటన్.

ఉ. హరి. 5 ఆ_146.

శ్రీకృష్ణాదులు ద్వారవతియం దుండుటయు, నాప్రదేశములలో నుషాకన్య స్వప్నగతపురుషుండు పశ్చిమోత్తరభూములఁ గాంచుటయు జూపబడినది. మఱియు ననిరుద్ధుని రూపలావణ్యములఁ బ్రశంసించు పట్టుల మూలమున నీక్రింది విషయము గలదు.

శ్లో. అయం త్రైలోక్యనాథస్య నప్తా కృష్ణస్య ధీమతః
భర్తా తవ విశాలాక్షి ప్రాద్యుమ్నిర్భీమవిక్రమః॥
న హ్యస్తి త్రిషు లోకేషు సదృశోఽస్య పరాక్రమే
ఉత్పాద్య పర్వతానేవ పశ్యత్రై రేవ శాతయేత్॥
ధన్యాఽస్యనుగృహీతాఽసి యస్యాస్తే యదుపుంగవాః
త్ర్యక్షపత్న్యా సమాదిష్టః సదృశః సజ్జనః పతిః॥

వి. ప. 118 అధ్యా.72_74

పయిశ్లోకములం దెనిగించుటలో నీక్రింది పద్యము రచింపబడినది.

మ. వనితా వాసవవైరిమర్దనుఁ డనన్ వర్ణింప నొప్పున్ జనా
ర్దనుఁ డద్దేవుని మున్నువింటిమికవా తత్పుత్త్రుఁ బ్రద్యుమ్నుఁగం
తునికంటెం గొనియాడఁగాఁబోనగు తత్సూనుండు నీకోరువాఁ
డనిరుద్ధుఁ డిటు చిక్కెనే సమత నీయన్యోన్యయోగ్యాకృతుల్.

ఉ. హరి. 5 ఆ 151.

మూలమునందలి "ఎర్వతా నేవ పర్వతైః" "భీమవిక్రమః" అను పదములను పరిహరించి కంతునికంటె మిన్నయగు వానిపుత్త్రుఁ డనిరుద్ధుఁ డనుట సమంజసము.

ఉషానిరుద్ధుల సమాగమము సమకూడు విషయమును గూర్చి చర్చించు పట్టులఁ, జిత్రరేఖ శక్తిసామర్థ్యములు మూలమున విపులముగ వర్ణింపబడినవి. మఱియు నట నుష యనిరుద్ధునిఁ దోడితెమ్మనుట మాత్రమే కాననగును. ఉషాకన్య పలుకుల నీదిగువ పొందుపఱచు చున్నాఁడను.

శ్లో. త్వమేవాత్ర విశాలాక్షి యోగ్యా భవ వరాననే
న శక్యా హి గతిశ్చాన్యా అగత్యా మే గతిర్భవ ॥
అంతరిక్షచరా చ త్వం యోగినీ కామరూపిణీ
ఉపాయస్యాస్య కుశలా క్షిప్రమానయ మే ప్రియమ్ ॥
ఉపాయశ్చింత్యతాం భీరు సంప్రతిర్క్యా ప్రియే సుఖమ్
సిద్ధార్థా సన్నివర్తస్వ యే నోపాయేన సుందరి ॥
భవేదాపత్య్యే యన్మిత్రం తన్మిత్రం శస్యసే బుధైః
కామార్తా చాస్మి సుశ్రోణి భవ మే ప్రాణధారిణీ ॥
యద్యేనం మే విశాలాక్షీ భర్తారమనురోపమమ్
అద్య నానయసి క్షిప్తం ప్రాణాంస్త్యక్ష్యామ్యహాం శుభే ॥
వి. ప. 118 అధ్యా. 74_78

ఈ శ్లోకములను దెనిగించుటలో సోమన కొంత స్వతంత్ర మార్గము ననుసరించినాఁడు. అమూలకముగఁ గొన్నివిషయములఁ జోడించియు, మూలభావముల విపులీకరణము గావించియు, పాత్రచిత్ర ణములందును నేర్పుఁ జూపినాఁడు. ఆ విషయము లీ క్రింది పద్యము లందు గన్పట్టును.

ఉ. ధీరుల నింద్రముఖ్యు లగు దిక్పతులం గుఱిలోలఁ బెట్టు న
వ్వీరుఁడు బాణుఁ డేమిటికి వియ్యపుటిచ్చకుఁ దెచ్చు మర్త్యులన్
దూరపు వారిఁ దన్వఁ గన నువ్వులఁ గండ్లను నోరఁబోసికొ
న్నారము కాఁ దలంపు లలనా కెలనాడెడు ప్రాణ మేటికిన్.

గీ. దనుజకులవైరి శౌరి నందనులు నట్ల
రక్కసులు మనవారు వారలకు మనకు
బొసఁగునె నడుమఁ బెట్టినపూరి గాలు
నేల చిత్రరేఖా తుది నింతసఱుగు. ఉ. హరి. 5ఆ. 158, 159

వ. మఱియు నొక్క తెఱంగు విను మక్కుమారు నిక్కడకుం గొనివచ్చి తన్నుం గలుపు సామర్థ్యంబు గలదేని.

క. కలసెదఁ బతి నతఁ డిచ్చట
మెలఁగుట మాతండ్రి విన్న మే లగునే ప్రే
వులలోన నురియఁ ద్రిప్పిన
కలపన బిండైనఁ జెలిమికత్తెలు నగరే.

ఉ. నావుడుఁ జిత్రరేఖ వదనంబున బింకము మీఱఁ బల్కు నా
లావున నిప్డు దెత్తు నబలా విభు నింపెసలారఁ గూడి సం
భావన చేయవే చెలులు ప్రాణమునం బరికించునట్లు ర
క్షావిధ మాచరింపు మన సౌధములందు నిగూఢభంగులన్.

ఉ. హరి. 5 ఆ. 162, 163, 164

పయి పద్యములో నుషానిరుద్ధుల సమాగమమునకు సాధ్యాసాధ్య విచారణతోడి యుక్తుల భాషణము నమూలకముగా సోమన పెంచినాఁడు. శ్రీకృష్ణాదులకును, బాణాసురునకు "నడుమబెట్టిన పూరిగాలు" సంతటి వైరభావము గలదు. కావున ననిరుద్ధుని చేపట్టు ప్రయత్నము చేయుట ప్రమాదకరము. మఱొకవిషయమునుగూడ నుషా

కన్య తడవినది. తానే యనిరుద్ధుని కడకేగినచో ననిరుద్ధుఁ డనుమా నించునేమో యని భావించినది. ఇఁక మిగిలినమార్గ మాతనిని బాణాంతః పురమునకుఁ గొని వచ్చుటయే. కాని బాణుఁ డీవిషయ మెఱింగినచోఁ దనజీవితము నవ్వుల పాలగుట తథ్యమని తలఁచినది. ఆ సమయమునఁ జిత్రరేఖ తా ననిరుద్ధుని దెత్తుననియు, నంతఃపురరక్షణము నకు వలయు చర్యల గైకొనుమనియు యుషకు బోధించినది. అనువాద మున నుషా చిత్రరేఖల పాత్రలకుఁ గొంత యౌచిత్యమును గల్పింప దలంచినాఁడు. అనిరుద్ధునితోడి సమాగమ మేరీతిని సంభవమనితర్కించు టయు, జిత్రరేఖ యుక్తియుక్తముగా నొకయుపాయము మెఱిగించుటలో నాటకీయత కానవగును. అనువాదమున నీయిరువురు సజీవపాత్రలుగా చిత్రింపఁబడినారు. కార్యనిర్వాహణమునందు చిత్రరేఖ కుషాకన్య సహాయకారి. కాని మూలమున నుష తన చెలికత్తె ననిరుద్ధుని తోడి తెమ్మనుటయే కానగును.

అనిరుద్ధుని దెచ్చుటకు నిర్ణయించుపట్టులఁ చిత్రరేఖ ద్వారకా పురప్రవేశమునకుఁ గల యవరోధములు మూలమున నైదుశ్లోకము లలో జెప్పఁబడినవి. సోమన యీవిషయము ననువదింపలేదు. ఉషా కన్య యనిరుద్ధుని తోడితెమ్మని చిత్రరేఖను వేఁడునపుడు చెప్పినవిషయ ములకు విరుద్ధముగా నీవిషయము గన్పట్టుచున్నది. అట "అంతరిక్ష చరా చ త్వం, కామరూపిణీ, ఉపాయస్యా" ఇత్యాదులచే గణింపఁబడిన చిత్రరేఖ యీసందర్భమున ద్వారకాపురప్రవేశము కష్టతరమనుట సమంజసము కాదు. ఆశ్లోకముల నిట నుదాహరించుచున్నాను.

శ్లో. ఉషాయా వచనం శ్రుత్వా చిత్రలేఖాబ్రవీద్ వచః
శ్రోతుమర్హాసి కళ్యాణి వచనం మే శుచిస్మితే
యథా బాణస్య నగరీ రక్ష్యతే దేవి సర్వశః
ద్వారకాఽపి తథా భీరు దురాధర్షా సురైరపి

అయస్మయప్రతిచ్ఛిన్నా సప్త ద్వారా చ సా పురీ
గుప్తా వృష్ణికుమారైశ్చ తథా ద్వారకవాసిభిః
ప్రాంతే సలిలసంయుక్తా విహితా విశ్వకర్మణా
రక్ష్యతే పురుషైర్ఘోరైః పద్మనాభస్య శాసనాత్
శైలప్రాకారపరిఖాదుర్గమార్గప్రవేశినీ
సప్తప్రాకారరచితా పర్వతైర్ధాతుమండితైః
న చ శక్యమవిజ్ఞాతైః ప్రవేష్టుం ద్వారకాం పురీమ్
ఆత్మానం మాం చ రక్షస్వ పితరం చ విశేషతః.

వి. ప. 118 అధ్యా. 80-85

ఈవిధముగనే దౌత్యము నిర్వహింప, చిత్రరేఖ నుషాకుమారి బలవంతము చేయుటయు మూలమునఁ గానవగును. అనువాదమున నుషయు, జిత్రరేఖయు నీవిషయమున సాధ్యాసాధ్యముల సహేతుకముగాఁ జర్చించిరి. ఉషాకన్య సూచన ననుసరించి, చిత్రరేఖ యనిరుద్ధుని తే నిచ్ఛగించినది. మఱియు నంతఃపుర రక్షణమున కనువగు చర్యలఁ గైకొనుమనినది. ఈవిషయమును జూపుటకయి మూలము నందలి శ్లోకముల నీదిగువ చూపుచున్నాను.

శ్లో. తవ యోగప్రభావేణ శక్యం తత్ర ప్రవేశనమ్
బహు నా కి ప్రలాపేన ప్రతిజ్ఞా శ్రూయతాం మమ॥
అనిరుద్ధస్య వదనం పూర్ణచంద్రసమప్రభమ్
యద్యహం తన్న పశ్యామి యాస్యామి యమసాదనమ్॥
దూతమాసాద్య కార్యాణాం సిద్ధిర్భవతి భామినీ
తస్మాద్ దౌత్యేన మే గచ్ఛ జీవంతీం మాం యదీచ్ఛసి॥
యది త్వం మే విజానాసి సంఖ్యం ప్రేమ్ణా చ భాషితమ్
క్షిప్రమానయ మే కాంతం తవాస్మి శరణం గతా॥

జీవితస్య హి సందేహం క్షయం చైవ కులస్య చ
కామార్తా హి న పశ్యంతి కామినో్య మదవిక్లవాః॥
వి. ప. 118 అధ్యా. 86—90

పయి శ్లోకములలోని భావమునుబట్టి చిత్రరేఖ, యుషాకన్యకు చెలికత్తెమాత్రమే యని వ్యక్తము. ఆమె యుషాకన్య యాజ్ఞానుసారిణి, అనఁగా చిత్రరేఖ వ్యక్తిత్వము లోపించినది. చిత్రరేఖ, యుషాబాల సూక్ష్మమగు సూచనము నాధారముగాఁ గైకొని తా నానిర్ణయముును గైకొనినటులు గలదు.

చిత్రరేఖ ద్వారకాపురమున కేగి శ్రీకృష్ణు నంతఃపురభవనమును జేరినది. మూలమున నీఘట్టమున ననిరుద్ధుని యంతిపురభవన వర్ణనమును, ననిరుద్ధుని రూపలావణ్యాదుల వర్ణనమును గలవు. ఈవిషయములు మూలమునఁ బదిశ్లోకములలోఁ జెప్పఁబడినవి. వానిని సోమన యనువాదమున గైకొనలేదు. మఱియు చిత్రరేఖానిరుద్ధుల సంభాషణ మిరువది శ్లోకములందు గలదు. తామసీవిద్యాప్రభావము నాచ్ఛాదముగాఁగొని వీరి సంభాషణము సాగినది. అనిరుద్ధుని స్వప్నవృత్తాంతము మూలమున గలదు. ఉషాకన్యను దాను స్వప్నమునఁ గని పరితపించుచుండిన విషయమును జిత్రరేఖతోఁ జెప్పుటయు, నుషాసంగమునకయి యనిరుద్ధుఁ డామెను బ్రార్థించుటయు సోమన పరిహరించెను. ఈ ఘట్టమునందలి విషయజాల మంతటినుండి యనిరుద్ధుని వర్ణనవిషయమునుమాత్రము గ్రహించి సోమన సాలంకారముగ నీక్రింది పద్యమును రచించెను.

లలితనూతనలతాలంకారముల మెచ్చి
మొగమిచ్చు లేమావిమోక వోలెఁ
బరిహారతారకాపటలంబుతో నవ్వ
దొరకొన్న పిన్నచందురుఁడు వోలె

గమలిసీకలికావికాసంబు లెఱిఁగి పై
 ప్రాలెడు తేఁటిరాచూలి వోలె
సరళసౌదామనీసల్లాపముల మేను
 గరుపాఱు బిండమేఘంబు వోలెఁ
తే. సంతకంతకుఁ జిట్టంటు లంటి యంటి
 చెలువలకు యౌవనము విందు చేయ నున్న
 మానగుణబద్ధు మన్మథ మంత్రసిద్ధు
 రుచిరరసవిద్ధు నాయనిరుద్ధుఁ జూచి. ఉ. హరి. 5 ఆ_188

చిత్రరేఖ యనిరుద్ధుని దెచ్చుటకు ముందు నారదమహామునిని జూచినది. ఆతఁ డామెకు తామసీవిద్య ననుగ్రహించినట్లు మూలమున గలదు. అనువాదమున నీవిధముగా మార్చబడినది.

క. మును విద్యాధరసంతతి
 యనఁగా వివిధంబు లగు నుపాయంబుల మీ
 ఱిన తన మాయాబలమున
 ననిరుద్ధుం బొదివె విస్మయావాదిని యై.
 ఉ. హరి. 5 ఆ_189

అనిరుద్ధుని యుషాకన్యాంతఃపురంబునకుఁ గొనివచ్చినంతనే మూలమున వి. ప. 118 అధ్యా. 59 వ శ్లోకమున నీ క్రిందివిధముగా నాతనికి సపర్యలు చేయఁబడినవి.

శ్లో. ప్రహర్షోత్ఫుల్లనయనా ప్రియం దృష్ట్వాఽర్ధకోవిదా
 సా హర్మ్యస్థా తమర్ఘ్యేణ యాదవం సమపూజయత్॥

అనువాదమున నాసందర్భమున నర్ఘ్యపాద్యాదుల నిడి పూజించుట యుక్తముగాదని సోమన విడిచియుండును.

ఈసందర్భమున మూలమునలేని యుషాచిత్రరేఖల సంభాషణము నిట గూర్చినాఁడు. తన మనోగతాభిప్రాయము వెల్లడియైనదని వగచు

చున్న యుష నూరడిల్లఁజేసి, నంతిపురమునందలి సఖీజనంబుల కట్టడి జేసినది. ఈవిషయము మూలమున లేదు. కాని యీసంభాషణము మూలమున, నుషాకన్యయు, జిత్రరేఖయు తమ నిశ్చయమునకుఁ దగిన రక్షణమును గూడ గల్పించుకొని యున్నటులు దోచును.

తామసీవిద్యాప్రభావము సడలినంతనే యనిరుద్ధుఁ డుషాకన్యను గాంచినాఁడు. ఈసందర్భమున నుషానిరుద్ధుల సంభాషణము మూలమునఁ బంచెరింటు (వి. ప 119 అధ్యా 64-75) శ్లోకములలో గలదు. అందుషాకన్య కనిరుద్ధుఁడు తన స్వప్నగతవృత్తాంతమును జెప్పుటయు, గాంధర్వవిధిని వారిరువురు వివాహ మాడుటయు వర్ణింపఁబడినది. ఈ శ్లోకములలోని విషయ మామూలాగ్రముగా విడువఁబడినది. అనిరుద్ధుని స్వప్నమును బూర్వఘట్టమున గైకొనకుండుట, హేతువుగ నుషానిరుద్ధుల సంభాషణమున నీవిషయము విడువబడుట సమంజసము.

ఉషానిరుద్ధుల విషయము వినిన బాణాసురుఁ డనిరుద్ధుని నాగాస్త్రమున బంధించి, కారాగారమున నుంచెను. ఈ సందర్భమున నారదుఁ డట కేతెంచి, బద్ధుఁడగు యనిరుద్ధుని జూచి ద్వారవతి కేగి నటులు మూలమున గలదు. ఆ శ్లోకము లివి.

శ్లో. యయౌ స్వమేవ భవనం బలేః పుత్రో మహాయశాః
సంయతం మాయయా దృష్ట్వా అనిరుద్ధం మహాబలమ్ ।
ఋషీణాం నారదః శ్రేష్ఠోఽబ్రవీద్ ద్వారవతీం ప్రతి
తతో హ్యాకాశమార్గేణ ముని ద్వారవతీం గతః ॥

వి. ప. 119.అ: 196, 197.

ఈ విషయము నెఱిఁగిన యనిరుద్ధుఁడు తనలో నారదాగమనమును, శ్రీకృష్ణాదు లరాకను దలఁచికొనుటయుఁగూడ చెప్పఁబడినది. నాగబద్ధుడయిన యని ద్ధుని జూచి విలపించుచున్న యుష నూఱడించినట్లును మూలమునఁగ డు. ఈ విషయమంతయు విడువఁబడినది. అంతే

కాక మూలమున నలుబదియెనిమిది శ్లోకములలోఁగల యార్యాస్తవ మునుగూడ సోమన విడిచెను.

ఇక ద్వారకాపురమున ననిరుద్ధకుమారుని గానక యాదవ లోకము తల్లడిల్లిపోయినది. మూలమున ననుసరించి యనువాదము జేసినను గొన్నిచోటుల నాయాసందర్భములను బట్టి కల్పనములను గావించినాఁడు సోమన. అందు శ్రీకృష్ణుని యంతఃపురస్త్రీల దుఃఖాతి శయమును వర్ణించుపట్టుల ననిరుద్ధుని స్వరూపస్వభావముల జాటు నీ క్రింది పద్యములు గలవు.

సీ. చక్కనివారిలోఁ జక్కనివాఁడు దాఁ
గడుఁ బిన్నగాని వేగంబు వీను
బంటు నొచ్చిననోరఁ బలుకండు నెఱవాది
సుఖభోగి చుట్టాలసురభి రాచ
బిడ్డయై యుండి గబ్బిదనం బెఱుంగఁడు
గరగర నై యుండుఁ గలయు నేర్చు
నూఁపరలాఁడు గాఁ డుపకారి నవ్వు మే
లము గాని తనవారు లాఁతివార

తే. సఁడు గడానిబంగారు రత్నంపుబొమ్మ
ముంగిటినిధాన మమ్మలముద్దు దమ్ము
లన్న యీతనిఁ గన జేని కన్నతల్లి
కడుపు మసిగాదె దయ్యమ ! కరుణలేదె.

సీ. అనిరుద్ధసింహంబు నంటి చావునకుఁ ద
ప్పిన కరి హరితోడఁ బెనఁగ కున్నె
యదుపుంగవున కింత యపకార మొనరించి
దేవతావిభుఁ డైన దిగులు చొరఁడె

మురవైరిసీడన మూఁడులోకంబులు
బ్రదుకంగ మనకేల పలవరింప
నద్దేవుమనుమని నద్దిరా యొటుచూతు
ననక కేరడ మెవ్వఁ డలవరించె
తే. వెఱవ కోడక యొకరుండు ప్రేలఁ జూప
నెంతవాఁ డక్కుమారు నోరంత ప్రొద్దు
గలసి పాసి పోఁ జాలని కతన మనకు
నేలతలఁ గాల్లు నిలువమి నిజము గాక.

ఉ. హరి. 5ఆ: 278, 282

## షష్ఠాశ్వాసము

శ్రీకృష్ణాదులు ద్వారకాపురము నం దనిరుద్ధుని గానక వంతఁ జెందుసమయమున నారదమహర్షి యట కేతెంచినాఁడు. వాసుదేవుఁ డా మునీశ్వరునివలన ననిరుద్ధుని విషయమును దెలిసికొని, బాణాసురుని పయి దండెత్త సిద్ధపడినాఁడు. దానవాంతకుఁడు నాగాంతకుని దలంచి నంత నాతఁ డేతెంచినాఁడు. ఈసందర్భమున శ్రీకృష్ణ గరుత్మంతుల సంభాషణమును, గరుడున కర్ఘ్యమిచ్చుటయు మూలమున నలువది శ్లోకములలో వర్ణింపఁబడినది. (వి. ప. 121 అధ్యా. - 95-134). ఆ విషయము నంతను సోముఁడు పరిహరించినాఁడు. కావ్యమున నవి యనావశ్యకమని తలఁచియుండును. మూలమున లేని సిద్ధసాధ్యచారణ గంధర్వసంయమీంద్రు లాకసమునుండి గావించిన స్తుతులను సోమన కల్పించినాఁడు. వాని నిటఁ జూపుచున్నాను.

తోటకవృత్తములు :

జయ జయ మంగళసంగతరూపా
జయ జయ పావకసంభృతరూపా

జయ జయ కల్పితసాగరతాపా
జయ జయ ఖండితశంకరచాపా
జయ జయ మస్తకశస్తకలాపా
జయ జయ కౌస్తుభచారుకలాపా
జయ జయ కాళియసారదురాపా
జయ జయ కంసనృశంసమహాకోపా
జయ జయ ధౌతవిశంకటపాపా
జయ జయ మోహనిశామణిదీపా
జయ జయ పాదలసత్సరిదాపా
జయ జయ విక్రమశాసితభూపా.

చ. జయ జయ శంఖచక్రధర శార్ఙ్గగదాధర శ్రీధరాధరా
జయ జయ భక్తిభావితనిశాచరఖేచరచిత్తగోచరా
జయ జయ కిల్బిషాపనుద శాంతహృదాస్పద చిత్తసమ్మదా
జయ జయ భూతభావన ప్రజాకలితావన లోకపావనా.

మ. జయ నారాయణ పుండరీకనయనా శార్ఙ్గీ జగన్నాయకా
జయ పీతాంబర భక్తవత్సల విరించస్తోత్రపాత్రక్రియా
జయ జంభారివిరోధివిక్రమకథాశ్లాఘావిఘాతక్రమా
జయ గోవింద ముకుంద మందరధరా శౌరీ మురారీ హరీ.

ఉ. హరి. 6 ఆ. 18, 19, 20.

పై పద్యములందు శ్రీకృష్ణావతార విశేషములను శ్లాఘించి శ్రీమన్నారాయణతత్త్వమును వ్యక్తపఱచి రా దివ్యులు. మఱియు తోటకవృత్తములను రచించుటయు, వృత్తరచనయందు జయజయ ధ్వానములఁ జేర్చి రచన సాగించుటయు, సోమన రచనయందలి విశేషములు. అంతేకాక శ్రీకృష్ణ బలరామ ప్రద్యుమ్నులు వైనతేయునెక్కి

చనుదెంచు యాకాశగమనవర్ణన మమూలకము. ఈవచన (ఉ. హరి. 6 ఆ. 28) రచనము కూడ సోమన కవితలో విశిష్టతర మగునట్టిదే.

ఇట్లే గిరివ్రజపురంబును గాచియుండు యావహనీయాగ్ని ప్రభావమున నాకాశమునఁ బ్రయాణించు నీముప్పూర దేహచ్ఛాయ పసు పారినది. ఇందులకు హేతు వారయుగోరు బలరాముని వాక్యముల నొక సీసమున జెప్పినాఁడు సోమన. ఆపద్య మిది.

సీ. బాలార్కబింబంబు పరగించి రేయెండ
మనమీఁదఁ జల్లినమాయ లేదు
కొంతంబు మెఱుఁగులు గుప్పించి మెఱుఁగులు
మనమీఁద జిలికినమహిమ లేదు
హరజటామండలం బడరించి క్రొమ్మించు
మనమీఁద జిమ్మినమమత లేదు
కమలభవాండంబు గదలించి సలిలంబు
మనమీఁద ముంచిన మహిమ లేదు
ఆ. పసపునిగ్గు వోలెఁ బ్రద్యుమ్ను నకు నాకు
సీకుఁ జాయ మేన నివ్వటిల్లెఁ
గనకభూధరంబుఁ గదిసినవారమో
కాక వేఱె తెఱఁగొ కమలనాభ. ఉ. హరి. 6 ఆ. 29

అమూలకమగు రచన మిది. ఇందు ప్రకృతిసిద్ధములగు సూర్య చంద్రాదికాంతుల విషయములను సందర్భోచితముగ మలచుట గన్పట్టును.

బాణపురమునకు శ్రీకృష్ణాదులు చేరినంత నే నారదుఁడు శ్రీకృష్ణు నితో భాషించినట్లు కలదు. శ్రీకృష్ణనారద సంభాషణ మైదు శ్లోకము లలో (వి. ప. 122 అధ్యా. 41-45) గలదు. వానిని బూర్తిగా సోమన పరిహరించెను. బాణపురమును శివుఁడు సంరక్షించుచున్న విషయమును

సర్వాంతర్యామియగు కృష్ణునకు త్రిలోకసంచారియు, త్రికాలవేదియు నగు నారదుఁ డీవిషయము చెప్పుటలో నౌచిత్యము లేదని సోమన తలఁచి యుండును.

శ్రీకృష్ణ బలరామ ప్రద్యుమ్నుల నెదుర్కొనుటకు దైత్యసేనా సన్నాహము మూలమున నాఱు శ్లోకములలో (వి. ప. 122అధ్యా. 48_53) వర్ణింపఁబడినది. ఇందు సేనలు శంఖభేరీనినాదములను గావించి నట్లును, నాజ్ఞాపితమయిన ప్రమథగణ, దైత్యాదా నవరాతుసాదిసేనా నీకము కృష్ణాదులతో యుద్ధము చేయుచున్నట్లును వర్ణింపఁబడినది. కాని సోమన యనువాదమున నీభావమును గ్రహించి, యుద్ధవర్ణనము నొకవచనమున (ఉ. హరి. 6 ఆ_50) రచించి యున్నాఁడు. ఇది యమూలకము; అనుప్రాస సంఘటితము.

మూలము ననుసరించి రచించిన పట్టులను సోమన తన రచనా వైశిష్ట్యముఁ జూపినాఁడు. ప్రమథసైన్యము మూర్తిత్రయము నెదుర్కొను నవసరమున మూలమున నీవిధముగా గలదు.

శ్లో. ప్రమాథగణభూయిష్ఠం బలం తదభవత్ క్షితౌ
శైలమేఘప్రతీకాశై ర్నానారూపై ర్భయానకైః
వాహనైః సంఘశః సర్వే యోధాస్తత్రావతస్థిరే.
వి. ప. 122 అధ్యా. 58

ఈసందర్భమున నీక్రింది పద్యము రచింపఁబడినది.

చ. పలుకలునొడ్డనంబులును బాసట చేయఁగఁ గత్తిగొంతముల్
బలుసబళంబులు న్వెనుకఁ బన్నిన విండులవారు పైపయిం
దలముగఁ దోఁప వారువపుదండము నేనికపిండు దేరుమూ
కలుఁ బరిపాటిమై సమరకౌతుకహేతుక మై చెలంగఁగన్.
ఉ. హరి. 6ఆ. 59

తెనుగుఁతన ముట్టివడ ననువాదము నడచినది.

సోమన మూలమున లేని గరుడని యుద్ధమును బ్రవేశపెట్టి యొక వచనమున నద్దానిని వర్ణించెను. ఇదియుఁ జతురంగబలముల నుగ్గడించిన విధమును దెలుపుచున్నది. దాని నిట నుదాహరించు చున్నాను.

వ. అనుటయుం బతంగపతి వసుమతికి నవతరించి వసుదేవసుతుని తలంపున కనుగుణంబుగ నడచి కడచి ముంగలియై జంగిలివెలుచు గోపాలు పోలికిం బ్రతిబలంబులం గదలించియు నదలించియుఁ గడంగి యాటడంగి తాళఫలంబులు డులుచు పెలుచనం బోదిపి పెల్లొదివి హాస్తికుల మస్తకంబుల ధర నురలించియుఁ బొరలించియు ముంచి మెయి వెంచి మించిన తురగదళంబులంబొలియించియునలియించియు నరదంబులు చెక్కులు వాయ జెక్కుల విద్రిచియు నద్రిచియుఁ బేరెలమిం దలపడిన వీరుల నారెలం జీరి నారులువోసినట్లు చేసియు మెండుకొని యున్న శుండాలంబుల తొండంబులు వట్టికొని గుండెలు వగులం దన్నియుఁ గడిమిఁ గడచన్నపన్నగ యక్షరాక్షసులఁ బెడ చేత ద్రేసియు డాసియుఁ బాసియు లాసియు వాసి చెడక కలకలంబులు సేయుపలకలవారి నుంగుటంబుల నింగికిం జిమ్మియు పఱిపఱిగా నఖంబుల వ్రచ్చియు విచ్చియుఁ జొచ్చియుఁ బెచ్చుపెరిగివచ్చు బేతాళంబులం బాతాళంబు సొరనడిచియుఁ బిడిచి వైచిన చందంబున మడఁచి త్రోచియు సరసాన బెరసినం గరసాన నొరసిన వెరవు చేసియు గేడించినం గూడించి యడంచియుఁ బెల్లగిల్లిన మల్లడి గొలిపియు ననేక ప్రకారంబులం జీకాకుపఱిచె నట్టియెడ.

ఉ. హరి. 6ఆ. 66

అనంతరము శ్రీకృష్ణ బలరామ ప్రద్యుమ్నులతోపాటు గరుడుడును యుద్ధము చేయుచున్నటులుగాఁ జెప్పి, బలరాముని యుద్ధము మాత్రమే మూలమున వర్ణింపబడినది.

శ్లో. ఏవం బ్రువంతస్తేఽన్యోన్య మభిరూఢాః ఖగోత్తమమ్
గిరిశృంగసభైః ఘోరైర్గదా ముసల లాంగలైః ॥
యుధ్యతో రౌహిణేయస్య రౌద్రం రూపమభూత్ తదా
యుగాంతే సర్వభూతానాం కాలస్యేవ దిధక్షతః ॥
ఆకృష్య లాంగలాగ్రేణ ముశలేనావపోధయత్
చచారాతిబలో రామో యుద్ధమార్గవిశారదః ॥
ప్రద్యుమ్నః శరజాలైస్తాన్ సమంతాత్ పర్యవారయత్ ॥
వి. ప. 122:64 – 67

ఈవిషయము ననువదించుచు నా నల్వురును గావించు యుద్ధమును సోమన, నాలుగు వృత్తములలో (ఉ.హరి. 6 ఆ. 67–70) వర్ణించినాడు. పతంగపతి సాహాయ్యముతోడుత నా యదువీరులు బాణసైన్యమును చిందరవందర గావించుటచేఁ బ్రమథాదిపుఁడు శివజ్వరము నేసెనని యనువాదమునఁ జేర్చినాఁడు. శివజ్వర ప్రయోగమున కౌచిత్యమును గూర్పనెంచి, సోమన, గరుడని యుద్ధమునుగూడఁ జేర్చినాడు. ఈసందర్భమున నీమార్పు మూలమునకు వన్నెబెట్టిన దనవచ్చును.

శ్రీకృష్ణ శివజ్వరముల పోరాటమున నా శివజ్వరము కోపించి యగ్నికణములతోఁ గూడిన భస్మమును మురారిపైఁ జల్లెను. ఆ వేడిమికి మాధవుని తులసీవనమాలిక పచ్చగామారి నటులు భాసించినది. శ్రీకృష్ణ శివజ్వరముల యుద్ధ మమూలకముగా మూఁడుపద్యములలో వర్ణింపబడినది. ఆ పద్యము లివి.

ఉ. మంజ్వభిరామమై చైత్ర వాఁగు మాధవు గాత్రము దైన్యపాత్రమై
సంజ్వర మొందఁగఁ గాధరె వెసం దనచేతులు మూఁడు నెత్తి త్రవే
సెం జ్వరుఁడంతఁ బోక తులసీవనమాలిక పచ్చగందమం
టం జ్వలనంబు రాఁబిడికటం బొడిచెం దమరఃకవాటమున్.
ఉ. హరి. 6ఆ. 88

చ. అదరులు వాఱ నూఁదికొని హస్తయుగంబునఁ గంసవైరిఁగ
ట్టెదుర నురంబు వ్రేసి పెరయీఁగతిం గఱచెన్మురాంతకుం
డది చిఱునవ్వునం దెగడి యాననముం జదియంగ మోఁదినన్
బెదరక వ్రేటుపాటు నెడపెట్టి గదంబుమదంబు చూపఁగన్.

ఉ. హరి. 6ఆ. 90

శా. దైతేయారిఘనంబు గర్జిలి భుజాదండాహతిం జూపియు
త్యాతంకం బగురౌద్రతాపమును మూర్ధాధిక్యతన్ ముష్టిని
ర్ఘాతవ్రాతమువైచి నొంచె నిటుప్రారంభించె ఘోరాభిసం
పాతం బట్టభుజత్రిబాహుల కపూర్వస్తోత్ర పాత్రంబుగన్.

ఉ. హరి. 6ఆ. 91

ఇంతటి సుదీర్ఘమగు పోరాటమును గల్పించుటలో నొకవిశేషము కలదు. పయి పద్యములవలన శివజ్వరము శ్రీకృష్ణుని పెరయీఁగ గతిని కఱచినది; ఉరమున బొడిచినది; సరిసమానముగఁ బోరినది అను విషయములు తెలియుచున్నవి. అనఁగా శివజ్వర బలాతిశయములు స్పష్టమగుచున్నవి. మఱియు నంతటి శివజ్వరము నోడించుటలో శ్రీకృష్ణుని యపరావతారమును గన్పట్టును. మఱియు శ్రీకృష్ణనాయక వైశిష్ట్యముకూడ వ్యక్తమగును.

మఱియుక విషయము. శివజ్వరవర్ణనమున నీక్రింది శ్లోకములు కలవు

శ్లో. భజ్యమానేష్వనీకేషు త్రాతుకామః సమభ్యయాత్
జరస్త్రిపాదస్త్రి రాః షడ్భుజో నవలోచనః
భస్మప్రహరణ రౌద్రః కాలాన్తకయమోపమః
నద న్మేఘసహ స్రేణ తుల్యో నిర్ఘాతనిఃస్వనః
నిఃశ్వసన్ జృంభమాణశ్చ నిద్రాన్వితతనుర్భృశమ్
నేత్రాభ్యామాకులం వక్త్రం ముహుః కుర్వన్భ్రమన్ముహుః

సంహృష్టరోమా గ్లానాత్మా భగ్నచిత్త ఇవశ్వసన్
హలాయుధముఖైః క్రుద్ధైః సాక్షేప మిదమబ్రవీత్.

వి. ప. 122 అధ్యా. 71-74

ఇందు శివజ్వరుఁడు పద్మ్యుజుఁడని గలదు. అనువాదమున మూఁడుచేతు లున్నటులు చెప్పఁబడినది. ఆ పద్యమునుగూడ నిటఁ జూపుచున్నాను.

ఉ. అట్టియెడం గడంగి ప్రమథాధిపు పంపున సీరపాణికిం
గట్టెదుర న్మహాజ్వరముగాఁ ద్రి శిరంబులు మూఁడు మూఁడుగా
ముట్టినతేవ నిక్కముగ మూఁపులు మూఁడయివచ్చి తాఁకి ము
చ్చుట్టును బాఱి యార్చె నతిభీకరతమై భసితాయుధస్థితిన్.

ఉ. హరి. 6 ఆ. 72

వేఱొకచో మూలమున- "సవ్యేతరాభ్యాం బాహుభ్యామేవ ముక్తో జ్వరస్తదా" (వి. ప. 122 అధ్యా. 87) అని గలదు. సోమన యీపాఠము ననుసరించి యనువదించె ననవచ్చును.

శివజ్వరము నోడించుటకు శ్రీకృష్ణుఁడు విష్ణుజ్వరమును సృజించెను. ఈ సందర్భమున మూలమున నీదిగువనుజూపిన మూఁడుశ్లోకములు కలవు.

శ్లో. జ్వరాభిభూత మాత్మానం విజ్ఞాయ పురుషోత్తమః
సోఽసృజజ్జ్వరమన్యం తు పూర్వజ్వర వినాశనమ్॥
ఘోరం వైష్ణవమత్యుగ్రం సర్వప్రాణి భయంకరమ్
సంసృష్టవాన్ స తేజస్వీ తం జ్వరం భీమవిక్రమమ్॥
జ్వరః కృష్ణ విసృష్టస్తు గృహీత్వా తం జ్వరం బలాత్
కృష్ణాయ హృష్టః ప్రాయశ్చిత్ తం జగ్రాహ తతో హరిః॥

వి. ప. 123 అధ్యా. 6-8

పయి శ్లోకముల ననువదించు నవసరమున నీక్రింది పద్యము రచింపఁ బడినది.

మ. తనలోఁ జొచ్చిన శాంకరజ్వరముపైఁ దండెత్తఁ గల్పించె న
ద్దనుజారాతి ప్రతిజ్వరంబు నది యాత్మస్వామి దేహంబులోఁ
గని హస్తాంఘ్రిశిరస్త్రయాన్వితుని నాకర్షించి హర్షించెఁ గే
లును మస్తంబులుఁ గాళులుం దనకు నాల్గున్నాల్గు నాల్గుండఁగన్.
ఉ. హరి. 6 ఆ. 98

పయి నుదాహరించిన శ్లోకములలో శివజ్వరమును వైష్ణవజ్వరము బట్టియిచ్చెననిమాత్రమే కలదు. అనువాదమున వైష్ణవజ్వరము తనసామర్థ్యముచేత శివజ్వరమును శ్రీకృష్ణుని శరీరమునుండి బయటకు వెడలించి, యుద్ధముచేసినట్లు గలదు. శివ వైష్ణవజ్వరములకు మల్లయుద్ధమొకటి యమూలకముగా వర్ణింపఁబడినది. అది యుదాహరణీయముగాన నిట పొందుపఱుచుచున్నాను.

వ. ఇవ్విధంబునం గ్రొవ్వున నివ్వటిల్లి డిల్లంబులు గాక మల్లయుద్ధంబు సిద్ధంబు గాఁ దొడంగిన గడంగి మహాజ్వరంబులు జ్వాలనజ్వాలాకలాపంబులు రూపంబులు గైకొన్న విన్నసువునఁ గన్నసువు చూప అగ్గింప బగ్గింప పెగ్గించియుఁ బోరు నెడ నారాయణజ్వరంబు గరంబు గినిసి కవిసిన పరువంబు గరువంబున నుండనీక ఖండపరశుజ్వరంబు బట్టి మెట్టుకొని పదఁబున మపంబుసఁ దాఁచియుఁ ద్రోచియు మడమల వెడమలిఁచియు నలంచియుఁ బిక్కల మొక్కలంబునఁ జప్పరించియు నుప్పరించియు జానువు నానువున నదిమియుఁ గదిమియుఁ దొడల నొడ లరికట్టియుఁ జుట్టియుఁ జేతుల వాతు లడిచియు విడిచియు మనికట్ల విఱిచియుఁ జఱిచియుఁ గొప్పరంబుల దెప్పరంబుల దెలిపియు నిలిపియు సందుల బొందులఁ గలయ నొత్తియు హత్తియుఁ గారించియు సారించియుఁ దూలించియు సోలించియు నయ్యదుకుంజర సన్నిధికిం దెచ్చి పెచ్చు పెరిగి మెచ్చింపం దలంచి యిట్లనియె.
ఉ. హరి. 6 ఆ. 108

శివవైష్ణవ జ్వరముల యుద్ధము సమూలకముగా పండ్రెండు పద్యములలో సోమన రచించెను. గ్రంథవిపులీకరణమున కిది తార్కాణము.

మూలమున శివజ్వరవర్ణనమును గూర్చి పండ్రెండు శ్లోకములలోఁ జెప్పఁబడినది అనువాదమున సంక్షిప్తముగ సంగ్రహింపఁబడినది. మూలమున శివజ్వరము మనుష్యలోకమున నుండునట్లు వరమీయఁబడినది. శివజ్వరము నోడించిన వైష్ణవ జ్వరము శ్రీకృష్ణుని శరణఁగి పోయినట్లు గలదు. (వి. ప. 123 అధ్యా. 19-29) ఆశ్లోకము లందలి భావమున క్రింది పద్యములను సోమనాథుఁడు రచించెను.

ఆ. అనుమఁ గైటభారి యతిశీతహృదయుఁడై
యట్లు కాక మజ్జ్వరాధివిభుఁడు
నిదె యడంగు మీఁరలిద్దఱు లోకంబుఁ
బీడసేయఁ జంపఁ బెంపు గలిగి.

క. నీవు మదీయ జ్వరమును
ద్యావాపృథివీ ప్రసిద్ధతా వైభవ నా
నావిధచరిత్రములతో
నీవసుధం బరఁగుఁ డనుఁడు నెంతయు నెమ్మిన్.

ఉ. హరి. 6 ఆ. 121, 122

శ్రీకృష్ణాదుల ధాటికోర్వలేక చెల్లాచెదరై పోయిన బాణాసైన్యమును నుద్దేశించి, యుత్సాహ మెసఁగి వీరములఁ బలికినాఁడు. ఆసందర్భమున నీక్రింది శ్లోకము మూలమునఁ గలదు.

శ్లో. ఏవముచ్చరితం వాక్యం శృణ్వంత స్తద చింతయన్
ఉపాక్రామంత తే సర్వే దానవా భయమోహితాః ॥

వి. ప. 124 అధ్యా. 10

ఈవిషయమును విపులీకరించి, సోమన మూఁడు సీసపద్యములను రచించినాఁడు. శివకేశవుల యుద్ధమువలన గలిగిన నుత్పాతముల వర్ణ

నము మూలమున (వి. ప. 124 అధ్యా. 29-34) నాలు శ్లోకములలో వర్ణింపఁబడినది. సోమన వాని ననువాదమున గ్రహింపలేదు. ఉత్పాత ముల వర్ణన బాణాసురుని కోరిక మేరకు యుద్ధముసంభవించు సూచన లను వర్ణించు పట్టులనే కలదు. కావున చర్వితచర్వణమని యభిప్రాయ పడి యుండును.

ఇంతియగాక సోమన తదనంతర యధ్యాయమున నేబదినాలుఁగు శ్లోకములను (వి.ప.125 అధ్యా. 9-63) బరిహరించినాఁడు. ఈభాగమున దానవుల మాయాయుద్ధము, శివుని ముఖమునుండి యగ్నిజ్వాల లెగసి దశదిశలఁ గాల్చుట, ధారుణీదేవి బ్రహ్మను స్తుతించుట, రణరంగమున బ్రహ్మ సదాశివుల సంభాషణ మిత్యాది విషయములు విడువఁ బడినవి.

ఈక్రింది రెండుశ్లోకములలో "కోటవి" అనునొక యుచ్చమల్లి పాత్ర ప్రవేశపెట్టబడినది.

శ్లో. వ్యావిధ్యమానే చక్రే తు కృష్ణేనామితతేజసా
కుమార రక్షణార్థాయ బిభ్రతి సుతనుం సదా ॥
దిగ్వాసా దేవవచనాత్ ప్రవిష్టా తత్ర కోటవీ
లంబమానా మహాభాగా భాగో దేవ్యాస్తథాఽష్టమః ॥

వి. ప. 126 అధ్యా. 22, 23.

ఈవిషయమును సోమన యొక వచనమునందు రచించెను. అం దీవిధముగఁ గలదు. "గుహుండు చేయునది లేక తిరుగం బడినం బూర్వజయుతుండై (పూర్వగీర్వాణుఁడగు బాణునజేయు) హృషీకే శుండు సమయింప దలంచి వేఁటం దగులు నవసరంబునం గోటవి యన నొక్కయుచ్చమల్లి వచ్చి యడ్డుపడిన నగ్నికంజూచి నారాయణుండు మాఱుమొగంబు వెట్టికొని యప్పుడు ద్వాదశవర్షంబులు నన్నుం గొలి చిన ఫలంబు నిన్నొక్కమరి చూచినం జెడునని శపించె నదిమొదలుగా నానగ్నిక దిగంబరయై యుండు నివ్విధంబున. ఉ. హరి. 6ఆ. 182

కోటవి, పార్వతీదేవి యొక్క యష్టమభాగము. అనువాదమున రెండు విషయములు గలవు. కృష్ణుఁడామెను జూడక పరాఙ్ముఖుఁడయ్యెను. అనువాదమునఁ గల నారాయణుని శాపము మూలమున లేదు. మఱియు నాశాపము నిడినదావి దిగంబరయై యున్నదనుటవిశేషము.

శివుఁడును, గుహుఁడును యుద్ధరంగమును విడిచి పోవఁగా బాణాసురుఁడు దేవేంద్రవైభవమున రణరంగమున కేతెంచెను. మూలమున నావిషయము మూఁడుశ్లోకములలో వర్ణింపఁబడినది. (వి. ప.126 అ. 34-36) అనువాదమున సుదీర్ఘమును, సంస్కృతపదసమాస భూయిష్ఠమునయిన వచనము నొకదానిని, సోమన రచించినాఁడు. (ఉ.హరి. 6ఆ 184). అనువాదమున నిట పెంపు కానవగును.

బాణాసురుని యస్త్రప్రయోగమువలన నేర్పడిన దారుణమగు పరిస్థితి, మూలమున నైదుశ్లోకములలో వివరింపబడినది. ఇందు "దహ్యమానే చ కేశవే" (వి. ప. 126 అధ్యా. శ్లో. 62) అనుటలో కేశవుడే కాలిపోవుచున్నాఁడని కలదు. ఇది యసమంజసమని సోమన తలఁచి, విడిచియుండును.

ఈఘట్టముననే గరుడ మయూరముల యుద్ధముకూడ నతిరమణీయముగా వర్ణింపఁబడినది. ఆవచనము నిటఁ జూపుచున్నాను.

వ. తదవసరంబున గరుడమయూరంబులు సమరకాంక్ష మానసంబులతోడం దలపడిన నప్పుడు గరుడండు దక్షిణపక్షంబునఁ బ్రేయంబూనిన సంకుచితశరీరంబై మయూరంబు సవ్యభాగంబునకు నెగసి ముక్కునం బొడిచి ఱెక్కల నడిచి తదుపరిభాగంబునకు నెగసినంజూచి తానునుం దోడన యెగసి తదీయదేహంబు చరణంబుల నిఱికియు మఱియు గగనంబునకు నుఱికియు విరుగంబడి నీలకంఠశిరంబు చంచుపుటంబునం గీలించి తదీయపక్షంబు గోళ్ళ గీఱియుఁ జాళ్ళ

వాటియు నయ్యాయోధన శిక్షితుం డగు పతత్త్రిపతి తనదక్షిణ వక్షంబున నడిచి మహిం బడ విడిచిన నామయూర రా జర్ధపదపాత జనితజ్ఞానుండై క్రమ్మఱ నెగిరి యురవున నూఁకియు వెరవునం దాఁకియుఁ దుండంబు సారించియుఁ బ్రచండంబుగాఁ గారించియు ఱెక్కలఁ బ్రేయం జూచియుఁ బ్రక్కలుడాయ నఖంబులఁ జాఁచియు బహుప్రకారంబుల గారించినం గనుంగొని సుపర్ణుండు విజృంభించి సువర్ణ వర్ణ సంకీర్ణ కిరణ సముదాయ వ్యాప్త నభోమండలుండై వత్త్రింబులం జిత్రంబులుగా మయూరంబు వ్రేసియు నీసునం బో నీక గాసి చేసియు మఱియునుం దనువు లేక లేఖలోకంబు వెక్కసం బంద నక్కార్కోదర విదారియగు వైనతేయుండు తదీయోదరంబు వ్రచ్చి రణభూమికి బలిచేసిన. ఉ. హరి. 6 ఆ. 204

శ్రీకృష్ణుఁడు బాణాసురు నోడించి సంహరింపనెంచు నవసరమునఁ బార్వతియుఁ, గోటవియు శ్రీకృష్ణునెదుటఁబడిరి. మూలమునఁ బార్వతీ దేవి దిగంబరయై వచ్చినదనుట జుగుప్సాకరమగు విషయమని విడిచెను. కావున వారిరువురి సంభాషణముకూడ ననువాదమున రాలేదు. ఈవిషయము లన్నియు (వి. ప. 126 అధ్యా 111-116) శ్లోకములందు గలవు. అనువాదమున నీక్రిందిపద్యము చక్కగా భావసమన్వితముగా నున్నది.

గీ. దేవ దేవ జగన్నాథ దివ్యమూర్తి
 కావవే దనుజేశ్వరుఁ గరుణతోడ
 ననుచుఁ గోటవి యెదురుగా నరుగుదేఱ
 మోముచూడక కన్నులు మూసికొనుచు. ఉ. హరి. 6ఆ. 218

మఱియొకవిషయము. పార్వతీదేవి లంబాద్వితీయముగా వచ్చిన దని గలదు. అనువాదమున శివుని యాజ్ఞను నగ్నికమాత్రమేవచ్చి కృష్ణుని ప్రార్థించినది.

మూలమునం బార్వతీదేవి, తాను శాఖనకిడిన వచనము వ్యర్థము గాకుండం జూడుమని శ్రీకృష్ణుని ప్రార్థించినది (వి. ప. 126అధ్యా 117-120) అనువాదమున నన్మాత్రమే వచ్చి ప్రార్థించినట్లును, శ్రీకృష్ణుండు బాణుని రక్షించి, బ్రోచినట్లు నిర్ణయింపబడినది కావున నీభాగము పరిహరింపంబడినది.

ఇంతియుగాక శ్రీకృష్ణ పార్వతీదేవుల సంభాషణము (వి ప. 126 అధ్యా. 121-123), చక్రవేగ ప్రశంస బాణహస్తముల ఛేదన ప్రక్రియా కలాపము (వి. ప. 1-6 అధ్యా 128-133), చక్రోపసంహార ప్రార్థనము- ఇత్యాది విషయంబులను బరిహరించినాండు సోమన ఈవిధముగనే శ్రీకృష్ణాదు లనిరుద్ధుని కడకేగునప్పుడు చిత్రరేఖ స్వాగతమిచ్చుట (వి. ప 126 అధ్యా 1-8), అనిరుద్ధుని నాగబంధ విముక్త్యాదులును (వి ప 126 అధ్యా 9-36) విడువంబడినవి

శ్రీకృష్ణాదు లుషానిరుద్ధులతో ద్వారవతి కరుదెంచుపట్టుల ద్వారకాపురవర్ణనము గావింపంబడినది మూలముకంటె నిది ప్రపంచీకరింపంబడినది.

# సామెతలు - జాతీయములు

ఉత్తరహరివంశమునందు నాచన సోమనాథుఁడు సామెతలను, జాతీయములను విరివిగా నుపయోగించెను సామెతలలోఁగల విలువను బాగుగా గుర్తెఱింగిన సోమన, తన గ్రంథమున శతార్థము వఱకు సామెతలను జొప్పించినాఁడు, జాతీయములు, నుడికారములన్ననో శతాధిక మనుట నిస్సంశయము సామాన్యప్రజానీకము సామెతల నాదరించుట వలననే యవి శిష్టవ్యవహారమున కెగఁబ్రాకి, సాహిత్యమునఁ జోటుచేసికొనిన వనుట సత్యము రమణీమణుల కాభరణములవలె భాష కలంకారములు భూషణములు అట్టి యలంకారములలో మణిపూస యనఁదగు యుపమాలంకార మీసామెతలకు జీవము. ఉపమానపూర్వకరచనము మూలమున విషయస్పష్టతయు, నర్థబోధకతయు సాధింపనగును ఈకారణముననే సాహితీపరులును విశ్వశ్రేయము నాకాంక్షించి యట్టిరత్నములను తమబంగరు కవితలఁ బొదిగించి రనుట యథార్థము

నాచన సోముని సామెతల ప్రయోగ బాహుళ్యమును గూర్చి వ్రాయుచు, శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిట్లు చెప్పియున్నారు "ఇతని (నాచన సోముని) గ్రంథం ఆఱాశ్వాసాలే అయినా పదునెనిమిది పర్వాల భారతంలోకూడ వెతికితే యిన్నిలోకోక్తులు దొరకవనే నాకు తోస్తుంది"

లోకోక్తులే, సామెతలుగా వ్యవహరింపఁబడుట సర్వసామాన్యమైన విషయము. వీనికి వ్యవహారరంగమునఁ గల స్థాన మీక్రింది యొకటి రెండు నిర్వచనములను బట్టి గ్రహింపనగును

(1) సామెతలు ప్రసంగానికి కాంతినిచ్చెడి దీపాలు.

(2) ఏజాతి అంతరంగమైనా దాని సామెతలలో ప్రతిఫలిస్తుంది.

(3) సామెతలు భాషలకు ఆమెతలు _ అవి పెద్దలు లోకులకు చిందించిన అనుభవామృత బిందువులు,

ఇంతేగాక సామెతలనుబట్టి యాకాలమునందు వాడుకలోఁగల పదములను, భాషాప్రయోగ వైచిత్రియుఁ దెలియనగును. ఉదాహరణమునకు నాచన సోమనాథుని సామెత నొకదాని నిట జూపుచున్నాను. "దువ్వఁజూచి నక్క యొడలుగాల్చికొన్న వడువున"(ఉ.హరి. 4ఆ 165) అను సామెత చతుర్థాశ్వాసమున జరాసంధుని రాయబారవుఘట్టమునఁగలదు. ఇందలి "దువ్వ" పదప్రయోగమునుబట్టి సోముని కాలమున కాపదము వాడుకలోనున్నట్లు తెలియుచున్నది. తిక్కనకాలము నాటికీపదము వాడుకలోనున్నట్లును గానగును. అనంతర కాలమున నీపదము వాడుకలోనుండి తొలఁగినది. కావున నీసామెత "పులినిజూచి నక్క వాతఁబెట్టికొనినట్లు"గా మారింది. ఆనాటి "దువ్వ" తరువాతికాలమున "పులి" యైనది. ఈ విషయమునుగూర్చి ప్రస్తావించుచు, (శ్రీ) చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు వ్రాసిన వాక్యముల నీసందర్భమునఁ జూడనగును. "కవిత్రయమువారు వాడని తెలుఁగుపదాలు యీయన వాడినట్లు పీఠికలో వ్రాయఁబడినది. _ ఆ పదాలకు నాటికాలపు వ్యావహారిక భాషే యీయనకు గురుత్వం చేసిందను కోవాలి. సామెతలు మా గోదావరీ మండలంలోనే కాక కృష్ణా గుంటూరు మండలాలలోకూడ వాడుకలో లేని వెన్నో యీయన వాడినట్లు కనపడుతుంది. ఉదాహరణకు :_

(1) మాఱఁ దనయింటికి రమ్మను వానికేమియుం గఱపినన్.

(2) మద్దులు మునింగి పాఱ వెంపల్లు తమకెంత బంటి యనుట.

తనంతట తానుగా యింటికి ఆహ్వానించేవాఁడు అని పయి సామెతకు తాత్పర్యం. ఈ సామెత మా ప్రాంతంలో లేదుగాని యించుమించు యిదే అర్థాన్ని బోధించేవి కొన్ని ఉన్నాయి.

(1) కాళ్ళచు పోయేదాన్ని నెత్తిని రుద్దుకొన్నట్లు.
(2) కొఱవితో తల గోక్కన్నట్లు ... ... లోనైనవి.

ఈ రెండోదాన్నికూడ యీ మహాకవి వాడే ఉన్నాఁడు. "కొఱవిం దల బరికికొన్న కొఱకులుగారే" (ఉ. హరి. 4 ఆ. 106) మఱెన్నె సమానార్థబోధకాలుగా వుండే సామెతలు దేశభేదాలనిబట్టి మెన్నో కనబడతాయి."

ఇక జాతీయముల విషయము. సామెతలతోపాటు జాతీయములు, నుడికారములు సోముని గ్రంథమునఁ గొల్లలుగఁ గానవగును. ఏదేని యొక యపూర్వభావప్రకటనమునకుగాను కొన్ని పదములను గలిపినచో, నా పదబంధములే కాలక్రమమున నుడికారములుగాను, పలుకుబళ్ళుగాను, జాతీయములుగాను వ్యవహరింపఁబడును. ఆ పదములు విడివిడిగా సామాన్యవిషయములనే దెలుపునవైనను, వాని కలయికలో నావైశిష్ట్యమును బొంది యొక నూతనభావమును బ్రకటించును. కావుననే సోమనాథమహాకవి తన గ్రంథమునందు, శిష్టజన వ్యవహారమునందానాటికి జీవించియున్న సామెతలనే గాక జాతీయములను, నుడికారములను గూడ నిక్షిప్తపఱచియున్నాఁడు.

అవి సహజముగను, సందర్భోచితముగను, భావసముజ్జ్వలముగను క్రిందివిధముగ నమరియున్నవి.

1. చిల్కవోయినం బంజరమేమిసేయ ? (1-72)

ఉత్తరహరివంశమునఁ బ్రథమాశ్వాసమున నరకాసురవృత్తాంతముకలదు. నరకుఁడు దిక్పతులను జయించి, స్వర్లోకమునాక్రమించెను. ఆతఁడొక యున్నతరత్న సింహాసనంబు నధిరోహించి, యూర్వశిని బిలువనంపెను. ఆమె యట కేతెంచినది. అతఁ డామె యందమునకు మురిసి ప్రేమించెను. కాని యూర్వశి వాని బారినుండి తప్పించుకొను

నెపమున, "చిత్తమెల్లం జెడియుండ, రిత్తయొడలం జవిచేరునె" - యని తోడన, "చిల్కవోయినం బంజరమేమిసేయు" "రసభంగము సంగతిలోన మెత్తురే" యని పలికినది. ఇట ప్రధానముగ నరకునియందు దనకుఁగల యనిష్టతను స్పష్టముగ వ్యక్తీకరించినది. చిలుకను బెట్టియుంచెడు పంజరము, చిలుకపోయిన వెనుక నక్కఱకు రాదను పలుకులలోఁ దన హృదయము విప్పిచెప్పినదనుట స్పష్టము. ఈఘట్టమునగల యూర్వశీ నరకుల సంవాదము ముఖ్యమైనది. తుద కామె కోర్కెను మన్నించియే నరకాసురునికి మునులను బాధించి యజ్ఞభాగములను గొన నిచ్ఛగలిగినది. అది యాతని క్రౌర్యము వ్యక్తమగుటకును, సన్మార్గుల నొప్పించి, తత్ఫల మనుభవించు సమయమాసన్నమగుటకును గారణభూతమైనది. ఈ విధముగ సీసామెతలను బ్రయోగించుటలో "వ్యంగ్యముగ విషయ వ్యక్తీకరణమును సాధించుట" యను నొక విశిష్టత నాపాదించి నాఁడు నాచన సోమనాథ మహాకవి.

2. పువ్వులు వేడుకైనఁ గడివోయిన వాఁక ముడువంగ వచ్చునే. (1-73)

పయి ఘట్టమునందే యూర్వశి నరకు నుద్దేశించి, సువాసనల వెదజల్లు యోగ్యములైన పుష్పములనైనను వాడిపోయి, వాసన లంతరించిన వెనుక నిరుపయోగము లనియుఁ, దనకుఁగల పూర్వప్రఖ్యాతిని మాత్రమే పురస్కరించుకొని, తనను గోరుట భావ్యము గాదనియు తప్పించుకొన జూచినది. ఇట్లు తన మనోభావములను వ్యక్తీకరించుట కీసామెత బలము చేకూర్చినది.

3. ఎంత దటీఁగిన మిరియాలుం జొన్నలసరిపోవే. (1-75)

తనబారినుండి తొలఁగిపోవంజూచు నూర్వశితో నరకుఁడు "ఎంత దటీఁగిన మిరియాలుం జొన్నలసరిపోవే" యని పలికినాఁడు. కవి యిందెంతటి భావమిమిడ్చినాడో గమనింపనగును. కాలప్రభావమున ఘనులైన వారు పతితులైనను, నల్పుల కేనాడును తీసిపోవరని చెప్పుట కీ సామె

తను గూర్చినాడు కవి. ఊర్వశి స్త్రీని నంగీకరించుటకు నరకుడు సుముఖుడుకా లేదు. అయ్యప్సరస, జ్యోత్స్నలతోఁ బోల్పఁదగిన నారీసమూహమునందు మిరియమువంటిదని నరకుఁ డూహించినాఁడు. ప్రకృతపరిస్థితియందును నామె సామాన్యులగు నంగనలకెన్నడును తక్కువకాదను భావము నీసామెతమూలమునఁ గవి వ్యక్తపరచినాఁడు.

4. శిరసుండగ మోఁకాలను సేసలు వెట్టుట. (1-96)

నాచన సోమనాథుఁడు స్వీకరించిన సామెతలును నాయాఘట్టముల యందదికికొనునట్లుండుటొక విశేషము. యుక్తియుక్తంబుగా నరకుని దప్పించుకొను నవసరంబున నూర్వశి యతనిని యజ్ఞభాగభ్రాజిష్ణుఁడవు గమ్మని కోరినది. ఆతఁడును వల్లెయనినాఁడు. అనంతరకాలమున, నావిషయమును దలంచి, యయ్యసురుఁడు తాపసులకడకేగి యాగభాగము లిమ్మనెను. వారందులకు సమ్మతింపమి, నరకునిమాటల నీవిధముగ నొక సామెతయందిమిడ్చినాఁడు సోమన. "శిరసుండగ మోఁకాలను సేసలువెట్టుట - బేలుఁదనముగాక మీకుఁ బెద్దరికంబే" అనుటలోఁ దన యౌన్నత్యమును బ్రదర్శించినాఁడు. తాను దిక్పతులను జయించుటఁజేసి, నాకలోకమునకు నాయకుఁడయ్యెను. తత్కారణమున శరీరమునకు శిరమువంటి ప్రాధాన్యము నందినాఁడట; ఇంద్రాదులు తన కోడి పాఱుటచే వార లీతనికిఁ బాదాక్రాంతులయిరఁట. సోమన యీ యాక్షేపణమును వాచ్యము చేయలేదు. ఈ పై సామెతలో నీ భావమును ధ్వనింపఁజేసినాఁడు. మహత్త్వసంపన్నములగు నధ్వరభాగంబులను పదవీభ్రష్టులగు నింద్రాదుల కిడుట వ్యర్థము, నయోగ్యము నను భావమీ సామెతను బ్రయోగించుటలో సూచింపఁబడినది.

5. నోచినవారి సొమ్ములవి నోమనివారికి వచ్చునేధరన్. (1-168)

ఈ మహాకవికి సామెతలఁ గూర్చుటలోఁగలనేర్పు కడు విచిత్రమయినది. హైందవధర్మశాస్త్రము ననుసరించి, కర్మపరిపక్వమునందిన

మానవుల కయాచితముగ, సప్రయత్నముగఁ గొన్ని ఫలములు సమకూడుచుండును. ఈ విషయమును వ్యక్తీకరించుటలో తద్భిన్నములగు వానినిగూడ కలిపిచెప్పుట విశేషము. నరకాసురవధ ఘట్టమున లలిత తనూవిలసితయగు సత్యభామ, వీరత్వము రూపుధరించినదోయన రణరంగమున భాసించినది. ఆమె నరకుని విరథు నొనరించి, మూర్ఛనొందించెను. ఆపె రణకౌశలమున కానందించి, యంతలో సేదఁదేఱిన యరవిందనయనుఁడామెకొక కంఠాభరణమును బహూకరించి కౌగిలించుకొనెను. ఇదియొక విషయము. ఇంతకు మున్నెన్నఁడో రుక్మిణీదేవి కోరిన పతకమును దేవదేవుఁ డనుగ్రహింపక కాలయాపనఁ జేసెననుట మఱియొక విషయము. ఈ రెండింటి నొక్కచోఁ జేర్చి, కవి "నోచినవారి సొమ్ములవి నోమనివారికి వచ్చునే ధరన్" – యనుసామెత నిట ధ్వని ప్రధానముగఁ గూర్చినాఁడు. మరియు సోముని కూర్పులోఁగల నేర్పు యీవాక్యమున విశదమగుచున్నది.

6. పాటెడుబండ్లకుఁ గాళ్ళు సాఁపుట. (2-31)

శ్రీకృష్ణమాహాత్మ్యము వర్ణింపఁబడిన ద్వితీయాశ్వాసమునందు, విప్రుఁడొకడు తనకు పుత్త్రభిక్షపెట్టుమని శ్రీకృష్ణుని వేడుకొనెను. వాసుదేవుఁడాదినమున దీక్షగైకొనియుంట యిలువెడల ననువుగాలేదు. అట్టియెడ పార్థుఁడా విప్రకుమారరక్షణముసేయ కృష్ణుననుమతిఁబడసి విప్రునితోనేగినాఁడు, అట తనపంతము నెగ్గించుకొనఁజాలక యర్జునుఁడు వీరబంధువయ్యెను. విప్రుఁడందులకు వగచి, పార్థుఁడపార్థుఁడాయెనని, స్వకృతాపరాధము నీరీతిఁబలికెను : "పాటెడు బండ్లకుఁ గాళ్ళుసాఁపఁగా సలవనుపన్న పోటుమగఁడై యిటుచేసితిగాక". పర్వెత్తుచున్నట్టి బండి ములక్రిందకుఁ గాళ్ళుసాచుటవలనఁ గాళ్ళు నలుగుటయే కాని, తదితర ప్రయోజనము సిద్ధింపదని యద్దానిభావము. ఇది సర్వసామాన్యమగు న్యాయము. అనగా శ్రీకృష్ణుడు తనకుఁబుత్త్రభిక్ష పెట్టుటకు సమర్థుఁడని

తా నెఱింగియు, మూర్ఖునివలె నర్జునుని గొనివచ్చుట తనయవివేకమనుట. పనియు సానుకూలము కాలేదు. ఇట్లు దెలిసియు, నర్ధమును గోరి తెచ్చి కొనినాఁడను భావమును - జూపుటకు గాను వాడఁబడిన దీ సామెత.

7. తగునే కఱకట్లును జంకఁబొత్రముల్. (2-157)

ఈ సామెతను సంఘటించుటకు సోమన యత్యంత రమణీయమగు ఘట్టము నేర్కొనినాఁడు. బదరికావన మతిపవిత్రమయినది. అందులకుఁ గారణ మా భూస్థలిని మహర్షులు నిరంతరము లోకకల్యాణార్థము శ్రీమన్నారాయణునిగూర్చి తపంబొనర్చుటయే. అట హింసలకుఁగాని యపవిత్రతకుఁగాని చోటులేదు. కావుననే శ్రీకృష్ణుఁ డాత్మసముఁడగు నీశ్వరునిగూర్చి, తపంబొనర్చుట కా యాశ్రమమునకే పయనమయి నాఁడు. మార్గమధ్యమున పిశాచద్వయము శ్రీకృష్ణునకు తటస్థపడినది. వారిరాక యాశ్రమపవిత్రతకు భంగకరమనుట సత్యము. సదా శివ చింతను నిశ్చలచిత్తులగు మహర్షుల కాలవాలమగు నాప్రదేశమున తద్విరుద్ధప్రవర్తనులగు పిశాచములరాక యొకచేత కఱకట్లును (అనగా కాల్చుటకయిన మాంసపుముక్కలు) మఱియొకచేత సద్గ్రంథములను బట్టికొనినట్లున్నదని వర్ణించినాఁడు కవి. ఇట మకారపంచకమున నొకటి యగు మాంసభక్షణమును, పవిత్రమగు జ్ఞానసాధన కనువగు విద్యా వ్యాసంగమును జతపఱచుటలోఁగల యసంగతము నిరూపింపఁబడినది. పవిత్రాపవిత్రములగు విషయముల పొందును, తదనురూపమగు నుప మానమునఁ బోల్చిచూపుట కనువగు ఘట్టమున నీ సామెతను సంఘ టించుటలో సోమన విశిష్టత గోచరించును.

8. తామరపాకు నీరుఁబలెఁ దల్లడమందిరి పౌరులందఱున్. (3-35)

తృతీయాశ్వాసమునందు పౌండ్రకవాసుదేవుని కథగలదు. ఏక లవ్యుఁడు యాదవసైన్యమును దైన్యమునొందించిన ఘట్టము నతిరమ్య ముగాఁ జిత్రించినాఁడు సోమన. వృష్ణివీరు లాతని బలపరాక్రమముల

సమరోద్ధత మెఱయఁబలికి, యాతని నెదుర్కొనెను. పౌండ్రుఁడు, సాత్యకితోఁ దలపడుటకు మారుగా, నయ్యాదవ సేనాధిపతిని కనుఁగొని యిట్లని యాక్షేపింపఁ దొడంగెను. యాదవులు పరాక్రమ విహీనులు, భీరువులు, రణరంగమున శౌర్య ధైర్య సాహసములను జూపువారలు కారనియెను. మీజాతియందు వీరుఁడగు వాని నొక్కనినైనను జూపుట యసాధ్యము; అసహజమును గూడ ననెను. ఈ సందర్భమున నీసామెత నిముడ్చుట గమనింప దగినది. కుమ్మరావమునఁ బచ్చికుండలను గాల్తురు. అందు కాలిన కుండలెల్లప్పుడును దొరకుట సహజము. కాని విలువగల రాగిముంత లట్టి యావములందుఁ గాన్పింపవు; దొరకునని వెదకుట భ్రాంతియు, వృథాప్రయాసయు నగును. ఇది యథార్థమే. పౌండ్రుని యభిప్రాయమున యాదవులు నిర్వీర్యులు, ప్రతాపహీనులు ననుట ప్రకృతవిషయము. యాదవవంశమున వీరాగ్రగణ్యుని వెదకుట భ్రాంతి యని పౌండ్రుని భావము. తన్నెదిరింపవచ్చి, పరుషవాక్యులను బల్కు సాత్యకినిగాంచి, యాదవులందు తాఁకోర్వఁజాలు వానిని జూపుమని ప్రశ్నించుపట్టుల నాచన సోమనాథుఁడీ సామెతను వాడినాఁడు.

10. జీలుగు వెరిఁగిన మాలెకుఁ గంబంబుగాదు. (కి-50)

ఇదియుఁ బౌండ్రక సాత్యకుల మధ్య జరిగిన సంభాషణమున కవి జొప్పించిన సామెత. పౌండ్రకుఁడు, యాదవవంశమునందు యుద్ధమున తనకెదురునిలిచి, పోరాడగల వీరుఁడు లేడని ప్రగల్భములు పల్కెను. తద్భావ నిరూపణమునకు "కుమ్మరావమున రాగిముంత లేరంగఁ గలవె" యను లోకోక్తిని జోడించెను. అప్పలుకులకు సాత్యకి క్రుద్ధుఁడై పౌండ్రుని వ్యక్తిగతములగు శక్తి సామర్థ్యములను జాతిపరములుగఁ జేయుట సంభావ్యము కాదని నిందించుచు, జీలుగుచెట్టు మహావృక్షముగ బెరుగును కాని, యా పెరుగుదలవలని ప్రయోజనము కానరా దనెను. అట్లే పౌండ్రుని వాచాలత జీలుగువలె పెరుగుచున్నదే కాని, సామర్థ్య

రహితమని నాఁడు సాత్యకి. మఱియొక విషయము. జీలుగుచెట్లు యెంత పెరిగినను బలముచాలమి, గృహనిర్మాణాదులం దుపయోగ పడవు. అట్లే పౌండ్రుఁడు తన ప్రతాపము నెంతగాఁ బొగడికొన్నను, సాత్యకి యెదుట నిలువఁగల మగతనము లేనివాఁడు. ఈ భావముయొక్క ప్రతిపాదనమున కయి యీ సామెతను గవి యిట కూర్చినాఁడు.

11. "ఒక్కగుహలో వర్తింప సింహద్వయ మొనకుం గూడునె" (3-98)

ఒక్కయరలో రెండుకత్తులు ఇముడవనియెడునది సామాన్య జనుల ముఖమున నలిగియున్నట్టి సామెత. దీనినాధారముగా నీ సామెతయుఁ బుట్టినది. పౌండ్రక వాసుదేవుఁడు శ్రీకృష్ణపరమాత్మునివలె శంఖచక్రగదాదులను స్వయముగా నిర్మించుకొనినాఁడు. మరియు నిరువురు వాసుదేవులు లోకంబున నుండుట సమకూడదని పౌండ్రునితలఁపు. అనగాఁ దన్ను గెల్చినగాని, వాసుదేవనామము శ్రీకృష్ణునకు సమకూడదని పౌండ్రుని హెచ్చరిక.

12 పఱిగల నేఱినం గొలుచు పాఁతటికిం గలదే తలంపఁగన్ [4-48]

పండిన పంటను గోసి, పాతర వేయుట వలన ప్రయోజనముండును. కాని యా పంటను విడిచి, యా పొలమునందు రాలినయేవో కొన్ని యెన్నుల నేఱి పాతరవేయ ప్రయత్నించుట వ్యర్థము. అవి పాతర వేయుటకు సరిపడవు. పాతర వేయు తలంపున్నచో వెంటనే కోసి ధాన్యమును గ్రహించుట యుక్తము. హంసడిభకులు దుర్వాసునాశ్రమమున కేతెంచి యట నున్న శిష్యకోటిం జూచి యూహించిన విధము నీ సామెత మూలమునఁ దెలియఁ బఱచినాఁడు కవి. ఆశించిన ప్రయోజనమును బట్టి తదవసర చర్యలు గైకొనవలెను. కాని తద్విరుద్ధముగ చరించుట యవివేకమని వారి తలఁపు. ఆశ్రమములలో నతిముఖ్యమును, ప్రసిద్ధమును నైన గృహస్థాశ్రమధర్మమును వీడి వృథాశ్రమకు హేతుభూతమగు వానప్రస్థాశ్రమము మూలముననే ముక్తి

నొందఁ జూచుట యవివేకమని హంసుఁడు దుర్వాసాది మునులతోఁ బల్కినాఁడు. ఈవిషయము నందలి ముఖ్యాంశములను వ్యక్తపఱచు టలో నీసామెత బహుధా తోడ్పడుచున్నది.

13. వరుగుతో దాఁగరయు నెండ వలసినట్లు (4-54)

హంసడిభకులు దుర్వాసు నవమానించుటను గాంచి వారి యనుంగు చెలికాడగు జనార్దనుఁడు పలికిన పలుకు లెంతయు సాధు సమ్మతములు. ఇతఁడు దుర్వాసుని మహాత్త్వమును వివరించు పట్టుల హంసడిభకుల నుద్దేశించి, యీ క్రిందిపద్యమును జెప్పినాఁడు.

"చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము
దానఁ గీడెంతవుట్టినఁ దగిలె నాకు
ననుభవింపక పోవునే యక్కటకట !
వరుగుతో దాఁగరయు నెండవలసినట్లు!"

ఇందు తాను రాజకుమారుల కత్యంత ప్రియసఖుఁడగుట వారు సాధువులకుఁ జేసెడి యవమానాద్యములలో పాలుపంచుకొని నట్లు భావించినాఁడు. ఈ ఘట్టమున నొక సామెతను గవి ప్రయోగించి నాఁడు. ఇందు సమయస్ఫూర్తి గలిగి, విషయగ్రహణమున కనువైన సామెతను వాడుటలో కవి తన లోకజ్ఞతను వ్యక్తమొనర్చినాఁడు. పదార్థములను నిలువ యుంచుటకు వానిని దాఁగర యందుంచి, యెండఁ బెట్టుట లోకసామాన్యమగు విషయము. ఆ సమయమున నా పదార్థ ములతో పాటు దాఁగరయు నెండును. ఇట దాఁగర నెండఁబెట్టు తలంపుగాని, యద్దాని నెండఁబెట్ట వలసిన యవసరముగాని లేదు. లేకు న్నను నాపదార్థముల తోడి బొత్తు హేతువుగా నా దాఁగరయు నెండు చున్నది. అట్లే జనార్దనుఁడు హంసడిభకులతోడి మైత్రిని తత్పాప ఫలము ననుభవించు చుండెనను విషయమును కవి యీ సామెతలో

సాధించినాఁడు "నసఁ గూడి నార తల కెక్కు-నట్లు" అను లోకోక్తియు నిట్టిదే.

14 తవుడు దిని చచ్చువానికి విషముపెట్టువాఁడు వెఱ్ఱివాఁడు [4-62]

మహాతపస్వి యగు దుర్వాసు ననేకవిధముల నవమానించు పట్టుల, హంసడిభకులను, వారికూరిమి చెలికాఁడగు జనార్దనుఁడు మంద లించినాఁడు. త్రికాలవేదియుఁ గోపిష్ఠియునగు నమ్ముని శాంతుఁడగుట యొకవిశేషము. శ్రీకృష్ణపరమాత్ముఁడు హంసడిభకుల వధింప నున్నా డను విషయమును వివరించు నవసరమున కవియొక సామెతను వాడి యున్నాఁడు. చక్రధరుఁడు వారి సమరనున్నాఁ డనుటలో కాలమును గూడ సూచించియున్నాఁడు. ఏమాత్రమును హానికరముకాని తవుడు నారగించి కొలదికాలములో మరణించు నవస్థను బొందువానికి విష మును బెట్టి చంపఁబూనుట బుద్ధిహీనత యగును. శిష్టరక్షణము సేయఁ బూనిన శ్రీకృష్ణుఁడు త్వరలో హంసడిభకులను జంపనున్నట్లు గ్రహిం చిన దుర్వాసుఁడు వీరల శపించి దండించుట యనవసరము. ఈ విషయ మును దెలుపుట ప్రకృతభావము— దుర్వాసుని కోపానలమునకు గురి కాకున్నను హంసడిభకులు చచ్చుట నిశ్చయమను భావవ్యక్తీకరణ మునకీ సామెత ప్రయోగింపబడినది.

15 దాఁగంబోయి తలారివాని యెదురన్ దాఁగంగ నీకేటికిన్ [4-92]

హంసడిభకులు వేట చాలించి, పుష్కరసరస్తీరోత్తరారణ్యా పావనభూము లందు శిష్యసమేతుండగు దుర్వాస మహర్షిం గాంచిరి. అతఁడు తపోనిష్ఠ యందుండి పలుక కుండుటను వేఱువిధముగ భావించి హంసడిభకు లా తపోధనుని శిష్యసమేతముగ నవమానించి చనిరి. శాపా నుగ్రహ సమర్థుఁ డయ్యు దుర్వాసుఁడు శాంతించి యివ్విషయమును శ్రీకృష్ణున కెఱింగింపఁగోరి, ద్వారవతీపురమున కేగెను. ముల్లోకము లను సర్వథా రక్షించు సర్వాంతర్యామి యగు నా జగన్నాథుఁ డిమ్ముని

రాకకు గారణ మరయుట విచిత్రము. దుర్వాసుఁడు స్వయముగఁ దన
తపోమాహాత్మ్యమున శ్రీమహావిష్ణువి యంతరంగ మెఱుంగును.
మఱియుఁ దాను బ్రహ్మాదులను మించి శ్రీమహావిష్ణువుతో నెవ్విష
యమునైనను బ్రసంగింపఁగల ధీరుఁడు. అట్టియెడ నాతఁడు తన రాక
కుఁ గారణమడుగుటను సహింపఁజాలకుండుటలో నాశ్చర్యము లేదు.
దోషియగువాఁడు తలారివాని యెదుటనే దాగినట్లు సర్వమును దెలిసిన
తనయెడ నివ్విధముగఁ బ్రవర్తించుట శ్రీకృష్ణునకు భావ్యము గాదని
దుర్వాసమహాముని తలఁపు. ఆతఁ డావిషయమునే వ్యక్తపఱచినాఁడు.
ఇందు శ్రీకృష్ణ దుర్వాసులకుఁ గల యత్యంత సన్నిహితత్వము స్పష్ట
మగుచున్నది. మఱియు శ్రీకృష్ణుఁ డీదివ్యావతారమున సహజముగఁ
జూపు నటనల కిట తావులేదని దుర్వాసుఁ డతిచనవునఁ బల్కుట గమ
నింపఁ దగినది. ఈసందర్భమున నీసామెత మూలమున దుర్వాసుని యభి
ప్రాయ వ్యంజకత్వమున కత్యంత ప్రయోజనము సిద్ధించినది.

19. వేళ్ళతో మొదలు చూచి చెట్టెఱుఁగు వారి కాకులు సిదుమనేల [4-95]

దుర్వాసాది మహామునులు హంసడిభకుల దుర్నయములను
శ్రీకృష్ణుని కెఱింగింప నేగిరి. వాసుదేవుఁడును వారల సత్కరించి వారు
వచ్చిన కారణ మడిగెను. తోడన దుర్వాసుఁ డుగ్రుఁడై కొంత కోప
ముపశమింపఁ జేసికొనినాఁడు. బ్రహ్మవేత్తలును, విజ్ఞాన నిధులును నగు
నా మునీశ్వరులు పంచభూతసుధాకరభాస్కరాత్మస్వరూప మగు నారా
యణుని రూపు నెఱుంగుదురు. అట్టివారిలో దుర్వాసుఁ డొకఁడు. త్రిలోక
రక్షణమే ప్రధాన కర్తవ్యముగాఁగల వాఁడగు శ్రీకృష్ణునకుఁ దాపసుల
రాకకు హేతు వరయుట తగదని పలికె నాఁడు. ఏరూపమున నున్నను
నట్టి యవతారపురుషుఁ డయినను, సాక్షాద్భగవంతుఁ డగు నారాయ
ణుని గుర్తింపఁజాలిన వారా తాపసులనుట నిశ్చయము. వైద్యసంబంధ
మైన సామెత నిట గ్రుచ్చినాఁ డీమహాకవి. చెట్టు విషయము తెలియని

వారి కాచెట్టు నెఱుంగుట కాకులు చిదుముట మొదలగు ప్రక్రియ లవసరము. కాని చెట్టునుజూచి వేళ్ళతో సమస్తము గుర్తింపఁగల వారలకట్టి పరీక్ష లనవసర మగును. బ్రహ్మవేత్తలగు నమ్మహార్షులకు శ్రీకృష్ణుని మహాత్త్వముఁ దెలియుననుట కీ సామెత ప్రయోగింపఁబడినది.

17. పులి పేదవడినఁ బసులవాండ్రెక్కా_డి రనుకత (4_102)

18. మునులలోపల నాలుకములు విఱిగె"

ఈ ఘట్టముననే మఱి రెండుసామెతలను సంధించినాఁడు సోమన. దుర్వాసుఁడు తానును సర్వసమర్థుఁ డయియుండియు, నా హంసడిభకుల కయి తన తపోధనమును వ్యయింపలేదు. దుష్టశిక్షణ దక్షతకలిగి, లోకరక్షణ భారంబు వహించు, శ్రీకృష్ణుని దాకార్యభారము. పులి పేదవడినచో, నాబలహీనతను గమనించి యల్పతి జరులగు పసులకాపరులు సహితము పులితో చెలగాట మాడుట సహజము.

తలలో నాలుకవలె మునినికాయమున శ్రేష్ఠుఁడగు దుర్వాసుని స్థితియు నారీతి నుండుట కేవలము పరిహాసాస్పదము. దుర్వాసుఁ డింతటి దైన్యస్థితి నందుటను గూర్చిన భావప్రకటనమున కీసామెతదోడ్పడుచున్నది.

19. మద్దులు మునింగి పాఱ వెంపళ్ళు తమ కెంత బంటి యనుట [4_124]

బ్రహ్మదత్తుఁ డొకనాఁడు కొలువుండునెడ తనయులగు హంసడిభకులాతనిని రాజసూయము సేయుమనిరి. తాము దిగ్విజయముగావించి ...యు యజ్ఞసంభారములఁ గూర్తుమని చెప్పిరి. అందుల కాతఁడు ...యమున మంత్రికుమారుఁడును, హంసడిభకుల మిత్రుఁడును నగు జనా...ఁడు, రాజసూయనిర్వహణమును భీష్మ బాహ్లిక భీమ జరాసంధా...లు సైరింపరను విషయమును బ్రస్తావించినాఁడు. మఱియు చాణూర_...ష్టిక, మురహయగ్రీవాదులతో పాటుగ ...ంసనరకాసురులను గూడ ...ంచినట్టి శ్రీకృష్ణుని నిగ్రహించుట తమకు వశముగాదని స్పష్టపఱిచి

నాఁడు. ఈసందర్భమున మద్దులం మసింగిపాటి, వెంపళ్ళు తమకెంత యను సామెతను వాడినాఁడు సోముఁడు. మద్దిచెట్లను బోలు నరకాసురా దులే నిలువజాలనప్పుడు చిన్నమొక్కలగు వెంపళ్ళను బోలిన తాము శ్రీకృష్ణునితోఁ బోరఁజాలుట సంభవము కాదనినాఁడు జనార్దనుఁడు. స్వపర బలాబలముల విషయము నీ సామెత మూలమున సువ్యక్త మొనరించుటలో కృతకృత్యుఁ డయినాఁడు నాటక సోమనాథుఁడు. ఈ సామెత "మహాగజాః పలాయంతే మశకానాం తు కాగతిః" యనుదాని ననుసరించి కూర్పఁబడినది.

20. తీర్థమున్ స్వార్థమున్ [4-136]

హంసుఁడు తమమిత్రుఁ డగు జనార్దనుని పలుకుల నలక్ష్యము జేసి, భీష్మాదుల సామర్థ్యము తమ బలపరాక్రమముల నెదుట కొఱగాని దని బీరములు వలికినాఁడు. అనంతర మాతని శ్రీకృష్ణుని కడకుఁబోయి లవణమును గప్పముగాఁ గొనిరమ్మని రాయబారమును నెఱప నియమించిరి. జనార్దనుఁడు చేయునది లేక వారియానతిని శిరసావహించి బయలుదేరినాఁడు. మార్గమధ్యమునందు జనార్దనుఁడు తన మనమున నిట్లనుకొనసాగినాఁడు. ఈతీరునైనను రాయబారపుకార్యాచరణము ద్వారమున శ్రీకృష్ణుని దర్శించు భాగ్యము తనకబ్బినదని యుప్పొంగి నాఁడు. కావున హంసడిభకుల యాజ్ఞద్వారమున తీర్థమగు రాజకీయో ద్యోగమునకుఁ దోడుగ స్వప్రయోజనముగూడ నెఱవేఱుచున్నది. ఈ విషయద్వయమును నూటిగ వివరించుట కత్యంతోపయోగకరమగు నీసామెతనుగూర్చినఁ సోముఁడు ప్రశంసార్హుఁడు.

21. చల్లకువచ్చి ముంతదాచిన గతి. (4-149)

జనార్దనుని రాయబారఘట్టమున శ్రీకృష్ణుని పలుకులలో సోముఁ డీ సామెతను బ్రయోగించెను. లోకోక్తియుఁ బ్రకరణోచితముగ నున్నది. హంసడిభకుల పంపున జనార్దనుఁడు నీలవర్ణుని జెంతకు దూత

కృత్యము నెఱపఁబోయెను. జనార్దనుఁడు శ్రీకృష్ణుని భక్తుఁడు; మహా జ్ఞాని. ఆతఁడు తన కిష్టములేకున్నను, విధినిర్వాహణము తప్పనిదగుట నా కార్యాచరణమునకుఁ బూనుకొనెను. జనార్దనుఁడు శ్రీకృష్ణుని పరతత్త్వమును దొలుత, బ్రస్తుతించినాఁడు. తన యుద్యోగమును, దన యధిపతుల యవివేకమును సతిదీనముగ వివరించెను. అయ్యవసరమున నచ్యుతుఁ డాతనితో దూతకృత్యము నెఱపునెడ నేలికల ప్రల్లదముల నైనను, జెప్పఁ జెల్లుననియుఁ, దప్పని పలుకైనను వినఁబోలుననియుఁ బలికెను. మఱియుఁ జల్లకువచ్చి ముంతదాచునట్లు దూత రాయబారపు వాక్యముల వినిపింపకుండుటలో నర్థ ముండదుగదా! ఈ సందర్భమున నీ సామెతను బ్రయోగించుట నాచన సోమనకుఁగల సమయస్ఫూర్తిని, లోకజ్ఞతను బ్రస్ఫుట మొనర్చుచున్నవి. సర్వాంతర్యామియగు శ్రీకృష్ణుఁడు జనార్దనుని స్వభావము నెఱుంగుటచేతనే యిట్టి లాలింపు. ఇది ధ్వనిప్రధానమగు సామెత యనఁజెల్లును. చల్లకువచ్చి, ముంత దాచ నెంచుట యనవసరము. ఎట్లును చల్ల గొనిపోవనెంచు నాతఁడు తాఁ దెచ్చిన ముంతను జూపకఁ దప్పదు. అట్లే యొద్దేని యొక ప్రయోజనాపేక్షతో నేతెంచువాఁడు, తత్ప్రసంగమును మార్చుటయు, నా యుద్దేశమును దాచనెంచుటయు నవివేకమేయనుట నిశ్చయము. ఈ విషయము వ్యక్తపఱచుటకీ సామెత తోడ్పడుచున్నది.

22. పాముకాటు సీరఁ దుడిచినం బోవునె (4-150)

ఈ ప్రకరణమునందే వాసుదేవుఁడు జనార్దనునితోడ బల్కు వాక్యములందుఁ గవి పౌఢముగు మఱియొక సామెతనుఁగూడ గూర్చినాఁడు. "పాముకాటు సీరఁ దుడిచినం బోవునే" అనుటలో దూత తినచాక చక్యము నంతటి నుపయోగించి, తమ యేలికల దుర్భాషణములకొక గతి కల్పింపనెంచుట నిష్ఫలప్రయాస మను భావమును శ్రీకృష్ణుఁడు స్పష్టము చేసినాఁడు. రాయబారులు తమ యధిపతుల వాక్యముల

కూర్పునెంతగా మార్పుగావించినను, వీనియందలి భావములను మార్చ లేరు. పాముకాటునకు వస్త్రముచే మసిచి, ప్రయోజనము నందుటకల్ల. ఈసందర్భమున, నీ సామెత మూలమున విషయము సూటిగ మనసున నాటును. యథార్థవిషయ గ్రహణమునకును తోడ్పును.

23. ఉప్పునబట్టె లాడువేళ నుప్పులు దెచ్చుచుగాక యూరకుండె (4-155)

జనార్దనుఁడు హంసడిభకుల రాయబార సందేశమును వినిపించి నాఁడు. యాదవులనుండి లవణమును గప్పముగా గ్రహింపవలయు ననునదే యాసందేశ సారాంశము. ఉప్పుబట్టె లనునది యొక క్రీడా విశేషము. ఈయాట యందోడినవారు ఉప్పును మోసికొని రావలయు నని నియమముండును. హంసడిభకులు శ్రీకృష్ణునినుండి లవణమును గప్పముగా గ్రహింపనెంచి, రాయబారము పంపిరి. లవణము నేకిరీటైన నను గ్రహింపఁగల్గినచో, వారు యాదవుల నోడించిరనుభావము స్పష్ట మగును. "లవణమెంతేని యడుగుడు" అనుటలో, శ్రీకృష్ణునినుండి వారు ధనమును గాక, యాదవులయోటమి నాశించిరనుట స్పష్టము. శ్రీకృష్ణుఁ డంతకుమున్నే దుర్వాసాదిమహర్షులఁ గారించిన కారణమున ధూర్తులగు నా హంసడిభకులను మడియింప నిశ్చయించియున్నాఁడు. కావున హేళ నాత్మకములగు శ్రీకృష్ణుని పలుకులలోని భావము నీ సామెత విశదీక రించుచున్నది. యాదవులు క్రీడాసక్తులయి యుప్పుఁబట్టెలాడు సమయ మున నోటువడిన వారలుప్పు మోయుదు రేకాని, యితర సమయము లందుఁ గాదను విషయము మీ సామెత మూలమున స్పష్టపఱుపఁబడినది.

24. వెదకంబోయిన తీవ కాలఁదవిలెన్ (4-163)

కృష్ణపరమాత్ముఁడు దుష్టశిక్షణము, శిష్టరక్షణము గావించి, ధర్మసంస్థాపనముచే నవతరించిన శ్రీమహావిష్ణుని యవతారము. కావున దురాత్ములగు హంసడిభకుల నున్మూలించుట కృష్ణునివిధి. మునిజనమానన సములకు ఖేదమొనర్చుట దుష్టుల స్వభావము. మహర్షుల ఖేదమును

సహింపఁజాలఁడు మురారి. మదాంధులగు హంసడిభకుల దుశ్చేష్టితము లను, వారల యహంకారమును, దుర్వాసాదులచే నెఱింగినవాఁడై, యదూద్వహుండు, వారలఁ దునుము నిశ్చయించెను. నాచన సోమన ప్రతిపద్యము నలంకార యుతముగ సంతరించును. ప్రతిపద సార్థకతయు నీతని కవనము నందలి ప్రత్యేకత. తాపసాదిశిష్టజనమును గారించు దురాత్ములగు హంసడిభకులను శిక్షింపుటకుఁ గారణము తొలుతనే సమకూడినది. కాని హంసడిభకులతోఁ దనకు ప్రత్యక్షవైర మానాటికి లేదు. అదియు నీ జనార్దనుని రాయబారము మూలమున నేర్పడినది. వెదకుట కుపక్రమింపఁబోయిన తీవ తన సముఖముననే అప్రయత్నముగ గాననయిన విధముగ, నీ జనార్దనుని రాక, శ్రీకృష్ణుని కార్యాచరణ మునకుఁ దోడైనది. కావున సోముఁ డీ యుపమాలంకార సహితమగు రచనమును గావించినాఁడు.

25. దువ్వఁజూచి నక్క యొడలు గాల్చికొన్న వడువున. (4-165)

26. పిడుగు వ్రేసినఁ దలటొప్పి యాగునే (4-166)

స్వతస్సిద్ధములగు శక్తి సామర్థ్యముల నుటంకించు నట్టి దీసామెత. బాహ్యానుకరణముల వలన ప్రకృతిసిద్ధమగు బలిమి లభ్యముకాదనుట సత్యము. స్వబల పరబలముల తారతమ్య మెఱుంగక, హంసడిభకుఁ లంపిన రాయబారమునకుఁ గృష్ణుఁడు తగినవిధముగఁ బత్యుత్తర మిచ్చి నాఁడు. ఈ సందర్భమున నాచన సోమనాథ మహాకవి "దువ్వఁజూచి నక్క యొడలు కాల్చికొన్న వడువున" అను సామెతను వాడినాఁడు. పులికిం బలె నక్కవాతలు పెట్టుకొనినను వ్యాఘ్రమునకు సహజముగ నుండు బలము చేకూరదు. అటులనే హింసడిభకులును మహేశుని వర ములచే నెంతటి శక్తిమంతులైనను, శ్రీమన్నారాయణావతారమగు శ్రీకృష్ణుని కజేయులు గారనుట సత్యము. శ్రీకృష్ణుఁడు జనార్దనున కుత్తరము సెప్పు నవసరమున, నీ సామెతమూలమున నా భావము వ్యక్త

పఱుపఁబడినది. ఇంతియు కాక, సోమనాథుఁ డీ పట్టుననే "పిడుగు వ్రేసినఁ దలటొప్పి యాగునే" యను మఱియొక సామెతను వాడినాఁడు. తాము గడించిన వరబలమును శిరోధారణము పిడుగు వ్రేటును భరింపఁజాలదనియు శ్రీకృష్ణు డా దూతతోఁ జెప్పినాఁడు. అనఁగా శివుని వరములనాచ్ఛాదనముగాఁ గొని శ్రీకృష్ణు నెదుర్కొనుట యవివేకమని స్పష్టీకరించినాఁడు. ఇట్లు సామెతల మూలమున నభిప్రాయములకు స్ఫూర్తిని గలిగించుట సోమన ప్రత్యేకత యనవచ్చును.

27. చెఱువు విడిచి కాలువఁ బొగడం జనునే (4-186)

హంసడిభకుల కోరిక మేరకు జనార్దనుఁడు ద్వారకాపురమున కేగి శ్రీకృష్ణపరమాత్మని యెడఁ దన దూతకృత్యమును నెఱవేర్చికొని, శైనేయునితోఁగూడ మరలివచ్చినాఁడు. రాయబార విశేషములఁ దెలుపుచు, నా జనార్దనుఁడు, జగన్నాథుని వైభవమును బొగడి, తమ వ్యర్థ ప్రయత్నమును వివరించినాఁడు. అందులకు హంసుఁడు మిగుల కోపించి, యాబాల్యమిత్రుఁడని తలంపక, జనార్దనుని పలువిధముల నిందింప సాగెను. ఆ సందర్భమున హంసుని ముఖమునఁ గవి పలికించిన మాటలలో నీ సామెత ఘటింపఁబడినది. వర్షాకాలమునందు జలపూర్ణములయిన చెఱువులనుండి కాలువలను ద్రవ్వి, పలుప్రాంతములందలి భూములకు నీటివసతిని గల్పించుట లోకసామాన్యము. ఆ సౌకర్యము ననుభవించు వారలా జలములు నిలుచుట కాధారభూతమయి తమ యవసరమున కాదుకొనిన చెఱువును బొగడుటయు సమంజసము. కాని తద్భిన్నముగ నా జలములను గొనివచ్చిన కాలువలను బొగడుట తగదు. జనార్దనుఁడు హంసుని రాయబారిగా ద్వారక కేగినాఁడు. ఆతఁడు హంసుని పక్షము వాఁడగుట, దేవకీనందనుఁ డెంతటి ఘనుఁడయినను, వానిని దన సమక్షమునఁ బొగడరాదని హంసుని యభి

ప్రాయము. ఈ విషయముల నిట వాచ్యము గావింపక, పయి సామెత మూలమునఁ గవి యీ భావమును సూచించినాఁడు. జనార్దనుని మను గడ కాధారభూతులగు హంసడిభకులను విడిచి, శత్రుకూటమిలోని వాఁడగు వాసుదేవుని నుతించుట, చెఱువును విడిచి, నీటిని గొనివచ్చు కాలువలను బొగడునట్టిదే యను భావప్రకటనమున కీసామెతను గూర్చి నాఁడు సోమనాథుఁడు.

28. కలువఁగ వచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్ (4-189)

హంసడిభకులు పంపిన రాయబారకార్యమును జనార్దనుఁడు సక్రమముగ నిర్వహించియున్నాఁడు. కాని యది సఫలీకృతముకాలేదు. బ్రహ్మదత్తుని పేరోలగంబున రాయబారసందేశమున కుత్తరము సెప్పు టకు సాత్యకి యరుదెంచినాఁడని జనార్దనుఁడు తెలిపినాఁడు. అంతకు ముం దాతఁడు శ్రీకృష్ణదేవుని బహుధా పొగడి స్తుతించినాఁడు. జనార్ద నుని యీ ప్రవర్తనకుఁ గినిసి, హంసుఁడాతనిని నిందించుపట్టుల నీ సామె తను సోముఁడు వాడినాఁడు. హంసడిభకుల యౌద్ధత్యము మెఱయ రాయబారమును నెఱపుటకు మారుగ తద్వ్యతిరేకముగఁ బ్రవర్తించినాఁ డని హంసుని యభిప్రాయము. ఈ భావము నీ సామెత యథాతథముగ విపులీకరించి, సువ్యక్తము సేయుచున్నది. పులితోలుఁ గప్పికొన్నంత మాత్రమునఁ బులికిఁగల సహజగుణములబ్బవనుటయ కాక, హంసుఁడు, జనార్దనుని గాడిదతోఁబోల్చుటలో నాతనిమందబుద్ధిని విమర్శించినాఁడు. ఇట్లు నిందాగర్భితమగుభావము నీసామెతను వాడి సాధించినాఁడు కవి.

29. వెలుగు చేన్మేసినఁ గాచువార లెందుఁగలరె జగతి (5-42)

సహస్రబాహుఁడగు బాణాసురుఁడు సదాశివుని మెప్పించి, యయ్యాదిదేవునకుఁ గొమరుం డయి, కార్తికేయ పర్వతకన్యాస్థాణుల పొత్తున బాణుఁడు శోభించుచుండెను. అత్తటి నొక్కనాఁడు తనచేతుల తీటవోవ కయ్యమును బరమేశ్వరుని వేడి వరమును బడసినాఁడు.

ఆ వరము ఫలించు నవసరమున శోణితపురమునఁ గొన్ని దుర్నిమిత్తములు పొడసూపినవి. బాణుని సచివుఁడగు కుంభాండుఁడు వానిని జూచి మిగుల చింతించు సమయమున నీ సామెత ప్రయోగింపఁబడినది. చేల కెట్టి ప్రమాదమును సంభవింపకుండ పొలమునకు వెలుగును నిర్మింతురు. కాని యాకంచెయే చేనును మేసినచో నిక రక్షణమున కవకాశము లేదుగదా! ప్రకృతము బాణుని సర్వవిధముల గాచి బ్రోచు నీశ్వరుఁడే యిట్టి ముప్పును బ్రసాదింపఁ నిక వేఱొకరు బాణుని రక్షింపలేరనుట నిశ్చయము. ఈ భావమును స్పష్టముగ వ్యక్తపఱచుటకయి సోముఁడీ సామెత నీ సందర్భమున వాడినాఁడు. ఇట్టి చోటులం దింతటి స్ఫూర్తిని బ్రకటించు నీ సామెతను సంఘటించుటలో నీ మహాకవి రచనావైశిష్ట్యము వెల్లడి యగుచున్నది.

30. నిప్పు చెదలంటునటే (గ-90)

పంచమాశ్వాసమున నుషాకన్య స్వప్నముం గని పరితపింప, నామె సఖీజనులామె నోదార్చి బుజ్జగించిరి. దైన్యము నొందుట బలితనూజుఁడగు బాణాసురుని పుత్త్రి కుచితము కాదని దెల్పు సందర్భమున నిప్పును జెదలంటునటే యను బలుకుల నామె సఖీజనుల నోట ననిపించినాఁడు సోమన. ఈ ధోరణి యాతని సమయజ్ఞతకుఁ దార్కాణము. ఈ వాక్యమున నుషాకన్య పావిత్ర్యమును దెలుపుటయే కాక, కవి యామె జనకుని యౌద్ధత్యమునుగూడ వెల్లడించినాఁడు. ఆమె యాభిజాత్య సంపన్నతను సహిత మిట వ్యక్తముచేయఁబడినది. చెదలనునవి దేనినైనను సమీపించి, చెఱుప సమర్థములేయైనను, నిప్పును జెదలంటుట సంభవింపదు. అట్లే యొరులు సమీపింప సాధ్యముగానిది బాణాసుర నంతఃపురము. మహాదేవుని సతీతిలకమైన కాత్యాయిని మెప్పువడసిన శీలసౌభాగ్యము గలది యుషాకన్య. మాహేశ్వరుని పుత్త్రప్రేమకుఁ బాత్రుఁడైనవాఁడు బాణాసురుఁడు. కావున నీకీ యంతిపుర

మున నవమానముజరుగుట యసంభవము. నిప్పును జెదలంటని యటులు భక్తిమయ విత్తమునఁ బరమేశ్వరుని లోఁగొన్న దైతేయాధిపుని యనుంగు తనయ కెవ్విధమైన యకార్యమును సంక్రమింపఁదని యుషా కుమారి కామె చెలు లుద్బోధించిరి. ఇంతటి మహాదర్శము నిముడ్చుట కయి సోమనాథుఁ డీ సామెత నిట గూర్చియుండె ననుట స్పష్టము.

31. ఏ నొకటి చేయదలఁచినఁ దానొకటి దలంచె విధి (5-137)

అసురరాజగు బాణాసురుని యనుంగు తనయ యగు నుషాకన్య స్వప్నము నందొక సుందర పురుషుని గాంచి, యాతనికయి పరితపించు ఘట్టమునందుఁ బ్రయోగింపఁబడిన దీసామెత. చిత్రరేఖ యను నామె చెలికత్తె యాతని నానవాలు పట్టుటకయి లోకమునందలి ప్రముఖ రాజ కుమారుల పటములవ్రాసి తే నరిగినది. ఆమె యీపని కేను దిన ముల గడువు కోరినది. ఆమెతిరిగి వచ్చునరికి బాణు నంతఃపురమే చైతన్య రాహిత్యమును బొందినట్లామెకుఁ గానిపించినది. ఉషాకన్య విరహానలం బున వ్రాగ్గి చేష్టలుడిగి యుంటయే యందులకుఁ గారణమని తెలిసి కొనినది. ఆ సమయమున చిత్రరేఖ తనలో ఖేదం బొందు పట్టుల నీ సామెతను గవి ప్రయోగించినాఁడు. మానవప్రయత్నము లన్నియు సఫలీకృతములు గాకుండుట సామాన్యమగు విషయము. చిత్రరేఖ తన చాకచక్యమున నుషాకన్య స్వప్నగత రాకుమారుని గనిపట్టి యాప్రేమి కుల జతగూర్తునని తలంచినది. ఎంతటి దైవబల సంపన్నుల కయినను మానవసంజాతు లగుట నిట్టి యవస్థల పాలగుట తప్పదనుట నిశ్చ యము. చతురమతియు, శాంభవీ విద్యా పారంగత్వమును గల యా చిత్రరేఖ శాంభవీ వరప్రసాదలబ్ధ యగు నుషాకన్య నీ స్థితి యందుఁ జూడవలసిన యగత్యము గల్గునని మున్నెన్నఁడు నూహించియుండలేదు. ... రణమున విధి బలీయమను నిశ్చయమునకు వచ్చిన రీతి నీ మాట ... ది. ఇట నీ సందర్భమునకు యుక్తములగు పలుకుల నా యాపాత్రల

ముఖమునఁ బలికించుటలో సోమనాథుని విశిష్టత గానవగును. మఱియు నీ సామెత మూలమున మానవప్రయత్నమునకు దైవబలము తోడ్పడ వలయునను విషయముకూడ ధ్వనించుచున్నది.

32. బెండులు మునింగి గుండులు దేలెన్ (5-218)

పార్వతీదేవిమాట మేరకు బాణునిపుత్రి యగు నుషాకన్య స్వప్నమును గాంచుటయుఁ, జిత్రరేఖ యను చెలికత్తె నారదుని సాహాయ్యమును గొని, యుషానిరుద్ధుల రహస్య సమాగమము నేర్పఱచుటయు యథాక్రమముగ జరిగినవి. కన్యాంతిపుర పరిచారకు లీవిషయమును బాణాసురునకు నివేదించినారు. అవ్విషయమును వినినంతనే బాణాసురుఁడు రోషావేశపూరితుఁడయి పల్కిన పల్కులలో నొక యథార్థ విషయము నుగ్గడించినాఁడు. రాక్షసత్వ ప్రభావముచేఁ దనుజులు మనుజాంగనలఁ బట్టుట పరిపాటిగాఁ గానవచ్చును. కాని మనుజులు దనుజాంగనలఁజోలికిఁ బోవుట యరుదు. సకృత్తు యనవచ్చును. ఈ సందర్భమున బాణపాత్రోచితముగ సోముఁడొక సామెతను జొప్పించినాఁడు. బెండు లతితేలిక వస్తువులగుట నవ్వెల్లపుడును నీటిపైఁ దేలుచుండును. అతి భారములగు సీసపుగుండులు మాత్రము నీటియందుంపఁబడి నంతనే మునిగిపోవును. రక్కసుల దృష్టికి మానవులు బెండులవంటివారనుట నిశ్చయము. కావున నట్టి తేలికదనము గల మనుజులు తమ స్వభావమునకు విరుద్ధముగ దనుజాంగనలఁ బట్ట యత్నించుట యతి సాహసము, విచిత్రము నని బాణుని యభిప్రాయము. సత్యముగూడ నంతియే. సీసంపుగుండులం బోలు రక్కసులు బెండులవంటి వారుగా మారిరేమో యనియు నాతఁడు భయపడెను. ఇట్లు స్వాభావికేతరమగు ప్రవర్తనము కానిపించుచున్నదను విషయము నీ సామెత చెప్పకయే చెప్పుచున్నది. సోముని ప్రకరణోచితములగు నిట్టి సామెతలు భావస్ఫూర్తికిఁ దోడ్పడుచున్నవి.

33. కన్నుండఁ గంటిపాపం గొన్నట్లు (5-288)

ఉషాకన్య యభిమత మీడేర్చుటకయి, యామె యనుంగు చెలి కత్తెయగు చిత్రరేఖ, ద్వారకాపురమునుండి యనిరుద్ధ కుమారుని యొరులెఱుంగకుండ శోణితపురాంతఃపురమునకుఁ గొనితెచ్చినది. హరి నగరిలో ననిరుద్ధకుమారునిం గానక శ్రీకృష్ణాదు లెల్లరును గలవరపడఁ జొచ్చిరి. అఖిల లోకాధీశుఁడగు నా చక్రధరు నింటనే యంతటి యుప ద్రవ మొదవుట కా జగన్నాథుని యంతఃపురస్త్రీల దుఃఖమునకు మేర లేకుండెను. అనిరుద్ధు డదృశ్యుఁ డగుటకు హేతువుగాని, యెచ్చోటికి బోయినదిగాని తెలియరాలేదు. ఆ సమయమున నీ భంగపాటు నోర్వ లేక యాదవ బంధుకోటిలో వినంబడు మాటలలో నీ సామెత కూర్పఁ బడినది. కంటిని సర్వథా కాపాడుటకు కంటిరెప్ప యేర్పడినది. అందును గంటి యందుండు (కంటి) పాప కంటినంటియే యుండును. అట్టిచో కంటిని విడిచి కంటిపాపను గ్రహించుట యసంగతము. సురక్షితమైన శ్రీకృష్ణుని నగరియందు పరిచారికా గణావృతుఁడయిన యనిరుద్ధకుమా రుని గొనిపోవుట, కంటినుండి వేఱుచేసి కంటిపాపను గొనిపోవుటను బోలు యసాధ్యమగు విషయ మనుట స్పష్టము. నిరవకాశమగునట్టి కార్యము సాధింపఁబడెనను భావమును వ్యక్తపఱుచుటకయి సోమనాథు డీసామెత నీ సందర్భమున నిమిడ్చినాఁడు. ఇట నీసామెత యత్యద్భుత ముగ నమరినది. సోమనాథుఁడు సామెతలను బ్రయోగించుటతోఁపాటు, యద్దానిని సందర్భోచితముగ నిముడ్చుటలోనను అతినిశితమగుదృష్టిని బఱపినాఁ డనుటలో సందియము లేదు.

34. చెఱకుం జెఱకైన వంట చెఱకుం జెఱకే. (6-109)

త్రిలోకసంచారి యగు నారదుఁడు ద్వారకాపురమున కేతెంచి, బాణాసురునిచే నాగాస్త్రమున ననిరుద్ధకుమారుఁడు బంధింపబడియున్నాఁ డని శ్రీకృష్ణ పరమాత్మునకుఁ దెలిపినాఁడు. అవ్వార్త వినినంతనే

శ్రీకృష్ణుఁడు, బలరామ ప్రద్యుమ్నులతో శోణితపురమున కరుదెంచినాఁడు. తొలుతఁ బురరక్షకులఁ గూనిమి, ప్రమథగణంబుల నోడించినాఁడు. అనంతరమ బలరాముని మూర్ఛిల జేయ శివజ్వరము నావాసుదేవుఁడెదుర్కొని, శాంకరజ్వర గర్వభంగమునకయి వైష్ణవజ్వరమును బురికొల్పినాఁడు. ఆ జ్వర ద్వయము మల్లయుద్ధమును జేసినవి. తుదకు వైష్ణవజ్వరము, శివజ్వరము నోడించి, శ్రీకృష్ణునికడ కీడ్చుకొని వచ్చినది. ఈ సందర్భమున వైష్ణవజ్వరము తన మాహాత్మ్యము మెఱయ శంకరజ్వరమును బ్రుంగుడుపనుచు, చెఱకుం జెఱకైన వంటచెఱకుం జెఱకే యని పలికినది. ఇట రెండును జ్వరములే అందులకుఁ దగినట్లుగా మఱి రెండు చెఱకుల విషయముతోఁ బోల్చినాఁడు సోమన. చెఱకు వలనఁ గలుగు ప్రయోజనములు వంట చెఱకుచే సిద్ధింపవు. చెఱకుకుఁ గల విలువ వంటచెఱకున కేనాఁడును సమకూడదనుట సత్యము. కాని వంట చెఱకునకుఁ గూడఁ జెఱకను నామము గలదు. నామ సామ్యమే కాని సమత్వము లేదు. సోమనాథుఁ డీ విషయమును జ్వరద్వయమున కన్వయింపఁ జేసినాఁడు. కావుననే, వైష్ణవజ్వరము, తనవలెనే శాంకర జ్వరముగూడ జ్వరుఁడను నామమును ధరించినను, తనతోఁ బోరలేక పోయినదని యీసడించినది. వంటచెఱకును బోలి శాంకరజ్వరమును నామసామ్యమున విజృంభించి, వైష్ణవజ్వరమునకు లొంగినదను భావము నీ సామెత నుపయోగించి, స్పష్టపఱచినాఁడు సోమనాథమహాకవి. ఇందు రెండు జ్వరములకును, చెఱకు ద్వయమును ఘటిల్లఁజేసి, చమత్కారమును సంఘటించుట మఱియొక విశేషము.



# జాతీయములు - నుడికారములు

(ఉత్తర హరివంశము : వావిళ్ళప్రతి 1961)

ప్రథమాశ్వాసము :

## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

షష్ఠాశ్వాసము

# నాచన సోమన - తిక్కన

నాచన సోమనాథుని గద్యనుబట్టి తిక్కన కవితయెడ నాతనికి మిక్కుటమగు గౌరవము గలదని వ్యక్తమగుచున్నది ఆంధ్రవాఙ్మయమునఁ దిక్కన తరువాత చెప్పదగిన కవి సోమనాథుఁడే యనిగాని, తిక్కనతో సమానుఁడగుకవి సోమనాథుఁడె యనిగాని యాగద్యకర్థము చెప్పికొనవచ్చును ఎట్లర్థము చెప్పికొన్నను, తిక్కనయెడ సోమనకు గల గురుభావము వ్యక్తమగుచున్నది కావున సోమన కవితయందు గవిబ్రహ్మ కవితారీతు లెవ్వియైనఁ గన్పట్టుచున్నవా? అను విషయమును బర్యాలోచించుట సమంజసము ఆధునికులలో కొందఱు సోమనాథుఁడు కవితా విషయమున గవిత్రయమును గూడ మించియున్నాఁడను నభిప్రాయమును వ్యక్తీకరించియున్నారు బాలవ్యాకరణ కర్తయగు చిన్నయసూరి కవిత్రయమును గూర్చియు, సోమనాథుని గూర్చియు నీ క్రింది పద్యమును రచించియున్నాఁడు.

క. ఘను నన్నయ భట్టును ది
   క్కన, నెఱ్ఱాప్రెగడఁ బొగడి, యలికంబున య
   క్షుని డాఁచినట్టి సర్వ
   జ్ఞుని నాచన సోమనాథుఁ స్తుతి యొనరింతున్.

శబ్దరత్నాకర కర్తయగు బహుజనపల్లి సీతారామాచార్యుల వారుకూడ సోమన కవితను బహుధా మెచ్చుకొనుచు, తత్కవితా మహిమకుఁ దార్కాణముగా హరివంశమందలి యీ క్రింది పద్యము నుదాహరించియున్నారు.

సీ. వంకదారకుఁ జేరి వాకిటి దడ్డడం
బులు సెర్చి కొమ్మల బ్రోఁకువైచి
ప్రాఁకి లోపలఁజొచ్చి పలుగాఁడిఁ దెఱచిన
పంతగార్లకు మున్న బ్రద్దపరుల
తోన నిచ్చెన లెక్కి లోని కొత్తళములోఁ
బుఁగశించి చొచ్చిన పోటుమగల
వాఁడి మెచ్చక యాళువరి మీఁదఁ బాళెల
వాఁటఁ దాఁకించిన వాసి బిరుదు

తే. లచ్చెరువు నొంద మీఁడలు సొచ్చి యార్చు
దొద్దకార్లచేఁ బఱివోయెఁ దూర్పుదిక్కు
తాలవాటుల నేటుల ఱంతు మిగిలి
తఱిమిరచ్చటి బలముఁ గొందఱుగడంగి. ఉ. హరి. 3-34

(శ్రీ) వేదము వేంకటరాయ శాస్త్రిగారీ పద్యవిషయమునఁ దమ యభిప్రాయము నిట్లు వ్యక్తీకరించియున్నారు, (నాచనసోముఁడు తిక్కనసోమయాజి విజయము : పుట 35) "ఇట్లు అపూర్వపదములను గుప్పించుటచేత కడమవారికన్న నితఁడే యధికుఁడని నే దలంపనుగాని, ఉత్తరహరివంశమందలి కవనగుణములు పెక్కింటిచేత నీయన వాస్తవముగా నుత్కృష్టకవియే. ఈయన కవనము కఠినమని గణపవరపు వేంకటకవి వచించినాఁడుగదా! (శ్రీనాథు వార్తాప్రసిద్ధి నాచన సోము భూరి కాఠిన్యంబు- ప్ర. రా. వే. వి. వి.) ఈయన నన్నయ తిక్కనల కన్నం బండితుండనుటకు నిదర్శనములేదు..." అది యటుండనిండు.

నాచన సోమనాథుఁడు తిక్కనభారతమును బహువారములు పఠించినాఁ డనుటకు నిదర్శనము లనేకము లుగలవు. విషయసంభావనము నందును, వ్యక్తీకరణమునందును, తిక్కన పోకడలు హరివంశమున నందందుఁ గన్పట్టుచుండును. భారతమునందలి సంజయ రాయబార

మును, హంసడిభకోపాఖ్యానము నందలి జనార్దన రాయబారమును బోల్చి చూచినచో నీ విషయము స్పష్టమగును. ఇట్లనుటచే జనార్దన రాయబార మన్నిటఁ సంజయ రాయబారమునకు సరిపోవునని చెప్పుట గాదు. ఈ రెండింటి-ని పాత్రభేదమును, వస్తుభేదమును చాల గలదు. కాని సంజయ రాయబార ఛాయలుమాత్రము జనార్దన రాయబారమునఁ గన్పట్టుచున్నవి. సంజయ రాయబార సందర్భమున, సంజయుఁడు సభాస్థలిని ప్రవేశించుట యిట్లు చెప్పఁబడియున్నది. "... మరునాఁడు ధర్మతనయు నొడ్డోలగంబున్న సమయంబువేచి. సముచితంబుగా నతనిం గని, సాష్టాంగముగాఁ బ్రణమిల్లిన నతండును బ్రియపూర్వకంబుగా నాదరించి, తన సమీపమున నునిచికొనినం గొలిచియుండి, యతని కిట్లనియె." ఉత్తర హరివంశమున జనార్దనుఁడు శ్రీకృష్ణుని సభకేఁగుట యిట్లు వర్ణింపఁబడియున్నది.

వ. "కని కదియంబోయి తనపేరుచెప్పి నమస్కారంబుచేసి బలదేవునకు
నట్ల బ్రణమిల్లి యథోచితస్థానంబునం గూర్చున్న యనంతరంబ
మురాంతకుం డతనితో నిట్లనియె."

ఇందు పదభేదమేగాని భావభేదమంతగాఁ గానరాదు. సంజయుఁడు ధర్మరాజాదులకుఁ గ్రొత్తవాఁడు కాఁడు. కావున పేరు చెప్పుకొనవలసిన యావశ్యకత యాతనికి లేదు. యాదవులకు హంసడిభకుల రాయబారియగు జనార్దనుఁడు క్రొత్తవాఁడు. కావుననే పేరు చెప్పుకొనవలసిన యావశ్యకత యతనికి వచ్చినది. సంజయుఁడు కూడ నరనారాయణులకు "తనరాక యెఱింగించిపుచ్చి, తను బ్రవేశించినాఁడఁట." జనార్దనుఁడుకూడ "తనరాక యెఱింగించిపుచ్చి, యద్దేవదేవుని యనుమతంబున సభామండపంబునకుం జని" నాఁడఁట. తిక్కన సంజయ రాయబారమున "ధర్మతనయు నొడ్డోలగంబును" వర్ణింపలేదు. సోమనాథుని యీ క్రిందిపద్యము దానికి వ్యాఖ్యానము వంటిది.

సీ. బలభద్రుఁడును దాను భద్రపీఠంబునఁ
గదియ శైనేయుఁ డగ్రమున మెఱయ
దుర్వాసుఁడును నారదుండును రెండు ది
క్కులఁ దనకింపుగా గోష్ఠి సేయ
నుగ్రసేనుఁడు గౌరవోన్నతిఁ దనుఁ జేర
గంధర్వగానంబు గలసి పొలయ
నప్సరోగణనర్తనాడంబరముఁ జూచు
తనచేత నభినవధనము లడరఁ
తే. దనకునై వందిమాగధస్తవము నిగుడ
సామవేదులు దనయందు సార మెఱుఁగఁ
దనవలన లోకు లానందధారఁ దేల
లీలఁ బేరోలగం బున్న నీలవర్ణు. ఉ. హరి. 4-141

ఈ పద్యమును వ్రాయుచున్నప్పుడు సోముని మనసులో తిక్కన గారి "ధర్మతనయు నొడ్డోలగము" మెదలుచున్నదనుట స్పష్టము. ధర్మజుఁడు సంజయునడిగిన కుశల ప్రశ్నలకును, శ్రీకృష్ణుఁడు జనార్దను నడిగిన కుశల ప్రశ్నలకును సామ్యము చాలగలదు. ధర్మజుఁ డీ క్రింది విధముగా సంజయునితోఁ బలికెను.

క. అమ్మనుజేశ్వరునకు సే
మమ్మే పుత్త్రికులు సుఖులె మనుమలు సమో్మ
దమ్మునఁ బెఱిఁగెదరే నగ
రమ్ముల భూములను శుభపరంపర గలదే.

సీ. ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును
సుఖమున్నవారె సుశ్లోకుఁడైన
భీష్ముండు కుశలియే పెద్దతనం బిచ్చి
యాతనిఁ గౌరవు లనుసరించి

మెలఁగుదురే బ్రాహ్మణులకు మన్నన గల్గి
యుండునే యేమ్మర్థి నొసఁగినట్టి
వృత్తులు సెల్లునే యితోరు వారిండ్ల
వలనఁ బుట్టునుగదా కలఁకులందుఁ

తే. బుట్టినప్పుడు గాండీవి భుజబలంబు
తలఁతురా భీమసేను గదా విహార
ముగ్గడింతురె కవలు మహోగ్రగతుల
భూములంతంత కొత్తుట పొగడఁబడునె.

భార. ఉద్యో. 1-277, 278

శ్రీకృష్ణుఁడు జనార్దనునితో నిట్లు బలికెను.

గీ. అనఘ మీరాజు బ్రహ్మదత్తునకుఁ గుశల
మా నరేంద్రకుమారులు హంసడిభకు
లధిక భవ్యులె వరములు హరునిచేతఁ
గొన్నవారఁట కుశలంబు గొఱఁత గలదె.

క. మీ జనకుఁడు శుభయుతుఁడే
రాజులు మిము గారవింతురా సుఖకరులే
భూజను లిపు డిచ్చోటఁ బ్ర
యోజనమా నీవు వచ్చు నుద్యోగమునన్. ఉ.హరి.4ఆ 143,144.

మీఁది పద్యములందలి సామ్యము స్పష్టమే. కథాగత పాత్రలను బట్టియు, వారివారి మనస్తత్వములను బట్టియు భావవిన్యాసమునఁగొంత భేదము గన్పట్టినను, విషయసంభావనమునను,నుపక్రమణమునను,రెండింటికిని చాల దగ్గర సంబంధము గన్పట్టుచున్నది. మఱియు జనార్దనుఁడు పలికిన యీ క్రిందివాక్యములందు సోమనాథుఁడు, తిక్కన గడుసు పోకడలనే యనుసరించినాఁ డనుట స్పష్టము.

క. అందఱకుం గుశలము, మా
కుం దగుమన్ననల ప్రజలకుం బరిణామం
బిం దే వచ్చినపని గో
విందఁ దెలింగింప కెఱుఁగనే విశ్వపతీ.

క. లోపల వెలుపల వెలుపల
లోపలఁగా నుండు నఖిలలోకంబులకున్
నీపరతత్త్వము చిత్రము
రూపము నై నీవు లేని రూపము గలదే.

ఉ. ఉండుట తప్పు వారికడ నుండమి తప్పిట, రాక తప్పు, రా
కుండుట తప్పు, తప్పులకు నొప్పులకున్ గతి నీవ దేవ! యే
నొం డొకరుండనే, పలుక నూరక నేరక యుండఁ జేయుపి
ఱిండితనంబుచేత నిసిఱింతలు వాఱెడిఁ జిత్త మిప్పుడున్.

ఉ. హరి. 4 ఆ. 146, 147, 148

మఱియు సదృశములగు పద్యము లనేకములు గలవు. విరాట పర్వమునందు తిక్కన రచించిన యీక్రింది పద్యమును దిలకింపుడు.

సీ. శక్రాదిసురలతో సంగ్రామ మొనరించి
ఖాండవం బేర్చె నొక్కరుఁడకాఁడె
యాదవబలమెల్ల నాఁగఁ ద్రోచి సుభద్రఁ
గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడకాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు సేసెని
కురువంశమునకు నొక్కరుఁడకాఁడె
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ
గౌరవేశ్వరుని నొక్కరుఁడకాఁడె

తే. యని నివాతకవచు లనుదానవుల నాతఁ
డొక్కరుండకాఁడె యుక్కుమడఁచె
నమరులకు నజేయులగు కాలకేయుల
నొక్కరుండ కాఁడె యొడిచెఁ గర్ణ! భార. విరా. 4ఆ-210

ఈపద్యము కృపాచార్యుఁడు కర్ణు నధిక్షేపించుచు, నర్జునుని ప్రశంసించు సందర్భమునఁ జెప్పఁబడియున్నది. ఉత్తరహరివంశమునందలి యీక్రింది పద్యమును దిలకింపుఁడు.

సీ. నరకాసుర ప్రాణనాళోత్తరణ కేళి
రణకేళి వలకేళి రమణఁ జూపెఁ
గంస దానవ శిరఃకమల కృత్తన మేలు
తనమేలు చేయు పెద్దలకు నొసఁగెఁ
జాణూర ముష్టిక క్షతజకీలాలంబు
నాలంబులో నెల్ల నలవు వఱపె
మురహయగ్రీవాంత్రమూల ఫేనావలి
నావలి దలఁగఁ జీకాకు పఱచె

తే. వీరరస సారకాసార విహరణంబు
విష్ణునకు నొప్పు నతనితో నిగ్రహింప
దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి
పాఱ వెంపల్లి తమకెంత బంటె యనుట. ఉ. హరి. 4 ఆ 124

హంస డిభకులు తమ తండ్రిచే రాజసూయమును జేయింప సమకట్టి నప్పుడు వారికి హితుఁడగు జనార్దనుఁడు వారి నాయత్నము నుండి వారింప ప్రయత్నించెను. ప్రపంచమున మహారథులనేకులు గలరనియు, వారినందఱ జయించుట గష్టతరమనియు, నాతఁడు వారికిఁ జెప్పెను. ఆసందర్భమున శ్రీకృష్ణుని బలపరాక్రమముల నుగ్గడించుచు,జనార్దనుఁడు చెప్పిన పద్యమిది. ఈ రెండింటికిని గల సామ్యము స్పష్టమే. ప్రబంధ ధోరణిలో తన కావ్యమును రచించిన సోమనాథుఁడు తన పద్యమును అనుప్రాసలతో నింపినాఁడు. రెండింటికిని గల భేద మీ యనుప్రాస విషయముననే కన్పట్టుచున్నది.

తిక్కన విరాటపర్వమున కౌరవసేనను వర్ణించు పద్యమిది.

సీ. అభినవ జలధర శ్యామలంబగు నెడ
లాకు జొంపంబుల ననుకరింప

సాంధ్యరాగోపమచ్ఛాయంబులగు పట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళగౌరములగు చోటులు
దళచుఁబూఁబొదల చందంబు నొంద
హారిద్రరుచి సమానాకృతులగు తావు
లడరెడు పుష్పాదులట్లు మెఱయఁ
తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
డివికి నలిఁగాపు వోయెడు తెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడచు కౌరవరాజసైన్యంబుఁ గనిరి. భార. విరా. 4 - 50

దీనికిని, ఉత్తరహరివంశమునందలి యీక్రింది పద్యమునకును భేదమంతగాఁ గానరాదు.

సీ. కరటి ఘటాకోటి కటనిర్గళన్మదా
సారంబు దొలుకారుఁ జేరఁబిలువ
రథనేమి నిర్భిన్న పృథివీపరాగంబు
నీహారసమయంబు నేర్పుఁ దెగడ
సుభట భుజోద్భట క్షురికా ప్రభాభంగి
మండువేసవితోడ మాటలాడఁ
దురగధట్టఖలీన ధుతఫేన తారకా
వళి శరత్కాలంబు వరుసఁజూపఁ
తే. బవన చంచల ధ్వజపట పల్లవములు
నవవసంతంబు దెలుప సన్నాహతరళ
ఖడ్గ లతికలు శిశిరంపు గడక నెఱప
హంసడిభకుల సేన యోఁడఁగ నడిచె. ఉ. హరి. 4 ఆ. 223

మీఁది యుదాహరణములను బట్టి సోమనాథుఁడు, తిక్కన నెంతగా ననుకరించెనో వ్యక్తమగుచున్నది. ఇట్టి యుదాహరణములు మఱికొన్ని యనుబంధమునఁ జూపఁబడినవి. (చూఁడుడు : అనుబంధము 2)

# నాచన సోమనుఁడు - ఎఱ్ఱన

ఎఱ్ఱన సోమనల కవితా తారతమ్యములను గూర్చి, పండిత లోకమున నభిప్రాయభేదములు గలవు. అప్పుడప్పుడాయా పండితులు వ్యక్తీకరించిన భావములను యథాతథముగాఁ జెప్పి, తరువాత వాని యందలి సామంజస్యమును విచారించుటకు యత్నించెదను. చిన్నయ సూరి, శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారు సోమన కవిత్వమును గురించి యిట్లు వ్రాసియున్నారు.

ఘను నన్నయభట్టు ది
క్కన నెఱ్ఱాప్రెగడఁ బొగడి యలికంబున యు
ష్ఠిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్ - చిన్నయసూరి

"ఆగ్రంథ (సోముని హరివంశ) మిక్కడ సమగ్రముగాఁ జిక్కక పోయినను జిక్కినంతవట్టు పరికించి చూడఁగా నది మిక్కిలి ప్రౌఢము గాను భారతము కంటె నెల్లవిధముల విశేషించినదిగాను గానంబడు చున్నది. ఇతనిని సర్వజ్ఞుఁడందురు. అట్లనుటకు సందేహింపఁ బనిలేదు."

సీతారామాచార్యులు.

కందుకూరి వీరేశలింగముపంతులుగారిట్లు వ్రాసియున్నారు. "సోమనాథుని కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను, సర్వవిధముల నెఱ్ఱాప్రెగడ కవిత్వముకంటె మేలైనదిగాను నున్నది. ఒక్క యెఱ్ఱాప్రెగడ కవిత్వమే కాదు, భారతము రచించిన కవిత్రయములో ననేకుల కవిత్వమును గొన్ని విషయములలో సోముని కవనముతో సరిరాదని నాయభి

ప్రాయము. ఇతని కవితాపటుత్వ సంపదనుబట్టి యీతనికి సర్వజ్ఞుఁడని బిరుదు పేరువచ్చినది. ఆపేరున కితఁడు తప్పక తగినవాఁడే."

నాగపూడి కుప్పుస్వామయ్యగారు ఆంధ్రసాహిత్యపత్రికలో నిట్లు వ్రాసియున్నారు.

"చిన్నయసూరి, వీరేశలింగముపంతులుగారు, సీతారామాచార్యులు మన నాచన సోముని కవిత్రయము వారికంటె నుత్కృష్టునిగా జెప్పుట యతిశయోక్తి యని తలంచెద. ఎఱ్ఱాప్రెగడ హరివంశములో నేవిధముగాఁ బోలనేరని యుత్తరహరివంశమును రచించిన సోమనాథుని కట్టి యున్నత పదవి నొసఁగ నామనస్సు గొలుపదు.... ఈవిషయమై నాయభిప్రాయంబుగ బ్ర. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి గారును, బ్ర. శ్రీ రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారును నేకీభవించిరి. కీర్తిశేషులైన శతఘంటముఱంగయ్యశాస్త్రులవారియాశయంబునిదియె."

రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు తమ యుద్యోగోపన్యాసమున నీక్రింద పొందుపఱచిన విషయమును జెప్పియున్నారు.

"ప్రకృతి వర్ణనమున నితఁడు(నన్నయ్య) ఎఱ్ఱనయు నగ్రగణ్యులు. ఎఱ్ఱన యొక్క ప్రకృతి వర్ణనాప్రభావము దెలియ వలయునన్న హరివంశమును జిత్తగింపుఁడు. అన్ని రీతుల శైలులును గాంభీర్యమయములు. వీరి నాయికలు సంభాషణము గరువము గలయవి. శృంగారము గూడ గౌరవభావముతో సమన్వితము. గౌరవబుద్ధిలేని మోహము తుచ్ఛమును క్షణికమును. అట్టిదిందు వ్యంగ్యము ... గాంభీర్యముప్రధానగుణమని యెంచుటకు ఎఱ్ఱాప్రెగడవంటి మహనీయుఁ డాధారము".

తం. తేవప్పెరుమాళ్లయ్యగారి భారత కవుల వ్యాసము నందీ క్రింది విషయము జూడనగును.

"నృసింహపురాణమును నుత్తరహరివంశమును జూడఁగా నితని (ఎఱ్ఱాప్రెగడ) తెలుఁగురచనలు తిక్కన వాక్యములకుఁ దులదూఁగు సరియు, గొన్నిపట్టులఁ దిక్కన రచనల కంటెను నొకటి రెండు వన్నె లెక్కుడుగా నున్నవనియుఁ జెప్పవచ్చును ... ఇతని హరివంశము మిక్కిలి రసవంతమై నాతి కఠినమై యుండదు. ... భాషకుఁగల నైజగుణములు వెలయించి చెలువు గూర్చు కవనమే యిక్కవిది ... తిక్కన పదసంఘటనలమృదుత్వమును, ఉభయ భాషాలక్షణ ప్రమాణ శేముషీ వైదుష్యంబును బింక సౌకుమార్య శయ్యాచారుత్వసంవిధాన ప్రౌఢియు లలితసరళాతిసరళ ధారా స్వైరవిహారంబును రసభావోచితపదసంఘటనా రచనాప్రాగల్భ్యంబును నీ మహాకవి యందును గలవు. ఆతని కవనంబునందుం బోలె జప్పిడి సందు గొందులును అనుప్రాస క్లేశంబులును అనవరతంబులగు ద్రుతిస్వత్వంబులును అప్రసిద్ధార్థములగు పదములును యమకబంధాది క్లిష్టరచనలును నిందు సంతతిగాఁ గలుగవు."

శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు తమ విజయనగర ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో సోమనాథుని కవిత్వమును గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"ఈలాగున నుభయగ్రంథంబులయందును నేభాగములు సరిపోల్చి చూచినను సోమనాథుని కవిత్వ మెఱ్ఱనార్యుని దానికంటె రసవత్తరముగను ప్రౌఢతరముగ నున్నదని చెప్పుట కొకించుకయును సందేహము కలుగలేదు. ఇట్లు సోమనాథుని కవిత్వమును భూషించుట యెఱ్ఱనార్యుని కబ్బమును నిరసించుటఁగాఁ గవితాభిమాను లూహింపఁదగదు. గ్రంథ విమర్శయందు యదార్థ గుణ నిరూపణము చేయుకతప్పదు. హెచ్చు తగ్గులు నిర్ణయింపక తీరదు. కవితాభిమానమే గాని కేవలము కవీశ్వరాభిమాన మనుచితము, నక్రమము."

మీఁది యభిప్రాయములను బట్టి చూచినచో నెట్టన సోమనల కవితా తారతమ్య విషయమున బండితలోకమున భిన్న దృక్పథము లున్నవనుట స్పష్టమగుచున్నది. ఈ యభిప్రాయములనుబట్టి మనమెట్టి నిర్ణయమునకును రాజాలము. వీరి తారతమ్యముల నిర్ణయించునప్పుడు యెవ్వారికి రుచించిన పద్యమును వా రుదాహరించిరి; ఎవరికిఁ దోచిన విధమున వారు వ్యాఖ్యానించి యున్నారు. ఈవిషయమున కేవల పద్యములఁ నుదాహరించుటయేగాక, ఉదాహరించిన పద్యముల నన్నిఁటిని గొన్ని సాహితీ సూత్రముల బంధించుటకు శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు యత్నించిరి. యత్నము గొప్పది యయ్యు నందును గొన్ని గుణ దోషములు లేకపోలేదు. అందు గమనింపవలసిన విషయములు రెండు మూఁడు గలవు. ఒకటి : ప్రాచీనులగు నాలంకారికు లెవ్వరు నీ సూత్రములను జెప్పలేదు. అనఁగా నాలంకారిక ప్రామాణ్యము వానికి లేదనుట. రెండు : పాశ్చాత్య విమర్శకులు కూడ నట్టి సిద్ధాంతములను జెప్పలేదు. అనఁగా ప్రాచీనులగు నాలంకారికులు గాని, ఆధునికులగు పాశ్చాత్య విమర్శకులుగాని యీ సూత్రముల నామోదించి రనుట కాధారములు లేవనుట. మూఁడు : వీనిని శ్రీ అనంత కృష్ణ శర్మగారే సృజించిరి. ఒరుల చెప్పిన విషయములనే మనముగూడఁ జెప్పవలయు ననియు, స్వతంత్రించి యెట్టి సిద్ధాంతములను జేయరాదనియు నియమ మెచ్చటను లేదు. కాని మునుపు నందొక సిద్ధాంతమును మొదటనే యుంచుకొని, దానిని స్థాపించుటకయి తదనుగుణములగు సూత్రము లను గల్పించుట సమంజసము కాదు. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారు, కవిత్వాది లలితకళల యందుఁ బ్రధానముగాఁ గనవట్టు తత్త్వములు రెండే యనియు, నవ్వానిని భావము, వస్తువు అని పేర్కొన నగుననియు మొట్టమొదట నొక సిద్ధాంతమును జేసిరి. ప్రేమ, కోపము, అసహ్యము, అలక్ష్యము మొదలగు ప్రాణి ధర్మములే భావములనియు

ప్రకృతియందు గానవచ్చు జాతి, గుణము, క్రియ మొదలగు వివిధ పదార్థములు వస్తువు లనఁబడుననియు వారు వివరించిరి. వస్తువులు లేని భావములుగాని, భావములు లేని వస్తువులుగాని యుండు టరుదైనను ప్రాధాన్యమును బట్టి భావకళలనియు, వస్తుకళలనియు కళలను విభజింపనగునని వారే చెప్పిరి. భావకళ కుదాహరణముగా తిక్కన భారతము నందలి యీ క్రింది పద్యమును వ్రాసిరి.

ఉ. దప్పి జనించె; వ్రేళుల పుటంబులు పొక్కఁ దొడంగె; గోళ్ళలో
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు, చిత్తము నాకుఁ గడున్ వశంబుగా;
దప్పర మిచ్చటచ్చటను నాసల వచ్చితి; నెంతదవ్వొకో!
యిప్పటిభంగి నొక్కఁడును నేఁగెను దానికి నోర్వనెమ్మెయిన్.

భార. విరా. 1_148

వస్తుకళ కుదాహరణముగా నన్నయ భారతమునందలి యీక్రింది పద్యము నిచ్చిరి.

ఉ. శారద రాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులం
జారు తరంబులయ్యె, వికసన్నవకైరవ గంధ బంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరరస రాగ పాండు రుచి పూరము లంబరిపూరితంబులై.

భా. అర. 4_142

భావ, వస్తు కళలకుఁ దోడుగా రచనా విన్యాసమును గూడ వీరు మూఁడవ తత్త్వముగఁ జేర్కొనిరి. ఆ మూఁడవ తత్త్వమున కుదాహరణముగ నీ క్రిందిపద్యమును జూపి యున్నారు.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి
యేపున రేగి వాయించి యాడఁ
గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ,

సేడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచని రొంపి మైనలఁది కొనఁగ
దిక్కులు నాలుఁగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండిలి చేసి పిడుచ గొనఁగ

తే. మిగుల బ్రహ్మాండ భాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయ కాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతిభయంక రాకారత నతిశయిల్లె. భార. విరా. 1-134

ఈవిధముగ భావ, వస్తు, రచనా విన్యాసములుగఁ కవితాకళను విభజించి చూపియున్నారు. తుదకు సోముని కవితా విషయమునఁ దమ యభిప్రాయము నిట్లు వెలిబుచ్చి యున్నారు. "నాచన సోమునిది భావముల ప్రాధాన్యము లేక వస్తువు, రచన వీనికిఁ జేరిన కళ. ఆకాలమున తెలుఁగు సాహిత్యమున కిది నవీనము. "అవిదిత వేద్యాంతర" మైన యానందము నిచ్చు శక్తి లేకున్నను తృప్తిని, ఆశ్చర్యమును గలిగించి మనల నుల్లాసపఱచు సామర్థ్యము దీనికిఁ గలదు." ఇది వారి యభిప్రాయము. అది యటుండనిండు.

ఎఱ్ఱన సోమనల కవితా తత్త్వముల నిర్ణయించుటకుఁ బైని పేర్కొనఁబడిన యభిప్రాయములకంటె, సమానేతి వృత్తములుగల ఘట్టములఁ గైకొనుట యుచితము. అందును గవితా తత్త్వముల నాకళించుకొని, నాయా సన్నివేశ కల్పనాదులను దృష్టియందుంచుకొని బరామర్శింపవలయును. ఈ కవీశ్వర ద్వయము రచనలయందు నరకాసుర వృత్తాంతము, శ్రీకృష్ణ మాహాత్మ్యము, పౌండ్రక వాసుదేవుని వృత్తాంతము, ఉషానిరుద్ధులు సమానేతి వృత్తములు. వీరి రచనలకు మూలము వ్యాస హరివంశమగుటయు, గాథలభిన్నము లగుటయు వీరి రచనలలో సామ్య తారతమ్యములుండుట సహజము. వానిని గొన్నిఁటి నిట నుదాహరించుచున్నాను.

ప్రథమాశ్వాసమునఁ గల సూర్వశీ నరకాసుర సంవాద ఘట్ట మున, నూర్వశి నిరలంకృతమై, వినమ్రమైనను నామె సహజ సౌంద ర్యమున కబ్బురపడి ప్రేమావస్థ నందినాఁడు నరకుఁడు. కావున నాతఁడు లలితోక్తుల నీ క్రింది విధముగాఁ బలికినాఁడు.

మ. అవె సుత్రామరథంబు; లల్ల వె కుబేరానేకపశ్రేణు; ల
ల్లవె వార్ధింద్రు తురంగమంబు; లవె ప్రేతాధీశ వీరావళుల్
దవులం బాఱినఁ బట్టి తెచ్చి రనిలో దైతేయు లే సొమ్ము లిం
దువిదా నీకుఁ బ్రియంబు? గైకొనుము నీయుల్లంబు డెల్లంబుగన్.

ఉ. కౌఁగిటి కాస చేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చి రా
రాఁ గొఱగాని వాఁడనయి రామలలోఁ నగుఁబాటు దేను నీ
కేఁ గలుగంగ సంపదలకేల విచారము పద్మగంధి? నీ
లోఁ గిటఁ జేర్చనే యుభయలోక సుఖంబులు నన్నుఁ బొందినన్.

ఉ. హరి. 1-63, 64.

ఈ ఘట్టమునే రచించు పట్టుల నెఱ్ఱాప్రెగ్గడ పద్యము నీ దిగువ నుదాహరించుచున్నాను.

మ. వరుణుం దోలితి నర్థపుం బఱపితిన్ వైవస్వతున్ గెల్చితిన్
హరిఁ బోఁ జోపితి నేన యీశ్వరుఁడ సర్వామర్త్య సిద్ధోరగా
సురగంధర్వ యచ్చరాదులకు మెచ్చు ల్మీఱ నీవింక న
న్నరవిందానన సత్కరింపుము మనోజానీక సంక్రీడలన్.

హరి. ఉ. భా. 4-42

ఎఱ్ఱన సోమనలు నరకుని పాత్ర చిత్రణము నందెంతటి వైవిధ్య మును జూపినదియు మీఁది పద్యములవలన వ్యక్తమగుచున్నది. సోమన రసవత్తరమగు నొక నాటకీయతను జొన్పి, నరకునకు సౌమ్యత నాపా దించియుండ, నెఱ్ఱన నాయసురరాజునకు దౌష్ట్య ముట్టిపడునట్లు పాత్ర చిత్రణము గావించినాఁడు. ఇందిరువురి పోకడలును వేర్వేఱుగానున్నవి.

శ్రీకృష్ణ పరమాత్ముని తపశ్చర్యకు మెచ్చి సాక్షాత్కరించిన సదాశివుని పలుకులలో మన్మథుని వర్ణించిన విధము నెఱ్ఱన సోమన లోకేతీరున గావించి రనవచ్చును.

సీ. మకరందమాని మైమఱచిన గొనయంబు
 వెడఁ బ్రోయఁ గడిఁ బోని వింటితోడ
 జలజ కేసరరాజి జల్లెడ యూఁకగాఁ
 దాఁటువఁ దారి రథ్యములతోడఁ
 గర్ణికారఁపు మొగ్గ కనకంపు గుబ్బగాఁ
 గోయిల నోరూరు గొడుగుతోడ
 రతి కన్నుఁ గవ మచ్చరము సేయుటెక్కెంబు
 వడఁక వీతెంచు సేవకులతోడ

తే. వలపుఁ దూఁపులు కరసాన వాఁడిచేసి
 మండు నెలతోడఁ దనమేనమామయైన
 నిండునెల తోడవలరాజు నిర్జరేంద్రు
 సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ

ఉ. హరి. 2-194

సీ. ముందటి నెల మావిమొక్కల నలరింపఁ
 గర్త దా నగు చెలికాఁడు నడువ
 నిరు దిక్కులందును విరుల తేనియఁ గ్రోలు
 దొరలు మోదంబునఁ ద్రుళ్ళియాడ
 నునుగుత్తుకల నింపుఁ గొన గూయు పులుఁగుల
 చారు నాదములు గై వారములుగఁ
 జందన గిరినుండి చనుదెంచి చల్లని
 బంటెల్ల పనులకుఁ బరువు పెట్టఁ

తే. జిలుక మావులు గట్టిన చిగురు దేరి
పసిఁడి బలు మీను పడగ సద్దెసల మెఱవఁ
జెఱకు విలుఁ బువ్వుటమ్ము లేదైఱ ధరించి
కట్టి బిగిసి యేతెంచె నక్కడిఁది మగఁడు హరి. ఉ. భా. 6-64

ఉషానిరుద్ధుల రహస్యసమాగమవృత్తాంతమును విన్న బాణుని కోపవర్ణనముఁ జేయుటలో నీ మహాకవుల కవితారీతులు గమనింపఁ దగినవి.

ఉ. నావుడు రోషవహ్ని వలనం బొగరేఁగిన భంగి మోమునం
గావిరి పర్వ నంగమునఁ గంపలు నివ్వటిలంగ బాణుఁడ
త్యావిల చిత్తుఁడై మనుజుఁ డకట మదీయ పురంబు జొచ్చెఁన
చ్చేవయు కాక నానగరుచొచ్చె నిసీ మగమాట లేటికన్

క. ఏనటె నా కూఁతురినటె
మానవుఁడటె నగరుచొచ్చి మా కులమునకున్
హాని యొనరించెఁ గన్నులఁ
గానఁడు దలయెత్తి రోఁత గాదె నాకున్.

క. మనుజాంగనలం బట్టుట
దనుజులకుం జెల్లుఁ గాక దనుజాంగనలన్
మనుజులు పట్టుటకునుఁ దొర
కొనిరే బెండులు మునింగి గుండులు దేలెన్.

ఉ. హరి. 5 ఆ. 214, 215, 216.

శా. నా విక్రాంతియుఁ బేరుఁబెంపు మదిలోనం గాన కున్మత్తుఁడై
నా పీ డక్కటసొచ్చి నా ప్రియసుత న్వంశైక భూషామణిన్
భావం బేదఁగ నొక్క మర్త్యుఁ డట దర్పం బేర్పడన్ దూషితం
గావించెన్ మది సైఁపఁగా వశమె యిక్కాలుష్య దుర్భంగులన్.
హరి. ఉ. భా. 7-207

పయి పద్యములం దిరువురును నొకే విషయమును వర్ణించినను వారి రచనా విధానములు మాత్రము భేదించుచున్నవి. నాచన సోమన, ఆవార్తను విని బాణుడు చిత్తమునఁ గలఁగి రోఁతను జెందినాఁడని చెప్పుటతో నాగక యసురుల దుష్ట ప్రవృత్తిని సైతము వ్యక్తపఱిచి నాఁడు. మఱియు నొక సామెతను సంఘటించి, భావస్ఫూర్తిని గలిగించి నాఁడు ఇది సోమన రచనావైశిష్ట్యమును జాటును. ఎఱ్ఱాప్రగడకు గ్రంథానువాద దృష్టియే కాని కావ్య రచనా కల్పనల జోలికిఁ బోవు నుద్దేశము గానరాదు.

ఈ విధముగ నేయెడఁ జూచినను నీ మహాకవిద్వయు గ్రంథము లందు సన్నివేశ కల్పనములను బట్టియుఁ, బాత్ర చిత్రణాదులఁ బట్టియు వారివారి రచనా విన్యాసములు పొడగాంచుననుట సమంజసము.



# నాచనసోమనాథుడు - ఇతరకృతులు

నాచన సోమనాథుఁ డుత్తర హరివంశము ను గాక మఱికొన్ని గ్రంథములనుగూడ రచించినట్లు తెలియుచున్నది. కాని యాగ్రంథము లేవియు నేఁడు కాఁరావు అందులకుఁ దగిన హేతువులును దెలియరావు వసంతవిలాస మను నొక ప్రబంధమును రచించినట్లు లక్షణ వేత్తలు తమ గ్రంథము లందుదాహరించిన పద్యములను బట్టి గ్రహింపవచ్చును.

పదునేడవ శతాబ్ది మధ్య మందుండిన కాకునూరి అప్పకవి తన లక్షణ గ్రంథమునం దీక్రింది పద్యము నుదాహరించెను (అప్పకవీయము వావిళ్లవారి ప్రతి 1963)

కం. అత్తఱి విటనాగరకులు
చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టి తెచ్చిరి
ముత్తెపు ఝల్లరులతోడి బుజ్జటకొమ్ముల్ అప్పకవీయము 3_73

అప్పకవీయమునందు బయిపద్యమును మ॥కారయతులకు లక్ష్యముగా గ్రహింపఁబడినది (అట నీవసంతవిలాసమను గ్రంథము నాచన సోమ నాథుని దని స్పష్టముగ పుట యడుగునఁ జెప్పఁబడినది)

ఈక్రింది "వితాళచౌపద" వసంతవిలాసములోనిదిగా లక్షణ గ్రంథములందుఁ గానవచ్చుచున్నదని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగా రుదాహరించియున్నారు. (ప్రబంధరత్నావళి)

వీణాగానము వెన్నెలతేట
రాణమీఱఁగా రమణుల పాట
ప్రాణమైన పిన బ్రాహ్మణుపీట
జాణలు మెత్తురు జాజఱపాట.

ఈవితాళశౌపద చర్చరి జాతికిఁ జెందినది. ఈవిషయమును గూర్చి శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారిట్లు వ్రాసియున్నారు.

చర్చరి :-

"షోడశమాత్రాః బహవః పాదః" 16 మాత్రలు, బహు పాదాలు కలిగి అనుప్రాసాన్వితమయి ఉంటుంది. ప్రాకృతంలోను (ఆంధ్రాది) దేశభాషలలోను ఎన్నో చర్చరీ పదాలు ఉన్నవని సింహభూపాలుఁడు వ్రాశాఁడు. వసంతోత్సవంలో పాడదగినది. శ్రీహర్షుని రత్నావళి నాటకంలో వసంతోత్సవ సందర్భంలో చర్చరి ప్రశంస ఉంది. ఆంధ్ర భాషలో దేశీయ పదాలలో జాజర అనేదే చర్చరిగా మారినదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు. నాచనసోముని యుత్తర హరివంశము నుంచి యీక్రింది జాజర పాట నుదాహరించారు.

వీణాగానము వెన్నెలతేట
జాణలు మెత్తురు జాజర పాట.

ఇది పయిని చెప్పిన "షోడశమాత్రాఃబహవః పాదాః" అనునడకకు అనుగుణంగానే ఉంది. (ఆంధ్రవాగ్గేయకార చరిత్రము)

పయిచర్చను బట్టి చూచినచో సీవితాళచౌపద, వసంతవిలాస గ్రంథములోని దనుట సమంజసమే యగును.

ఇంతియగాక, నాచనసోమనాథుని కృతమని చెప్పఁబడిన వసంత విలాస (ప్రబంధ) ము, మాచయబ్రహ్మని కంకితముసేయఁబడినదనియు, నందలి మొదటి దీక్రిందిపద్యమనియు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు రుదాహరించియున్నారు.

శా. శ్రీచన్నొంగవ క్రేవ గ్రామ్యములఁగులన్ శృంగారపుం దోఁటకున్
ప్రాచీనంబగుచున్న వింశతినఖప్రాథిన్ సుఖాంబోధి వే
లాచంద్రోదయ మైన దేవుఁడు కృపాలంకార చిత్తంబునన్
జూచున్ మాచయ బ్రహ్మధీమణిఁ గవిస్తోమైక చింతామణిన్.
(చాటుపద్యమణిమంజరి-ద్వి. భా. పుట. 181)

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉత్తరహరివంశము (వావిళ్ల వారి ప్రతి-1926) నకుఁ బీఠిక వ్రాయుచు, నీమాచయ బ్రహ్మని శాసనము పల్నాడు తాలూకాలోని కారెమపూడిలో నున్నదనియు, వారా శాసనమునకు నకలు సంపాదింపలేదనియు వ్రాసియున్నారు. కాని శ్రీచాగంటి శేషయ్యగారీవిషయమును జర్చించుచు, శా. శ 1225, 1229 (అనగాఁ క్రీ. శ. 1303, 1307) సంవత్సరములలో మాచయ నాయనింగారి శాసనములు (రెండు) వెలసినవని తెలిపి యున్నారు. (ఆంధ్ర కవితరంగిణి: నాలుగవ సంపుటము: పుట 123) "మాచయ బ్రహ్మధీమణి" యను దానిని మాచయ బ్రహ్మగా గాక, మాచయ గారి బ్రహ్మయ అనఁగా మాచయకుమారుఁడగు బ్రహ్మగా గ్రహించిన చో, నీ మాచయబ్రహ్మఁడు, నాచనసోమనాథుని కాలము వాఁడయి యుండుననుటలో సందియము లేదు; సోముని వసంతవిలాసగ్రంథమునకుఁ గృతి భర్త యగుట కవకాశము గలదు. కాని ప్రామాణికములగు నాధారములు దొరకు నంతవఱకీవిషయమయి నెట్టి నిశ్చితాభిప్రాయము నను జెప్పుటకు వలనుపడదు.

శ్రీవేటూరివారిచే సంపాదింపఁబడి,ముద్రింపఁబడినచాటువులలో మాచయ బ్రహ్మనిపయి నీక్రింది పద్యమొకటిగలదు. దాని నీదిగువను జూపుచున్నాను. (చాటుపద్యమణిమంజరి: ద్వి. భా. పుట 181)

సీ. కమలంబునకుఁ బుట్టి కమలంబు చుట్టమై
కమలంబు తననాభిఁ గాంచిగాక
గంగకు నుదయించి గంగనౌదలఁదాల్చి
గంగలో భువనంబు గలపిగాక
జలరాశి జన్మించి జలరాశి లంఘించి
జలరాశి బాణాగ్నిఁ జమరిగాక
వహ్నికి నుదయించి వహ్ని నెచ్చెలిఁజేసి
వహ్నిఖాండవముపైఁబ్రోఁకిగాక
గీ. ఊరకెవ్వారు నీతోడ నోరయువారు
బుద్ధి తేజోరమా శౌర్యభూతి యత్న
కాంతి విక్రమఖ్యాతి సంగతుల నలరి
ప్రాభవోదార! మాచయబ్రహ్మధీర.

శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు, సోముని యితర గ్రంథములను గూర్చి వ్రాయుచు నిట్లనిరి. – "ఇతఁడు (నాచనసోమనాథుఁడు) వసంతవిలాస మను మఱియొక గ్రంథమును రచించి నట్లు కనుపట్టు చున్నది. ఇతఁడు కన్నడ భాషలోఁగూడ నేవేవో గ్రంథములను రచించెనని తెలియుచున్నది." (ఆంధ్రులచరిత్రము: మూఁడవభాగము: పుట 341) శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు సోముని చరిత్రమున నిట్లువ్రాసి యున్నారు. "ఇతఁడు హరివంశమును గాక వసంత విలాసమను ప్రబంధము నొకదానిని గూడ రచించి యున్నాఁడఁట. దానిలోని పద్యముల మూఁటి నీక్రింద నుదాహరించు చున్నాను. (ఆంధ్రకవుల చరిత్రము: ప్రథమభాగము: పుట 329)

క. అత్తఱి. విటనాగరికులు
చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా
మొత్తములు గట్టితెచ్చిరి
ముత్తైపు ఝల్లరుల తోడి బుజ్జటకొమ్ముల్.

క. అంజెదవు కాక నను జెం
తంజేరఁగనీక యెంత తగ్గిన మిరియా
లుం జొన్నల సరిగావే
లంజెతనమునందుఁ గొమిరెలం గెలువవొకో.

శా. ప్రాలేయ ప్రతివీరసేనఁ బఱపెన్ బైపై వసంతంబిలన్
గాలోన్మీలత కోరకోదర పరాగప్రోషకోషాగ్నియై
హాలాపాన విహారసారమహిళాహంకారదోస్సారమై
హేలాపల్లవ హేతిఖండిత మహాహేమంతసామంతమై

పయి నుదాహృతము లయిన వానిలో మొదటి పద్యమును లాక్షణి కుఁడగు నప్పకవిచే లక్ష్యమునకుఁగా గ్రహింపఁబడినది. రెండవపద్య ముత్తరహరివంశమున నూర్వశీ నరకాసురుల సంవాదమునందు గలదు. చివరి వృత్త మేగ్రంథమునుండి గ్రహించినదియు శ్రీవీరేశలింగము పంతులుగారు తెలిపి యుండలేదు.

మఱొక విషయము. ఈవసంతవిలాసప్రబంధవిషయ మీాక్రింది ముద్రితాముద్రితగ్రంథ పట్టికలలో నెచ్చటను గానరాలేదు.

i. ఆంధ్ర వాఙ్మయ సూచిక ముద్రితాముద్రితగ్రంథపట్టిక:
ii. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార అముద్రితగ్రంథపట్టిక.
iii. తంజావూరు సరస్వతీ మహాలు అముద్రితగ్రంథపట్టిక.
iv. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక అముద్రితగ్రంథపట్టిక .

(ఆంధ్రవాఙ్మయసూచిక: 1927)

పయి నాలుఁగు పట్టికలలో నీగ్రంథ ముదాహరింపఁ బడకుండుటను బట్టి నాచనసోముని వసంతవిలాస (ప్రబంధ) మీానాటికి లభ్యము కాలేదని తెలియుచున్నది.

పయి యభిప్రాయములను బట్టి యీాక్రింది విషయములు వ్యక్తములగుచున్నవి.

i. పలువురు లాక్షణికులు నాచన సోమనాథుని వసంతవిలాసము నందలి విగాఁ గొన్ని పద్యముల నుదాహరించియున్నారు;
ii. ఆయా పద్యములందలి భావాదికముల తీరునుబట్టి, యవి వసంత విలాసగ్రంథము లోనివే యనిపించుచున్నవి;
iii. ఈగ్రంథము మాచయబ్రహ్మని కంకిత మీయఁబడినదనుట కాధార భూతమగు నొక పద్యము లభించినది;
కావున నాచన సోమనాథుఁడు "వసంతవిలాస (ప్రబంధ) ము" అను గ్రంథమును రచించెనని చెప్పుటయే సమంజసము.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారును, శ్రీ చాగంటి శేషయ్య గారును, కవిలోక చింతామణిలో వెల్లంకి తాతంభట్టు, నాచన సోమ నాథునిదిగా నీక్రిందిపద్యము నుదాహరించి యున్నారు.

కం. ఆపాద శిరోలంకా
రాపాదితచారుతాభిరామాత్మీయా
రూపాలోకనతుష్టా
కూపార కుమారికాముకురమణిబింబా!

శ్రీ వేటూరి వారీ పద్య ముత్తరహరివంశములోఁ గానరాదని వ్రాసియు, ప్రథమాశ్వాసాంత మందలి దేమోయను సంశయమును వెలి బుచ్చిరి. క్రీ. శ. 1926వసంవత్సరమున వావిళ్ల వారిచేఁ దొలుతఁ బ్రక టిత మయిన యుత్తరహరివంశమునకుఁ బీఠిక వ్రాయుచు వీ రీయభి ప్రాయమునిచ్చి యున్నారు. కాని, క్రీ. శ. 1961వ సంవత్సరమున వేయఁబడిన మఱియొకముద్రణమున, నీపద్యమును బ్రథమాశ్వాసాంత పద్యముగా (నాపత్రికటనకర్త లే) కూర్చియున్నారు.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ప్రథమాశ్వాసాంత పద్యములు లభింపమి, చతుర్థ పంచమాశ్వాసాంతములందలి పద్యము లనేకూర్చి ప్రథమాశ్వాసమును బూర్తి చేసియుండిరి.

(ఉత్తరహరివంశము: ప్రథమముద్రణము - 1897 ఏ.డి)

శ్రీ చాగంటి శేషయ్యగారు పయిపద్యమే గ్రంథములోనిదో తెలియదని జెప్పియున్నారు.

(ఆంధ్రకవితరంగిణి: నాలుగవ సంపుటము)

నాచన సోమనాథుడు ప్రత్యాశ్వాసాంతమునను ఒకవృత్తము, ఒక కందము, ఒక మాలినీ వృత్తమును రచించినాడు. ప్రథమాశ్వాసము పూర్తిగానున్న ప్రతి లభింపకుండుట నాపద్యము లు కొఱంతపడినవి. కాని వెల్లంకి తాతంభట్టు పయి నుదాహరించిన పద్యము నాచనసోమనాథునిదిగాఁ జెప్పుటయు, నాపద్య మాశ్వాసాంతపద్యమును బోలియుండుట చేతను, శ్రీ వేటూరి వారి సంశయాస్పదమయిన యభిప్రాయము సరియైనదని తోఁచుచున్నది. కావున క్రీ. శ. 1961 ముద్రణమున నీపద్య మాశ్వాసాంతపద్యము జూపట్టుటయు నంగీకార్యమే.

అప్పకవి తరువాతి వాఁడగు కస్తూరి రంగయకవిచే రచియింపఁబడిన లక్షణగ్రంథము నందుఁగూడ నాచనసోమనాథుని పద్యములు లక్ష్యములుగా గ్రహింపఁబడినవి. రంగయకవి తన ఆనందరంగరాట్ఛందమున (వావిళ్లవారి ప్రతి: 1922) యతి ప్రకరణమునఁ బూర్వకవుల గ్రంథములనుండి లక్ష్యముల నెన్నుకొనుటలో, నాచనసోముని హరివిలాసము లేక హరవిలాసము నందలి వని యీక్రింది పద్యముల నుదాహరించినాఁడు :—

1. మకారయతి కుదాహరణము:

కం. జయమగుటకు నీమది సం
శయమేటికి వినుమనుచు సముంచిత కరుణా
లయుఁడగు మునీంద్రుఁ డెంతయుఁ
బ్రియముగా మంత్రంబు చెప్పె నృపతికి నెలమిన్. 3 ఆ 119

2. ప్రాదియతి కుదాహరణము:

కం. శంబరవైరి విభంజన
సాంబశివా యంధక ప్రశాసక గజ చ
ర్మాంబరధర యని నీదు ప
దంబులు పూజించువాఁడు ధన్యుఁడుసుమ్మీ! 3 ఆ: 214

"ఆఙ్" అను నుపసర్గ యందలి యచ్చు కుదాహరణము:

కం జయ విజయ వినుత జన్మా
వ్యయ దూరానంద రూప భాసురదత్తా
భయ హరిహయ ముఖ నిర్జర
నయ నన్నక్షత్ర యూథ నళినీనాథా! 3 ఆ: 403

"అఙ్" అను నుపసర్గ యందలి అచ్చు కుదాహరణము

కం మౌని తిలక! సజ్జన సం
తాన మహీరుహా! భవత్సుధాలాపము నా
వీనులకు విందొనర్చెన్
మేనునఁ గల తాపమణఁచె మృషగాదుసుమీ. 3 ఆ: 357

ఈపద్యములు సోముని యుత్తరహరివంశము నందలివి గావు. శ్రీనాథుని హరవిలాసమునందు గూడ లేవు. కావున శ్రీనాథుని హరవిలాసము నందలి వనుటకు మాఱుగ సోముని హరివిలాసములోని వని భావపడెననుటకుఁగూడ నవకాశము లేదు. ప్రమాణగ్రంథముగ భావించి యందలి పద్దెములను లక్షణవేత్తలుదాహరించుటచే, నాచనసోమనాథుఁడు హరివిలాసము లేక హరవిలాసమను మఱియొక గ్రంథమును గూడ రచించె ననుట కవకాశముకలదు.

ఈవ్యాస సారాంశముగ నాచన సోమనాథ మహాకవి యుత్తర హరివంశమునే గాక వసంతవిలాసమను నొకప్రబంధమును, హరివిలాసము లేక హరవిలాస మను మఱియొక గ్రంథమునుగూడ రచించెను.

ఇక్క విసత్తముఁ డాంధ్రసరస్వతి కలంకారములుగాఁ గూర్చిన గ్రంథము లలో నేఁ డుత్తర హరివంశము మాత్రము లభించుచున్నది. ఈతఁడష్ట భాషా కవిత్వసంపన్నుఁడగుట, నాంధ్రభాష కతిసన్నిహితమగు కన్నడ భాషయందు గూడ రచనము గావించి యుండును.

కొందఱు లాక్షణికులు, నాచన సోమనాథుని హరివంశము నందలివిగాఁ గొన్ని పద్యశకలములను దమ గ్రంథములం దుదాహరించియున్నారు. వారిలో నప్పకవియుఁ గస్తూరిరంగయకవియు యతిప్రాసప్రకరణంబు లందు లక్ష్యములుగా గ్రహించిన వాని నిటఁ జూపింతును.

అప్పకవి సంయుతాసంయుత ప్రాస వివరణము నందు రేఫశ్లిష్ట మున కుదాహరణముగ నీక్రిందిపద్యమును గ్రహించినాఁడు.

1. సోముని హరివంశమునందు :-

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీ నాగేంద్ర బృందారకా
రాతుల్మున్నుగ దేవసంఘములు పోర స్థిర సంగ్రామకుం
డీత్రైలోక్యము నందుఁ గల్గఁడు రణంబెచ్చోట లేకుండఁగాఁ
జేతుల్వేయు వృథాభారం బగుచు వచ్చె న్దేవ యీ మేనికిన్.

(వావిళ్లవారిప్రతి: 1951) అప్పకవీయము. 3 ఆ 319

ఈపద్య ముత్తరహరివంశమునఁ గానరాలేదు. ఇది బాణాసుర వృత్తాంతమునందలి దనుట స్పష్టము. ఎఱ్ఱాప్రెగడ హరివంశమునందును, భాగవతము నందును లేదు. ఉత్తరహరివంశ ప్రతులలో నెచ్చటను కానరానికారణమున నీగ్రంథపరిష్కర్త లీపద్యమును విడిచి యుందు రని తోఁచుచున్నది.

కస్తూరి రంగయకవి తన ఆనందరంగరాట్ఛంద గ్రంథమునఁ బ్రాస భేదంబుల వివరించు నవసరమున గూడ నీపద్యమునే గ్రహించెను. కాని యీపద్యమునందుఁ గొంతభాగము వేఱుగ నున్నది. ఆపద్యపాద మును గూడ నీదిగువఁ జూపుచున్నాను.

ii. నాచన సోముని హరివంశమునందు :-

శా. నాతో మార్కొన లేరు నిర్జర మరున్నాగేంద్ర బృందారకా
రాతుల్మున్నుగ దేవసంఘములె పోఁడన్ లేవు సంగ్రామికుం
డీ త్రైలోక్యము నందుఁగానము రణం బెచ్చోట లేకుండఁగాఁ
జేతుల్వేయు వృథాధర మ్మగుచుఁదోఁచెఁ దేవ యిమ్మేనికిన్.

(వావిళ్లవారి ప్రతి: 1922) ఆనంపరంగరాట్ఛందము 3 ఆ. 196

ఈతఁడీపద్యమును ద్రివర్ణప్రాసమున కుదాహరణముగ నిచ్చి యున్నాఁడు. మఱియు యతిప్రకరణము నం దీక్రింది వానిని గూడ నీకవి పేర్కొని యున్నాఁడు:

iii. నాచనసోముని హరివంశమునందు:

వికల్పయతి కుదాహరణము :-

మ. ఒకనాఁడిందుధరుండుఁ బార్వతియు లీలోద్యాన కేళీసరి
న్నికటానేక విహార దేశముల దైతేయేంద్రకన్యాప్సరో
నికురుంబములు పారిజాత కుసుమానీకంబుపైఁ జల్లద
ర్పక బాణంబుల కెల్లనెల్లయగు సౌభాగ్యంబుతో నాడఁగన్. 3 ఆ 196

ఘుఙ్ యతి కుదాహరణము:-

గీ. అగ్రజన్మ నాతోమృషాలాపమిప్పు
డాడినందుకు ఫలము జిహ్వాంచలంబుఁ
గత్తిరించెద నీ సూరకత్తిచేత
ననుచు డగ్గరఁ జేరెన యసురఁ జూచి. 3 ఆ 237

ప్రాదియతులు (ప్ర అను నుపసర్గయందలి యచ్చునకు) :-

శా. ప్రారంభంబగుశక్తి కుట్మలితహస్తాంభోజయై యిట్లనున్.3 ఆ 325

పయి మూఁడుపద్యములలో మొదటిది బాణాసురకథలో నిందు ధరోపాఖ్యానమునఁ గలదు. (ఉ. హరి. 5-47) మిగిలిన రెండు పద్యములు ప్రకృత ముపలబ్ధగ్రంథమునఁ గానవచ్చుటలేదు. అవి యేఘట్టము నకుఁ జెందినవో చెప్పుట కవకాశమును లేదు.

# సోమనాథుని హాస్యరసపోషణము

సాహిత్య రసపోషణ బిరుదాంచితుఁడగు నాచన సోమనాథుని యుత్తర హరివంశమున హాస్యరస మెంతవఱకుఁ బరిపోషింపఁ బడినదియుఁ బరిశీలింతము

వికృతాకార వాగ్వేషచేష్టాదేః కుహకాద్భవేత్

హాస్యోహాసః స్థాయీభావః – అని సాహిత్య దర్పణమునందుఁ జెప్పఁబడినది. "వాగంగాది వికారదర్శనజన్యా వికాసాఖ్యోహాసః" అని రసగంగాధరమున హాస్యమునుగూర్చి నిర్వచింపఁబడినది. అంగవికారములఁజూచుటచేతను, వికృత సంభాషణముచేతను హాసముదయించును. కాని హాస్యమునకు సౌమనస్యమును దోడుగా నుండవలయును

ఈ మహాకవికి హాస్యమునందుఁగల యభిరుచిని గూర్చి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిట్లు వ్రాసియున్నారు

"... మఱియు నీకవికి (నాచన సోమనాథునకి) హాస్యరసమందు విశ్వాసమెక్కుడని తోఁచెడిని కొన్ని యెడలఁ జదువరుల నవ్వింపవలయునని ప్రయత్నపడి వ్రాయును." ఇట నరకాసురవధ ఘట్టమునందు మహర్షుల యవస్థల వర్ణించు సీసపద్య భాగము నుదాహరించినారు "ముందట దిక్కుఁ డి మొలత్రాడుఁ దవిలిన తోఁక గోచుల వెంటఁ దూలువారు .." (ఉ హరి 1 ఆ 102)

ఒరుల యవస్థలఁజూచి హాస్యముచేయుట నీచలక్షణమనియు, హాస్యమునకును సౌమనస్యము తోడుపాటు ముఖ్యమనియు విమర్శించిరి.

శ్రీ ఖండవల్లి ... శ్రీ ఖేకుమళ్ళ అచ్యుతరావుగారు, సోముని హాస్యరస పోషణమును గూర్చి "విజయనగర ఆంధ్ర వాఙ్మయ చరిత్రము" నందిట్లు వ్రాసిరి. "హాస్యరసము వర్ణించుటయం దీకవి కెంతనేర్పు గలదో తెలిసికొనుటకుఁ దగిన యవకాశము లీగ్రంథమునఁ గానరావు. ఒకానొకచోట మాత్రము హాస్యకరుణరస మిశ్రితమయిన భావమును గడు చిత్రముగ నిరూపించి యున్నాఁడు. డిభకుఁడు మునిఁగి చచ్చిన తన యన్నయగు హంసునికొఱకై వెదకుచు నిట్లు విలపించెనట." ఇట డిభకుని చేష్టాదికములం దెలుపు రెండు పద్దెముల నుదాహరించిరి.

కం. వ్రేలెడు వెంట్రుల విరుగడఁ, దూలగ...నన్నా లాయని యొఱలున్.
కం. ఆలం దల యడిచికొనున్...దన్నికొనున్ (ఉ.హ. 4ఆ. 302, 303)

నాచన సోమనాథుని కవితయందుఁ గాననగు నాతని ఉక్తిచాతుర్యమునందును హాస్యరసము లీలగా గోచరించును. ఈ విధమైన రచనాచమత్కృతికి, ఊర్వశీ నరకాసురుల సంవాద ఘట్టమొక ధ్వజప్రాయము గు తార్కాణ. అంతియకాదు, తెలుఁగు సారస్వతమునకే యిదియొక భూషణము.

ఊర్వశి పలుకులయందుఁగల వాక్చాతుర్యము, నెఱజాణతనము, మదాంధుఁడగు నరకాసురుని మోసపుచ్చును. ఆతని కోర్కె కొప్పుకొనుచున్నట్లుగనే నటించి, తన నేర్పుమెయిఁ దప్పించుకొనఁజూచు నూర్వశి పల్కులు, అందలి గడుసుదనము నీ క్రింది పద్యములలో వ్యక్తమగును. ఈ వాక్చమత్కృతియందే సరసమగు హాస్యము మనోజ్ఞముగఁ బోషింపఁబడినది.

చ. చతురవచోవిలాస ! గుణసాగర ! సాగరమేఖలావనీ
పతియగు నీకు నింతులొక భ్రాంతియె? నీవిటు గోరుటెల్ల నా
యతులిత భాగ్య; మింత నిజ; మైనఁ గలంగకమున్న వైభవో
న్నతి మెఱయంగ వచ్చి, యొకనాఁడయినన్ నను గారవించితే.

ఉ. లంజియ నాదు నేను విను లావున నీవమరేంద్రు గెల్చి న
న్నుం జెఱవట్టి తెమ్మని వినోదము చేసితిగాక చిత్త మె
ల్లం జెడియుండ రిత్తయెడలం జవిచేరునె చిల్కవోయినం
బంజర మేమిసేయు? రసభంగము సంగతిలోన మెత్తురే.

ఉ. నవ్వుల మాటలో నిజమొ నాకములోన ననేక కన్యకల్
మవ్వపు దీగెలం దెగడు మానిను లుండఁగ నంత నెన్నఁడో
జవ్వన మమ్మకొన్న గడసాని ననుం గవయం దలంచితే
పువ్వులు వేఁకకైనఁ గడివోయిన వాళ్ ముడువంగ వచ్చునే.

ఉ. హరి. 1 ఆ. 66, 72, 73

ఇందలి ఉక్తివైచిత్రి దర్పోద్ధతుఁడగు నరకున కవగతముకాలేదు. "ఇంచు నిన్నుర । మ్మనుట పోసంగ దొక్కదినమైనను నీవిహరించు చోటికిన్ । నను బిలిపింపవైతి తగునా చనవింతకు నాకుఁ జెల్లదే?" – అని యాతనిపై దోషము నారోపించినది. మహామునులు క్రతువులు సేయు చోటి కధికారివిగాని కొంతయేటికని, నరకుని ప్రోత్సహించు పలుకులయందు హేళనతోఁ గూడిన హాస్యము గాన్పించును.

నరకాసురవధ ఘట్టమున, నరకుని పరివారముచే బాధింపఁబడిన మహర్షుల దురవస్థలను వర్ణించు పట్టుల కరుణముతో పాటుగ హాస్యమును చదువరులకు స్ఫురించును. కాని మహర్షుల విషయముగుట–నిట యనౌచిత్యమని కొందరి భావము. అట్లే దుర్వాసమునికి, అతని శిష్యులను, హంసడిభకులు బాధించునవసరమున – గొంత హాస్యముగలదు. అధిక్షేపహాస్యముగ దానిని పేర్కొన నగును.

సీ. జడలు కంపలు వట్టి జరగనీ కున్నచో
విడిపింప శిష్యుల వెదకువారు
జన్నిదంబులు కాలిసంకెలలై పడఁ
దెగఁ దన్ని మిన్నక తిరుగువారు

ముందటిది కూర్కొడి మొలత్రాడుఁ దవిలిన
తోఁక గోచులవెంటఁ దూలువారు
దగ నెత్తి పోలేక దండంబు లటువైచి
"హా విధీ" యని చేతు లార్చువారుఁ
తే. గడవసంబుల మోఁదినఁ గలఁగువారు
వల్కలంబులు దోఁచిన వంగువారుఁ
జెఱలువోయినవారలఁ జీరువారు
నైరి మునీంద్రులు గలఁగి రయ్యాశ్రమమున. ఉ. హరి. 1ఆ. 102

హంసడిభకోపాఖ్యానమునందు, హంసుఁడు యమునా జలంబులలో మునిగిపోవును. డిభకుఁడు తన యన్నయగు హంసుని గానక, నాతని నన్వేషించుచు, నీక్రిందివిధముగ నాక్రోశించును. ఇందు కరుణము, హాస్యము సమ్మిశ్రితమగుట యీ క్రింది పద్యమున స్పష్టమగుచున్నది.

కం. వ్రేలెడు వెండ్రుక లిరుగడఁ
దూలఁగఁ దలయూఁచుఁ దొప్ప తొప్పన నోరుం
గేల నడచికొను సెలవుల
లాలలు చొరఁగంగ నన్నలా యని యెఱలున్.

కం. ఈలం దల యడిచికొనున్
నేలంబడి పొరలు లేచు నెత్తురు లుమియుం
గేలిఁబడి రిపులు చూడఁగ
నాలుక వెటికికొనుఁ జావునకుఁ దన్నికొనున్. ఉ. హరి. 4-302, 303

డిభక మూర్ఖుఁడు యమునా జలంబులందు మునుఁగుచుఁ దేలుచు హంసు నెందును గానఁ డయ్యెను. ఆరాక్షసాధముని వికృతాకారమును, వికారచేష్టలును, మాటలును, హాస్యోత్పత్తికి హేతువులగుచున్నవి.

ఈ ఘట్టము నాచన సోమనాథునకు హాస్యరసపోషణమునందుఁ గల ప్రావీణ్యము స్పష్టము చేయుచున్నది.

# సోమన సీసపద్య రచనావిధానము

నాచన సోమనాథుని సీసపద్య రచనమునందొక వైశిష్ట్యము గన్పట్టును. ఈ రచనా చమత్కారములను జూపుటలో సోమన వివిధ మార్గములందుఁ బ్రయాణించినాఁడు. అనంతర కాలికులగు శ్రీనాథాదులకుఁ గూడ నీవిషయమున నీతఁడు మార్గదర్శకుఁ డయినాఁడు. కథా కథనమునందును, వేదాంత విషయ ప్రతిపాదక ఘట్టములలోను, నీతని సీసము వంపులువొయ్యారములు లేక సరళముగ వచనశైలిలో సాగును. ఒక్కొకచో నీతని సీసము లు పూర్వోత్తర దళము లు రెండును రెండు సంస్కృత సమాసములుగ సంతరింపఁబడి యట్టి యెత్తుగీతితోఁ గూడి శ్రుతి సుభగముగ నడచును. ఒక్కచో నచ్చతెనుఁగు నుడుల కూర్పుతో పద్యమంతయు నింపుకొని, తెనుఁగుదనము తొణికిసలాడు చుండును. వేఱొకచో సీసపద్య పాదములో నుత్తరార్ధమునందుఁ బ్రాస యతితో క్రియా యుగళమును సంఘటించి, సీసమునకొక తూగు కల్పించును. వర్ణ్య వస్తు గౌరవమును బురస్కరించుకొని, సీసపాదములు నాలుగు, నాలుగు దీర్ఘ సంస్కృత సమాసములుగ ఘటించి, యెత్తుగీతిలో విషయ వివరణ మొనర్చు టీతని రీతులలో నొకటి.

ఇక సోమనాథుని సీసపద్యములఁ గొన్నిటిని జూపి, తద్రచనా వైదగ్ధ్యములను బరిశీలింతము.

సీ. సాల్వ దేశంబున జనియించె బ్రహ్మాద
త్తాభిధానుండు మూర్ధాభిషిక్తుఁ
డఖిలధర్మ విధిజ్ఞుఁ డాత్మబార్హాద్వయం
బునకు బిడ్డలు లేమిఁ బొల్లవోయె

సంసార మనుచు నీశాను నారాధించెఁ
బదియేఁడు లొండు సంభ్రమము లేక
పరమేశుఁ డతని సద్భక్తికి మది మెచ్చి
కలలోన నొకనాఁడు గదిసి వరము

తే. వేఁడికొను మన్న నిరువుర వేఁడె సుతుల
శివుఁడు నిచ్చితినంచు విచ్చేసె నంత
నతని దేవు లిద్దఱును గర్భాభిరామ
మూర్తులయి రన్న రేంద్రుండు ముద్దుసేయ,

ఉ. హరి. 4ఆ. 7

ఇందు బ్రహ్మదత్తుని జన్మాదికమునుండి, యీశ్వరుని వరముచే నాతని సతులు గర్భవతు లగునంతవఱకుఁ గల కథను సంగ్రహముగ సరళముగ వివరింపఁ బడినది.

వేదాంత విషయ ప్రతిపాదక సందర్భములలోను, భగవత్ప్రశంసా పద్ధతియందును పాండితీ ప్రాగల్భ్యములను బ్రదర్శింపక, ప్రౌఢ దీర్ఘ సమాసముల పొంతకుఁ బోక నలతి యలతి పలుకుల సీసపద్యములను గూర్చును.

సీ. నీయంద జనియించె నీయంద నిఖిలంబు
నడఁగె నీ వాదిమధ్యాంత మగుట
నేన నీవన నీవ నేనన వర్తింతు
మిరువుర శబ్దార్థ మేకరీతి
నీ నామములు నాకు నా నామములు నీకు
నీకుఁ జేసినపూజ నాకుఁ బూజ
నిన్ను నొల్లనివార నన్ను నొల్లనివార
లెఱుఁగ నీ యునికి నా కచట నునికి

తే. చెల్లినది చెల్లుచున్నది చెల్లనున్న
యది సమస్తంబు నీవ నీ కనభిగమ్య
మేదియును లేదు వేదంబు లెఱుఁగు నవియు
నీవ నా నమస్కారంబు నిన్నుఁ జేరు. ఉ. హరి. 2 ఆ. 212

సీ. ప్రణుతింతు నో న్నమో భగవతే వాసుదే
వాయ నమో భక్తవత్సలాయ
సూర్యాత్మనే నమస్సోమాత్మనే నమః
ప్రణవాత్మనే నమో బ్రహ్మణే న
మో రుద్రనామ్నే నమో విష్ణవే నమో
మూలప్రకృతయే నమో వసుంధ
రాది భూతగణానుహారిభాసే నమో
మాయామయాయ నమ స్సహస్ర

తే. బాహునేత్ర శిరఃపాదవస్తయే న
మో వషట్స్వధా స్వాహాత్మ మూర్తయే న
మః స్వభావ శుద్ధాయ నమః ప్రహరణ
ధారిణే నమో యనుచు నుదాహరింతు. ఉ. హరి. 2 ఆ. 218

సోమన, సంస్కృత సమాస భూయిష్ఠముగు రచనను సలిపియు, ప్రతిదళము నొక సమాసముగఁ గూర్చుటలో నొక సంయమనమును పాటించును. ఇట్లన్ని పాదములందును నీనియతి కానవచ్చును. ఈకూర్పు నీ క్రింది పద్యమునఁ జూడదగును.

సీ. వాచంయమోత్సంగ వత్సల సారంగ
మురుచషాల స్థూలయూపశతము
ప్రాగ్వంశ బంధుర బహుగంధ సాన్నాయ్య
మాగ్నీధ్రముఖ్య ర్త్విగాశ్రయంబు

సుత్రామసఖమాయజూక సామాజికం
బాతిథేయమయోట జాజిరంబు
పటుధవిత్ర పవిత్ర పవనోజ్జ్వలత్రేత
మఘుమర్షణజ్ఞ శౌకాంచితంబు
తే. సంతత బ్రహ్మచర్య సుస్నాతకంబు
పరమయోగి నిరాకృత పాతకంబు
హాస్తికైతిహ్యసహ్య పంచాననంబు
బదరికా కాననంబు చూపట్టె నెమర.

ఉ. హరి. 2 ఆ. 108

సంస్కృత సారస్వతమునందు భారవ్యాది కొందఱు కవులు తమ పాండిత్య ప్రకర్షను వెలిబఱుచుటకు చిత్ర కవిత్వాదుల నట నట వెల యించిరి. ఆ విధముగనే తెనుఁగున బాల్కురికి సోమనాథుఁ డచ్చ తెనుఁగు పద్యములఁ గూర్చుట కంకురార్పణము చేసినాఁడు. ఆ మార్గముననే సోమనాథుఁడును తననేర్పు మెఱయి నచ్చతెనుఁగు సీసమును దన గ్రంథమున గూర్చినాఁడు. ఈతని రచనా వైచిత్ర్యము మెఱయు మఱియొక పద్యమునుగూడ నుదాహరించు చున్నాఁడను.

సీ. తొలుకారు మెఱుఁగుల తోఁటలో నాడెడు
రాయంచకొదమతో రాయఁ జాలి
యిరుల బండారంపుటింటికిఁ బెట్టిన
బొండుమల్లెల కోటఁ బోర గెలిచి
బలుమంచుఁ గంబాల బలసి రాఁ జుట్టిన
క్రొత్తమంజిడి బాగుఁ గొఱఁతచేసి
పాలపెన్నురవు గుబ్బలిమీఁద నెలకొన్న
నిండు వెన్నెల ప్రముగ్గు నిగ్గు చెఱచి

తే. జడలఁ గ్రొన్నెల మెడఁ బాఁపసరిగఁ దొడలఁ
బొడలతో లేఁత వెలిమిడిపూఁత మించఁ
బొడమి వేఁచేనిముంకాటఁ బొడవు సూపెఁ
బొడువులందెల్లఁ బొడవైన బోఁటువేల్పు.

సీ. కుజము కుంజరముచేఁ గూలునో కూలదో
కూలు కుంజరము నీకుజము గూల్చె
మ్రాను పేరేటిచే మడుఁగునో మడుఁగదో
మడుఁగు పేరేటి నీమ్రాను మడిఁచెఁ
గాలునో యొకనిచేఁ గాలదో సాలంబు
గాలు నీసాలంబు గాల్చె నొకని
దునియునో పరశుచేఁ దునియదో వృక్షంబు
తునియు నీవృక్షంబు తునిమెఁ బరశు

తే. వనుచుఁ దమలోనఁ జర్చించు నమరవరుల
కభిమతార్థ ఫలార్థమై యందవచ్చు
పారిజాతంబు నామ్రోలఁ బండియుండ
నందఁ గంటి నా కోర్కుల నందఁ గంటి. ఉ.హరి. 2ఆ. 171, 176

సీసములందు యూగును గల్పించుటకూడ తెనుఁగున సోమునితో నారంభమయిన దనవచ్చును. ప్రతి పాదమునందును నుత్తరార్ధమున రెండుక్రియలను సంఘటించుటయు నొక విశేషము. ఈదిగువ నుదాహరించిన సీసమునఁ బ్రాస యతిని గూడ పాటించి, హరిహరుల విషయమును స్పష్టపఱిచినాఁడు.

సీ. అభ్రంకషంబైన యాలపోతు నితండు
త్రుంచినాఁ డీతండు పెంచినాఁడు
సాధు సమ్మతముగా సామజంబు నితండు
గాచినాఁ డీతండు ద్రోచినాఁడు

బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు
దాల్చినాఁ డీతండు వ్రాల్చినాఁడు.
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు
మెట్టినాఁ డీతండు సుట్టినాఁడు

తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ
జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁ గలిగె
ననుచుఁ గొనియాడు సంయమిజనుల కొదవె
రజితగిరి మీఁద హరిహరారాధనంబు. ఉ. హరి. 2ఆ. 180

సోముని సీసములందు వర్ణ్య వస్తు గౌరవమును బాటించుట మఱియొకవిశేషము. మారుత వర్ణనా వ్యాజమున నీ క్రింది పద్యమున నీశ్వర స్వరూపమును వర్ణించినాఁడు.

సీ. కల్హార మకరంద కలిత మందాకినీ
లహరీ పరీత కోలాహలంబు
బాలేందు చంద్రికా పరభాగ శోభాప
రాగ సంభావి తారగ్వధంబు
సేవా సమాసన్న సిద్ధ సీమంతినీ
తాల వృంతోత్తాల తాండవంబు
కాత్యాయనీ దత్త కర్ణావతంసక
ధూర్వార ఖండామోద పూరితంబు

తే. మారుతంబు నా మీఁదట మలసియాడ
గలుగునొకో నాకు నొకనాఁడు కన్నులార
శివుని జూచు పుణ్యం బనుచింత నెఱయు
మొదలి వేలుపుఁ బొడఁగంటి మ్రొక్కఁగంటి. ఉ. హరి. 2ఆ. 173

ఇందు మారుతముకంటె నీశ్వర స్వరూపమే ప్రాముఖ్యమును వహించుట కానగును. తద్రూపమున విషయమునకు గౌరవమును, దీర్ఘసమాస భూయస్త్వమున కౌచితియును గలుగుచున్నది.

మఱియొక రచనా చమత్కృతి విశేషముగల పద్యము నిట నుదాహరించుచున్నాను. పూర్వార్ధము సందేహమును సూచించు పదములఁగూర్చి యుత్తరార్ధమున వర్ణ్య వస్తువును జెప్పినాఁడు. ఆపద్యమిది.

సీ. వెలిదమ్ములో లేఁతవెన్నెలో యమృతమో
కన్నులో చిఱునవ్వొ కనికరంబొ
గగనమో చుక్కలో గ్రహరాజబింబమో
వక్షంబొ మౌక్తికావళియొ మణియొ
తరఁగలో ఫేనమో తరణిమండలమొ హ
స్తములొ శంఖంబొ సుదర్శనంబొ
తలిరులో కరికరంబులొ కుంకుమ ప్రభయొ
పదములొ యూరులో పచ్చఁబట్టొ

ఆ. యనుచుఁ గన్నులార నా జగన్నాథునిఁ
గనుగొనంగ నేఁడు గలుగుఁ గాన
తలఁపులోన మున్ను దలఁచిన రూపంబు
పట్టువడుట జన్మ ఫలముగాదె. ఉ. హరి. 4ఆ. 138

ఇట్లీతని సీసపద్యములు ఒక్కొక్క పద్య మొక్కొక్క రీతికి నుదాహరణముగా భాసించుచుండును. తదనంతర కవుల పద్యములకు మాతృకలుగ, మార్గదర్శకముగా నొప్పుచున్నవి. పైన పేర్కొనఁబడిన రచనా విధానములే గాక సోముని సీసములం దింకను బెక్కు రచనా ప్రణాళికలు కానగును.

# నాచన సోముని విశిష్ట పదప్రయోగములు

అప్పకవ్యాది లక్షణగ్రంథములందు నాచన సోమనాథుని యుత్తరహరివంశము నందలి పద్యములు లక్ష్యములుగా గ్రహింపఁబడుటచే, నీగ్రంథమున కాంధ్రసాహిత్యము నందొక విశిష్టస్థానమున్న దనుట నిశ్చయము చిన్నయసూరి, యుత్తరహరివంశము నందలి పద్యముల నుదాహరింపకున్నను, సోమనప్రయోగములను లక్ష్యములుగ గ్రహించె ననుటలో సందియములేదు శబ్దరత్నాకరకారుఁడగు శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యుల వారాంధ్ర సారస్వతమునందలి ప్రౌఢప్రయోగములను గ్రహించి యొకలక్షణగ్రంథమును రచించుటచే నీకవిప్రౌఢప్రయోగములందు గన్పట్టును వాని నీదిగువ జూపుచున్నాను.

మ ఘనచక్రాయుధ నిష్ఠురక్షతగళద్రక్తార్ద్ర సర్వాంగు ని
నున్న భూతా ప్రతిమప్రగల్భ పరివాదాంతర్ధితోద్వ్రక్రమున్. 6–226

ఉ వీ రల్గోపించిన సంతకుండుఁ జెడు మీరారయోర్చువారు 4 – 53

ఉ. దామరపాకు నీరువలెఁ దల్లడమందిరి పౌరులందఱున్. 3 – 25

సీ సంగరమునఁకు నుత్సవమునకేఁగెడు క్రియ 6 – 140

ఆ బాలు టర్వామయ్యు బవరమందు 6 – 140

క. దానవకులమథన! పెద్దదడవున నుండింబూని 5 – 291

శా ధాత్రీచారంబున మోహరింతము పురారిం జేర లేఁడిమ్మోయిన్ 6 – 65

సీ. లీలఁ బేరోలగంబున్న నీలవర్ణు 4 – 141

క. నల్దిక్కుఁ దిరిగి నిలిచి యావ్రలిఁచుచు నుండెన్. 6 – 168

క. న య్యున్నాదమ్ములఁగని 4 – 15

వ. విచ్చలవిడిని దనముయంబు గా గగనంబున. 3 - 144
క. ఘనమగు లవణంబు కప్పుచుగుము. 4 - 134
క. చేకుఱె నీకు నలిగితన్నిన 5 - 151
సీ. పసుల వాండ్రై యెక్కాడిరి. 4 - 102
క. నృపతులకుం జెప్పవలె. 4 - 130
క. గాలుని కందిచ్చె రౌద్రఘనవాయు గతిన్. 1 - 143

పయిని చూపఁబడిన ప్రయోగములు వ్యాకరణ కార్యములకు సంబంధించినవి. ఇక నీమహాకవి ప్రయోగించిన కొన్ని పదముల ప్రయోగ వైచిత్ర్యమును బరిశీలింతము.

క. మనుజాశనులఁట బలులఁట
మునులఁట యాగంబులఁట నమో విశ్వసృజే
విన మింతకు మున్నెన్నఁడుఁ
గని కని కొఱవ్వఁడింటి కంబము సేసెన్. ఉ. హరి. 1ఆ-94

ఇందు ప్రయోగింపఁబడిన "నమో విశ్వసృజే" అను సంస్కృత వాక్యము ననుకరణము యథాతథముగావాడినాఁడు. ఇట్టివే "మాతర పితృ" (4-17) "ధన్వాది" (4-12) యిత్యాది పదము లాయాసందర్భము లందుఁగవి మనోభావవ్యక్తీకరణమున కనువుగ నుండుటచే వానినట్లే ప్రయోగించినాఁడనుట స్పష్టము. "ప్రణుతింతు నో న్నమో భగవతే" (2-218) అనునదియు నిట్టి ప్రయోగమే.

ఉ. "వియ్యము లేని వైభవము నిందులసందడి లేని ముంగిలిం" (5-29)

అను పద్యపాదమున 'ముంగలి' శబ్దమునకు మారుగా వాడుక యందున్న రూపమే గ్రహింపఁబడినది. వినుట కింపుగా నున్న కారణముచేతనే వేఱొకచో గూడ 'లోఁగిలి' (5-101) అనియే వాడినాడు. సోమన శిష్టజనవ్యవహార రూపమునే గ్రహించి యుండియుండును.

"కూఁతురి" (5-217) శబ్దముకూడ నీకోవకుఁ జెందినదే. ఈపదము నందలి రేఫము వ్యావహారమున నేటికిని గలదు.

సోమనాథుని గ్రంథమున "కఱకంఠ" (2-84) అనుపదము (గ్రామ్యము) గన్పట్టుచున్నది. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు. కావున నీపదమును జిన్నయసూరియు నొకలక్ష్యముగ గ్రహించినాఁడు. ఈపద మీగ్రంథమున రెండుపర్యాయములు వాడ బడినది (2-84; 5-98).

ఈకవికిఁగల సంస్కృత భాషాపరిజ్ఞాన పాటవముచే సంస్కృత శబ్దములు, సమాసములు తెనుఁగునఁ గూడ దొరలి, యొక విచిత్రమగు శైలికి దోహద మిచ్చినది. ఈక్రిందిపద్యమునందలి సమాసరచనము చూడనగును.

చ. ఇనసమతేజ విఁటివే యతీవభుజక్రమ విక్రియా
ఘనులు ... ... (5-28).

"అతీవ" శబ్దము సంస్కృతమునఁ బహుళప్రచారమునందుండు నదియే.

సముచ్చయలోపమునఁ బ్రయోగించిన పదము లనేకములు గలవు. ఉః "ఏమీ యెఱుఁగఁడు". పాత్రస్వభావమును బట్టియిచ్చు పదప్రయోగమిది. సందర్భ శుద్ధినిబట్టి లక్షణము నతిక్రమించుటకు వెను దీయని వాఁడగుట, నిట్టిప్రయోగములు మఱికొన్నియుఁగలవు.
ఆ ప్రయోగము లివి.

1. పట్టపగ లేలా యింతటన్ (5 ఆ. 52)
ii. జలతైలబిందువయినా (5 ఆ. 198)
iii. ప్రాణముతోడ నున్న (4 ఆ. 294)

రసజ్ఞుఁడగు సోమన, ప్రకరణోచితముగ నాకాలమునందలి వ్యవహారము నందుండు శబ్దములను ప్రయోగించినాఁడు.

ఈ మహాకవి ప్రయోగించిన కొన్ని పదములు—బోటుంబులు, పరదాళములును, గజిబిజించు, పటుతళించు మున్నగు యపురూపధాతువులును కానవగును. వీని కన్నిటికి శబ్దరత్నాకరమున నర్థములు కానరావు. ఆపదములు నేడు గాన రాకున్నను, సోమన కాలములో వాడుకలో నుండెననుట తథ్యము.

ప్రౌఢవ్యాకర్త లక్ష్యముగా గ్రహించిన యీ క్రింది పద్య పాదవిషయమును గూర్చి చర్చింతము.

మ. అనుచుం గృష్ణుఁడువోయినం బిదప బాణాసుర్త్యవైరీశ్వరున్
ఘనచక్రాయుధ నిష్ఠురక్షతగళద్రక్తార్ద్ర సర్వాంగు ని
న్నను భూతా ప్రతిమ ప్రగల్భ పరివాదాంతర్విత్తో ద్వికర్మున్
జనితాస్త్రాధిక వేదనా ప్రకట మూర్ఛాపారవశ్యాత్మునిన్.
(ఉ. హరి. 6-226)

ఇట, రెండు మూఁడు పాదములకీ క్రిందిపాఠాంతరములుగలవు.

1. "ఘనచక్రాయుధ నిష్ఠురక్షత గళద్రక్తాస్య సర్వాంగుని
న్నను భూతా ప్రతిమ ... ..."
2. "ఘనచక్రాయుధ నిష్ఠురక్షత గళద్రక్తార్ద్ర సర్వాంగు న
భ్యను భూతా ప్రతిమ ... ..."

ముద్రిత ప్రతి యందు మొదటి పాదమా చివర "వైరీశున్" అనియు, రెండవపాదమున "ఘనచక్రాయుధ నిష్ఠురక్షత గళద్రక్తార్ద్ర" అనియుఁ గలదు. కాని వేలూరు పాఠము ననుసరించి మొదటి పాదముచివర "వైరీశ్వను" అనికలదు, రెండవపాదమున "ఘనచక్రాయుధనిష్ఠురక్షత గళద్రక్తార్ద్ర" అను దానిని గ్రహించినచో, 'ద్ర' యతి స్థానమున నుండును లేనిచో యతితప్పును. మఱియుఁ బ్రౌఢవ్యాకర్తయగు శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారు గ్రహించిన 'ద్రక్తాస్య' పాఠమే ప్రతిలోని దైనదియు తెలియరాదు.

ఇక, వీరల్లోపించిన, అయ్యన్నాదమ్ములవంటి ప్రయోగములను వ్యాకరణ ప్రసక్తమును విడిచి. శ్రవణసుఖములైన శిష్టవ్యవహార పదములను యథేచ్ఛముగా వాడినాఁడు.

నాచన సోమనాథుని విశిష్ట ప్రయోగముల విషయమున శ్రీచెల్లపిళ్ల వెంకటశాస్త్రిగారు యీక్రిందివిధముగాఁజెప్పియున్నారు. "ఇతణ్ణి (నాచన సోమనాథుని) వసుచరిత్ర కర్త యీవిధంగా సమ్మానించి యున్నాఁడు.

> మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు త
> న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
> మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపుచెన్నారు నీ
> బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్యమూహించెదన్.

ఈ ఆంధ్రభాషా ప్రపంచానికి యితఁడు చంద్రునివంటి వాఁడుగా ఉన్నాడన్న మాట... ... ...వసుచరిత్ర పద్యం శ్లేషపరిధానం కనక శ్రీనాథుణ్ణి అలా పేర్కొనవలసి వచ్చింది. కవితాగోష్ఠిలో శ్రీనాథుఁడి కంటె యితఁడు యద్విధంగాను తీసిపోయేవాఁడు కాకపోయినా అతని కున్నంత పేరుమాత్రం యితనికి లేదు."

"చిన్నయసూరి – చిచ్చుఁటకన్ను మూసికొని – వచ్చిన సోముఁడే (ఈశ్వరుఁడే) సోముఁ డన్నారు. భవతు. ఆంధ్రవాఙ్మయంలో యీ సోముఁడు సుప్రసిద్ధుఁ డన్నందుకు పై వారి పొగడ్తలే సాక్ష్యమిస్తాయి. ఇట్టి మహాకవి ప్రయోగాలు కూడ మాన్యాలు కావనుకొనుట కన్న దురహంకారమంటూ ఉంటుందా ? ఉండదు."



# ఉత్తరహరివంశము-అన్యదేశ్యములు

నన్నయ విరచితాంధ్రమహాభారతమునం దన్యదేశ్యములగు పదములు గానరావు. తిక్కనసోమయాజి కాలమునుండి యాంధ్రసాహిత్యమున నీ యన్యదేశ్యములు చోటుచేసికొన్నవి. నాచన సోమనాథుని గ్రంథమునఁగూడఁ గించి దన్యదేశ్యములగు పదములు గన్పట్టుచున్నవి. అన్యదేశ్యము లాయా కాలములందు పరభాషాసంపర్కము కలిగి, జనులనోళ్ళ నలిగి స్వభాషయందు స్థిరత్వ మేర్పఱచుకొనును. ఆంధ్ర భాషయందు ముఖ్యముగ నుత్తర దేశీయులగు మహమ్మదీయుల సంపర్కమున ఉర్దూ, హిందీపదములు చేరినవి. ఈ యన్యదేశ్యముల విషయమున శ్రీ తూమాటి దోణప్పగారిట్లు వ్రాసియున్నారు. "నవీ నోత్తరాహ భాషల నుండియు, భారతీయేతర భాషలనుండియు ఎరవు తెచ్చిన పదము లిట ఉద్దిష్టము. తిక్కన్న చివరిరోజులలో గాలివాన చినుకు పాటుగా అక్కడొకటి యిక్కడొకటి చెదరు చెదరుగా పడి చెమ్మగిల్లి, శ్రీనాథుని హయాముకు చేరెడు చెలమగా రూపొందిన అన్యదేశ్య బిందురాశి, ప్రబంధయుగము నాటికి ఆంధ్రభాషా స్రవంతిలో చిఱుపాయగా పెంపొందుట చారిత్రక సత్యము." (శ్రీనాథయుగము : అన్యదేశ్యములు. ఆంధ్రప్రదేశ్ పత్రిక 1963 మార్చి)

ఉత్తర హరివంశము నందు గానవచ్చు యన్యదేశ్యపదములను గూర్చి యొకింత పరికింతము.

శ్రీ కృష్ణుడు నరకాసురుని సంహరించు పట్టుల నీ పద్యము కలదు.

ఉ. అంతట దానవాంతకుఁ డహంకరణంబున.........
......వ్రక్కలొ క్కంతగ నేలఁగూలె దనుజాకృతి త్రాసునఁ
దూపఁభూతముల్. (ఉ. హరి. 1 ఆ. 175)

ఇందు ప్రయోగింపఁబడిన "త్రాసు" పదము పారసీభాష యందలి "తరాజు" అను పదమునకు రూపాంతరము. దీనికి తక్కెడ, తుల యని యర్థము. ఉర్దూ, హిందీ, మరాఠీ భాషలలో "తరాజూ" అని యందురు. తరాజు శబ్దమునకు తరాజూ, తరాసు, త్రాసు, తాసు రూపాంతరములు.

సోమన "త్రాసు" శబ్దమును డిభకసాత్యకుల ఖడ్గయుద్ధమును వర్ణించుచు నొకవచనమున గూడను బ్రయోగించినాఁడు. (4-256) ఈ పదము క్రీ. శ. 1278 నాటికే వాడుకలో గలదని తెలియుచున్నది.

తృతీయాశ్వాసమునఁ బౌండ్రక వాసుదేవుఁ డొక యర్ధరాత్ర మున ద్వారవతిని ముట్టడించెను. పోరు ఘోరముగ సాగుచుండఁ దెల్ల వారినది. ఆ సందర్భమున సూర్యోదయ వర్ణనమున నీ క్రింది పద్యము కలదు.

సీ. .......................
పార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్న
యలరు గెందమ్మి కోహళి యనంగ......(ఉ.హరి. 3 ఆ. 86)

ఇందలి కోహళి శబ్దమునకు శిరోవేష్టనము, పటరచితమకుటమని యర్థము. ఇది ఖోలక శబ్దభవమును, దేశ్యమును గాదని పరిశోధకుల యభిప్రాయము. పారసీభాష యందలి "కులాహ్" పద పరిణామమని వారి నిర్ణయము. ఈపదము ఉర్దూ హిందీ భాషలయందు "కులాహ్" రూపముతోడనే చేరినది. మరాఠీ యందు "ఖోళ" అని గలదు. ఈ పద మునకు కుళ్ళాయి, కుళ్లాయి, కుళ్లు, కుల్లా, కులాయి, కోహలి యను రూపాంతరములు గలవు.

బాణాసురుఁడునాగాస్త్రమున ననిరుద్ధుని బంధించినను, నా యదు వీరుఁడు విగతధైర్యుఁడు కాలేదు. కుంభాండుఁ డీతని స్థైర్యమునకు మెచ్చి యిట్లనినాఁడు.

క. భుజగర్వ మడఁగ జుట్టిన.........
మజ బాపురె వీనిఁ బోలు మగలుం గలరే. (ఉ.హరి. 5 ఆ. 270)

ఇందలి "మజ" ప్రశంసార్థకము. పారసీ భాషయందు మజా, మజ్జహ్ అను పదములుగలవు. ఉర్దూ హిందీ మరాఠీ భాషలలో 'మజా' అనురూపమునఁ గలదు. ఆనందము, తమాషా, హాస్యము, రుచి, వాసన, గమ్మత్తు అను యర్థముల నిచ్చును.

మఝ్ఝారె, మఝ్ఝా, మజ్జారె, మజ్జా, మజా రూపాంతరములు.



# సోముని అచ్చతెనుఁగు పద్యములు

చ. కఱచిన పీనుఁగు న్వెడఁద కప్పెరయు న్మొలఁ బచ్చితోళులున్
బుఱియల పేరులు న్మెదడుపూఁతయు ఝుమ్మని మూఁగు నీఁగలుం
బెఱికినవాలు ఱొమ్ముపయిఁ జేరిననెత్తురు త్రేవుడున్ గడున్
బిఱుముల చూపులుం దఱచు బీఱనరంబులుఁగల్గు రూపునై.

సీ. తోలుకారుమెఱుఁగులతోఁటలో నాడెడు
రాయంచకొదమతో రాయుఁ జాలి
యిఱులబండారంపుటింటికిఁ బెట్టిన
బొందుమల్లెలకోటఁబోర గెలిచి
బలుమంచుఁగంబాల బలసి రాఁ జుట్టిన
క్రొత్తమంజిడిబాగుఁ గొఱఁత చేసి
పాలవెన్నురువుగుబ్బలిమీఁద నెలకొన్న
నిండువెన్నెలముగ్గు చెఱిచి
తే. జడలఁ గ్రొన్నెల మెడఁ బాపసరిగఁ దోడలఁ
బోడలతో ల్మైన వెలిమిడిపూఁత మించఁ
బోడమి వ్రేఱేనిముందటఁ బోడవు సూపెఁ
బోడువులం దెల్లఁ బోడువైనబోఁటుచెల్వ

ఉ. పనికతోఁలుపచ్చడము నెమ్ములగుబ్బసరంబు, నంపపూఁ
దేనియతియ్యవిల్లుఁ గొని త్రెంచినబొట్టుఁ బలుంగునెట్టెము
స్వీనుల చూపుపెంపెమ్ముఁ దవిల్చినమంచముకోటికైదువుం
బూనినప్రాఁతవేల్పుఁ గని పోకులఁబోయిన వెన్నుఁడిట్లనున్.

ఉ. హరి. 2 ఆ- 126, 171, 172.

# అనుబంధము—1

## సంస్కృత హరివంశ, ఉత్తర హరివంశ ప్రతులు

శ్రీ మన్మహా భారతమునకు ఖిలపురాణమని ప్రఖ్యాతిఁగాంచిన హరివంశమును వ్యాసభగవానుఁడు సంస్కృతమున రచించినాఁడు సౌతి మహాభారతమును బదునెనిమిది పర్వములుగా నేర్పఱిచినను, హరివంశమును పందొమ్మిదవ పర్వముగఁ బరిగణించుటయు గలదు ఈ గ్రంథమునకు ప్రకృతము దక్షిణోత్తర దేశములం దైదాఱు ముద్రితప్రతులు కానవచ్చుచున్నవి వీనియం దొకటి రెండు ప్రతులుతప్ప మిగిలిన వన్నియు నుత్తర దేశమునందు ముద్రింపఁబడినవే దక్షిణదేశ ప్రతుల యందొకటి మాత్రము తెనుఁగు లిపియందు ముద్రింపఁ బడినటులు తెలియుచున్నది ఆ ప్రతుల వివరముల నిక్రింద పొందుపఱచుచున్నాను.

| | ముద్రణ వివరములు | ముద్రిత కాలము |
|---|---|---|
| 1 | గంగా విష్ణు శ్రీకృష్ణదాసు లక్ష్మీ వేంకటేశ్వర ప్రెస్సు, కల్యాణినగరము, బొంబాయి | శా. శ. 1833 |
| 2. | ముంబయ్యాం శ్రీకృష్ణ దాసాత్మజ క్షేమరాజ శ్రేష్ఠినా శ్రీ వేంకటేశ్వర ముద్రణాలయే ముద్రితమ్, బొంబాయి | శా. శ 1848 |
| 3. | నీలకంఠుని భారత భావదీపముతో రామచంద్ర శాస్త్రి కింజవాడేకర్ చేఁ బరిష్కృతము, చిత్రశాలా ప్రెస్సు, సదాశివపేట, పూనాసిటీ. | క్రీ శ. 1936 |

4. జాలా నోపాహ్వాన ఘనశ్యామ దాసేన గీతా
ప్రెస్ నామ్ని ముద్రణాలయే ముద్రయిత్వా
ప్రకాశితమ్, గోరఖ్‌పూర్.
(హిందీ తాత్పర్యసహితము) క్రీ. శ. 1959

5. గోపాల్ నారాయణన్ అండు కో., ప్రిన్సెస్
వీధి, బొంబాయి. —

6. పురాణం హయగ్రీవశాస్త్రిగారిచేఁ బరిష్కృతము. క్రీ. శ. 1860

పయి నుదాహరించిన వానిలో మొదటి నాలుగు ప్రతులును బ్రచారమునందు లభ్యము లగుచున్నయవి. బొంబాయిలో ప్రచురింపఁబడిన గోపాల్ నారాయణన్ అండు కో వారి ప్రతి, గణపతి కృష్ణ ప్రతి, కుంభకోణమునందు ముద్రింపఁబడిన దాక్షిణాత్య ప్రతు లతి ప్రాచీనములు. పురాణం హయగ్రీవశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడిన ప్రతియు ప్రాచీనమైనదే. క్రీ. శ. 1936 వ సంవత్సరమున నీలకంఠుని వ్యాఖ్యాన సహితముగఁ బూనా నగరమున ముద్రింపఁబడిన ప్రతి యర్వాచీనమే. ఈ ప్రతియందు హరివంశము మూఁడు పర్వములుగా (అనఁగా క్రమముగా హరివంశపర్వము, విష్ణుపర్వము, భవిష్యపర్వము) విభజింపఁబడుటయుగాక విష్ణుపర్వమునందలి 81 వ అధ్యాయము తుదిని "ఇదం హరివంశస్య పూర్వార్ధమ్" అనియు, 82 వ అధ్యాయము ప్రారంభమున "ఉత్తరార్ధమ్" అనియు గలదు. అనఁగా నీ గ్రంథమున పర్వ విభాగముతోఁబాటు పూర్వోత్తరార్ధములుగాకూడ విభజింపఁబడినదని వ్యక్తమగుచున్నది.

శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రిగారిచేఁ క్రీ. శ. 1860 వ సంవత్సరమునఁ బరిష్కరింపఁబడి తెలుఁగు లిపియందు ముద్రింపఁబడిన దక్షిణదేశ ప్రతియందు ముఖపత్రమున నీ క్రిందివిధముగాఁ గలదు. "పురాణం హయగ్రీవ శాస్త్రిణా, నానాదేశేభ్య అనీతాన్ శ్రీమద్ధరివంశ మూల

గ్రంథాన్ - శ్రీ మద్వైశంపాయన నీలకంఠాచార్యాది భిర్విరచితాన్ - తద్వ్యాఖ్యాన గ్రంథాంశ్చ సంయక్సంశోధ్య - నిఖిలాధ్యేతృజనానాం విశేషతః పఠనసౌలభ్యాపాదనాయ ప్రతిశ్లోక సంఖ్యాది భిన్నమూలం కృత్య - ఏష ముద్రితో గ్రంథః".

పయి విషయమునుబట్టి శ్రీ శాస్త్రిలవారు నీలకంఠ వ్యాఖ్యతో పాటుగ మఱికొన్ని ప్రతులను, వ్యాఖ్యలను సంగ్రహించినటులు తెలియుచున్నది. ఈ ప్రతియందు నాగరిలిపి ప్రతులయందుఁ గానవచ్చు పర్వ విభాగము లేదు. పూర్వోత్తర విభాగమే గ్రహింపఁబడినది. పర్వవిభాగమున్న యెడల నీ పూర్వోత్తర విభజనమునకుఁ బ్రత్యేకించి ప్రయోజనము లేదని విడిచియుందురు. మఱియు నీ ప్రతియందు కథల క్రమముత్తర దేశ ప్రతులకు భిన్నముగ నటనట నవరింపఁబడి యున్నటులు తోఁచుచున్నది. బహుశః యెఱ్ఱాప్రగడ హరివంశమునకు మూల మీ గ్రంథమే యనియుఁ జెప్పుట కవకాశము కలదు.

మీఁద నివరింపఁబడిన సంస్కృతముద్రిత ప్రతులుకాక నీ దిగువ నుదాహరింపఁబడిన వ్రాఁత ప్రతులు, తాళపత్ర గ్రంథములును ప్రకృతము లభ్యములని ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (సంపుటము 12; సంచిక 1-6; పుటలు 22, 115) లోఁ బ్రకటింపబడిన వ్యాసమునుబట్టి వ్యక్తమగుచున్నది. ఈ ప్రతులన్నియు దక్షిణ దేశపు ప్రతులే.

1. వ్రాఁత ప్రతులు.
   - (i). ఆంధ్ర పరిశోధక మహామండలివారు సంపాదించిన ప్రతి
   - (ii). బొబ్బిలి నగరపుఁ బ్రతి
   - (iii). చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారపుఁ గాగితపుఁ బ్రతి.
2. తాళపత్ర గ్రంథములు.
   - (i). తంజావూరు ప్రతి

(ii) పీఠికాపుర సంస్థానమునకు శ్రీ జయంతి రామయ్యగారు ఆంధ్ర సాహిత్య పత్రికా కార్యస్థానమునుండి పంపిన ప్రతి

(iii) చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రతి

(iv) 200 సంవత్సరముల క్రితము వ్రాయఁబడి కూచిమంచి తిమ్మ కవి పురాతన గ్రంథజాలమునఁ జిక్కిన ప్రాఁత తాటియాకుల ప్రతి

(v) శ్రీ కందుకూరి వీరేశలింగముగారి పూర్వప్రతి.

ఇఁక నుత్తర హరివంశమునకు మూలమగు సంస్కృత ప్రతి యెట్టిదో యారయవలసియున్నది. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు క్రీ. శ. 1912 వ సంవత్సరమున ఆంధ్రభాషాభివర్ధనీ సమాజమువారు జరిపిన పోటీకిఁ బంపిన "ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథున కీయఁదగిన స్థానము" అను శీర్షికగల వ్యాసమునందు శంభుదాసుని హరివంశమును, సోమనాథుని యుత్తర హరివంశమును బలుతావులఁ బరిశీలించి యిట్లనిరి – "ఏది యెట్లున్నను సోమనాథుని యుత్తర హరివంశమునకుఁ జాలవఱకు నెఱ్ఱన హరివంశమే మూలమని చెప్పినఁ దప్పుగాదు. అనేక స్థలములలో నందుగల మాటలేమార్చి యిందు వ్రాయఁబడియున్నవి." అని కొన్ని యుదాహరణములఁ జూపిరి. ఆ పిమ్మట "అనేక స్థలములలో నిరువురు కవులును సంస్కృత మూలానుసారులు గావున నిట్టి సాదృశ్యముల కవకాశము గలిగె. ముఖ్యముగఁ బ్రత్యేకముగ సోముఁడు వ్రాయు పెద్దవచనములందప్ప యుద్ధవర్ణనములలో నీ యిరువురకు బింబ ప్రతిబింబ భావము స్పష్టమగు. అందందు సోముఁడు వీరులు ప్రయోగించు బాణముల లెక్కను బెంచును లేక దించునేమో! ఇంతియకాదు వర్ణనాంశములయందుఁ గూడ నేయే స్థలములలో నెఱ్ఱన యించుక విపులముగ వర్ణించినాఁడో యాస్థలములనెల్లఁ బ్రాయికముగ సోముఁడు

చల్లఁగ దాటును. ఆతఁ డుదాసీనముగ విడిచిన స్థలములలోనెల్లఁ దా నించుక చేయి వేయును. సూక్ష్మదృష్టిఁ బరీక్షించినచో గ్రంథమంతయు దీని కుదాహరణమగును. మఱియు నొక విశేషము, ఎట్టిన యెందైన మిగుల మనోహరముగ వర్ణించియుండెనేని దానును నాచోటనే యాతని మాటలకే రంగుమార్చి వ్రాయఁ బ్రయత్నించును." అని మూఁ డుదాహరణముల నిడిరి. అనంతరము, "ఇట్లు సోముని హరివంశమునకు నెట్టిన హరివంశమే మూలమని స్థాపించు నిదర్శనము లింకను బెక్కులుగలవు". అని తమ యభిప్రాయమును వెలువరించిరి.

ఈ వ్యాసమును విమర్శింపుచుఁ, బిఠాపురముసభలో శ్రీ నడకుదిటి వీరరాజు పంతులుగారు సుదీర్ఘముగ నుపన్యసించిరి. అందు సర్వజ్ఞ శంభుదాసుల మూలగ్రంథములు వేఱగుట స్పష్టమని నుడివిరి. ఇందు విషయమై వారు "ఆంధ్ర పరిశోధక మహామండలివారు సంపాదించిన సంస్కృత హరివంశపుఁ బ్రతియందు,

1. ప్రథమాధ్యాయము మొదలుకొని రుక్మిమారణ కథనముగల 124 వ యధ్యాయమువఱకు నున్న గ్రంథము పూర్వభాగముగాను,
2. బలదేవ మాహాత్మ్యాభివర్ణనము గల 125 వ యధ్యాయము మొదలుకొని యుత్తర భాగముగాను ఉన్నవి. ఇట్టివే మఱికొన్ని ప్రతులును గానవచ్చుచున్నవి. సోముని గ్రంథమునకు మూలమిట్టిదే యని స్పష్టమగుచున్నది. ఈ పూర్వోత్తరభాగ వివరణము పై ప్రతియందేకాక" బొబ్బిలి నగరమునఁగల వ్రాఁత ప్రతులయందును, చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని కొన్ని వ్రాఁత ప్రతులయందును గలదు. ఈప్రతు లన్నిటియందును ముద్రితప్రతులలోలేని "ఊర్వశీ నరకాసుర సంభాషణము మొదలగునవి" గలవు. (మఱియు బలదేవ మాహాత్మ్యాభివర్ణనముతో ననఁగా నుత్తర భాగము కథతోఁ బ్రారంభింపఁబడిన సోముని యుత్తర హరివంశము

సయితము పై భాగద్వయ విషయమును నిర్ధారణము చేయు చున్నది)" అని పలికిరి.

ఈ విధముగ వీరు నాచన సోమనాథుఁడు గ్రహించిన సంస్కృత ప్రతియు, తెలుగు హరివంశమునకు మూలమగు ప్రతియు భిన్నములని స్పష్టీకరించుటయగాక దక్షిణ దేశమునందు లభ్యమగు అముద్రిత ప్రతులలో, (ఆంధ్ర పరిశోధక మహామండలివారి ప్రతియందును, చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారపుఁ గాగితఁపు వ్రాఁత ప్రతియందును), నరకాసురుఁ డూర్వశిని బిలిపించిన కథ గలదని నుడు వుచు నీ దిగువ శ్లోకముల నుదాహరించిరి.

శ్లో. జయ మాఘోషయామాస నరకో దానవోత్తమః
అమరావతీం తదా దైత్యః ప్రవిశ్య చ మహాసురః
ఊర్వశీంచ సమాహూయ వచనం చే దమబ్రవీత్
భుజవామిహ వామోరు ! నిర్జిత శ్శక్ర ఆహవే
అహమిన్ద్రో యమో రాజా వరుణో యాదసాం పతిః"

................

"ఊర్వశీ, బుషయో యదితే రాజన్ ! యక్ష్యంతి క్రతుభిస్సదా
తదా భజామి దైత్యేన్ద్ర ! నాత్ర కార్యా విచారణా."

సం. హరి. ఉ. భా. 127 అధ్యా.

మీఁది శ్లోకములలోని భావమును బట్టి, కొన్ని అముద్రిత సంస్కృత ప్రతులం దూర్వశీ నరకాసురుల సంభాషణాది కథాక్రమము మూలానుసరణమే కాని తెలుగు హరివంశ రచనా సందర్భముననో, తదితర సందర్భములందు మఱి యెవ్వరో కల్పించి యుండిరనుట పొసగదు. కాని యీ కథాఘట్టముగల సంస్కృత ప్రతిని జూచిన గాని నీ విషయము నిశ్చయముగాఁ జెప్ప వలనుపడదు. ఏది యెట్లయినను నాఁడ్రీకరణములయి వెలసిన హరివంశ, ఉత్తర హరివంశములకు

మూలములయిన సంస్కృత ప్రతులు ఉత్తరాది ప్రతులతో భేదించు చున్నవనుట నిర్వివాదాంశము.

ఇక ప్రకృత గ్రంధమగు నుత్తర హరివంశ ప్రతుల విషయ మునుగూర్చిన చర్చయు నిట సంభావ్యమగును. శ్రీ కందుకూరి వీరేశ లింగము పంతులుగారు ప్రప్రథమముగ బ్రచురించిన ఉత్తర హరివంశ పీఠికలో నీ విధముగా వ్రాసినారు - లభ్యములగు ప్రతులవిషయమున- "My copy of the book is not complete and the whole of the first canto and portions of the second and sixth cantos are wanting in it besides some gaps here and there......" తాము సంపాదించిన ప్రతియందు ప్రథమాశ్వాసము లేదనియు, ద్వితీయ షష్ఠాశ్వాసములందు గొంతభాగము శిథిలములయి యుండినటులను జెప్పుచు, నాకాలమునందు తంజావూరునందు జిల్లా జడ్జిగానుండిన F. H. హేమ్నెట్‌దొరగారి సహకారమునఁ దంజావూరు కోటలోనున్న గ్రంథాలయమునుండి ప్రతియొకటి తెప్పించితి మనిరి. అదియును సరియైన ప్రతి కాకపోయెనట. అయినను దామెట్టులో శ్రమ పడి, గ్రంధమును బరిష్కరించి ప్రచురించినట్లు తెలిపియున్నారు. ఈవిషయము శ్రీ కందుకూరివారు తమపీఠికలో తెలిపిరి. వీరిచేత ప్రక టింపఁబడి నట్టి ఉత్తరహరివంశ ప్రతులు కరువగుచున్నందున, నాగ్రం థము "ముఖపత్రము" ను, వీరి పీఠికను యథాతథముగాఁ జివలఁ జేర్పఁ బడినది. (చూడు : అనుబంధము 1)

ఈరెండు ప్రతులేగాక మఱికొన్ని వ్రాత ప్రతులును లభ్యము లగుచున్నట్లు ప్రభుత్వమువారిచేఁ బ్రకటింపఁబడిన The Descriptive Catalogue ను బట్టి వ్యక్తమగుచున్నది.

ఆ ప్రతులే యే సంవత్సరములందు వ్రాయఁబడినవో, వాని నెవరు రచించిరో మొదలగు విషయములు లభింపకున్నను దత్సంబంధ

ములగు విషయము లుగ్గడింపఁబడినంతవఱకు నీదిగువ వ్రాయుచున్నాను.

1. తంజావూరు లైబ్రరీ - 2 ప్రతులు (సమగ్రము)
2. ప్రాచ్య లిఖిత పుస్తకశాల - 1 తాళపత్ర ప్రతి (సమగ్రము)
   1 కాగితపు ప్రతి (సమగ్రము)
3. వేంకటగిరి సంస్థానాధీశ్వరుల -
   పుస్తకశాల 1 ప్రతి. (అసమగ్రము)

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీ. శ. 1926 వ సంవత్సరమున తాము సంస్కరించిన ప్రతికిఁ బీఠిక వ్రాయుచు పై నుదాహరించిన వేంకటగిరి సంస్థానాధీశ్వరుల పుస్తకశాలలోనున్న వ్రాఁత ప్రతిలోఁ గూడఁ బ్రథమాశ్వాసము లేదని తెలిపియున్నారు. శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరమున నిమ్మహాకవి గ్రంథమును గూర్చి నుల్లేఖించుచు నయ్యది సమగ్రముగా లభించియుండ లేదనిరి. వీ రే ప్రతిని జూచియుండిరో తెలియరాదు.

ప్రకృతము సర్వజ్ఞ బిరుదాంకితుఁడగు నాచన సోమనాథ మహాకవి కృతమై, షష్ఠాశ్వాస సమన్వితంబయి వ్యాప్తియందున్న ఉత్తర హరివంశ గ్రంథము, క్రీ. శ. 1897 వ సంవత్సరమున శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారిచేఁ బ్రప్రథమముగ బరిష్కరింపఁబడి ప్రకటితమైనది. అనఁగా నీప్రతి శ్రీ కందుకూరివారి వద్దనుండిన హరివంశ ప్రతియుఁ, దంజాపురమునుండి తెప్పించిన ప్రతియు సంప్రతింపఁబడి, సంస్కరింపఁబడినట్టి దనుట స్పష్టము. పిదప వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారి ప్రోత్సాహమున శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంస్కరింపఁబడి క్రీ. శ. 1926 వ సంవత్సరమునఁ శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరులుగారిచే బ్రకటింపఁ బడినది. ఈ ప్రతియే క్రీ. శ. 1955, క్రీ. శ. 1961 సంవత్సరములలో మఱి రెండు ముద్రణములనంది, యావదాంధ్ర ప్రజానీకముచే నాదరింపఁబడుచున్నది.

## The geneology of Sangama of the First Vijayanagara Dynasty




(Tirupathi Devastanam Inscriptions: Vol VI - Part ii Page 17)




(A History of South India Page 300.
Sri K A, Neelakanta Sastry)

# ఉత్తరహరివంశము.

# UTTARA HARI VAMSAMU.

BY

NACHANA SOMANADHA.

EDITED FOR THE FIRST TIME AND PUBLISHED

BY

K. VEERESALINGAM

*Senior Pundit, Rajahmundry College*

RAJAHMUNDRY:

PRINTED AT THE VIVEKA VARDHANI PRESS

1897.

[*All rights reserved*]

*Price Rs.* 1—4 -0

# PREFACE



This Poem is pronounced by most competent literary authorities to be one of the best books in the language. It is written in a highly chaste and admirable classical style and abounds in rhetorical figures of unparalleled beauty. It is presumptuous on my part to attempt to dwell here upon the merits of a book which speaks for itself. It is particularly gratifying to me that the task of editing such an excellent book has fallen to my lot. I have been trying for a long time to secure a complete copy of the book but my attempts in that direction were not successful till very recently. My copy of the book is not complete and the whole of the first canto and portions of the second and sixth cantos are wanting in it, besides some gaps here and there. My warmest thanks are therefore due to F. H. Hamnett Esq., District Judge of Tanjore, through whose kindness I have been able to secure a complete copy of the book from the Tanjore Palace Library, though it is far from being a correct copy. I have had considerable difficulty in bringing out a correct edition of the book, but I have spared no pains and expense to give the public the best available edition as far as possible under the circumstances. I shall be thankful to those who detect and communicate to me any errors that may have escaped my attention so that when a second edition of the book is brought out it may be free from them.

RAJAHMUNDRY
7th April 1897.

K. VEERESALINGAM

# అనుబంధము-2

## తిక్కన సోమనల రచనాసామ్యములు

స్రగ్ధర. గాండీవారావఝంపాఘటితభయదివౌకఃపురాంతఃపురం
ధ్రీ, గండాభోగప్రమూంభః కణకలుషిత గంగాతరంగాభిషంగా
ఖండాస్మత్కాండ పాళీకబళితసకలాకాశసీమానిశాంతో
ద్దండాతిక్రాంత గర్వాంతకయమభటసంతానముం గానవైతిన్.

ఉ. హరి. 2-27

స్రగ్ధర. గాండీవజ్యారవంబుత్కటమయి పెలుచం గ్రమ్మినన్ భీముబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగా వోచినన్ వే
దండద్వయంబు మాఁడ్కిం దజిమి కవలు మాద్యద్గతిం దాఁకినం జా
కుండం బోకుండ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్.

భార. ఉద్యో. 1-323

శా. వీరాగ్రేసరుఁ డేకలవ్యుఁడు ధనుర్విద్యానవద్యుండు దో
స్సారఖ్యాతి నరాతిరాజుల రణోత్సాహంబు దూరంబు గాఁ
బారావార విహారమందరగిరి ప్రారంభో జృంభోద్ధతిన్
డే రొప్పారఁగఁ బేసువాడి కలఁచెన్ ధీరోద్ధతానీకమున్.

ఉ. హరి. 3-28

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధ ప్రక్రమ బాహువీర్యుఁడు కురుక్ష్మాపాల వాల్లభ్యల
క్ష్మీధామాత్ముఁడు జానుదఘ్న కలిత శ్రేష్ఠాస్త్ర విద్యాఢ్యుఁ డీ
రాధేయుండొక చీరికిం గొనఁడు వీరవ్రాతముం బోయలన్.

భార. విరా. 5-11

శా. నా కీతమ్ముఁడు ఖడ్గముం గలుగఁగా నాకేశుఁడున్ సాటియే
లోకంబు ల్పదునాలుగున్ గెలుతుఁ గల్లోలానిలాలోలవే

లాకూపారముపారముం గదియఁ జేయుంజాలినన్ ద్వారకం
గైకొందున్ యదువృష్ణి భోజనృప సంఘధ్వంసనాపాది నై.
ఉ. హరి. 4-190

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరులేల సద్భటా
కీర్ణ విరోధి సైన్యముల గెల్వఁగఁజాలుదు మేము మాకు నీ
యర్ణవవేష్టితక్షితి యసర్గళ విక్రమ మొప్పదక్క మా
నిర్ణయ మెల్ల నిట్టి దవినీతియొ నీతియొ చూడుమీతుదిన్.
భార. ఉద్యో. 2-295

సీ. శార్ఙ్గనందక ... నీలవర్ణుండు వెడలె. (ఉ. హరి. 4-214)
సీ. వక్షఃస్థలంబున ...మున్నుగా ఫల్గుణుండు (భార. )
సీ. వడఁకు పన్నగరాజు ... నప్పాంచజన్యరవము. (ఉ. హరి. 4-216)
సీ. బీఱెండ లాఁకున ... భాంకారమడలి. (భార. )

## అనుబంధము-3

కైలాసనగ, అంతఃపురవర్ణనలు

వ. కనుగొన్న నన్నగంబు కన్నులకు నందక మిన్నంది నందికృత నాందీసందానిత వందనమాలా సదోహావిహారద్బృందారక సుందరీ హార ఘటితనటనారంభ విజృంభిత రంభా కుచకుంభ సందర్శన సంభావనాసుభగంభావుక కుబేరకుమార సంభ్రమావతరణ కరణ చరణ ఝణఝణాయమాన మణిమంజీర జ్ఞాపిత సోపానపథోప గమ్యంబై రమ్యంబై వెండియు వెండియుం బసిండియుం దడంబడు ననుటకుం దగి కుంద గిరిమల్లికాకుసుమద సముదయ దాయాదసదా దితేయ నదీసుమేరు శిఖర విసరవిసర దుదీచీముఖ ప్రవాహావిహార మాణవిరించి పురమహిళా పయోధరకుంకుమ పరాగ రాగచ్ఛ విచ్ఛురిత తరంగ పరంపరా పరార్థ్యఫేనపటలపల్లవిత విగతరజత రుచిరతరాధిత్య కాదిత్య కాత్యాయనీరమణ శిరోభూషణ శశాంక

శకల విలాసని స్తంద్ర చంద్రికాపచర దవాచీముఖరోచీ ముఖరోచి ర్ఝరీఎరీత పరిసర పరిహ్నాత తపనీయతటద్యుతి నిపతదిత రేతరకాంతి వినిమయంబై మునిమయంబై పాతాళంబును మూలంబును మేలంబు లాడు ననియాడుట కొనియాడుట గాదని తెలుపం దెలుపగు సహజ ప్రకాశంబునకు నవకాశం బొసంగక భవాసీ సేవానిపుణపుణ్యా జనేశ్వర పురపురంధ్రీపునః పునరాగమన రాగమనః ప్రియపద పల్లవపరిచయ పరితః ప్రకటిత ప్రవాళిప్రభా విభావ్యమాన దశా ననభుజాపరిఘ సంఘాత విఘాత విఘట్టిత వసుధాసంధి బంధవివర విసర్పద్దర్వీకర సార్వభౌమ ఫణామణికిరణ చ్ఛురణ ప్రావరణంబై వరణంబై నరణంబై దురితంబులం జొరనీక ఛందంబు గాకుండియు జగతీధృతి ప్రగ్భృతి ప్రతిష్ఠాంచితంబై దంతావళంబు గాకుండియుఁ గటకర విగ్రహావిహారదానోన్నతంబై కాంతారూపంబు గాకుండియు నలకాహితపుష్పక చారూఢ ముక్తాభిరామంబై యట్లునుంగాక సంసారియుంబోలెఁ బ్రస్థౌషధి పూర్ణోదరంబయ్యును సకలాశా భరితంబై యనాత్మజ్ఞుండునుంబోలె దుర్వర్ణ సానుభవం బయ్యును నున్నతవంశ ధ్వనిముఖరంబై యట్లుంగాక జామదగ్న్యుండునుం బోలె భృగుసంతతి వర్ణనీయంబయ్యును భూభృద్విగ్రహ నిరూఢంబై నిఖిల నిర్జర లోకమకుటరత్న రాజినీరాజితపాదంబై రాజకళాధరు విడంబించియున్న నప్పు డప్పురుషోత్తముం డిట్లని విచారించు.

ఉ. హరి. 2ఆ _ 160

## అంతఃపురవర్ణన

వ. ఇట్లువచ్చి యక్కాంత యంతకుమున్న యంతంత వింతగా సంత రించిన శశికాంతజలశీకర శిశిరతర శయనాంతరంబున నప్పటికప్పటికి వెలయు పుష్పాడితిప్పలును గప్పురంబుఁ గుప్పలు నుప్పతిల్లి నశీతకర మణిశిలాతలంబులఁ నెడనెడ జాలకంబుల జడిగొన్నఁ బొడకట్టు వెన్నెలచేత నట్టుపడి మణికుట్టిమంబులు తుడిచి తుడిచి కడగానక

చిడిముడి పడి యొండొండ బొండుమల్లెలు నీడ నత్తెఱపుల నొఱ
పుగాఁ బఱపు కొందఱు దెఱవల ముద్దరాలితనంబునకు మెఱుంగిడిన
తెఱంగున మెఱయు చతురవనితా కీలిత వితతధాతుపట యవనికా
వితానంబులం గుఱుచ కుఱుచ కురువేరునం బరువం బగు మరువం
బునం గనుగందని బిసంబుల నుప్పరిగలో శారికాశుకపికంబులు
చడిసప్పుడు దెప్పరమ్ము చేయకుండం జలిచప్పరంబిడి మలయా
నిలంబుమలయు పలుచని తావులకు వలయుచెరువులు చెరివి మివులం
బొఱవున నురిలిన కుసుమకిసలయ కేసరవిసరంబుల నందంద యర
విందకర్ణికా పీఠంబులఁ గందర్పపూజ చేసినం జెలువొందు నిందీ
వరంబులుఁ జెందొవలుఁ గందువల సందడించు నిందిందిరంబులకు
విందులుగా సమంచితాకుంచితాలకంబులగు నలికంబులు వంచి
పంచబాణశరంబులని ప్రమాణంబు విచారించు విరహపరితాప పరి
హరణ నిపుణ పురంధ్రీగణంబులఁ గన్నకన్నచోటఁ జెన్నమరిన
కన్నియలు విన్ననైయున్న యన్నాతికన్నీరు దుడిచి తుడిచి పన్నీ
రునం జేఁదడిపికొనవలసి రజతపీటకాపటలంబు వెడలం దిగిచి కులికి
కులికి చుట్టందొలఁగవైచిన చిందంబులతోడం బురుడించు చందన
లిఖిత చంద్రమండల సమర్చనా సమయసముచితపరివార దేవ
తాయమాన తారకానికరంబుల మఱియుం గదళీ దళవీజనంబులఁ
గస్తూరి కాకర్దమంబులఁ గనకకరండభరిత మకరందంబుల మణికలశ
పూర్ణ మలయజతోయంబుల విన్యస్త వివిధకుసుమస్తబక విశాల
శాలాంగణంబుల విగతవీణా వినోదాది విహారదేశంబు లవిచ్ఛిన్న
విభ్రమోసహార విచార విచ్ఛందకాది మందిరంబుల మూకీభూత
శుకశారికా నికాయంబులంగల కన్యాంతఃపురంబు గలయం గనుం
గొని. ఉ. హరి. 5ఆ - 136.



# ఉదాహృత గ్రంథములు


1. అనిరుద్ధ చరిత్రము - కనుపర్తి అబ్బయామాత్య
2. అప్పకవీయము — అప్పకవి
3. ఆంధ్రకవి తరంగిణి — చాగంటి శేషయ్య
4. ఆంధ్రవాఙ్మయ చరిత్ర — కాశీనాథుని నాగేశ్వరరావు
   (ఆంధ్రవాఙ్మయ సూచిక - ఉపోద్ఘాతము)
5. ఆంధ్రకవుల చరిత్రము (ప్రథమ భాగము) కం. వీరేశలింగం పంతులు
6. ఆముక్తమాల్యద — శ్రీకృష్ణ దేవరాయలు
7. ఆంధ్రుల చరిత్రము (మూడవ భాగము) చిలుకూరి వీరభద్రరావు
8. ఆనందరంగరాట్ఛందము — కస్తూరి రంగయకవి
9. ఆంధ్ర వాగ్గేయకారులు — బాలాంత్రపు రజనీకాంతరావు
10. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము — ఆంధ్ర సాహిత్య ఎకాడమీ
11. ఉష (నాటకము) — వేదం వేంకటరాయశాస్త్రి
12. ఉషాపరిణయము — రంగాజమ్మ
13. ఉత్తర హరివంశము — కం. వీరేశలింగముచే పరిష్కృతము (క్రీ. శ. 1897)
14. ఉషాకళ్యాణము (ప్రబంధము) — కైపమాయనకవి
15. కవి జీవితములు — గురజాడ శ్రీరామమూర్తి
16. కవిలోక చింతామణి — వెల్లంకి తాతంభట్టు
17. కళాపూర్ణోదయము — పింగళి సూరన్న
18. కథలు - గాథలు Vol. (iii) — చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి
19. కథలు - గాథలు (Vol. ii) — వేంకట పార్వతీశ్వరకవులు
20. ,, (Vol. i) — ,,
21. కవిత్రయ కవితారీతులు — దేశిరాజు భారతీదేవి
   - తరువాతి కవులపై వారి ప్రభావము -
22. కాకతీయ సంచిక

23. కావ్యాలంకార సంగ్రహము - (నరసభూపాలీయము) రామరాజభూషణుడు.
24. కావ్యకుసుమావళి - 3 భాగము వేంకట పార్వతీశ్వర కవులు
25. క్రీడాభిరామము వల్లభామాత్య
26. కుమార సంభవము నన్నెచోడుడు
27. గీతారహస్యము బాలగంగాధర తిలక్
28. గౌతమ వ్యాసములు పింగళి లక్ష్మీకాంతం
29. చాటు పద్యమణిమంజరి (ప్ర. భా.) వేటూరి ప్రభాకరశాస్త్రి
30. ,, (ద్వి. భా.) ,,
31. చాటు పద్య రత్నాకరము ,,
32. తిక్కన సోమయాజి చిలుకూరి వీరభద్రరావు
33. తెలుగు మెఱుగులు వేటూరి ప్రభాకరశాస్త్రి
34. తెలుగు సామెతలు ఆంధ్రసాహిత్య ఎకాడమీ
35. తెలుగు జాతీయములు నాళం కృష్ణారావు
36. తెలుగు హాస్యము ముట్నూరి సంగమేశం
37. ద్విరేఫ దర్పణము ఓగిరాల రంగనాథకవి
38. నరకాసుర విజయము కె. వెంకటరత్నం పంతులు
39. పద్మపురాణము మరువాడ శంభన్నశాస్త్రి
40. పంచతంత్రము దూబగుంట నారాయణకవి
41. పదబంధ పారిజాతము సాహిత్య ఎకాడెమీ ప్రచురణము
42. పురాణ మణిమంజరి గొడవర్తి జగన్నాథం
43. పూర్వగాథాలహరి వేమూరి శ్రీనివాసరావు
44. పోతన - రచనలు డాక్టర్. వి. రాజేశ్వరి
45. ఆంధ్ర ప్రబంధములు-అవతరణ వికాసములు ప్రొఫెసర్ కె.వి.ఆర్. నరసింహము ఎం. ఏ. పిహెచ్. డి.
46. ప్రబంధ రత్నావళి వేటూరి ప్రభాకరశాస్త్రి

47. ప్రతాప రుద్రీయము — విద్యానాథుఁడు
48. ప్రబంధ రాజ వేంకటవిజయము — గణపవరపు వేంకటకవి
49. ప్రౌఢ వ్యాకరణము — బహుజనపల్లి సీతారామాచార్యులు
50. బాలవ్యాకరణము — చిన్నయసూరి
51. బమ్మెర పోతనామాత్యుఁడు — పెద్దిభొట్ల వీరయ్య బి. ఎ. బి. ఎల్.
52. ఆంధ్ర మహాభారతము — కవిత్రయము
53. భగవద్గీత — (పురుషోత్తమ ప్రాప్తి)
54. ఆంధ్రమహా భాగవతము — పోతనామాత్యుఁడు
55. రమణీయము — దువ్వూరి వేంకటరమణశాస్త్రి
56. రత్నపరీక్ష — భైరవకవి
57. రాయవాచకము — విశ్వనాధనాయని స్థానాపతి
58. రూపకమర్యాదలు — వేదం వేంకటరాయశాస్త్రి
59. వరాహపురాణము — మల్లన సింగయ్య
60. విజయనగరసామ్రాజ్యము నందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము — ఓరుమళ్ళ అచ్యుతరావు
61. విద్యార్థి కల్పతరువు — ముసునూరి వేంకటశాస్త్రి
62. విజయనగర చరిత్రము — ఎమ్. రామారావు
63. విజయ విలాసము — చేమకూర వేంకటకవి
64. వేదం వేంకటరాయశాస్త్రి సంస్మృతి — గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్య
65. శకుంతలా పరిణయము — పిల్లలమఱ్ఱి పినవీరన
66. శబ్దరత్నాకరము — బ. సీతారామాచార్యులు
67. శతకకవుల చరిత్ర — వంగూరి సుబ్బారావు
68. శాసనపద్యమంజరి — జయంతి రామయ్యపంతులు
69. శ్రీకృష్ణావతార తత్త్వము — జనమంచి శేషాద్రిశర్మ
70. శ్రీకృష్ణ చరిత్రము — బాలాంత్రపు సూర్యనారాయణరావు
71. సకలనీతి కథావిధానము — ఎఱ్ఱయకవి

72. సామెతలు_జాతీయములు డాక్టర్. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి
73. సారస్వతాలోకము రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
74. సింహాసన ద్వాత్రింశిక కొఱవి గోపరాజు
75. సుమనో మనోభిరంజన కావ్యవ్యాఖ్యానము
76. సోముఁడు వేలూరి శివరామశాస్త్రి
77. హరవిలాసము శ్రీనాథుఁడు
78. హరివంశము ఎఱ్ఱాప్రగ్గడ
79. హరివంశః (నీలకంఠవ్యాఖ్య) 3 ప్రతులు వ్యాసుఁడు

## వివిధ వ్యాసములు

I. ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయదగిన స్థానము రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
II. ఉత్తర హరివంశము – ఆశ్వాసాది పద్యములు తిమ్మావఝల కోదండ రామయ్య
III. ఒకడు నాచన సోమన్న విశ్వనాథ సత్యనారాయణ
IV. నాచన సోమన : సంవిధాన చక్రవర్తి : విశ్వనాథ సత్యనారాయణ
V. నాచన సోమనాథుని సంవిధాన చక్రవర్తిత్వము (కృష్ణాపత్రిక 14_2_69) – దివాకర్ల వేంకటావధాని
VI. నాచన సోమనాథుడు – చారిత్రక విషయములు – వంగూరి సుబ్బారావు (గ్రంథాలయ సర్వస్వము)
VII. నాచన సోమన హరివంశము S. V. S. భాష్యకారాచార్యులు (భారతి **May 1954**)
VIII. నాచనసోముని నవీనగుణములు – అద్దేపల్లి రామమోహనరావు
IX. సోముని హరివంశము – నడకుదుటి వీరరాజు (ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక మే నెల 1920)
X. సోముని హరివంశము నడకుదుటి వీరరాజు ఆ. సా. ప. 11_6; 12_1; 12_2,3; 12_4,5; 12-6; 13_1.

—※—

72. సామెతలు_జాతీయములు డాక్టర్. చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి
73. సారస్వతాలోకము రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
74. సింహాసన ద్వాత్రింశిక కొఱవి గోపరాజు
75. సుమనో మనోభిరంజన కావ్యవ్యాఖ్యానము
76. సోముఁడు వేలూరి శివరామశాస్త్రి
77. హరవిలాసము శ్రీనాథుఁడు
78. హరివంశము ఎఱ్ఱాప్రగ్గడ
79. హరివంశః (నీలకంఠవ్యాఖ్య) 3 ప్రతులు వ్యాసుఁడు

వివిధ వ్యాసములు

I. ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయదగిన స్థానము రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
II. ఉత్తర హరివంశము – ఆశ్వాసాది పద్యములు తిమ్మావఝుల కోదండ రామయ్య
III. ఒకడు నాచన సోమన్న విశ్వనాథ సత్యనారాయణ
IV. నాచన సోమన : సంవిధాన చక్రవర్తి : విశ్వనాథ సత్యనారాయణ
V. నాచన సోమనాథుని సంవిధాన చక్రవర్తిత్వము (కృష్ణాపత్రిక 14_2_69) – దివాకర్ల వేంకటావధాని
VI. నాచన సోమనాథుడు – చారిత్రక విషయములు – వంగూరి సుబ్బారావు (గ్రంథాలయ సర్వస్వము)
VII. నాచన సోమన హరివంశము S. V. S. భాష్యకారాచార్యులు (భారతి May 1954)
VIII. నాచనసోముని నవీనగుణములు – అద్దేపల్లి రామమోహనరావు
IX. సోముని హరివంశము – నడకుదుటి వీరరాజు (ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక మే నెల 1920)
X. సోముని హరివంశము నడకుదుటి వీరరాజు
ఆ. సా. ప. 11_6; 12_1; 12_2,3; 12_4,5; 12-6; 13_1.

—✻—